# బోయకొట్టంబు ల్వణ్ట్రెణ్డు

# బోయకొట్టములు పండ్రెండు

చారిత్రక నవల

పండరంగని అద్దంకి శాసనము క్రీ.శ. 848

(చాళుక్య లిపి)



భాషా ప్రవీణ

## కరణం బాలసుబ్రహ్మణ్యం పిళ్ళె

# బోయకొట్టంబు ల్పణ్డెణ్డు

# బోయకొట్టములు పంద్రెండు

పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారి
పాక్షిక ఆర్థిక సహాయంతో ముద్రింపబడినది.

భాషా ప్రవీణ
**కరణం బాలసుబ్రహ్మణ్యం పిళ్ళై**

# బోయకొట్టములు పండ్రెండు

## (చారిత్రక నవల)

ప్రథమ ముద్రణ : డిసెంబర్, 2013

ప్రతులు : 1000

రచన : కరణం బాలసుబ్రహ్మణ్యం పిళ్ళై
2-253-డి5ఎ, సొసైటీ కాలనీ
మదనపల్లె - 517 325
ఫోన్: 9502304027

ప్రతులకు : పై చిరునామా మరియు
అన్ని ముఖ్యమైన పుస్తక కేంద్రాలు

డిటిపి & డిజైన్ : ఎం.గిరివర్మ, తిరుపతి. ఫోన్:9059809799

ముద్రణ :

# పండరంగని అద్దెంకి శాసనము క్రీ.శ. 848

(ఈనాటి తెలుగు లిపిలో)

౧. ........................................................ (పుర?)

౨. ........................................................ భూపాలకుణ్డు[౧] (॥*)

౩. పట్టంబుగట్టిన ప్రథమంబు నేణ్డు బలగర్వ్వంబొ

౪. ప్పగ బైలేచి సేన (।*) పట్టంబు గట్టిఞ్చె ప్రభుం

౫. బణ్డరంగు (ం*) బ(ణ్చి[౨])న సామ(ం*)త్త పదువతో బోయ(।*)

౬. కోట్టంబు ల్వణ్ఱెణ్డుం గొణి వేంగినాట్టిం గొఱల్చియ

౭. త్రిభువనాంకుశబాణ నిల్పి (।*) కట్టెపుదుర్గ్గంబు గడు

౮. బయల్సేసి కణ్డుకు బ్బెర్జవాడ గావిఞ్చె మెచ్చి (॥*)

౯. పణ్డరంగు పరమమహేస్వరుణ్డు[౩] అదిత్యబటరని[౪]

౧౦. కి ఇచ్చిన భూమి ఎనుబొదివుడ్ల అడ్లు[౫] పట్టునేల (।*) ద

౧౧. మ్మపురంబున[౬] దమ్ముమ్వులు[౭] (।*) విని[౮] రక్షిఞ్చినవారికి అస్వ

౧౨. మేదం(బు)[౯]న పలం(బు)[౧౦] (అ)గు (॥*)



అద్దంకిలో ఆవిష్కరించిన పండరంగని నిలువెత్తు పద్య శాసన స్థూపం

# కాన్పించని కథలు

## పండరంగని అద్దంకి శాసనము క్రీ. శ. 848 సం॥.

---------------------------- భూపాలకుండు
పట్టంబు గట్టిన ప్రథమంపు నేడు బలగర్వమొప్పంగ బైలేచి సేన
పట్టంబు గట్టించి ప్రభు పండరంగు బంచిన సామంత పదువతో బోయ
కొట్టము ల్వంద్రెండు గొని వేంగినాటి గొఱల్చియ త్రిభువనాంకుశ బాణనిల్పి.
కట్టెపు దుర్గంబు కడు బయల్సేసి కందుకుర్బెజవాడ గావించె మెచ్చి.
పండరంగు పరమ మహేస్వరుండు ఆదిత్య బటరనికి ఇచ్చిన
భూమి ఎనుబొది వుట్ల ఆడ్లు పట్టు నేల ధర్మపురంబున
ధర్మువులు వీని రక్షించిన వారికి అస్వమేదంబున పలంబు అగు.

అద్దంకిలో శ్రీకాళికా సమేత కమతేశ్వరస్వామి దేవాలయం ముందర స్థూపముగా నిలుపబడిన ఈ శాసన ప్రతిరూపమును చూచినప్పుడు " ఈ శాసనములోని వృత్తాంతమును ఇతివృత్తముగా తీసికొని ఒక చారిత్రక నవలగా వ్రాయవచ్చునే " అను ఆలోచన పుట్టినది. ఎందుకనగా దేశములో ఎక్కడైనను సరే – ఒరిగిన ప్రతిస్తంభము వెనుకను ఒకచరిత్ర ఉండును, కూలిన ప్రతి గోడక్రింద ఒక కన్నీటి గాథ ఉండును.

"రణరంగం కాని చోటు భూ
స్థలమంతా వెదికిన దొరకదు."

వేంగి చాళుక్యులలో రెండవ విజయాదిత్యుడు పంద్రెండు సంవత్సరములలో నూట ఎనిమిది యుద్ధములు చేసెనట. బహుశ నూట ఎనిమిది చోట్ల జరిగి ఉండవచ్చును. ఎంత రక్తపాతమో! ఎంతటి మారణ హెూమమో!

ఆ పాపపరిహారార్థము నూటఎనిమిది శివాలయములు కట్టించెనట. వాటికి రాళ్ళెత్తిన కూలీలెవ్వరు? వారికిచ్చిన కూలిఎంత? పని ఆలస్యమైనపుడు పడిన కొరడా దెబ్బలెన్ని?

"గతమంతా తడిసె రక్తమున,
కాకుంటే కన్నీళులతో"

ఆ రక్తగాథలూ, ఆ కన్నీటిగాథలూ మనము తెలుసుకొన్నప్పుడే మనకు మనచరిత్ర బోధపడును,

"ఇతిహాసపు చీకటి కోణం
అట్టడుగునపడి కాన్పించని
కథలన్నీ కావాలిప్పుడు."

కాబట్టి ఈ శాసనము లోని బోయకొట్టముల వృత్తాంతమును నవలగా తప్పక వ్రాయవలసినదే అని తీర్మానించుకొంటిని.

"పండరంగడు అను చాళుక్య సేనాధిపతి సామంత సైన్యముతో దండెత్తిపోయి పండ్రెండు బోయకొట్టములను స్వాధీనము చేసికొని, కట్టెపు దుర్గమును నేలమట్టము గావించి, కందుకూరును బెజవాడ వలె పటిష్టము గావించెను. ఆదిత్య బటరనికి ధర్మపురమున కొంత భూమి దానమిచ్చెను". ఇది ఈశాసనము నందలి విషయము. దాని వెనుకనే అనేక ఆలోచనలు కూడ నన్ను చుట్టుముట్టినవి. కొట్టము అనగా పూరికొట్టమో, తాటాకుల కొట్టమో కాదనియు, కొట్టము అనగా ఒక చిన్న పరిపాలనా విభాగమనియు చరిత్రకారులు చెప్పి యున్నారు.

శాసనమునందు " బోయకొట్టములు పండ్రెండు " అని సంఖ్యా నిర్దేశము చేయుటలో పరమార్ధమేమి? బహుశ ఆ ప్రాంతము ఆ సామూహిక నామముతో వ్యవహరింప బడుచుండెనేమో. ఇప్పటికిని "ఇరవైనాలుగు పరగణాలు", (బెంగాల్‌లో) "ఛత్తీస్‌గడ్" (ముప్పైఆరుకోటలు) అనుపేర్లతో వ్యవహరింపబడు ప్రాంతములున్నవి కదా. ఇదియు అట్లే ఉండవచ్చును.

పండరంగడు ప్రత్యేకముగా బోయకొట్టములపై ఏల దండెత్తి పోయెను? ఆ బోయ కొట్టము లెక్కడివి? కట్టెపుదుర్గము ఎక్కడిది?అతడు దానిని స్వాధీనము చేసుకొని చాళుక్య రాజ్యములో కలుపుకొని దానిని ఒక గడిదుర్గముగా చేసికొనక "కదుబయలు"- నేల మట్టముగా ధ్వంసము - గావించుటకు కారణమేమి?

బోయలు ఆ ప్రాంతమువారు కారనియు, నల్లమల అడవుల ప్రాంతము నుండి వలస వచ్చియుందురనియు చరిత్రకారులు ఊహించి యున్నారు. అట్లయిన వారు ఎప్పుడు ఏ ప్రాంతము నుండి ఏల వలస వచ్చినారు?

పండరంగడు ఆదిత్యబటరనికి ధర్మవరమున కొంత భూమి దానము చేసినట్లు శాసనములో ఉన్నది. దండయాత్ర పోవువాడు దారిలో ఒక బ్రాహ్మణునికి ఏల దాన మిచ్చెను? సందర్భమేమి? అవసరమేమి? ఆ బ్రాహ్మణుని విశిష్టత ఏమి?

ఈప్రశ్నల కన్నింటికిని, సమంజసమైన, హేతుబద్ధమైన, చారిత్రాత్మకమైన కారణములనే ఊహించి ఈనవలను రూపొందించుటకు ప్రయత్నించినాను.

ఇది క్రీ. శ. 614 సం॥ ప్రారంభమై క్రీ.శ. 848 సం॥ వరకు అనగా దాదాపు 220 సంవత్సరముల కాలము జరిగిన సుదీర్ఘ చరిత్ర. ఇన్ని సంవత్సరముల కాలములో దాదాపు ఏడెనిమిది తరములు గడచిపోవును. ఈ ఏడెనిమిది తరముల కథను నిరంతరాయముగా, ఎక్కడను తెరపి లేకుండా, తెగకుండా వ్రాయుట సాధ్యమా?

మూడు తరముల కథ కలిగిన "వేయిపడగలు", ఏడు తరముల కథ కలిగిన "రూట్స్" అను అమెరికన్ నవల ఉండగా ఇది మాత్రము ఎందుకు వ్రాయలేము అను ధైర్యము కలిగినది.

అనేక విషయములను సేకరించితిని, శాసనములను పరిశీలించితిని. అనేక చారిత్రక గ్రంథములను పరిశీలించితిని, అద్దంకి, ధర్మవరము, గుండ్లకమ్మ, ముస్సివాగు, ఒంగోలు,

కందుకూరు మొదలగు ప్రదేశములను తిరిగి పరిశీలించితిని, విషయసేకరణకును,ఒక రేఖామాత్రపు కథాక్రమమును రూపొందించుకొనుటకును సంవత్సరకాలము పట్టినది.

ఈ పరిశీలనలో నాకు లభించిన చారిత్రకాంశములు ఇవి –

1. బాదామిరాజైన చాళుక్య సత్యాశ్రయ పులకేశి విష్ణుకుండినులను ఓడించి, వేంగి సామ్రాజ్యమును స్వాధీనము గావించుకొని, తన తమ్ముడైన కుబ్జవిష్ణువర్ధనుని వేంగి రాజ్యమునకు సర్వస్వతంత్రాధికారములతో రాజుగా నియమించి, చాళుక్యవేంగి రాజ్యమును సర్వస్వతంత్ర రాజ్యముగా ప్రకటించి వెడలిపోయెను.(క్రీ.శ. 624లో).
2. కుబ్జ విష్ణువర్ధనుని కుమారుడు జయసింహ వల్లభుడు బోయకొట్టములను స్వాధీనము చేసికొని, బోయలను సంస్కరించుటకు బోయకొట్టములలో బ్రాహ్మణులను నిలిపెను. (క్రీ.శ.643–673)
3. మూడవ విష్ణువర్ధనునికిని, అతనితమ్ముడు కొక్కిలి యనువానికిని వారసత్వ పోరాటము జరిగెను. కొక్కిలి ఓడిపోయి యలమంచిలిలో క్రొత్త రాజ్యమును స్థాపించు కొనెను.
4. పల్లవరాజు రెండవ నందివర్మ (క్రీ.శ. 733–798) అశ్వమేథయాగము చేసెను. బోయరాజ్య పాలకుడు పృథ్వీవ్యాఘ్రరాజు యాగాశ్వమును పట్టి బంధించెను. నందివర్మ తన సేనాధిపతి ఉదయచంద్రునిపంపి బోయకొట్టములను స్వాధీనము చేసికొనెను. పృథ్వీవ్యాఘ్రరాజు పారిపోయెను.
5. రెండవ విజయాదిత్యుడు తన తమ్ముడైన భీమసలుకితో రాజ్యాధికారము కొరకై పండ్రెండేండ్లు యుద్ధము చేసెను. మొత్తము నూట ఎనిమిది యుద్ధములు గావించి చివరకు రాజ్యమును దక్కించు కొనెను.
6. చాళుక్యరాజు గుణగ విజయాదిత్యుడు క్రీ.శ. 848లో తనసేనాని పండరంగడు అనువానిని సామంత సైన్యముతో కలిపి బోయకొట్టములపైకి పంపెను. ఆసేనాని పండ్రెండు బోయకొట్టములను స్వాధీనము చేసుకొని, కట్టెపు దుర్గమును నేలమట్టము గావించి, కందుకూరును బెజవాడవలె మరియొక ప్రధాన పట్టణముగా బలిష్ఠము గావించెను. ఆదిత్య బటరనికి ధర్మపురము వద్ద కొంత భూమి దానమిచ్చెను. అదేపయనములో నెల్లూరుపైబడి నెల్లూరును పరశురామప్రీతి గావించెను.

ఈ నవలా రచనకు నాకు తోడ్పడిన అంశములు ఇవియే. ఇవి ఆంధ్రుల చరిత్రనువ్రాసిన మన చరిత్రకారుల గ్రంథములలో లభించినవి.

ఈ అంశముల నాధారముగా చేసికొని, తదనుగుణముగానూ, సమన్వయము ఏర్పడునట్లుగానూ, ఆయా రాజుల పరిపాలనా కాలమునకు, నవలలోని కథాక్రమమునకు కాలానుక్రమణిక తప్పిపోకుండునట్లుగానూ ఈనవల రూపొందించితిని. సమగ్ర నవలారచన చేయుటకు పదునైదు నెలలుపట్టినది.

ఇది పల్లవుల, చాళుక్యుల సామ్రాజ్య విస్తరణ దాహములో ఇరువురి మధ్య నలిగి నశించిన పండ్రెండు బోయకొట్టముల కథ.

దాదాపు ఇన్నూరుసంవత్సరముల కాలవ్యవధిలోనే ఆవిర్భవించి, విస్తరించి, అభివృద్ధి పొంది, ఒక వెలుగు వెలిగి ఒక నాటి యుద్ధములో–కేవలము ఒక నాటి యుద్ధంలో –సమూలముగా, నేలమట్టముగా, తిరిగి తలయెత్తలేని విధముగా, అచ్చముగా విజయ నగర సామ్రాజ్యమువలె అంతరించిపోయిన బోయకొట్టముల విషాదగాథ యిది.

ఆంధ్రుల చరిత్రలో ఒక మారుమూల పుటలో ఒకపంక్తిలో తన ఉనికిని నిలుపుకొని యున్న ఒక పౌరుష గాథయిది.

సాధారణముగా చరిత్ర కారులు జయించినవానిని కొనియాడుదురు. ఓడినవాని పాట్ల నెన్నరు. పైపెచ్చు చులకన చేసి మాట్లాడుదురు.

ఇక దండయాత్ర సాగిన మార్గములోనూ, యుద్ధభూమి యొక్క పరిసరములలోను ఉండు సామాన్య జనుల అగచాట్లను గురించియు, కష్టనష్టములను గురించియు మాట్లాడు వాడెవడు?

అలెగ్జాండరు, చెంఘిజ్‌ఖాన్, అశోకుడు, మాలిక్‌కాఫర్ మొదలగు విజేతలందరిని చరిత్రకారులు అట్లే కీర్తించిరి. వారివలన జరిగిన విధ్వంసమును ప్రస్తావింపరైరి.

"నరహంతలు ధరాధిపతులై
చరిత్రమున ప్రసిద్ధికెక్కిరి."

యుద్ధమనగానేమి? నరమేధము, విధ్వంసము, తగులబెట్టుట. రెండుపక్షముల వారును చేయునది ఇదియే.

యుద్ధమున విజేతఅనగా ఎవరు? పై ఘోరకార్యములను, నిర్దాక్షిణ్యముగా, నిష్కరుణ ముగా సాగించుటలో ఎవడు పైచేయి సాధించునో వాడు విజేత.

పండరంగడును అట్టివారిలో ఒకడు, కట్టెపు దుర్గమును కడుబయలు – నేలమట్టము చేసినాడు. పంద్రెండు బోయకొట్టములను దెబ్బ తీసినాడు. అందుకే శాసనములో కీర్తింప బడినాడు. ఈచరిత్రను నాఊహకందిన మట్టుకు, నాశక్తి చాలిన మట్టుకు నవలగా వ్రాసినాను.

ఈచరిత్రను వ్రాయుచు పనిలోపనిగా మరియొక చరిత్రను ప్రస్తావించినాను.

"మును మార్గ కవిత లోకం
బునవెలయగ దేశి కవిత పుట్టించి తెనుం
గున నిలిపి రంధ్ర విషయం
బున జన చాళుక్యరాజు మొదలుగ బలువుర్
(సత్యాశ్రయుని దొట్టి చాళుక్యనృపుల్ – అని పాఠాంతరము)

తెలుగులో దేశికవితకు పునాదులు వేసిన చాళుక్య నృపులు ఎవరు? ఖచ్చితముగా రాజరాజనరేంద్రుడుకాడు. ఎందుకనగా నన్నయకు పూర్వమే తెలుగువారు గాసట బీసట అయిన తెలుగు దేశికవితలను చదువుచుండినారు. కావున దేశికవిత పుట్టించి తెనుంగున నిలిపినవాడు సత్యాశ్రయుడే కావలయును.

కన్నడ దేశము నందలి బాదామి నుండి తెలుగు సీమపై దండెత్తి వచ్చి ఆక్రమించిన తెలుగు చాళుక్యరాజు సత్యాశ్రయ పులకేశి తెలుగుసీమయందలి పండితులను, కవులను తెలుగులో దేశికవితను వ్రాయమని ప్రోత్సాహించినాడనియు, అతని ప్రోత్సాహముతో పండితులు, కవులు, తెలుగులో ఛందస్సును సృష్టించుకొని, పద్యములను రూపొందించు కొనిరనియు, క్రీ.శ. 848 సం॥ నాటికి పద్యము శాసనములలోనికి ప్రవేశించినదనియు, తరువాత క్రమ క్రమముగా దేశితెలుగులో చిన్న చిన్న కావ్యములు రచింపబడి (గాసట బీసట) తెలుగువారు చదువుకొనుచుండిరనియు, నన్నయ భారతము, నన్నెచోడుని కుమార సంభవము, పాల్కురికి సోమనాధుని రచనలు మొదలైన మహోన్నతములైన, బహుళ ప్రయోజనయుతములైన గ్రంథములు వెలసిన తరువాత అవి అన్నియు అనాదరమునకు గురియై ఖిలమై పోయినవనియు నాఅభిప్రాయము. ఇట్లు తెలుగు పద్యకవిత్వావిర్భావము, పరిణామము, అభివృద్ధులను అంచెలంచెలుగా నిరూపింప ప్రయత్నించినాను.

ఈ శాసనములో ఆనాటి–అనగా క్రీ.శ.848నాటి–తెలుగుభాషా పరిణామమును గురించిన అనేక ఆసక్తికరమైన విషయములు గమనింపవచ్చును.

1. ఆనాటి తెలుగు లిపిలో న,ట,డ,ద, అనునవి నాగరిలిపిని పోలియున్నవి. ణ,ర,గ,య మొదలైనవి ఈనాటి తెలుగులిపిని పోలియున్నవి.
2. న,ణ ల ప్రయోగములో నిర్దిష్టత కానరాదు. ఉదా:గౌణి, బణ్చిన.
3. వర్గానుస్వారముల ప్రయోగమున సంస్కృత సంప్రదాయము పాటింపబడినది.
   ఉదా: పఞ్చిన, రక్షిఞ్చిన, భూపాలకుణ్డు
4. అప్పటికే తెలుగుభాషలో సంస్కృత పదములు ఎక్కువగా ప్రవేశించినవి.
   ఉదా: పట్టము, ప్రథమము, బలగర్వము, సామంత, ప్రభు, రక్షించు, ఫలంబు మొ॥.
5. అప్పటి అచ్చతెలుగు పదములుకొన్ని ప్రస్తుతము అంతర్ధానమైపోయినవి.
   ఉదా: గొఱల్చి.
6. తెలుగు, సంస్కృతపదములు సమసించుటలో ఇప్పటివలె నిబద్ధత లేదు.
   ఉదా: ప్రథమంపునేడు, సామంతపదువ.
7. సమాసములందు మువర్ణమునకు పుంప్వాదేశముండినదిగానీ టుగాగమము అలవాటు లోనికి రాలేదు. ఉదా: కట్టెపుదుర్గము, ప్రథమంపునేడు (ప్రథమంపుటేడు)
8. గసడదవలు, సరళములు బహుళప్రయోగములో నుండినవి. ఉదా: గట్టిన, గావించి, సేసి, బైలేచి, గడు మొ॥.
9. సమాపకక్రియల తరువాత అసమాపక క్రియలనుంచెడు పద్యసంప్రదాయము అప్పటికే నెలకొన్నది. ఉదా: గావించె మెచ్చి.
10. కఠినమైన ఛందోనియమములుగల "తరువోజ" అప్పటికే ప్రచారములోనికి వచ్చినది. నియమకాఠిన్యమువలన త్వరలోనే కనుమరుగైపోయినది.

ఇక ఈనవలలోని భాష విషయము :–

వ్యావహారికభాష కేవలము జనవ్యహారమునకే పరిమితమనియు, గ్రాంథికభాష గ్రంథ రచనకే అనియు మొదటి నుండియు నా అభిప్రాయము, పత్రికలూ, కథలూ, నవలలూ సమకాలీన జనవ్యవహారమునకే రచింపబడినవి కనుక వీటిలో వ్యావహారికభాష సరిపడును. ఇంతకంటే మరింత విశేషమైన రచనలకు సరళగ్రాంధికమే తగునని నాఅభిప్రాయము. విశ్వనాథ, చిలకమర్తి, వీరేశలింగము, పానుగంటి మొదలైనవారి రచనలు నాఅభిప్రాయమును బలపరచు చుండెను, కాని ప్రస్తుతము పద్య కావ్యములలోనికి సైతము చొచ్చుకొని వచ్చుచున్న వ్యావహారిక భాషను చూచి, కొంత బెదురుపుట్టి ఇదివరకు నేనువ్రాసిన కథలను, నవలలను, వ్యాసములను గ్రాంథికభాషలో వ్రాయుటకు సాహసింప లేదు. వ్యావహారికములోనే వ్రాసితిని. నేడు వ్యావహారికభాష ప్రాంతీయ, మాండలిక, వర్ణ, వర్గ, వాద విభేదములతో కొట్టు మిట్టాడుచున్నది. పరస్పర విద్వేషములను కూడ సృష్టించుచున్నది. పత్రికలలో అతి జుగుప్సాకరమైన వ్యాఖ్యలు జరుగుచున్నవి. కనుక ఇప్పుడు నేను ఈనవలను సరళ గ్రాంథికములో వ్రాయుటకు పూనుకొన్నాను. జన సౌలభ్యమునకు సరళ గ్రాంథికమే తగుననిపించినది. పైపెచ్చు ఈనవలలోని వస్తు గౌరవమునకు సరళగ్రాంథికమే తగినది అనుకొంటిని. ఇట్లువ్రాయుచుండగా హాయిగా నున్నది. తేలికగానున్నది. ఎంతో సరళముగా నున్నది. చదువుచుండగా నాకేమియు వెగటుగానీ, క్లిష్టతగాని, ఎబ్బెట్టుతనముగాని కనబడుట లేదు. సహజముగానే ఉన్నది.

వ్యావహారికమునకు, గ్రాంథికమునకు ఏమి భేదము? "చేయాలి, చేశాను, చేశారు" ఇది వ్యావహారికము. "చేయవలెను, చేసితిని, చేసిరి" – ఇది గ్రాంథికము. అందలి సులువేమి? ఇందలి బరువేమి? "వేదంచెబుతోంది, వేదంచెబుతూఉంది, వేదం చెప్తూ ఉంది, వేదం చెప్పుద్ది, వేదంచెప్తాఉంది." ఇలా వ్యావహారికము నాలుగైదు విధాలు "వేదము చెప్పుచున్నది." ఇలా గ్రాంథికము ఒకవిధమే. అలాంటి గ్రాంథికములో వ్రాయుట తప్పా? పాఠకులు రెండు మూడు పేజీలు చదువగానే గ్రాంథికమునకు అలవాటు పడుదురు.

చాళుక్యరాజులనాటి కథ కావున ఇందులో ఆనాటి సామాజిక జీవనవిధానమును వర్ణింపవలసి వచ్చినది. ఆనాటిఅలవాట్లు, వస్తువులు, వ్యక్తులపేర్లు, అచ్చతెలుగు పదములు వెదికిపట్టవలసివచ్చినది. ఈనాటిఅన్యదేశ్యపదములను, వస్తువులను, ఆచార వ్యవహార ములనుమెలకువతో తొలగింపవలసివచ్చినది. చాళుక్య, పల్లవరాజుల కాలక్రమణికతో సమాంతరముగా బోయదొరల కాలక్రమణికను పాటించవలసివచ్చినది. కష్టమే.

ఈ నా ప్రయత్నమును పాఠకులు, సాహతీవేత్తలు ఎట్లు స్వీకరింతురో చూడవలె.

*భవదీయుడు*

**కరణం బాలసుబ్రహ్మణ్యం పిళ్ళై**

# మంచి చారిత్రక నవల

**అంపశయ్య నవీన్**

**(కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కార గ్రహీత)**

బోయకొట్టంబుల్వణ్డెణ్డు - బోయకొట్టములు పంద్రెండు అనే పేరుతో కరణం బాలసుబ్రహ్మణ్యంపిళ్ళై రచించిన ఈ నవలను చారిత్రక నవల అనొచ్చు. కొన్ని చారిత్రక ఆధారాలకు కొంత కల్పన జోడించి ఒకానొక కాలంలో జరిగిన సంఘటనలతో బాటు ఆనాటి సామాజిక, రాజకీయ పరిస్థితులను చిత్రిస్తూ రచింపబడిన నవలలను చారిత్రక నవలలు అంటాం.

తెలుగులో అడవి బాపిరాజు, నోరి నరసింహశాస్త్రి లాంటి నవలాకారులు గొప్ప చారిత్రక నవలల్ని రచించారు. అదే ఒరవడితో ఇప్పుడు కరణం బాలసుబ్రహ్మణ్యం పిళ్ళై ఈ "బోయకొట్టములు పంద్రెండు" అనే నవలను రచించారు. ఈ రచయిత ఇదివరకు "చండాలుడు" అనే పౌరాణిక నవలను రచించి విమర్శకుల మన్ననల్ని పొందాడు. "చండాలుడు" అనే నవలలో భారతదేశంలోని కుల వ్యవస్థలో పంచమజాతి ఎలా ఆవిర్భవించిందో, త్రిశంకు స్వర్గం అనే మాట వెనుక ఉన్న కథ ఏమిటో వివరించాడు. ఇక ఈ నవలను (బోయకొట్టములు పంద్రెండు) ఒకప్పుడు - అంటే క్రీ.శ. 614 నుండి 848 మధ్య కాలంలో బోయజాతివారు పంద్రెండు కొట్టములు - అంటే ఇంచుమించు పంద్రెండు గ్రామాల్లాంటివి - నిర్మించుకొని, ఆనాటి పల్లవ రాజులకూ చాళుక్య రాజులకూ సామంతులుగా ఉంటూ రాజ్యం చేశారనీ, పల్లవుల, చాళుక్యుల సామ్రాజ్య విస్తరణ దాహం కారణంగా వారిరువురి మధ్య నలిగి నశించారన్న ఉదంతాన్ని పండరంగని అద్దంకి శాసనం (848) ఆధారంగా తెలుసుకొని రచించారు.

అద్దంకిలో శ్రీకాళికా సమేత కమతేశ్వరస్వామి దేవాలయం ముందర స్థూపముగా నిలుపబడిన శాసన ప్రతి రూపమును చూచినప్పుడు ఈ శాసనములోని వృత్తాంతమును ఇతివృత్తముగా తీసికొని ఒక చారిత్రక నవలగా వ్రాయవచ్చుననే ఆలోచన కరణం బాలసుబ్రహ్మణ్యం పిళ్ళైకు కల్గింది. తత్ఫలితమే ఈ నవల.

తెలుగులో మొట్టమొదటి పద్యశాసనమని పేరుగాంచిన అద్దంకి శాసనములో ఏమున్నది?

పండరంగడు అనే చాళుక్య సేనాని పంద్రెండు బోయకొట్టముల మీద దాడి చేసి ఆ పంద్రెండు బోయకొట్టములను స్వాధీనము చేసికొని కట్టెపుదుర్గమును నేలమట్టం చేసెనని ఆ శాసనములో ఉంది. ఈ శాసనాన్ని క్రీ.శ. 848వ సంవత్సరంలో పండరంగడు వేయించాడు.

కొట్టము అనగా పూరికొట్టమో, తాటాకుల కొట్టమో కాదనీ, కొట్టము అనగా ఒక చిన్న పరిపాలనా విభాగమనీ చరిత్రకారులు చెప్పారు. బోయకొట్టములు పంద్రెండు అనగా నేటి రెవిన్యూ మండలముల వలె చిన్న పరిపాలనా విభాగములు అయ్యుండవచ్చునని ఈ రచయిత అభిప్రాయ పడ్డాడు.

పండరంగడు ప్రత్యేకముగా బోయకొట్టములపై ఏల దండెత్తిపోయాడు? ఆ బోయ కొట్టములు ఎక్కడివి? బోయకొట్టములలో ప్రధానమైన కట్టెపుదుర్గం ఎక్కడిది? పండరంగడు దానిని స్వాధీనం చేసుకొని చాళుక్య రాజ్యములో కలుపుకోకుండా నేలమట్టము గావించుటకు కారణమేమి? ఈ ప్రశ్నలకు ఈ నవలలో సమాధానాలు లభిస్తాయి.

బోయలు అద్దంకి ప్రాంతము వారు కారనియు, నల్లమల అడవుల ప్రాంతము నుండి వలస వచ్చి యుందురనియు చరిత్రకారులు ఊహించి యున్నారన్న విషయాన్ని రచయిత చెప్పాడు. అట్లయిన బోయలు ఎప్పుడు ఏ ప్రాంతమునుండి ఎలా వలస వచ్చారో కరణం బాలసుబ్రహ్మణ్యం పిళ్ళై ఈ నవలలో వివరంగా తెలియజేశారు.

ఈ నవలలోని సంఘటనలు క్రీ.శ. 614వ సంవత్సరంతో ప్రారంభమై 848 సంవత్సరం వరకు ఇంచుమించు 220 సంవత్సరముల పాటు కొనసాగుతాయి. 220 సంవత్సరాల పాటు జరిగిన చరిత్రను ఈ నవలలో రచయిత చిత్రించాడు. ఆ రోజుల్లో ఆంధ్రదేశాన్ని ఒకవైపు పల్లవులు, మరో వైపు వేంగి చాళుక్యులూ పరిపాలిస్తుండేవారు. ఈ రెండు వంశాల మధ్య ఎప్పుడూ యుద్ధాలు జరుగుతుండేవి. ఈ రెండు వంశాల వారితోనూ స్నేహంగా ఉండటానికే బోయరాజులు ప్రయత్నించారు.

దాదాపు రెండు వందల సంవత్సరాల కాల వ్యవధిలోనే ఆవిర్భవించి, విస్తరించి, అభివృద్ధి పొంది, ఒక వెలుగు వెలిగి కేవలం ఒక రోజులో మాత్రమే జరిగిన యుద్ధంలో సమూలంగా నేలమట్టమయిపోయి తిరిగి కోలుకోలేని విధంగా అంతరించిపోయిన బోయకొట్టముల విషాద గాధనే బాలసుబ్రహ్మణ్యం పిళ్ళై ఈ నవలలో చారిత్రక దృష్టితో చిత్రించడం ఎంతో ఆసక్తికరంగా ఉంది.

బోయకొట్టముల చరిత్ర చెబుతూనే ఆ కాలంలో ముఖ్యంగా చాళుక్యులు తెలుగు దేశికవితకు ఎలా పునాదులు వేశారో ఈ రచయిత వివరించాడు.

"తెలుగు దేశికవితకు పునాదులు వేసిన చాళుక్య నృపులు ఎవరు? ఖచ్చితంగా రాజరాజనరేంద్రుడు కాదు. ఎందుకనగా నన్నయ్యకు పూర్వమే తెలుగు వారు "గాసట బీసట" అయిన తెలుగు దేశి కవితను చదువుచుండినారు. కావున దేశి కవితను పుట్టించి ఆంధ్ర విషయంబున నిలిపిన వాడు సత్యాశ్రయుడే కావలయును" అంటాడు బాలసుబ్రహ్మణ్యం పిళ్ళై. (సత్యాశ్రయుడు రాజరాజనరేంద్రుని కంటె చాలా ముందు తెలుగు దేశాన్ని పాలించిన చాళుక్యరాజు)

ఈ నవలను రచయిత సరళ గ్రాంథికంలో రచించాడు. ఇంతకు ముందు ఈయనే రచించిన ఇతర గ్రంథాలలో శిష్ట వ్యావహారికమే కనిపిస్తుంది. 'చండాలుడు' లాంటి పౌరాణిక నవలను కూడా ఆయన వ్యావహారిక భాషతోనే రచించాడు. ఇప్పుడీ నవలను సరళ గ్రాంథికంలో ఎందుకు రచించాడు అన్న ప్రశ్నకు బాలసుబ్రహ్మణ్యం పిళ్ళై ఇలా సమాధానం చెప్పాడు.

"నేడు వ్యావహారిక భాష ప్రాంతీయ, మాండలిక, వర్ణ, వర్గ, వాద భేదాలతో కొట్టుమిట్టాడు చున్నది. పరస్పర విద్వేషములను కూడా సృష్టించుచున్నది. పత్రికలలో అతి జుగుప్సాకరమైన వ్యాఖ్యలు జరుగుచున్నవి. కనుక ఇప్పుడు నేను ఈ నవలను సరళ గ్రాంథికంలో వ్రాయుటకు పూనుకొన్నాను.

అట్లు వ్రాయుచుండగా హాయిగా ఉన్నది. తేలికగా ఉన్నది. ఎంతో సరళముగా ఉన్నది. చదువుచుండగా నాకేమియు వెగటుగా గానీ, క్లిష్టతగా గానీ, ఎబ్బెట్టుతనంగానీ కనబడుట లేదు. సహజముగానే ఉన్నది. మరి సామాన్య పాఠకులేమందురో చూడవలె. వారికిని హాయిగానే ఉండవచ్చును." అన్నాడు బాలసుబ్రహ్మణ్యం పిళ్ళె.

ఒక సామాన్య పాఠకుడిగా నేనీ నవలను చదువుతోంటే నాకు కొంచెం ఇబ్బందిగానే తోచింది. ఎందుకంటే అన్ని రచనల్నీ నేను వ్యావహారికంలోనే చదవటానికి అలవాటు పడ్డ నాకు ఈ సరళ గ్రాంథికం కొంచెం ఎబ్బెట్టుగానే తోచింది. ఇదివరకటిలా ఈయన వ్యావ హారికంలో రాస్తేనే ఈ నవలను సామాన్య పాఠకులు ఎలాంటి ఇబ్బంది లేకుండా చదవగల్గేవారని నాకనిపించింది. సంభాషణల్లో ఆయా ప్రాంతపు మాండలికాల్ని వాడితే బావుండేది. ఇప్పుడు వ్యావహారిక భాషలో ఏర్పడ్డాయని చెబుతున్న ప్రాంతీయ, మాండలిక, వర్ణ, వర్గ, వాద వివాదాలు తాత్కాలికమైనవే. వ్యావహారిక భాషే నిలుస్తుంది.

నల్లమల ప్రాంతం నుండి బోయలు అద్దంకి ప్రాంతానికి వలసపోవడంతో ప్రారంభమైన ఈ నవల 200 సంవత్సరాల తరువాత పండరంగడనే సేనాధిపతి చాళుక్య సైన్యంతో పంద్రెండు బోయకొట్టాల మీద దాడి చేసి కట్టెపు దుర్గాన్ని నేలమట్టం చేయడంతో ముగుస్తుంది. బోయల మొదటి రాజు వీరనబోయడు. అతని తర్వాత అతనికి నలుగురు వారసులు. రెండో వీరనబోయడు, పులిరాజు బోయడు, కసవన బోయడు, నన్నిదొరబోయడు, పొన్నిదొర బోయడు మొదలైన బోయరాజులు పరిపాలన చెయ్యడం – బోయల ఆచార వ్యవహారాలు, అధికారం కోసం వాళ్ళల్లో వాళ్ళే పోట్లాడుకోవడం మొదలైన సన్నివేశాలను రచయిత ఈ నవలలో చిత్రించాడు. బోయరాజులతోపాటు ఆ రోజుల్లో తెలుగు దేశాన్ని పాలిస్తున్న వేంగి చాళుక్యరాజులు తెలుగుభాషాభివృద్ధికి చేసిన సేవలను ఈ నవలలో మనం చదువుతాం. మరోవైపు పల్లవుల రాజ్యం, పల్లవరాజులకు బోయలకు ఉన్న మంచి సంబంధాలూ, పల్లవులకూ, చాళుక్యులకూ మధ్య ఉన్న వైరం, ఈ ఇరు వంశాల్లోని సామ్రాజ్యాన్ని విస్తరించుకోవాలన్న ఆకాంక్ష కారణంగా జరిగిన యుద్ధాలు, ఈ ఇరువురి మధ్య నలిగిన బోయప్రజలు – ఇలా ఈ నవలలో ఆనాటి అనేక పరిస్థితుల చిత్రణ ఉంది.

పండరంగడు వేయించిన అద్దంకి శాసనం ఆధారంగా ఇంత పెద్ద చారిత్రక నవలను రచించడం చాల కష్టసాధ్యమైన విషయం. చరిత్రలో సాధారణంగా గెలిచిన వారి ప్రస్తావనే ఉంటుంది. పంద్రెండు బోయకొట్టాలను ధ్వంసం చేశానని పండరంగడు గర్వంగా చెప్పుకుంటూ ఈ అద్దంకి శాసనాన్ని వేయించాడు. ఆ పంద్రెండు బోయకొట్టాల్ని నిర్మించుకొన్న బోయలెవ్వరు? వాళ్ళు ఎక్కడి నుండి అక్కడికొచ్చారు? వాళ్ళెలా జీవించారు? వాళ్ళను

పాలించిన రాజులెవరు? వాళ్ళ ఆచార వ్యవహారాలేమిటి? పల్లవులకు చాళుక్యులకూ మధ్య యుద్ధాలెందుకు జరిగాయి? ఆనాటి తెలుగు భాష, తెలుగు సాహిత్యం ఎలా అభివృద్ధి చెందాయి? దేశి కవిత్వాన్ని చాళుక్య రాజులెలా పోషించారు? మొదలైన అనేక ఆసక్తికరమైన అంశాలను గూర్చి ఆలోచించి, ఊహించి, పరిశోధించి ఒక సంవత్సర కాలం శ్రమించి కరణం బాలసుబ్రహ్మణ్యం పిళ్ళై ఈ నవలను రచించాడు.

ఈ నవలను పాఠకులు తప్పకుండా ఆదరిస్తారని ఆశిస్తున్నాను. ఎంతో శ్రమించి ఒక మంచి చారిత్రక నవలను రచించిన కరణం బాలసుబ్రహ్మణ్యం పిళ్ళైను అభినందిస్తున్నాను.

వరంగల్

**22-10-2012**

అంపశయ్య నవీన్

# తెలుగువారి వచన మహాకావ్యం

సాహిత్యలోకంలో ఇప్పుడే కళ్ళుతెరచిన యువరచయిత రచనల్ని ప్రముఖసాహిత్యవేత్త పరిచయం చేయవచ్చు. చెయ్యితిరిగిన సాహిత్యకారుని రచనల్ని కొమ్ములుతిరిగిన మరో రచయిత పరిచయం చేయవచ్చు. సుప్రసిద్ధ సాహిత్యవేత్త రచనను ఓనమాలు దిద్దుకుంటున్న రచయిత పరిచయం చేయటమేమిటి? ఇది ఒక విడ్డూరం. మన చుట్టూ ఉన్న ప్రపంచంలో ఇలాంటి సంఘటనలు కూడా జరుగుతుంటాయి. తప్పదుమరి.

"నన్నుగురించి రాయద్దు. నా రచననుగురించి నాలుగుముక్కలు రాయి" అంటూ ఆప్యాయంగా రాతప్రతిని పంపించారు శ్రీ కరణం బాలసుబ్రహ్మణ్యంపిళ్ళైగారు. పిళ్ళైగారు, మానాన్న గాడేపల్లి సీతారామమూర్తిగారు సాహిత్యమిత్రులు. సమవయస్కులు. పిళ్ళైగారు నాకు గురుతుల్యులు. పితృతుల్యులు. వారిమాట నాకు శిరోధార్యం.

'ఇతిహాసపు చీకటికోణం అట్టడుగున పడి కాన్పింపని కథలన్నీ కావాలిప్పుడు' అని ఆధునిక తెలుగుకవిత్వాన్ని మేలిమలుపు తిప్పిన శ్రీశ్రీగారు రచయితలకు మార్గనిర్దేశం చేశారు. పిళ్ళైగారి రచనలన్నీ చీకటిమూలల దాగిన విషాదగాథలపైన వెలుగును ప్రసరిస్తాయి. ఈ రచన ఆ కోవకు చెందినదే. సమకాలీన సాహిత్యంలో వస్తున్న ఇలాంటి ఉత్తమరచనల్ని తెలుగువారు ఆదరించే మంచిరోజులు రావాలని నేను ఆకాంక్షిస్తున్నాను.

కాలం బండిచక్రాల క్రింద నలిగిపోయి, ప్రాఙ్నన్నయయుగానికి చెందిన తెలుగువాడి చరిత్ర, శాస్త్రం, సాహిత్యం అన్నీ కనుమరుగైపోయాయి. అదృష్టవశాత్తు శిలాశాసనంలో చోటు దొరకటంవల్ల క్రీ.శ.848లో రచింపబడ్డ ఓ తెలుగుపద్యం కాలానికి ఎదురీది నిలిచింది. ఈ పండరంగని అద్దంకి పద్యశాసనం గుండ్లకమ్మతీరంలో అద్దంకి వేయిస్తంభాల గుడి పరిసరాల్లో 1900 ప్రాంతంలో లభించింది. తెలుగుభాషకు భారతప్రభుత్వం ప్రాచీనహోదాపట్టాన్ని కట్టబెట్టడానికి నిలువెత్తు సాక్ష్యంలా నిలిచిన ఈ శాసనం తెలుగు వారందరికి ప్రీతిపాత్రమైంది. ఈ శాసనంచుట్టూ జిగిబిగిఅల్లిక చేసి మీ కరకమలాల నలంకరించిన ఈ నవలను రచించారు శ్రీ పిళ్ళైగారు.

ఈ శాసనం ఇప్పటిదాకా వేంగీచాళుక్యభూపాలకుడు గుణగవిజయాదిత్యునికి, అతనిసేనాని పండరంగనికి కీర్తిని సంపాదించి పెట్టింది. ఈ శాసనంలో పండ్రెండు బోయకొట్టములపై పండరంగడు విజయకేతనం ఎగరేసినట్లు, వారి కట్టెపుదుర్గమును కడుబయల్సేసినట్లు ఉంది. రచయిత బోయవీరులపక్షం వహించి వారి విషాదగాథను నవలగా తీర్చిదిద్దారు.

ఈ నవలలో బోయవీరుల ఏడుతరాల చరిత్ర ఉంది. ఏడుతరాల చరిత్ర అన్నమాట వినగానే అలెక్స్ హేలీ రచించిన 'రూట్స్' నవల మనకు చప్పున గుర్తుకు వస్తుంది. రూట్స్ నీగ్రో బానిసల ఇటీవలి చరిత్ర. స్వేచ్ఛనుంచి బానిసత్వంలోకి, బానిసత్వంనుంచి స్వేచ్ఛవైపుకు

నీగ్రోలు పయనించటం రూట్స్ నవలలో ఇతివృత్తం. యుద్ధవిముఖులైన బోయవీరులు ప్రశాంతజీవనం సాగించటానికి ప్రయత్నించి సఫలీకృతులై విశిష్టమైన జాతిగా ఎదగటం, మళ్ళీ యుద్ధంలోకి నెట్టబడి సామ్రాజ్యవాదుల దండయాత్రలకు చిక్కి అంతరించటం ఈ నవలలో కథాంశం. బోయలు అసలుసిసలు తెలుగువీరులు. ధైర్యం, ఆత్మాభిమానం వారి సొత్తు. తరతరాలుగా వస్తున్న తెలుగువారి ఏడుచేపల గొలుసుకట్టు కథలాగా బోయవీరుల ఏడుతరాల కథకూడా తెలుగువారిని అలరిస్తుంది.

చరిత్రకారుడు శాసనాలనుంచి, నాణేలనుంచి, బ్రతికి బట్టకట్టిన ప్రాచీనగ్రంథాలనుంచి చరిత్రను సత్యనిష్ఠతో పునర్నిర్మిస్తే, ఆ చారిత్రకసత్యాలను స్వీకరించి, కల్పనలుచేసి రక్తమాంసాలున్న సజీవపాత్రలను పునఃసృష్టిస్తాడు నవలారచయిత.

చారిత్రకనవలారచనలో రచయిత ఊహావిహంగం మానవసంబంధాలమీద, గతంనుంచి నేర్చుకోవలసిన అంశాలమీద దృష్టి నిలిపి, గతంనుంచి భవిష్యత్తులోకి అడుగువేస్తున్న మానవునికి పథనిర్దేశం చేస్తుంది. కొన్ని చారిత్రక సత్యాల విషయంలో చరిత్రకారులకు భిన్న అభిప్రాయాలుంటాయి. రచయిత తనకు న్యాయమనిపించిన ఏదో ఒక అభిప్రాయాన్ని స్వీకరించి రచన కొనసాగించాలి. వాస్తవానికి బెత్తెడో జానెడో దూరంలో కథ నడిపినా ప్రమాదమేమీ లేదు. ప్రాచీనగ్రంథాలనుంచి, వర్తమాన సమాజంనుంచి సునిశిత పరిశీలనా దృష్టితో, లోకజ్ఞతతో చారిత్రక నవలకు కావలసిన ముడిసరుకు సమకూర్చుకుంటాడు రచయిత. ఇది రచయిత ప్రతిభకు అగ్నిపరీక్ష.

తెలుగువారి తొలి మూడుపద్యశాసనాలలోను పండరంగని పరాక్రమం, బోయల ఓటమి ప్రసక్త మయ్యాయి. తరువోజపద్యాన్ని భద్రంగా కాపాడిన పండరంగని అద్దంకిశాసనంలో బోయల పంద్రెండుకోట్టములను పండరంగడు జయించి వేంగీచాళుక్యరాజ్యంలో కలిపినట్లు తెలుస్తుంది. క్రీ.శ.850కి చెందిన కందుకూరు శాసనంలో(సీసపద్యం ఉన్న శాసనం) 'కొలదిలేని కొట్టంబుల్ వొడిచె' అని ఉంది. కొలదిలేని అనటంవల్ల హద్దులులేని విస్తారమైన బోయకోట్టాలు పండరంగడు జయించినట్లు భావించాలి. ధర్మవరం శాసనంలో(క్రీ.శ.897కు సంబంధించిన సీసపద్యం ఉన్న భీమమహారాజు శాసనం) 'రామవిభునితో [illegible] (గుణగ విజయాదిత్యుని) నెడఱిన(ఎదిరించిన) బోయల నడవి సొన్పె' అని ఉంది. గుణగ విజయాదిత్యుని ప్రభుతను ఎదిరించిన బోయలను ఓడించి పండరంగడు అడవిదారి పట్టించాడని ఈ శాసనార్థం.

బోయలు కందుకూరు ప్రాంతంలో కోట్టములు ఏర్పాటు చేసుకున్నారని చరిత్రకారుల అభిప్రాయం. పిళ్ళెగారు త్రిపురాంతకం ప్రాంతంనుంచి గుండ్లకమ్మ, ముస్సీనదుల మధ్యప్రాంతానికి వీరు వలసవచ్చినట్లు చిత్రించారు. 1921 జనాభాలెక్కలను పట్టిచూస్తే మద్రాసు ప్రెసిడెన్సీలో 4లక్షలకుపైగాఉన్న బోయలు రాయలసీమలోను, నాటి నెల్లూరు జిల్లాలోను మాత్రమే కేంద్రీకృతమైనట్లు తెలుస్తుంది. మద్రాసు ప్రెసిడెన్సీలోని మిగతా జిల్లాలలో బోయలు లేకపోవటంవల్ల పంద్రెండు బోయకోట్టములు నేటి రాయలసీమ జిల్లాలలోను,

నెల్లూరు, ప్రకాశం జిల్లాలలోను విస్తరించి ఉండేవేమో అన్న ఊహ చేయటానికి ఆస్కారం ఉంది. బోయలు మిగతావారిలాగా అన్ని ప్రాంతాలకు వ్యాప్తి చెందకపోవటం, ఒక ప్రాంతంలోనే కేంద్రీకృతమవటం వంటి విషయాలను భావిచరిత్రకారులు పరిశీలించాలి.

ఆ కాలంలో అద్దంకిని అణ్డెక్కి అని, కందుకూరును కండుకుర్ అని, ధర్మవరాన్ని దమ్మపురం అని, బెజవాడను ఆ పేరుతోనే పిలిచేవారు. ఈ ఊర్లన్నీ నాటినుంచి నేటిదాకా నిలిచే ఉన్నాయి. కాని పన్నెండు బోయకోట్టములలో అప్పటి పేర్లతో ఒక్కటీ నిలిచి ఉన్నట్లు కనిపించటం లేదు. కట్టెపుదుర్గము పేరుతోకూడా కందుకూరుప్రాంతంలో ఏఊరూ కనిపించటం లేదు. ఖచ్చితంగా పన్నెండు బోయకోట్టములకు పన్నెండు పేర్లు ఉండి ఉండాలి. కోట్టము అనేపేరు ఉంటే పల్లవరాజ్య పరిపాలనా విభాగం అన్న విషయం గుర్తుకు వస్తుంది. బోయశబ్దం లేకుండా కోట్టములు ఉండి ఉండవు. పూర్వభాగంలో బోయవీరుని లేక నాయకుని పేరు నిలుపుకుని ఉత్తరభాగంలో బోయకోట్టము అన్న పేరును కలుపుకుని ఆ కాలంలో బోయకోట్టములు చలామణీ అయి ఉంటాయి. బేతకొట్టము, కొండబోయని కొట్టముల వలె. బోయలను సర్వనాశనం చేసి అడవులదారి పట్టించిన పండరంగడు ఆ ఊర్ల పేర్ల నన్నిటిని మార్చివేసి ఉంటాడు. ఇది ఒక ఊహ మాత్రమే.

ఈ నవల కాలం ప్రాఙ్నన్నయయుగంలో క్రీ.శ.624నుంచి క్రీ.శ.848వరకు విస్తరించింది. విష్ణుకుండినుల ఏలుబడిలో ఉన్న తీరాంధ్రప్రాంతం బాదామిచాళుక్యరాజుల హస్తగతమైంది. రెండవ పులకేశి సామ్రాజ్యవిస్తరణ కాంక్ష ఉన్న యోధుడు. అన్యాయంగా తన సామ్రాజ్యాన్ని ధారాదత్తం చేసుకొన్న పినతండ్రిని చంపి రాజయ్యాడు. పులకేశి తమ్ముడు కుబ్జవిష్ణువర్ధనుడు. అన్నదమ్ములిద్దరూ దక్షిణాపథాన్ని తమ ఏలుబడి కిందకు తెచ్చుకోటానికి పల్లవులపైన, విష్ణుకుండినులపైన, కళింగగాంగులపైన అనేకయుద్ధాలు చేశారు. దక్షిణా పథంవైపు దండెత్తుతున్న హర్షవర్ధనుని నర్మదానది తీరంలో నిలువరించి ఓడించిన ఖ్యాతి రెండవ పులకేశి సొంతం. విష్ణుకుండినుల ఏలుబడిలో ఉన్న తీరాంధ్రప్రాంతాన్ని క్రీ.శ. 624 నుంచి కుబ్జవిష్ణువర్ధనుడు పరిపాలించాడు. కుబ్జవిష్ణువర్ధనునితో వేంగీచాళుక్యయుగం మొదలయింది. అన్నదమ్ములిద్దరూ దక్షిణాపథాన్ని దాదాపుగా తమ గుప్పిట్లోకి తెచ్చుకున్నారు.

7వ శతాబ్ది ప్రారంభంలో యుద్ధాలతో ఆంధ్రదేశం అతలాకుతల మయిపోయింది. నిరంతరం యుద్ధాలలో పాల్గొనటంవల్ల బోయజాతికి ఆకాలంలో అంతరించిపోయే ప్రమాదం వచ్చింది. బోయలు పల్లవ సామ్రాజ్యం ఉత్తరసరిహద్దులో కోట్టములు(పల్లవరాజ్యంలో పరిపాలనా విభాగాలు) నిర్మించుకొని తమజాతిని రక్షించుకున్నారు.

తెలుగుభాషకు, తెలుగు సాహిత్యానికి ప్రాఙ్నన్నయయుగానికి చెందిన శాస్త్రాలకు సంబంధించిన కొన్ని ప్రత్యేక విషయాలు ఈ నవలలో చోటుచేసుకున్నాయి. వాటిని రేఖామాత్రంగా పరిచయం చేశాక నవలలోని మరికొన్ని విశేషాలను పేర్కొంటాను. నేడు మనం మాట్లాడే భాషలో అన్యదేశ్యపదాలు కోకొల్లలు. అన్యదేశ్యాలు లేకుండా మనం కాస్సేపుకూడా మాట్లాడటం దుష్కరం. నవల ప్రాచీనకాలానికి చెందినదవటంవల్ల అన్య

దేశ్యాలను సుతరామూ వాడకుండా దేశ్య తత్సమ తద్భవాలతోనే కథ నడిపించారు. మన భాషలోని దేశ్య శబ్దాలు అనేకం నేడు అటకెక్కాయి. అటకెక్కిన దేశ్యపదాలను ఆత్మీయంగా స్వీకరించి నవలలో పిళ్ళెగారు ఉపయోగించారు. చారిత్రక నవలలకు వ్యావహారికభాష సరిగ్గా నప్పదని యెంచి పిళ్ళెగారు సరళగ్రాంథిక భాషలో ఈ నవలను రచించారు.

తెలుగు సాహిత్యాభిమానులను అలరించే అనేక రసవద్ఘట్టాలకు ఈ నవల చోటు కల్పించింది. ప్రాఙ్నన్నయయుగంలో తెలుగు సాహిత్య స్వరూపం ఇలా ఉండేదేమో అనే అంచనాకు రావటానికి ఈ నవల ఉపయోగపడుతుంది. నన్నయ మహాభారత రచన అఖండగోదావరిలా ప్రవహిస్తుంది. తెలుగుకవిత్వం పుట్టుకతోనే ఆ స్థాయి నందుకోదుకదా! గుండ్లకమ్మ వాగులా ప్రాఙ్నన్నయయుగంలో ప్రవహించిన తెలుగు కవిత్వం కాలక్రమంలో గోదావరి స్థాయి నందుకుని పరవళ్ళు తొక్కింది. మార్గకవిత్వం(సంస్కృత కవిత్వం) లోకంలో ప్రశస్తంగా ఉండగా జనచళుక్యరాజులు(జనసత్యాశ్రయరాజు) దేశికవితను(దేశీయమైన తెలుగు కవిత్వం) పుట్టించి తెలుగున నిలిపారని నన్నెచోడుడు కుమారసంభవంలో పేర్కొన్నాడు. తరువోజ, సీసం, ఆటవెలది, తేటగీతి, మధ్యాక్కర వంటి పద్యాలన్నీ దేశికవితలే. జనసత్యాశ్రయరాజు(చాళుక్యరాజు) దేశికవితను పుట్టించాడన్న ఈ మాటను పట్టుకుని పిళ్ళెగారు దేశీయచ్ఛందాల పుట్టుకను అలరించేవిధంగా అందించారు. అందుకోసం యతులు, ప్రాసలు, సంధులు లేని కొన్ని పద్యాలనుకూడా రచించి తెలుగు పద్యం ప్రాథమిక దశలో ఇలా ఉండవచ్చు అని చూపారు. తమిళులకు పూర్వమే తెలుగువారు మంచి కవిత్వం చెప్పారని గాథాసప్తశతిని ఉటంకిస్తూ గడుసుగా పొన్నిదొర పల్లవరాజకన్య వకుళను సరస సాహిత్య సంభాషణలతో అలరించిన ఘట్టంకూడా సాహిత్యాభిమానులకు ఆనందం కలిగిస్తుంది. పొన్నిదొర, వకుళల ముద్దుపట్టి మలయప్ప సంస్కృత విద్వాంసుడు. శంకరాచార్యుని శివానందలహరిని, సౌందర్యలహరిని చదివి శంకరుని కవితాశక్తికి, భక్త్యావేశానికి పులకించి తన్మయత్వంతో వ్యాఖ్యానించిన సందర్భం ఒక రసవద్ఘట్టం. బహుశ అది రచయిత యొక్క స్వానుభూతి కూడా కావచ్చు.

పండరంగనినుంచి ధర్మవరంలోని 'ఎణుబొది పుట్ల ఆడ్లుపట్టునేల'ను దానంగా స్వీకరించిన ఆదిత్యభట్టారకుని వంశం ప్రాఙ్నన్నయయుగంలో భరతఖండంలోని శాస్త్ర సంబంధ ప్రగతిలోని వివిధ దశల్ని ఆవిష్కరించటానికి పిళ్ళెగారు వినియోగించుకున్నారు. తెలుగునేలపైన ఒకప్పుడు శాస్త్రసంబంధ పరిశోధనలు అద్భుతంగా జరిగాయి. ముఖ్యంగా గణిత, రసాయనిక, లోహ శాస్త్రాలలో గొప్ప పరిశోధనలు జరిగాయి. ఆదిత్యభట్టారకుని ముత్తాత, ముదిముత్తాతలు ఉజ్జయినితో సంబంధాలు కొనసాగిస్తూ ఖగోళ గణిత శాస్త్రాలలో వరాహమిహిరుని స్థాయి నందుకున్నవారుగా కనిపిస్తారు. ఆదిత్యభట్టారకుని ముత్తాత అర్కభట్టారకుని పరిశోధనలు 'టైకోబ్రాహి' పరిశోధనల్ని తలపింపజేస్తాయి. భూమిచుట్టూ సూర్యుడు, గ్రహాలు తిరుగుతున్నాయని విశ్వసిస్తున్న కాలంలో కూడా గ్రహభ్రమణ కాలాలు చక్కగానే లెక్కగట్టేవారు. అర్కభట్టారకుడు జీవిత చరమాంకంలో జ్యోతిష్యశాస్త్రంవైపు మొగ్గు

చూపాడు. ఆ తరువాత ఖగోళశాస్త్రం నుంచి తరువాతి తరాలవారందరూ జ్యోతిషశాస్త్రంవైపు అడుగులు వేశారు. జ్యోతిషంతోపాటు చరక, శుశ్రుతుల వైద్యవిధానాల్ని ఔపోసన పట్టారు. ఆదిత్యభట్టారకుడు జ్యోతిష్యశాస్త్రవేత్తగాను, వైద్యుడుగాను పేరెన్నికగన్న మేధావిగా, పండరంగని ప్రాణదాతగా చిత్రించారు పిళ్ళైగారు. క్రీ.శ.850కి చెందిన ధర్మవరపు గద్యశాసనంలో ఆ కాలంలో శాస్త్రపారంగతులు అనేకమంది ఉండేవారని అర్థమవుతుంది. ధర్మవరపు శాసనంలో అయ్యపయ్యను చౌషష్టి కళావిశారదునిగా, పెదపండరంగడు, అయ్యప్రెగ్గడలను సకలశాస్త్రపారంగతులుగా, బెజయరాజును బృహస్పతి సమానులుగా పేర్కొనడం జరిగింది. ఆదిత్యభట్టారకుడు, పండరంగడు, కడెయరాజు సకలశాస్త్ర పారంగతులు కావటానికి అవకాశం బాగాఉంది. క్రమంగా శాస్త్రం వెనుకబడి, శాస్త్రీయ దృక్పథం వెనుకబడి జ్యోతిష్యం, సాహిత్యం మేధావులను ఆకర్షించాయి. రచయిత నాటి వాస్తవిక పరిస్థితులను కళ్ళకు కట్టినట్లు చిత్రించారు.

ఈ నవల ప్రాజ్ఞన్నయయుగపు విజ్ఞానసర్వస్వంలా ఉంది. అనేకవిషయాలపైన నవలలో సమాచారం అందించారు పిళ్ళైగారు. ఏనుగులను పట్టే విధానం, వాటికి శిక్షణ ఇచ్చే విధానం, విలువిద్యా ప్రదర్శనం, యుద్ధతంత్రాలు, నాటి శిక్షావిధానాలు, సాతులు, సంతలు, పన్నులు, నాటకప్రదర్శనలు, తోలుబొమ్మలాటలు, ఆలయనిర్మాణం, కోటలు కట్టుకోవడం, ఊర్లు ఏర్పడటం – ఒకటేమిటి అనేక విషయాలపైన దృష్టిని సారించింది ఈ నవల.

బోయజాతిని కాపాడుకోవటానికి ఉద్యమించిన బోయనాయకుడు కట్టెం వీరనబోయన తొలితరం ప్రతినిధి. ఎడమ ముంజేతిని, ఎడమ చెవి సగభాగాన్ని యుద్ధాల్లో పోగొట్టుకున్నాడు. కుడివేపు డొక్కపై జేనెడు పొడవు కత్తిగాటు ఉంది. కట్టెం వీరన బోయన నేతృత్వంలో బోయలు త్రిపురాంతకం అటవీప్రాంతాలనుంచి కందుకూరువైపుకు వలస వెళుతున్న ఘట్టంతో నవల మొదలవుతుంది. యుద్ధాల్లేని ప్రశాంతమైన జీవనం సాగించటానికి మరో ప్రపంచంవైపుకు 'పదండిముందుకు, పదండి త్రోసుకు' అంటూ బోయజాతి ముందుకు అడుగు వేస్తుంది. వలస వెళ్తున్న బోయలు సాయంత్రంవేళ అద్దంకి సమీపంలోని గుండ్లకమ్మ తీరానికి చేరుకునేసరికి చల్లనిగాలితాకి కదంతొక్కుతున్న యువకులకు జానపదగీతాలు ఆలపించే ఉత్సాహం వస్తుంది. పద్యంపుట్టిన గడ్డమీద అడుగుపెట్టగానే ఆశువుగా ద్విపద లల్లే శక్తి బోయయువకులకు వచ్చినట్లు నిరూపించటంలో పిళ్ళైగారు ఒక విశేషాన్ని సాధించారు. రెండు ద్విపద పాదాలను ఏకపాదంగా చేసుకుని, పాదానికి మూడు యతిస్థానాలతో ప్రాస నియమంతో అలరారే 'తరువోజ పద్యానికి ద్విపద మాతృమూర్తి' అన్న అంశాన్ని సమర్థిస్తున్నట్లు అన్యాపదేశంగాతెలిపారు.

చెరకుతోటల్లో పల్లెపడుచులు పనిచేసుకుంటున్నట్లు పిళ్ళైగారు పేర్కొన్నారు. రచయిత ఈ నవల రాస్తున్నప్పుడు అద్దంకికి వచ్చి పరిసరప్రాంతాలను, ధర్మవరాన్ని చూశారు. అద్దంకి సమీపప్రాంతంలో ప్రస్తుతం చెరకును రైతులు పండించటం లేదు. మరి ఎందువల్ల వీరిలా పేర్కొన్నారని కాస్త ఆలోచించవలసి వచ్చింది. నేను కొందరు సృజనమిత్రులతో

కలిసి 2006లో ఎఱ్ఱనవిగ్రహాన్ని అద్దంకిలో ఆవిష్కరించుకుంటున్న సందర్భాన్ని పురస్కరించుకుని గుడ్లూరుకు వెళ్ళాను. గుడ్లూరు నెలవుగా గుణగరిష్ఠత నొప్పినవాడు ఎఱ్ఱన. గుడ్లూరులో ఎఱ్ఱన వంశంవారిమని చెప్పుకుంటున్న డాక్టరుగారింటికి వెళ్ళాము. అక్కడ వారితో మాట్లాడుతున్న సందర్భంలో వాళ్ళ పెరట్లో ఉన్న ఉసిరికచెట్ల విషయం వచ్చింది. ఎఱ్ఱన రామాయణంలో రాముడిబాణం తగిలిన రావణాసురుడి తలకాయలు పిడుగుపాటుకు దుల్లిపోయిన ఉసిరికకాయల్లా ఉన్నాయని అంటారు. రామాయణంలోనే అయోధ్యాపురాన్నో, మరోపట్టణాన్నో వర్ణిస్తూ 'చెఱకుందోఁటలఁ బెంచి శాలిమయసు క్షేత్రస్థలుల్ నించి'నారని అంటాడు. ఈ రెండు పద్యాలు అవాల్మీకాలే. గుడ్లూరు ఉసిరిక కాయలను, అద్దంకి చెరకుతోటలను ఎఱ్ఱన రామాయణంలోకి ఎక్కించా రన్నమాట. అందుకే చెరకుతోటలు ఈ నవలలో హఠాత్తుగా అద్దంకిలో ప్రత్యక్షమయ్యాయి.

అద్దంకి దుర్గాధ్యక్షుడు రుద్రమనాయకుడు పల్లవుల ప్రతినిధి. యుద్ధాలలో ఆరితేరిన రుద్రమనాయకుడు నాలుగు మూరల ఎత్తు మనిషి. సాటివీరునికి కట్టెం వీరనబోయన నిలువెత్తు ముమ్మొనవాలును బహూకరించాడు. రుద్రమనాయకునికి నిలువెత్తు బంగార మిచ్చినా అంతటి సంతోషం కలుగదేమో అనిపిస్తుంది పాఠకునికి.

కొత్త ప్రాంతానికి వలస వచ్చాక కట్టెం వీరనబోయన బోయలతో మాట్లాడిన ఈ మాటలు నాటి బోయల కష్టాలను, వారి ఆత్మాభిమానాన్ని మన కళ్ళముందుంచుతాయి. "కష్టములు వచ్చుచుండును. పోవుచుండును.... కష్టములు వచ్చినపుడు భయపడరాదు. ధైర్యముతో ఎదుర్కొని బయటపడవలె. మనము బోయదొరలము. ధైర్యమే మన బలము. కష్టపడుటయే మన ఊపిరి. ఇదికూడ మనకన్నతల్లి భూమాతయే. వేరేలోకము కాదు." ఇలా రచన చేసినపుడు కథకు కావ్యత్వం సిద్ధిస్తుంది.

కట్టెం వీరనబోయన వారసుడు ప్రయోజకుడు కాకపోవటంవల్ల వీరనబోయన మరణానంతరం బోయదొరసాని మంగసాని బోయలకు నాయకత్వం వహించవలసి వచ్చింది. వేంగీచాళుక్యరాజు జయసింహుడు బోయలపై యుద్ధానికి వచ్చినప్పుడు బోయదొరసాని ప్రదర్శించిన రాజనీతి ప్రశంసార్హం. అప్పుడే నిలదొక్కుకుంటున్న బోయజాతి యుద్ధాన్ని ఆహ్వానించే స్థితిలో లేదు. ఈ సందర్భంలో రచయిత చేసిన వ్యాఖ్యానం గమ నించండి. "ఝంఝూమారుతము నెదిరించి తాటిచెట్టు కూలిపోవుచున్నది. తలవంచుకొనిన గడ్డిపోచ తరువాత తలయెత్తుకుని నిలబడుచున్నది. ప్రస్తుతమునకు అదియే రాజనీతి."

జయసింహవల్లభుడు అద్దంకిలో అర్కభట్టారకుడనే ఖగోళ శాస్త్రజ్ఞుని కలుసుకున్న సందర్భంలో వారిద్దరి మధ్య జరిగిన చర్చ ఆసక్తిని కలిగిస్తుంది. ఇక్కడ పిళ్ళేగారు తనకున్న జ్యోతిశ్శాస్త్ర పరిచయాన్ని చక్కగా వినియోగించుకొన్నారు. అర్కభట్టారకుడు ప్రాచీన భారతదేశ చరిత్రలో రాజులు ప్రదర్శించిన విజ్ఞత నేటి రాజులు ప్రదర్శించటం లేదంటాడు. "బలమున్న వాని జాతియే ప్రజల జాతి. బలమున్నవాని భాషయే ప్రజల భాష" అయిపోయినదని ఆక్రోశిస్తాడు. బౌద్ధ జైన నిరీశ్వరవాద మతాల ప్రాబల్యం పెరిగిపోయిందని బోయలలో

వైదిక మతంపట్ల అనురక్తిని కలుగజేసి ప్రజానురంజకంగా పాలన సాగించమని హితబోధ చేస్తాడు. జయసింహుడు సర్వసిద్ధి బిరుదాంకితుడు. శాస్త్రజిజ్ఞాస, భాషానురక్తి, వైదిక మతాభిమానం ఉన్న జయసింహుని ఈ నవలలో చక్కగా ఆవిష్కరించారు పిళ్ళైగారు.

బోయవీరుల విలువిద్యా నైపుణ్యాన్ని అక్కడక్కడ అందమైనఘట్టాలుగా తీర్చిదిద్దారు పిళ్ళైగారు. మూడవతరం బోయల ప్రతినిధి వీరనబోయడు విలువిద్యలో మేటి. వినుకొండ నగరాధ్యక్షుడు నిర్వహించిన విలువిద్యా ప్రదర్శనలో బోయవీరులు అసమాన ప్రతిభను చూపారు. బోయవీరుల గురి తప్పదని రచయిత నిశ్చితాభిప్రాయం. ఒక బోయవీరుని గురిని తప్పించటానికి చీమ కథలోకి ప్రవేశించక తప్పలేదు. నగరాధ్యక్షుని మెడలోని ముత్యాలహారం వీరనబోయని కంఠాన్ని అలంకరించినవేళ, కోటకొమ్మంచుల పంచెలచాపులు నగరాధ్యక్షుడు విలుకాండ్రకు బహూకరించిన క్షణాన వీరనబోయని భార్య జయశ్రీ సంతోష మునకు పట్టపగ్గములు లేవంటాడు. పుట్టినింటిలో ఆమె ప్రతిష్ఠ దేవాలయ ధ్వజస్తంభమంత ఎత్తు పెరిగిపోయిన దనటం పిళ్ళైగారికే చెల్లింది. ఔచితీవంతమైన తేటైన మాటలను కూర్చుకొని చక్కని శైలితో కథనాన్ని నిర్వహించటం మహాకవుల స్థాయిని అందుకున్న రచయితలకే సాధ్యం అవుతుంది.

వీరనబోయడు మామగారు కుట్టించి ఇచ్చిన పొడవు చట్టలను(మోకాలి పొడవు చొక్కాలు) ధరించి బోయకోట్టాలలో తిరుగుతాడు. అదిచూసి బోయయువకు లందరూ పొడవు చట్టలను కుట్టించుకుంటారు. వీరన బోయడు పొడవు చట్టలు ధరించి తిరగడం బోయని తల్లికి, పినతల్లికి నచ్చదు. బోయలు నాగరీకుల వస్త్రధారణపట్ల మొగ్గుచూపడం అస్తిత్వాన్ని కోల్పో వటంగా బోయని తల్లులు భావించారు. విషయం తెలుసుకున్న వీరన బోయడు వాటిని ధరించడం ప్రత్యేక సందర్భాలకు పరిమితం చేసుకున్నాడు. మిగతా బోయ యువకులందరూ బోయదొర పద్ధతినే అనుసరిస్తారు. యథారాజా తథాప్రజా అంటూ ఈ ఘట్టానికి అందమైన ముగింపు పలుకుతారు పిళ్ళైగారు.

పల్లవుల మహారాణి, రాజప్రముఖులు తిరువేంగడక్షేత్రం కొండ ఎక్కుతున్నప్పుడు కాసేపు విశ్రమిస్తారు. పల్లకీలో అంతసేపు కూచుని దిగినవారు కాళ్లతిమ్మిరి తీరుటకై అటునిటు నడువసాగారట. పల్లకీని మోసిన బోయీలు కాళ్ళనొప్పులు తీరుటకై విశ్రమించారట. ప్రభువెక్కిన పల్లకీలోనివారి కాళ్ళ తిమ్మిరిని, అది మోసిన బోయీల కాళ్ళనొప్పులను పట్టించుకున్న పిళ్ళైగారి పరిశీలనాశక్తి ప్రశంసనీయం కదా!

ఈ నవలలోని విశేషాంశాల నన్నింటినీ వివరంగా రాస్తే నవలంత అవుతుందనే భయంతో నవలలోని మరో నాలుగుతరాల కథను టూకీగా ఇక్కడ రాస్తున్నాను. వీరన బోయనకు బోయయువతి సంపంగి వలన కసవనబోయడు, చాళుక్యపడతి జయశ్రీ వలన పులిరాజు జన్మించారు. పులిరాజు ఒక్కడే బోయలలో చారిత్రక పురుషుడు. మిగిలిన బోయవీరులందరూ కల్పిత వ్యక్తులే. పులిరాజు పృథ్వీవ్యాఘ్రరాజుగా చరిత్రలో ఉటంకింప బడ్డాడు. వీరన బోయని మరణానంతరం పులిరాజు స్వతంత్రించి పల్లవులతో వైరం కొనితెచ్చు

కోవడం, పారిపోవడం వంటి సంఘటనలు చోటుచేసుకున్నాయి. పల్లవసేనాని ఉదయ చంద్రుడు బోయలదుర్గాన్ని పట్టుకున్నాక పులిరాజు సోదరులకు 'కొరత' అనే భయంకరమైన మరణశిక్ష విధిస్తాడు. కసవనబోయని మనవడు వీరభద్రుని బోయలరాజుగా ఉదయచంద్రుడు ప్రకటిస్తాడు. పులిరాజుభార్య నాగసాని తన కొడుకు రాజు కాలేదని పగబట్టి వీరభద్రునికి విషంపెట్టి చంపుతుంది. నాగసానికి కసవనబోయన 'పుట్టెడు సున్నపురాళ్ళలో విడగబోయడం' అనే భయంకరమైన శిక్ష విధిస్తాడు. కొఱత వేయడం, సున్నపురాళ్ళలో విడగబోయడం అనే శిక్షలను అతి బీభత్సంగా వర్ణించారు రచయిత.

బోయలలో మూడవతరం ప్రతినిధులదాకా అందరూ నిరక్షరాస్యులే. నాలుగవ తరంనుంచి అక్షరం వీరిని ఆకట్టుకుని వీరి ఉన్నతికి తోడ్పడింది. 'ఓం నమః శివాయ సిద్ధం నమః' అన్న మంత్రాక్షరాలతో అక్షరాభ్యాసం మొదలవుతుంది. ఇందులో వైదిక జైన సంప్రదాయాలు పడుగుపేకల్లా మనసంస్కృతిలో కలిసిపోయాయి. కసవనబోయని ఆరవతరం ప్రతినిధులైన నన్నికి, పొన్నికి అక్షరాభ్యాసం చేయించి వాళ్ళను బోయదొరలుగా తీర్చిదిద్దు తాడు. కసవనబోయడు వృద్ధుడైపోయినందువల్ల నన్నిబోయడు బోయదొరగా వ్యవహరిం చవలసి వస్తుంది. 'ధర్మరాజు పిన్న వయస్కుడైనను ఎవరును అతనిని దుర్యోధనాదులతో సమానముగా చూడలేదు. భీష్మవిదురాదులతో సమానముగా చూచినారు' అన్న ఒక్క వాక్యంతో బోయలలో నన్నిబోయని స్థానం ఎంతటిదో రచయిత తెలియజేస్తాడు. నన్నిదొర, పొన్నిదొర రామలక్ష్మణులలాగ ఒకరికొకరు తోడుగా నిలుస్తారు. కుశాగ్రబుద్ధియైన పొన్నిబోయడు పైచదువులకై గుంటూరుకు, ధాన్యకటకానికి వెళతాడు. విద్యాభ్యాసానంతరం తిరిగివచ్చిన పొన్నిబోయడు గజబలాన్ని బోయలు సమకూర్చుకోవాలన్న ఉద్దేశంతో తిరువేంగడపతి వెలసియున్న పర్వతారణ్యానికి వెళతాడు. పొన్నిదొర, పల్లవరాజకన్య వకుళలమధ్య స్నేహబంధం వివాహబంధ మవుతుంది. వకుళప్రవేశంతో నవల అందమైన సొగసుల నందుకుంటుంది. వకుళ మలయప్పస్వామి భక్తురాలు. విలువిద్యలో అసమానమైన ప్రతిభ ఆమె సొంతం. బావగారు నన్నిదొర నేర్పిన పాఠాలతో విలువిద్యాతత్త్వం ఒంటబట్టించు కుంటుంది. బోయయువతుల సేనను తయారుచేస్తుంది.

పండరంగని తండ్రి కడెయరాజు పొన్నిదొర చేతిలో ఓడిపోవటం అవమానంగా భావించి బోయలపై కసిని పెంచుకుంటాడు. తండ్రికి జరిగిన పరాభవాన్ని జీర్ణించుకోలేక పండరంగడు సైన్యాధిపతి కాగానే అనంతమైన సేనావాహినితో బోయలపై దండెత్తుతాడు. యుద్ధతంత్రాలలో ఆరితేరిన పండరంగడు కట్టెపుదుర్గాన్ని 'కడుబయల్' చేసి పగతీర్చుకుంటాడు. నన్నిదొర, పొన్నిదొర అసమాన వీరులైనా దొమ్మియుద్ధంలో మామూలు సైనికుల చేతిలో హతులవుతారు. ఈ సందర్భంలో 'పలువు రొకని కోడి పాఱుట బల్లిదు లనదచేతఁ జెడుటయును ఘటిల్లు' అన్న తిక్కనగారి మాటలు మనకు గుర్తుకు వస్తాయి. కుమారులు, నన్నిదొర, పొన్నిదొర కళ్ళముందు మరణించటంతో వకుళ భద్రకాళికలా పండరంగనిపై దాడిచేసి తిరువేంగడ క్షేత్రంవైపు వెళ్ళిపోతుంది.

ఈ నవలలో వకుళను అపరశక్తిగాను, ప్రహ్లాదుని అంతటి భక్తురాలుగాను తీర్చి

దిద్దటంలో రచయిత కృతకృత్యులయ్యారు. మలయప్పసేవలో జన్మ ధన్యం చేసుకున్న వకుళ గాథను చదివితే విశ్వనాథవారు ఎంత ఆనందిస్తారో అన్న ఆలోచన వచ్చింది. ఆముక్తమాల్యద షష్ఠాశ్వాసంలో విష్ణుభక్తుడు మాలదాసరికథ ఉంది. ఈ నవలలో వకుళ ఆరవతరానికి ప్రతినిధురాలు. ఈమె భక్తికూడా మాలదాసరి భక్తితో సరిసమానమైనది. ఆముక్తమాల్యద పీఠికలో విశ్వనాథవారు రాసిన ఈ మాటలు పిళ్ళైగారి నవలకు వర్తిస్తాయనిపించింది. విశ్వనాథవారి మాటలతో ముగిస్తాను. "ఓహో ఏమి కథ! ఏమి చెప్పుట! ఇట్లు కథ చెప్పుట సృష్టిలో అనేకములైన నాగరకభాషలలో, మహాకావ్యములున్న భాషలలో మరియొకచోట కనిపించదు. ఇది యొక యాశ్చర్యము!"

ఈ నవలలోని –
ఇతివృత్తం కావ్యేతివృత్తం,
భాష కావ్య భాష,
శైలి కావ్య శైలి,
కల్పనలు కావ్య కల్పనలు,
ఇది తెలుగువారు తప్పక చదువవలసిన వచన మహాకావ్యం.

అద్దంకి, **గాదేపల్లి దివాకరదత్తు**
25-11-2013

# ఎందరి సహకారం!

ఇప్పటి వరకు మనకు లభించిన తొలి తెలుగుపద్యము పండరంగని అద్దంకి శాసనములోని తరువోజయే. ఆ శాసన ప్రతి రూపమును అద్దంకిలో స్థూపముగా ప్రతిష్ఠించి ఆ తొలి తెలుగు పద్యమునకు ఎనలేని గౌరవమును చేకూర్చిపెట్టిన అద్దంకి "సృజన" సంస్థకు, ప్రకాశం జిల్లా రచయితల సంఘమునకు, అద్దంకి పురజనులకు ఆంధ్ర లోకం పక్షమున, నా పక్షమున అభినందనలు తెలుపుకొనుచున్నాను.

ఆ శాసనములోని విషయమును ఇతివృత్తముగా తీసికొని నవల వ్రాయుటకు సంకల్పించినప్పుడు ఆ శాసన సంబంధమైన సమస్త వ్యాస సంపుటులను, సామగ్రిని నాకు అందజేసి నవల చారిత్రక వివాదరహితముగా వెలువడుటకు నాకంటే ఎక్కువ శ్రమ, శ్రద్ధ తీసుకొనుటయే కాక నవల వ్రాత ప్రతిని చదివి తన అభిప్రాయాలను వ్రాసి పంపిన అద్దంకి వాస్తవ్యులు, మిత్రులు శ్రీ గాడేపల్లి దివాకర దత్తుగారికి సవిశేష కృతజ్ఞతలు.

మరికొన్ని శాసనాలను కూడ పరిశీలింప వలెనను నా ఆకాంక్షను తెలుపగానే అనేక శాసనముల ప్రతులను నాకు అందజేసిన అద్దంకి మిత్రులు శ్రీ చంద్రమౌళి గారికి, శ్రీ దేవపాలన గారికి, కడప మిత్రులు శ్రీ కట్టా నరసింహులు గారికి నా వందనములు.

నన్ను తన ద్విచక్ర వాహనముపై ఎక్కించుకొని ధర్మవరమూ, గుండ్లకమ్మ నదీ తీరమూ, తిమ్మాయపాళెమూ, అద్దంకి పట్టణపు నలుమూలలూ త్రిప్పి చూపి ఇత్తివృత్తానికి సంబంధించిన భౌగోళిక అవగాహన కలిగించిన శ్రీ పుట్టంరాజు రామచంద్రమూర్తి గారికి ప్రత్యేక కృతజ్ఞతలు.

చారిత్రక నవల నీరసముగా సాగుచున్నదేమో అను సందేహముతో నేను కొట్టుమిట్టాడు చుండగా నాకు అమూల్యమైన సలహానూ, ఆచరణీయమైన సూచననూ ఇచ్చి నా నవలకు రసపుష్టిని కలిగించుటకు మార్గం చూపిన ప్రముఖ కథా నవలా రచయిత, పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయ పురస్కార గ్రహీత శ్రీ టి.ఎస్.ఎ.కృష్ణమూర్తి గారికి ఈ నవలయే ఋణపడి ఉన్నది.

సందర్భానుసారముగా నవలలో చేర్చుటకు ప్రాకృత శాలి వాహన గాథలను వ్రాసి పంపిన ప్రముఖ అవధాని శ్రీ నరాల రామారెడ్డి గారికి ఏటికోళ్ళు.

ఈ నవల వ్రాతప్రతిని ముందుగా చదివి తన అభిప్రాయాలను వ్రాసి పంపిన ప్రసిద్ధులు శ్రీ అంపశయ్య నవీన్ గారికి ధన్యవాదములు.

నవల ముద్రణా దశలో ప్రూఫులను క్షుణ్ణముగా పరిశీలించి దిద్దిపెట్టిన బహుళ ప్రక్రియా రచయిత, మా బావగారు, శ్రీ కలువకుంట్ల గురునాథ పిళ్ళై గారికి, కైమోడ్పులు.

నా రచనలకు ప్రథమ శ్రోతలైన మదనపల్లె రచయితల సంఘ సభ్యులకు అభివందనములు.

ఈ నవలను శ్రద్ధగా డి.టి.పి. చేసిన గిరివర్మ గారికి, అందముగా ముద్రించిన ...................................... వారికి నా నమస్సులు.

**కరణం బాలసుబ్రహ్మణ్యం పిళ్ళై**

# బోయకొట్టములు పంద్రెండు

## 1

## ప్రస్థానము

"ఊఁ-ఊ-తొందరగా-తొందరగా-వెనుకబడిపోవుచున్నారు. ప్రొద్దుగ్రుంకులోపల అణ్డెక్కి (అద్దంకిని ఆనాటిశాసనములలో అణ్డెక్కి అన్నారు) చేరుకోవలె. చీకటిపడిన తరువాత మనము వంటలు చేసికొనలేము. విడిదికి ఏర్పాట్లు చేసికొనలేము. రేపు ప్రయాణములేదు. అణ్డెక్కిలో కొనవలసిన సరుకులు చాలఉన్నవి. ముందున్న వారము దినముల ప్రయాణ మునకు కూర్చుకోవలసిన సంబారములు చాలఉన్నవి. తొందరగాసాగవలె."

ముందుభాగమున ఉన్నతాశ్వమునెక్కి పోవుచున్న కట్టెం వీరనబోయడు వెనుదిరిగి చూచుచు చేతి బల్లెమును ఊపుచు బిగ్గరగా హెచ్చరించినాడు.

వెనుక వచ్చువారు వారివెనుక వచ్చువారికి వరుసగా వీరబోయని హెచ్చరికను బిగ్గరగా అందించినారు.

వెనుక కొంతదూరమున వచ్చుచున్న జనసమూహములో వేగము హెచ్చినది. మాటలలో మునిగిన జనులు మాటలునిలిపి వాటారుచున్న ప్రొద్దువైపుచూచి ఒకరినొకరు హెచ్చరించు కొనుచు తొందరగా అడుగులు వేయుచున్నారు.

వెనుక పయనించుచున్నది చిన్న జనసమూహము కాదు. ఒక ఊరు ఊరేకదలి పోవుచున్నట్లున్నది.

ఏబది గూడబండ్లు-అందులో ముప్పదిబండ్లలో వివిధములైన సామగ్రులు, ఆయు ధములు, గృహోపకరణములు. తక్కిన ఇరువది బండ్లలో స్త్రీలు, పిల్లలు, ముసలివారు. ప్రతిబండి వెనుకను ఒకరిద్దరు సేవకులు, పనిపాటులవారు, బండిలోనివారు ఇదికావలె, అదికావలె అని అడిగినప్పుడు అందించుచున్నారు.

సుమారు నూరుమంది పురుషులు గుఱ్ఱములపై పోవుచున్నారు. గుఱ్ఱములప్రక్కల యందు పొడవైన విండ్లు, అమ్ములమోపులు వ్రేలాడుచున్నవి. వారిలో కొందరు చేతులలోని ఈటెలను, దొంకెనలను, ముందువెనుకలవారికి తగులకుండా విలాసముగా త్రిప్పుకొనుచు పోవుచున్నారు. కొందరి చేతులలో కేవలము బరికోలలు మాత్రము ఉన్నవి. వీరందరును బోయదొరలే.

వారివెనుక కొన్ని అల్పజాతి గుఱ్ఱములు తమవీపులపై ఇరువైపుల పెరికసంచులు, తూగుగంపలు, నీటితిత్తులు, సొరకాయబుఱ్ఱలు వ్రేలాడుచుండగా తలలు వంచుకొని భారముగా నడచుచున్నవి.

వారివెనుక ఉత్సాహవంతులైన పిల్లలు, శక్తియు, ఓపికయు గల వృద్ధులు, ఆడువారు దాదాపు ఏబదిమంది నడుచుచున్నారు. అప్పుడప్పుడు అలసినవారొకరిద్దరు ఏబండిలోనైన ఎక్కుచున్నారు. బండిలో విసుగెత్తిన ఒకరిద్దరు దిగి నడుచుచున్నారు.

ఈ సాయుధులైన జనసమూహముతో కలిసికొన్నచో తమకు రక్షణ కలుగునని కొందరు వ్యాపారులు తమ సరకుబండ్లతోనూ, పరిజనులతోనూ, వీరివెంబడి వచ్చుచున్నారు. వారితోబాటు యాత్రికులు, ఒంటరి ప్రయాణికులును వచ్చుచున్నారు.

ఈ జన సమూహమునకు కట్టెం వీరనబోయడు నాయకుడు. మూడన్నరమూరల ఎత్తుమానిసి. పొడవుకంటె లావెక్కువ. ఇరుచెంపలపై క్రమ్ముకొన్న గుబురుమీసములతో, ముచ్చిలిగుంటకు ఎగువన నిటారుగా నిక్కబిగించి కట్టుకొనిన జుట్టుముడితో అతని తల పెద్దదిగా కనబడుచున్నది. అతని యెడమ ముంజేయి ఒకానొక యుద్ధములో తెగిపోయి మోచేతివరకే మిగిలియున్నది. ఎడమ చెవియు అర్ధము తెగినది. కుడివైపు డొక్కలో జేనెడుపొడవు కత్తిగాటు మానిన గుర్తు. అది మరియొక యుద్ధమున తగిలినది. కాసెబిగించి మోకాలివరకు పైకెత్తి మడచి నడుములో దోపినాడు. అంగవస్త్రమునుతీసి నడుము చుట్టును నడికట్టుగా కట్టి ఎడమవైపున చెఱగులు వదలినాడు. కుడిచేతిలో పొడవైన డొంకెన ధరించి నేలపై తాటించుచు గుఱ్ఱముపై ముందు నడుచుచున్నాడు. అతని ముందు పదిమంది గుఱ్ఱాలవారు కొడవండ్లు చేతబట్టి దారిపైకి వంగిన కొమ్మలను నరుకుచు దారిని బాగు చేయుచు సాగుచున్నారు.

పురుషులెవరికిని అంగీలుగాని, కంచుకములుగాని లేవు. నడివయస్సువారు తలపాగాలు ధరించి యున్నారు.

ఎండతగ్గి గాలి కొంచెము చల్లగావీచుచున్నది. చెమటలు ఆరి చల్లనిగాలికి అందరికిని ఉత్సాహము రేగినది. ఒక బోయ యువకుడు పాట అందుకున్నాడు.

యాడ పోయేవురా వీరభద్రూడా
మారాడకా నన్ను మనువాడుకోర
పిలిచి నాతండ్రి నీ పేరు అడిగేను.
కూర్చుండ బెట్టి నీకులము అడిగేను
కొండకింద చేను కోర కిచ్చేను.
ఊరి పెత్తనము నీ కూఱ కిచ్చేను
కుచ్చులా జీనేసి గుఱ్ఱమిచ్చేను
పట్టుపుట్టాలనూ కట్ట బెట్టేను
బొమ్మలామంచమూ పండనిచ్చేను
బూరగాదూదేసి పరుపు లిచ్చేను
దువ్వలువ కలనేత దుప్పటిచ్చేను
చెప్పులు గొడుగులూ చెప్పకిచ్చేను
యాడ బోయేవురా ఎఱ్ఱినాగన్నా
మారాడకా నన్ను మనువాడుకోర.

వెంటనే మరొక బోయ యువకుడు ఆశువుగా అందుకున్నాడు.

"ఇంకేమి రోగమా ఎల్లి పోకుండా
మనువాడి పక్కలో పండుకోకుండా" –

చుట్టును ఉన్నవారును, బండ్లలోని స్త్రీలును చేతులు చఱచుచు నవ్వసాగిరి. అది విని మొదటివాడును ఆశువుగానే

"నను కాదు పిలిచింది నిన్నురా కొడకా
కాసుకోనుండాది చేసుకోబోరా" – అన్నాడు.

ఈ సారి నవ్వులు మిన్ను ముట్టినవి.

అంతలో ఒకబండిలోనుండి ఒక బోయసాని " ఒరేకోటి, పిల్లవానికి దొడ్డికి వచ్చు చున్నదట. వీని సంగతి చూడు." అన్నది.

కోటి అనబడినవాడు ఆ పిల్లవానిని బండిలో నుండి దించుకొని ప్రక్కనున్న గుఱ్ఱపు రౌతుతో " అన్నన్నా, నీగుఱ్ఱమును వదలి నీవు కొంతసేపు నడువుము. నేను ఈ పిల్లవాని పనిచూచిన తరువాత మేమిరువురము గుఱ్ఱముపై వచ్చి నిన్ను కలసి కొందుము." అని ఆగుఱ్ఱపు పగ్గములను పట్టుకొని ఒక సొరకాయ బుఱ్ఱను తీసికొని బాట ప్రక్కకు పోయెను.

పిల్లవానిపని ముగిసిన తరువాత ఇరువురును గుఱ్ఱమెక్కి అప్పటికే చాలా దూరము సాగిపోయినగుంపును వడివడిగా చేరుకొనిరి. కోటి ఆపిల్లవానిని వానితల్లికిని, గుఱ్ఱమును రౌతుకును అప్పగించి నడవసాగెను.

వాతావరణము చల్లబడగా ప్రయాణము వేగము హెచ్చెను.

ప్రొద్దు గ్రుంకబారునప్పటికి ఈ జన సమూహమంతయు ఒక చింతతోపులో ఆగినది. వారి ఎడమవైపున గుండ్లకమ్మ నది ప్రవహించుచున్నది. నది అంతయుకాదు. ఒక ఏబది అడుగుల వెడల్పున, మూడునాలుగు అడుగుల లోతుగా రెండు సన్నని పాయలు పారుచు న్నవి. తక్కినదంతయు ఇసుకతిన్నెలే.

నదికవతల అడ్డెక్కి పట్టణము, కోట పూర్తిగా కనబడుచున్నది. కోటగోడ ఎత్తుగా ఎనిమిది వైపుల బురుజులతోనూ, కోటగోడపైన పొడవునను కోటకొమ్మలతోనూ బలిష్ఠముగా నున్నది. కోట లోపల రెండంతస్థుల భవనములయొక్కయు ప్రాసాదముల యొక్కయు పై భాగములు మాత్రము కనబడుచున్నవి.

కోటబయట గవనికి ఎదురుగా విశాలమైన ప్రదేశము వదలివేసి, అక్కడినుండి ఇరుప్రక్కల సామాన్యజనులు నివసించు వీధులున్నవి. సామాన్యజనులనగా రైతులు, కూలీలు, పనిపాటులవారు, కమ్మరి, కుమ్మరి, వడ్రంగి, చాకలి, మంగలి, నేత, కల్లుగీత మొదలైన వృత్తులవారు, కైజీతగాండ్రైన సైనికులు, వారికి కావలసిన కొద్దిపాటి సరుకులను అమ్ము చిన్న బచ్చుల అంగడులు, మరికొంతఎడముగా, ఎనుములను, ఆవులను పెంచుచు పాడి అమ్ముకొని జీవించువారు, మత్స్యకారులు, మాంసవిక్రేతలు, మరికొంతదూరమున చర్మకారులు.

ఈ వీధులలోని ఇండ్లన్నియు పూరిండ్లే, అక్కడక్కడ ఒకటి రెండు మట్టిమిద్దెలు, పెంకుటిండ్లు కనబడుచున్నవి.

ఈ పట్టణము ఇప్పుడు పల్లవుల ఆధీనములోనున్నది. అణ్ణెక్కిలో పల్లవరాజ ప్రతినిధి పరిపాలించుచున్నాడు.

చింతతోపులో విడిసినజనులు దూరమునుండియే అణ్ణెక్కికోటను, కోటవెలుపలి ఆ వీధులను చూచుచు నిలబడినారు. తమస్వస్థలము నందు ఇట్టికోట ఎక్కడనులేదు.

"ఏమిటి? ఏమిచూచుచున్నారు? ఎప్పుడును ఊళ్ళమొగమే చూడనట్లు అదేపనిగా వింతగా చూచుచున్నారు. వంటపని చూడవలదా? " గద్దించినారు ఆగుంపులోని కొందరు పెద్దవారు. వెంటనే ఆడువారు చేతికిదొరికిన రాళ్ళనుతెచ్చి పొయ్యిలుగా అమర్చుచుండగా మగవారు చిదుగులు, పుల్లలు, ఎండుకట్టెలు ఏరుకొనివచ్చి పొయ్యిలప్రక్కన వేయు చుండిరి. స్త్రీలు కొందరు నదిలోనుండి కడవలలోనీరు తేసాగిరి. కొందరు జొన్నపిండిలో నీరుకలిపి పిసికి ముద్దలు చేయుచుండగా, మరికొందరు పిండిని రొట్టెలుగాతట్టి పెనములపై కాల్చు చుండిరి. కొందరు గుడారములు వేయసాగిరి.

ఉదయము నుండియు సమీపము నందలి పొలములలో పనిచేసుకొనుచుండిన స్త్రీలు, పురుషులు ఈ గుంపునుచూచి, ఈ గుంపులోని ఆశ్వికులనూ, వారిచేతులలోని బల్లెములను చూచి, చేయుచున్నపనులు ఆపివేసి, దూరముగా వెడలిపోయి, అక్కడినుండియే వారిని చూచుచు నిలుచుండిరి.

ఇట్టిగుంపొకటి ఆదారిన వచ్చుచున్నదనియు, వారందరును బోయదొరలనియ, ఆచుట్టు ప్రక్కల గ్రామములకు రెండుదినములకు ముందే తెలిసినది. ఆ వచ్చుచున్నవారు దోపిడి దొంగలుకారు, దండువెడలువారును కారు. ఆడువారితో పిల్లలతో వృద్ధులతో పెద్దగుంపుగా ఎక్కడికో వలస వెళ్ళుచున్నవారు. వారితోబాటు పెరికెవర్తకులును, యాత్రికులును పయనించు చున్నారు. ఇది వారికి అందినవార్త.

ఏమైనను ఆయుధములను ధరించిన గుఱ్ఱాలవారిని చూచినప్పుడు సామాన్యజనుల కెవరికైనను భయమేకదా, ఎందుకైనను మంచిదని దూరముగావెళ్ళి చెఱకుతోటలలో నిలబడి చూడసాగిరి.

చింతతోపులో నిలిచిన బండ్లనుండి స్త్రీలు, పిల్లలు, వృద్ధులు, బిల బిలమని దిగుటయు, వంటలకు ప్రయత్నముచేయుటయు చూడగానే ఆ గ్రామస్థులకు కొంతధైర్యము వచ్చినది. ప్రమాదములేదు– వారిదగ్గరకు పోవచ్చును. జంకుచుజంకుచు సమీపించినారు. మాటలు కలిపినారు, చేరువైనారు.

"ఏమమ్మా ఏమివండుచున్నారు? ఏవైనా వస్తువులు కావలెనా" అన్నదిఒక వృద్ధ గ్రామీణురాలు అక్కడ వంటలను పర్యవేక్షించుచున్న ఒక బోయసానితో. ఆ బోయసాని కట్టెంవీరనబోయని భార్య మంగసాని. వయస్సు ఏబదికి అటునిటుగా నుండవచ్చును. నల్లని శరీరచ్ఛాయ, విశాలమైన ముఖము. నొసటిపై పెద్ద కుంకుమబొట్టు, కుడిముక్కుకు రాయిపొదిగిన ముక్కర, ముక్కునుండి పెదవిపైకివ్రేలాడుచున్న బులాకి, చెవులకు బంగారు బుగడలు. మెడలో బంగారుకంటె. చేతులలో గాజులతోబాటు వెండికడియాలు. కాళ్ళకు

వెండిమురుగులు. తల నున్నగా దువ్వి నడిపాపటతీసి పెడతల కుడివైపున కొప్పు బిగించినది. వెడల్పంచు మట్టిరంగు చీర, అదేరంగు రవికె ధరించినది. మాటలలోను, చూపులలోను సౌమ్యతతో బాటు అధికార గాంభీర్యము స్పష్టముగా కనబడుచున్నవి. ఆమె ఆ గుంపులో ఒకచోట నిలబడకుండా పొయ్యిల మధ్య తిరుగుచు వంటపనులను పర్యవేక్షించుచున్నది.

మంగసాని గ్రామీణురాలి మాటలువిని నెమ్మదిగా చిరునవ్వుతో ఆమెనుచూచి "ఏమియు అవసరము లేదమ్మా. అన్నియు తెచ్చుకొన్నాము. బండ్లలో ఉన్నవి." అన్నది. గ్రామీణురాలు తరువాత ఏమియు మాట్లాడక పోవుటచూచి మంగసానియే మరల ఇట్లన్నది.

"మీది ఏగ్రామము? ఇక్కడ ఏమి చేయుచున్నారు? "

"అదిగో అక్కడ కనబడు తిమ్మాయపాళెం మాగ్రామము, చెఱకు తోటలలో గడలను నిలగట్టుచున్నాము గడలు పొడవుగా పెరిగినవికదా గాలికి వాలిపోయి విరిగిపోవును. కొన్ని కొన్నిగడలను చేర్చి కట్టినయెడల వాలిపోవు" అన్నదిగ్రామీణస్త్రీ. మరలఆమెయే "అదిసరే జొన్నరొట్టెలలోనికి ఏమిచేయుచున్నారు?"

"అదే ఆలోచించుచున్నాను. బండ్లలో కొన్ని పచ్చళ్ళున్నవి."

"చెఱకు తోటలలో గోగులున్నవి. గోగాకుతో ఊరుబిండి చేసికొందురా?"

"గోగాకు కోసుకోనిత్తురా?"

"అయ్యో, దానికేమిభాగ్యము. ఆకులే దూసుకొని తెచ్చుకోవచ్చును. రండి.మేమును గోగాకు దూసిఇత్తుము. ఇంతమందికి కావలెనుకదా రండి, రండి"

మంగసాని ఆజ్ఞతో పదిమంది బోయపడుచులు ఆగ్రామీణ స్త్రీలవెంట వెళ్ళి పదినిమిషములలో ఒడులనిండ, గోగాకు కోసికొని వచ్చి రాశిపోసిరి.

మంగసాని ఒకగ్రామీణవృద్ధుని దగ్గరకుపిలిచి "అయ్యా మీపల్లెలో ఎఱ్ఱగడ్డలు ఉన్నవా? ఒక గంపెడుకావలెను. వెలఎంతయోచెప్పి ఒకగంపెడుఎఱ్ఱగడ్డలు తెచ్చి పెట్టగలవా" అని అడిగెను.

ఆ గ్రామీణవృద్ధుడు ఆలోచించినాడు. పిడికెడో, చేరెడో, దోసెడో అయినచో ఊరకే ఇవ్వవచ్చును. గంపెడు ఎఱ్ఱగడ్డలు ఊరకే ఎట్లివ్వగలము? డబ్బుఅడిగినచో ఏమందురో, ఏమో? బోయదొరల ఇష్టము. డబ్బుఇచ్చినచో తీసుకొందము. లేదా--

అతడును మరియొక యువకుడును పరుగుపరుగునపల్లెకుపోయి రెండుపుటికల నిండుగా ఎఱ్ఱగడ్డలు తెచ్చిరి.

"డబ్బు? ఎంత?"

"మీ యిష్టము"

"బోయసాని నాలుగు వెండినాణెములు వారిముందుంచెను. అదివారు ఊహించనిధర. వారు సంతోషముతో పైకముతీసుకొని ఆమెకు దండముపెట్టి దూరముగా వెళ్ళి నిలబడిరి.

బోయవనితలు,బండ్లనుండి సన్నికల్లులు,పాత్రములు దింపిరి.పెనములపై గోగాకు, ఎఱ్ఱగడ్డలు, వెలుల్లిపాయలు నూనెలోవాడ్చి మిరియాలు, ఉప్పు మొదలైనవి చేర్చి ఊరుబిండి నూరిరి. ఒకవైపు జొన్నరొట్టెలు కాలుచున్నవి.

"మరి ముసలివారికి, పసిబిడ్డలకు ఏమిచేసినారు. వారు రొట్టెలు నమలలేరుకదా" అన్నది ఒక గ్రామీణ స్త్రీ.

"అదిగో అక్కడ అండాలో జొన్నఅంబలి ఉడుకుచున్నది. ఈ ఊరుబిండిని నంజుకొని అంబలి త్రాగుదురు".

గ్రామీణవృద్ధుడును వాని అనుచరుడును పల్లెలోనికి వెళ్ళి ఒక చిన్నకొప్పెరలో కొఱ్ఱ అన్నమును, ఒక పెద్ద దుత్తలో చిక్కని మజ్జిగయు తెచ్చిరి.

తన జనసమూహము చింతతోపులో విడిసినవెంటనే వీరనబోయడు నలుదిక్కుల పరికించి చూచినాడు. ప్రొద్దుగ్రుంకినది కానీ ఇంకను చాల వెలుగున్నది. చీకటిపడుటకు చాల సమయముకలదు. అంతలోపల మరియొక ముఖ్యమైనపని నెరవేర్చవలయును.

తనగుంపునుండి నలుగురు పెద్దవారిని, నలుగురుయువకులను పిలిచినాడు. వారిచేతికి ఏనుగుదంతములతో చేసినబరిణెలు, దంతపుచట్రములో బిగించిన పెద్దఅద్దము, నాలుగు పులిగోళ్ళు, రెండుపొడవైన ఏనుగుదంతములు, రెండు బెబ్బులిచర్మములు ఇచ్చి వానిని అణ్ణెక్కి దుర్గాధిపతికి సమర్పించి తమరాకను తెలియజేసి రేపు ఉదయము తొలిజాము ముగియువేళకు తాను దుర్గాధిపతి దర్శనమునకు రాదలచినవార్త తెలుపవలసినదిగా వివరముగాచెప్పి పంపినాడు.

ఎనిమిది మందియు గుఱ్ఱములపై నదినిదాటి పట్టణములో ప్రవేశించిరి. పెద్దవారివద్ద కానుకలుమాత్రము ఉన్నవి. యువకులు ఈటెలు ధరించియున్నారు. అందరును కోటగవను సమీపించిరి. గవనువద్ద ఎల్లప్పుడును పదిమంది భటులుకాపుందురు. కోటలోప్రవేశించు వారిలో క్రొత్తవారుండిన యెడల వారిని నిలిపి వివరములడిగి లోపలికిపంపుదురు.

బోయదొరలు గవనులోని భటులకు తమపరిచయము గావించుకొని తమరాక యొక్క ఉద్దేశమునుచెప్పి, వారిఅనుమతితో కోటలోప్రవేశించి దుర్గాధ్యక్షుని భవనమును చేరుకొనిరి. అక్కడి భటులకును తమనుపరిచయము చేసికొని తమరాకను దుర్గాధ్యక్షునకు తెలిపి దర్శనమునకు అనుమతి అడుగవలసినదిగా చెప్పిరి.

అణ్ణెక్కి దుర్గాధ్యక్షునకు బోయదొరల ప్రయాణవిషయమును, ప్రయాణకారణమును నాలుగుదినములకుముందే వేగులవలన తెలియవచ్చినిది. కావున ఇప్పుడు వీరు తన దర్శనమునుకోరి వచ్చినారను వార్తకు దుర్గాధ్యక్షుడు ఆశ్చర్యపడలేదు. అందఱిని లోనికి తోడుకొని రావలసినదిగా ద్వారపాలకుని ఆజ్ఞాపించెను.

ఎనిమిది మందియు దుర్గాధ్యక్షుని భవనము యొక్క అడువరి బయట గుఱ్ఱములుదిగి ద్వారపాలకులు చూపినచోట గుఱ్ఱములను కట్టివేసి లోపలప్రవేశించిరి. తాము కొనిపోయిన కానుకలను రాగిపళ్ళెరములో అమర్చి ముందర పెద్దవారును, వారివెనుక యువకులను దుర్గాధ్యక్షుని సముఖమునకువెళ్ళి సవినయముగావంగి నమస్కరించిరి.

"ప్రభువులకు సుగోజయం (సుఖోదయమునకుఅపభ్రంశము) మా నాయకుడు కట్టెం

వీరనబోయని దొరగారు తమసముఖానకు ఈచిన్నకానుకలను సమర్పించుకొనుచున్నారు. మా కాలము బాగులేక మేము మా స్వస్థలము నుండి పరస్థలమునకు ఎత్తిపోవుచున్నాము. ఇంతకంటె ఘనమైన కానుకలు సమర్పించుకోలేము. పెద్దమనసుచేసి స్వీకరింప ప్రార్థన". అని ఒకరును,

"మా నాయకుడు వీరనబోయని దొరవారు ప్రొద్దుపోయి తమదర్శనమునకు వచ్చి తమరికి అసౌకర్యము కలిగింపకూడదని మమ్ములను పంపినారు, తమరి సెలవైనచో రేపు ఉదయము జాముప్రొద్దెక్కిన తరువాత మిమ్ములను దర్శించుకొందుననుచున్నారు. తమరు ఏమి సెలవిత్తురో దానిని మా దొరవారికి విన్నవించుకొందుము" అని మరియొకరును దుర్గాధ్యక్షునికి విన్నవించిరి. రాగిపళ్ళెరమును దుర్గాధ్యక్షుని ముందర బల్లపైపెట్టిరి.

వారి వినయభాషణములకు దుర్గాధ్యక్షుడు చాలసంతోషించినాడు. కానుకలు అపురూప మైనవి. అంతపొడవు ఏనుగుదంతములు ఎక్కడదొరకును! దంతపుచట్రములో బిగింపబడిన అద్దము ఎంత అద్భుతముగానున్నది! చట్రములోని చెక్కడపుపనులు ఎంత అద్భుతముగా నున్నవి! పులిచర్మము తన ఆసనమునకు అలంకరించినచో దానికి ఎంత గాంభీర్యము వచ్చును!

దుర్గాధ్యక్షుడు ఆలోచించెను. ఈ బోయలు తమనాయకుని పదేపదే "మాదొరవారు" అని ప్రస్తావించుచుండుట చూడగా వీరు ఒకప్పుడు కొంతప్రభుతను, అధికారమును నెరపినారనియే తోచుచున్నది. ఏ కారణముననో వలస వెళ్ళిపోవుచున్నారు. అంతమాత్రము చేత వారు తమఆత్మగౌరవమును, ఆత్మాభిమానమును కించిత్తైనను కోల్పోలేదు. ఆ ఆత్మాభి మానము వీరిలో ఇంకను అట్లేయున్నది. కావున తాను వీరితో తగినమర్యాదతోనే వ్యవహ రింపవలె. ఉదయము తొలిజాముదాటిన తరువాత దర్శనమునకు వత్తుననగా భోజనము ముగించుకొని వత్తుననియర్థము. అంతటిపెద్దమనిషి తనయింటికివచ్చి భోజనము చేయ కుండా వెళ్ళుట మర్యాదకాదు.

"మీ రాక మాకు చాలాసంతోషమును కలిగించుచున్నది. కానుకలదేమున్నది. హృదయ ములో ఉండినచాలును. మీ దొరగారిని రేపుఉదయము అయిదుగడియల ప్రొద్దుకే మానగరుకు విచ్చేయవలసినదిగా మా ఆహ్వానం చెప్పండి. రేపుఉదయం మేము మీదొర గారితో కలిసి భోజనము చేయుదుము.

బోయపెద్దలు తమచెవులను తామేనమ్మలేకపోయిరి. "చిత్తం,చిత్తం" అని దండ ములుపెట్టుచు నాలుగుఅడుగులు వెనువెనుకకే నడచి తరువాత వెనుదిరిగి పోయిరి.

అప్పటికే ప్రొద్దుగ్రుంకి మూడుగడియలైనది. శుక్ల పక్ష అష్టమి చంద్రుడు పుచ్చ పువ్వులు పరచినట్లు వెన్నెలకాయుచున్నాడు. విశాలమైన గుండ్లకమ్మనది మీద నుండి నిరాటంకముగా ధారాళముగా గాలివీచుచున్నది. అలలపైన వెన్నెల మిలమిల మెరయుచున్నది.

అందరును వారికి కావలసిన జొన్న రొట్టెలను, గోగాకు ఊరుబిండియును మట్టి, మోదుగ మొదలైన ఆకులలో పెట్టుకొని పుష్టిగా తిన్నారు. చిన్నబిడ్డలకు వృద్ధులకు కొట్టి

అన్నమును మజ్జిగలో కలిపి చిన్నచిన్న కుడుకలతోత్రావించిరి. కొందరు జొన్న అంబలి త్రాగిరి.

గ్రామీణులు సైతము బోయనాయకురాలు మంగసాని బలవంతముచేయుటచే వారితో అక్కడనే జొన్న రొట్టెలు తిని ఏనుగెక్కినంత సంబరముతో వెళ్ళిపోయిరి.

వీరన బోయడు ఉదయమే లేచి కాల్యకృత్యములు తీర్చుకొని గుండ్లకమ్మనదిలో మునిగి భార్య మంగసాని నలుగు పిండితో ఒడలు రుద్దగా గడియసేపు స్నానము చేసి ఒడ్డుకు వచ్చెను. కోటకొమ్మంచుల ధోవతి కాసె బిగించి ముందు చుంగులు వదిలెను. ఎఱ్ఱని వస్త్రమును నడికట్టుగాకట్టి ఎడమవైపున చెఱగులు వదలెను. నడికట్టులోపల ఎడమవైపుననే మూరెడు పొడవు సురియను ఒరతోబాటు దోపుకొనెను. మెడలో ఒక రుద్రాక్ష మాలయు, ఒక పగడపు దండయు ధరించెను. మంగసాని అతని తల నున్నగా దువ్వి వెండ్రుకలను ముచ్చిలిగుంటకు ఎగువగా గోపురమువలె ముడివేసెను. పొడవైన అంగవస్త్రమును పొడవుగా మడతలు వేసి మెడపై నుండి రొమ్మునకిరువైపుల తొడల వరకు వ్రేలాడ విడిచెను. అతనికి అంగీనికానీ, కంచుకమును కానీ ధరించు అలవాటు లేదు. రొమ్మునను, వీపుమీదను నల్లని వెండ్రుకలు గుబురులు గుబురులుగా కనబడుచున్నవి. చెవిపైనను గుబురు వెండ్రుకలే. గుబురు మీసములను దువ్వెనతో తీరుగా దువ్వుకొనెను. పొడవైన మరియొక వస్త్రముతో వెనకవైపు మూరెడు చుంగు వ్రేలాడునట్లును, ముందువైపు బెత్తెడు చుంగు పైకి నిక్కియుండు నట్లును తలపాగా చుట్టుకొనెను. తడినొసలుపై విశాలముగా విబూది పట్టెలు తీర్చుకొనెను. ఇప్పుడు అతని రూపము ధీర గంభీరముగా పరమమహేశ్వరునివలె నున్నది.

వీరనబోయడు స్నానము చేసినప్పటి నుండి వస్త్రధారణ, అలంకరణ పూర్తియగు వరకు అతని తమ్ముడు అప్పన బోయడు చెంతనే ఉండి సహకరించుచుండెను. అంతలో మంగసాని చక్కెర కలిపిన వేడిపాలు ఒక చెంబునిండుగా తెచ్చి ఈయగా వీరన బోయడు తృప్తిగా తాగి తన తెల్లగుఱ్ఱమును సమీపించి ఒంటి చేతితో కళ్ళెమును పట్టుకొని అతిలాఘవముగా గుఱ్ఱముపైకి ఎగిరి కూర్చొని గుఱ్ఱమునదలించెను.

అప్పటికే సిద్ధమైయుండిన పది మంది ఆశ్వికులు ఈటెలు ధరించి తమ నాయకుని వెంబడించిరి.

గుండ్లకమ్మనుదాటి కోటగవను సమీపించి తమరాకను దుర్గాధ్యక్షునికి తెలియజేయ వలసినదిగా ద్వారపాలకభటులతో చెప్పిరి. వారిని నిరాటంకముగా తన యొద్దకు పిలుచుకొని రమ్మని దుర్గాధ్యక్షుని నుండి ద్వారపాలకులకు అదివరకే ఉత్తరువులంది యుండుటచే వారు వీరనబోయనికి నమస్కరించి సగౌరవముగా దుర్గాధ్యక్షుని భవనము వరకు కొనిపోయిరి.

భవనము యొక్క అడువరి బయట అందరును గుఱ్ఱములు దిగిరి. ముందు ఇరువురు బోయలును, వారి వెనుక వీరన బోయడును, అతని వెనుక తక్కినబోయలును, అణ్డెక్కి భటులు దారిచూపుచుండగా భవనములో ప్రవేశించిరి. విశాలమైన పడసాలలో రెండే

రెండు ఆసనములున్నవి. అందొక దానిపై ఆసీనుడైయుండిన దుర్గాధ్యక్షుడు వీరన బోయనిని చూడగానే లేచి నాలుగడుగులు ఎదురు వచ్చెను. ఇరువురును చేతులు మోగిచి ఒండొరులకు నమస్కరించుకొనిరి. పిదప చేతులు కలిపి కుశల(ప్రశ్నలు వేసికొనిరి. దుర్గాధ్యక్షుడు వీరనబోయనికి రెండవ ఆసనమును చూపి కూర్చుండుమనిసంజ్ఞ చేసెను కాని వీరన బోయడు దుర్గాధ్యక్షుడు కూర్చుండు వరకు వేచియుండి అతడు కూర్చుండగానే తానును కూర్చుండెను. ఈ మర్యాదాపూర్వకమైన నడవడికి దుర్గాధక్షుడు (ప్రసన్నుడై పోయెను.

అణ్డెక్కి దుర్గాధ్యక్షుడు రు(ద్రమనాయకుడు పల్లవుల రాజ (ప్రతినిధి. పల్లవ రాజ వంశమునకు చెందినవాడు కాకపోయినను, అతని పరా(క్రమమును గుర్తించి పల్లవులు అతనిని అణ్డెక్కికి రాజ(ప్రతినిధిగా నియమించిరి.

రు(ద్రమ నాయకుడు నాలుగు మూరల మానిసి, చామనచాయ, వ్యాయామ కర్కశ దేహుడు. అనేక యుద్ధములతో అతడు నెఱపిన పరా(క్రమము ఇటుపల్లవులలోనూ, అటు చాళుక్యులలోనూ (ప్రశస్తిగాంచినది. అతని ముంజేతుల మీదను, మెడమీదను, నొసటను గల కత్తి(వేటు గుర్తులు అతని యుద్ధానుభవములను చెప్పక చెప్పుచున్నవి. అంతరాంత రములలో అతడు జైనమతాభిమాని. కానీ పాలకులు శైవమతావలంబకులగుటచేత అతడు తన జైన మతాభిమానమును బయటపడనీయక గుట్టుగా కాలముగడుపుచున్నాడు. నాగరికమైన వేషధారణతో నిరాడంబరముగా కనుపట్టుచున్నాడు. వయస్సున వీరనబోయని కంటె చిన్నవాడుగా కనబడుచున్నాడు.

అంతలో వీరన బోయని అనుచరులలో ఒకడు మూడు మూరల పొడవున్న ఒక ముమ్మొన వాలును తెచ్చి వీరనబోయని (ప్రక్కన నిలబడెను. అది గట్టి ఉక్కుతో చేయబడినది. రస (ద్రవ్యములతో బాగుగా తోముట చేత మెరయుచున్నది. మొనలు బాగుగా పదను పెట్ట బడినవి.

వీరనబోయడు లేచి ఆ (త్రిశూలమును కుడిచేతితో అందుకొని తన ఎడమ ముంజేతిని కుడిచేతికి తాకించి రెండుచేతులతో సమర్పించుచున్నట్లు దుర్గాధ్యక్షునికి సమర్పించెను. రు(ద్రమనాయకుడు తటాలున లేచి రెండు చేతులతో ఆ ముమ్మొన వాలును అందుకొనెను.

"మీ శౌర్యసాహసములను గురించి అనేక కథలు వినియున్నాము. మీ వంటి వీరులకు మేము ఇచ్చుకోగల సముచితమైన కానుక ఇదియే అను ఉద్దేశముతో దీనిని మా యూరి కమ్మరిచేత (ప్రత్యేకముగా చేయించి తెచ్చినాము. దీనిని స్వీకరించి మన అనుబంధమును ద్విగుణీకృతము చేయవలెని మా మనవి" అన్నాడు వీరనబోయడు.

రు(ద్రమనాయుని ఆశ్చర్యమునకు మేరలేకపోయెను.

"ఆహా! ఎంతటివాడు ఈ వీరనబోయడు! రూపము ధీరగంభీరము, హృదయము సరసగంభీరము. మాట సరళగంభీరము. ఎంత మంది ఎన్ని కానుకలు సమర్పింపలేదు. స్వర్ణాభరణములు, రత్నాభరణములు, చీనిచీనాంబరములు, వింత వింత వస్తు సము దాయము, ఎన్ని? ఎన్నెన్ని? కాని తన శౌర్యసాహసములను గుర్తించి, తన వీరత్వమునకు

సముచితమైన ప్రశంసారూపమైన ఈ ముమ్మొనవాలును కానుకగా ఇచ్చిన ఈ వీరనబోయని వీరారాధన గుణమును, సమయస్ఫూర్తిని ఎంతని మెచ్చుకొనవచ్చును! ఒక వీరుడు తన సాటి వీరునకు ఇవ్వదగినకానుక ఇంతకంటె మించినదేమున్నది.” అనుకొని రుద్రమ నాయకుడు పులకించిపోయెను. త్రిశూలమును రెండుసార్లు పైకెగురవేసి పట్టుకొనెను. దాని బరువును అమరికను పనితనమును మెచ్చుకొనుచు కొంతసేపు అవలీలగా నైపుణ్యముతో ఆయుధ విన్యాసము గావించెను. అంతలోనే ఉత్సాహము ఉప్పొంగగా వివిధ భంగిమలతో కూర్చొని, నిలబడి, ఆలీఢ, ప్రత్యాలీఢ భంగిమలతో రివ్వు రివ్వుమని శూలమును త్రిప్పుచు విన్యాసము గావించి, నిలిచి, తృప్తిగా ఆయుధమును ముద్దుపెట్టు కొనెను. ఆ విన్యాసములోని నైపుణ్యమును, ఒడుపును, వడిని, లాఘవమును చూచి వీరనబోయడు ముగ్ధుడై పోయెను. “బాగుబాగు భళా” అని మెచ్చుకొనెను. అతడొక రాజప్రతినిధియనియు, తానొక అపరిచితుడైన సామాన్యబోయదొర యనియు మరచి దగ్గరికి పోయి భుజముపై తట్టి అభినందించెను. రుద్రమనాయకుడు చిరునవ్వునవ్వెను. ఇరువురును తమతమ ఆసనములలో కూర్చుండిరి.

రుద్రమనాయకుడు ఆత్మీయముగా నవ్వుచు ఇట్లనెను.

“మీరు అన్యథా భావింపరాదు. అతిథుల పూర్వాపరములను, యోగక్షేమములను విచారించుట ఆతిథేయుల కర్తవ్యము కనుక అడుగుచున్నాను. మీరు ఎక్కడ ఉండినవారు. ఇటు ఎక్కడికి పోవుచున్నారు స్త్రీలు, పిల్లలు, వివిధ సామాగ్రితో సహా మూకఉమ్మడిగా ప్రయాణమై పోవుటలో మీ ఉద్దేశ్యమేమి? అణ్డెక్కివద్ద నిలుచుటకు కారణమేమి. ఎన్నాళ్ళు నిలువదలచినారు”

వీరనబోయుడు రెండు నిమిషములు కన్నులు మూసికొని తరువాత ఇట్లు చెప్ప నారంభించినాడు.

“ప్రభువులు మాపై చూపుచున్న ఆదరమునకు, శ్రద్ధకు ఎంతయో కృతజ్ఞుడను. మాది ఒక పెద్దకథ. చెప్పుటకు చాల సమయముపట్టును. క్లుప్తముగా చెప్పెదను.

“మేము బోయదొరలము. త్రిపురాంతకము సమీపమున మా నివాసము. అక్కడ మా పల్లెలు చాలా ఉన్నవి. పది పదునైదు క్రోసుల విస్తీర్ణములోని పల్లెలన్నియు మావే...”

“ఈయనే మాకందరికీ పెద్ద దొరగారు. ఈయన మాట మాకు సుగ్రీవాజ్ఞ” అన్నాడు ప్రక్కన ఉన్న ఒక బోయ యువకుడు.

అంతకుమించి అతిశయములు మాట్లాడవలదన్న సూచనగా వీరన బోయడు చేయెత్తి వారించి తానే మాట్లాడసాగినాడు.

“కడచిన పది పదునైదు సంవత్సరములుగా మా ప్రాంతము దండయాత్రలతో, యుద్ధములతో అల్లకల్లోలమైపోయినది. ఈ అలజడులలో మేము చాల నష్టపడినాము.

మా జనులను చాలమందిని కోల్పోయినాము. మాపై ఒత్తిడులు అధికమైపోయెను. ఇక ఆ ప్రదేశములో ఉండుట మాకెంతమాత్రము సాధ్యముకాకపోయెను. శాంతిగా బ్రతు

కుటకై ఈ దిశగా వలస వచ్చుచున్నాము. వంగవోలుకు తూర్పున స్థిరపడదలచినాము. మా ప్రయాణమునకు కావలసిన వస్తువులు చాల కొనవలసి ఇక్కడ నిలిచినాము. మావారు కోమటివీధిలో సరుకులు కొనుటకు ఇది వరకే వచ్చుచుందురు.

రుద్రమనాయకుడు ప్రక్కనున్న పరిచారకుని వైపు చూచెను. వాడు చేతులు కట్టుకొని ముందునకు వంగి "చిత్తము" అనెను

"వీరికి కావలసిన వస్తువులను కావలసినంతయు సరసమైనధరకే ఇవ్వవలసినదిగా నా ఆజ్ఞగా కోమటివీధిలో చాటించుము. నీవు కడవరకు వారివెంట సాయముగా ఉండుము." పరిచారకుడు "చిత్తం" అని వెడలిపోయెను. వీరనబోయని చేసైగతో ఒకబోయయువకుడు అతనితో కలిసి వెళ్ళెను.

అంతలో వంటలవాడు వచ్చి దుర్గాధ్యక్షునికి నమస్కరించి చేతులు కట్టుకొని నిలబడెను. అది భోజనము సిద్ధముగా నున్నదని చెప్పు సంకేతము.

"సరి సరి. అంతయు తరువాత మాట్లాడుకొనవచ్చును. భోజనము చేయుదము లెండి". ఇరువురును లోపలి గదిలోనికి వెళ్ళిరి. బోయయువకులను పరిచారకులు మరి యొక వైపునకు తోడ్కొని వెళ్ళిరి.

రుద్రమ నాయకుడును, వీరన బోయడును లోపలిగదులలో భోజనమునకు కూర్చు న్నారు.

ఒక పరిచారిక ఒక బల్లపైన రెండు చిన్న చిన్న పళ్ళెరములలో కారమును, ఉప్పును పట్టించి వేయించిన మాంసము ముక్కలుంచి ఇరువురి ముందును రెండు వెండి చషకములుంచి అందులోనికి ఒక పెద్ద కలశములో నుండి మద్యమును నింపినది.

"ఇది ఓడ వర్తకులు ఎక్కడినుండియో తెచ్చిన మద్యము. మన మద్యముల వలె మత్తును కలిగించదు. కేవలము ఉల్లాసమును,భోజనాసక్తియు కలిగించును". ఇరువురును మాంసపు ముక్కలను నంజుకొనుచు రెండేసి చషకముల మద్యమును లాగించిరి. రుద్రమనాయకుని సైగతో పరిచారిక మద్యపు కలశమును, చషకములను తీసివేసి వెండి పళ్ళెరములను పెట్టి వడ్డన సాగించెను. అడవిపంది, కుందేలు, కౌజుపిట్ట, అరకోడిపెట్ట– ఈ నాలుగు విధములైన మాంసము, వరి బియ్యపు అన్నము, రెండు విధములైన చారులు, గడ్డ పెరుగు, రెండు విధములైన ఊరుబిండ్లు పరిచారికలు కొసరి కొసరి వడ్డించుచుండగా భోజన కార్యక్రమము ఒకటిన్నర గడియసేపు సాగినది. తాంబూలములు నములుచు మరల ఇరువురును ముందరి పడసాలకు వచ్చి ఆసీనులైనారు.

వీరన బోయడును, అతని అనుచరులును దుర్గాధ్యక్షుని దర్శనమునకు వెళ్ళిన వెంటనే తక్కిన వారందరును తొందర తొందరగా వండుకొన్న కొఱ్ఱ అన్నమును నిన్నటి గోగాకు ఊరుబిండితో తిని బండ్ల వద్ద కొందరు యువకులను కావలిగా ఉంచి ఓపిక గలవారందరును అణ్ణెక్కి పట్టణములోనికి వెళ్ళిరి. వారి వెంట వచ్చిన పెరికె వర్తకులును తమ సరుకులను

అమ్ముకొనుటకు అణ్డెక్కిలో ప్రవేశించి పోలేరమ్మ దేవాలయ ప్రాంగణములో అంగళ్ళు పెట్టిరి. బోయజనులు కోమటివీధిలోని అంగళ్ళలో వారి వారికి కావలసిన వస్తువులను చూడసాగిరి. ఈలోపల నగరునుండి వచ్చిన పరిచారకుడు విపణివీధిలో దుర్గాధ్యక్షుని ఉత్తరువును చాటింపు వేయించెను. తాను వారి వెంట తిరుగుచు సరుకులను సేకరించుటలో తోడ్పడ సాగెను.

సాధారణముగా చిల్లర వర్తకులు తమ సరుకులను బయటపెట్టి అమ్ముదురు. రాశి వర్తకుల సరుకులు మాళిగలలో ఉండును. అవి బయటకు కనబడవు. పరిచారకుడు బోయజనులను రాశివర్తకుల యొద్దకు తీసుకొనిపోయెను. చిల్లర అంగడుల వద్దను మాళిగల వద్దను సందడి ఎక్కువైపోయెను. గుంపున కంతటికిని ఉమ్మడిగా ఆరుగధాన్యము, కొఱ్ఱధాన్యము, జొన్నలు, సజ్జలు కొని, కొన్ని గోతములకు నింపిరి. నూనె, బెల్లము, జీలకఱ్ఱ, మిరియాలు, ఉప్పు, కొన్ని విధములైన మందు దినుసులు వేరుగా తోలుతిత్తుల లోనూ, గంపలలోను నింపిరి. కొందరు స్త్రీలును, యువకులునుకలిసి ధాన్యపు మూటలను కోట వెలుపల పేటలో కూలినాలి చేసికొని బ్రతుకువారు నివసించువీధిలో దించిరి. అక్కడ కూలివాండ్రు తమతమ ఇండ్ల వద్ద ఆధాన్యమును దంచి పొట్టు చెఱిగి, గట్టి గింజలను సంచులకెత్తిరి. జొన్నలను, సజ్జలను దంచి చెఱిగి, తిరగళ్ళతో పిండి విసరి గోతములకెత్తిరి. కూలివాండ్రకు కూలి లెస్సగా గిట్టినది. సాయంత్రమునకు ఈ పని పూర్తి అయినది. సరుకులనంతటిని బండ్ల వద్దకు చేర్చుకొనిరి. ఇక వారము దినముల ప్రయాణమునకు ఎట్టి ఇబ్బందియు లేదు.

వీరన బోయని వెంట వచ్చిన బోయయువకులును భోజనము ముగించుకొని పడసాల వెలుపల వసారాలలో పరిచారకులతోనూ రాజభటులతోనూ మాటలలో పడినారు.

"ఇప్పుడు చెప్పండి. మీ స్వస్థలములో మీరు ఎదుర్కొన్న అలజడులెటువంటివి? ఏకముగా మీరందరును వలసవెళ్ళునంత కష్టనష్టములేమి జరిగినవి. ధైర్యవంతులు, పోటరులునైన మీకే దుర్భరమైపోయిన ఆ అలజడులెట్టివి. మీరు వలసపోవుటకు క్రొత్తప్రదేశమును ఎట్లు ఎన్నుకున్నారు." రుద్రమనాయకుడు తీరికగా అడిగెను.

రుద్రమనాయకుని మాటలు విని వీరనబోయడు సాలోచనగా ఆసనముపై వెనుకకు వాలి కొంతసేపు మౌనముగా ఉండిపోయెను. పదునైదు సంవత్సరములుగా తాము అనుభ వించిన బాధలు, కడగండ్లు, హింసలు, అవమానములు అన్నియు అతని కన్నుల ముందర చిత్రపటములవలె తిరుగసాగెను.

"మేము త్రిపురాంతకము సమీపమున నివసించుచుండిన బోయదొరలము. మాది కొండలు, గుట్టలు, చిట్టడవులతో నిండిన ప్రాంతము. అక్కడ ఒకటి రెండు ఆమడల పరిధిలో మా బోయపాళెములు పెద్దవి చిన్నవి పదునైదు వరకు ఉండినవి. వేట, మెట్ట వ్యవసాయము, గొఱ్ఱెలను మేకలను మేపుకొనుట మా జీవనాధార వృత్తి. మా వారందరునూ

విలువిద్యలో ప్రవీణులు. ఆకాశములో దూసుకొనిపోవుచున్న డేగ నైనను గురి తప్పకుండా కొట్టగలరు. కష్టజీవులు. బలిష్ఠులు. ధైర్యసాహసములు మా ఊపిరి. ఆత్మాభిమానము మా ప్రాణము.

విష్ణుకుండిన ప్రభువుల కాలములో మా బ్రతుకులు ఎటువంటి ఒడుదొడుకులు లేకుండా సాగినవి. మా పూర్వులును, తరువాత నేనును సంవత్సరమునకు రెండుసార్లు బెజవాడలో విష్ణుకుండిన ప్రభువులను దర్శించుకొని యథాశక్తి కానుకలు సమర్పించుకొని వచ్చెడివారము. ఆ ప్రభువులు మమ్ములను ఎంతయో ఆదరించెడివారు. ధర్మప్రభువు మాధవవర్మ మహారాజుల కాలము వరకు మా బ్రతుకులు సరళముగానే సాగినవి. అంతటి ధర్మమూర్తి మరల భూలోకమున పుట్టునా? రాజ మార్గములో రథమును వేగముగా తోలి ఒక బాలుని మృతికి కారణమైనాడన్న కారణముగా తన కన్న కుమారునికే మరణదండన విధించిన ధర్మావతారు డాయన. ఆయన ధర్మబుద్ధికి మెచ్చి దేవతలు బెజవాడలో కనక వర్షము కురిపించిరని చెప్పుకొనుచుండిరి. ఇప్పటికిని ఆ వృత్తాంతమును జానపదులు పాటలుగా కట్టి పాడుకొను చున్నారు.

అంతలో వచ్చినది ఘోరమైన ఉపద్రవము. ఎక్కడో పడమటి కన్నడదేశము నుండి సత్యాశ్రయ పులకేశి అను చాళుక్యరాజు మా ప్రభువుపైకి దండెత్తి వచ్చినాడు. సత్యాశ్రయుడు సామాన్యుడుకాడు. ఉత్తరమున హర్షవర్ధనుడను చక్రవర్తినే ఓడించినాడట. అపారమైన సైన్యము, ఏబది ఏనుగులు, నాలుగు వేల గుఱ్ఱపుదళము ఏబదివేల కాల్బలము, నూర్ల కొలదిబండ్లు, పరిచారకులు, వంటలవాండ్రు, గాయపడిన సైనికులకు తక్షణ వైద్యమునకై వైద్యుల సమూహము, ఆయుధములను అరువుచేయు కమ్మరులు –ఓహ్–అది ఒక జన సముద్రము.

వారి ప్రయాణము అతి భయంకరముగా సాగును. దండయాత్రలను గురించి తమరికి తెలియనిదేమున్నది!

ఆ దండు నడుచు దారి వెంబడి పచ్చగా ఏపుగా పెరిగిన పంట పొలములన్నియు గుఱ్ఱములకు, ఎడ్లకు,ఏనుగులకు ఆహారమై పోవును. త్రొక్కిడిబడి నాశనమైపోవును. పండ్ల తోటలు, చెఱకు తోటలు, అన్నియూ ఏనుగులపాలై నేలమట్టమై పోవును. దారి పొడవున గ్రామములలోని జనులు ముందుగానే ఊళ్ళు వదలి పారిపోవుదురు. అయినను సైనికులు వదలరు. చేతికి దొరికిన గొఱ్ఱెలను, మేకలను, పందులను, కోళ్ళను పట్టి పొట్టన బెట్టు కొందురు. పాతరలలో దాచిన ధాన్యమును తోడి బండ్లకెత్తింతురు. వారు వెంట తెచ్చుకొను ఆహారము కొంచెము. దారి వెంబడి కొల్లగొట్టు ఆహారము అధికము. రాజుల దండయాత్రల న్నియు ఇట్టే సాగును. మీకు తెలియనిదేమున్నది. ఒకసారి దండుసాగి పోయిన తరువాత ఆ దారిలోని ఊళ్ళ ప్రజలు కోలుకొనుటకు రెండు మూడు సంవత్సరములు పట్టును.

మా బోయపాళెములకును అదియేగతి పట్టెను. చాళుక్య సేన అరక్రోసెడు వెడల్పున క్రోసెడుపొడవున మా పాళెములపైననే నడచినవి. మా వారందరును ఊళ్ళువదిలి అడవుల లోనికి పారిపోయిరి. ఆవులు, ఎనుములు తప్ప తక్కిన పశుసంపద అంతయు నశించెను.

పూరిండ్ల వాసములు, దూలములు చాళుక్యసేనకు వంట చెఱకుగా ఉపయోగపడెను. ఎద్దులను బండ్లు లాగుటకు పట్టుకొని పోయిరి. ఇక కొద్ది దినములలో వెన్ను వదలుటకు సిద్ధముగా నుండిన జొన్న, సజ్జ పైరులు, ప్రత్తిచెట్లు, పండ్ల తోటలు వారి ఎడ్లకు ఏనుగులకు ఆహారమైపోయెను. పాతరలు కొల్లబోయెను. కొన్ని ఇండ్లు కూలిపోయెను.

దూరమున దాగి చూచుచున్న మా వారి కడుపులు కాలిపోయెను. ఆ కోపముతో మావారిలో కొందరు అడవులలో చాటున నుండి వారిపై చాటుదెబ్బ తీసిరి. కనబడని ప్రదేశములలో దాగియుండి బాణములతో ఇన్నూరు మంది సైనికులను, నూట ఏబది గుఱ్ఱములను చంపివేసిరి. సైనికులు మా వారికోసము వెదకిరి. కాని మావారు తప్పించు కొనిరి. మా వారి ఈ దాడిని అడ్డుకొనలేక చాళుక్యసేనలు త్వరత్వరగా ముందుకు సాగిపోయినవి.

మూడవనాడు మేమందరమును మా పాళెములకు చేరుకొని చూడగా అక్కడ ఏమున్నది. సర్వము నేల మట్టము. మా బ్రతుకులు మొదటి నుండియు ప్రారంభింప వలసి వచ్చెను.

యుద్ధములో మాధవవర్మ మహారాజు మరణించెను. యువరాజు మంచెన భట్టార కుడు పారిపోయెను. చాళుక్యరాజు సత్యాశ్రయుడు తన ప్రతినిధిని బెజవాడలో నిలిపి వేరొక మార్గమున వెనుదిరిగి పోయెనట.

మేము మా పాళెములను మరల నిర్మించుకొని పశువులను సమకూర్చుకొని, సేద్య మునకు పూనుకొంటిమి. చితికిపోయిన బ్రతుకులను వట్టి చేతులతో బాగు చేసి కొనుట ఎంత కష్టమో తమకు తెలియనిది కాదు.

మా పాట్లు మేము పడుచుండగా మంచెన భట్టారకులును, మరి కొందరు దొరలును కలిసి మరల సైన్యమును సమకూర్చుకొను ప్రయత్నము చేసిరి. మా పాళెములకు వచ్చిరి. ఇరువది ఏండ్ల నుండి యేబదిఏండ్ల వరకు వయస్సున్న మగవారిని మున్నూరు మందిని బలవంతముగా పట్టుకొని సైన్యములో చేర్చుకొని బెజవాడపైబడిరి. మా వారందరును మేటి ధానుష్కులు. అదియే మావారు చేసిన పాపము. యుద్ధములలో మా వారినే ముందు వరుసలో నిలిపిరి. పెద్ద యుద్ధము జరిగెను. ఆ యుద్దములో మావారు చాల మంది మరణించిరి. ఆ యుద్ధములోనే నేను ఈ చేతిని పోగొట్టుకొంటిని. మావారిలో చాలమంది వికలాంగులైపోయిరి.

చాళుక్య ప్రతినిధి ఓడిపోయి పారిపోయెను. మంచెన భట్టారకుడు రాజయ్యెను.

అంతలోపలనే పిష్ఠపురము నుండి పృథ్వీ మహారాజు నాయకత్వమున దుర్జయులు బెజవాడపైబడిరి. మంచెన యొక్క సేనానులు మరల మాపాళెములపై బడి మావారిని మరికొందరిని పట్టుకొని పోయి తమ సైన్యములో చేర్చుకొనిరి. చెప్పితిని కదా ముందు వరుసలో మావారే ఉందురని. శత్రువులను ఎక్కువ మందిని చంపువారు మావారే. శత్రువులచేతిలో ఎక్కువ మంది చచ్చునదియు మావారే. ఆ యుద్ధములోనూ మావారు చాలామంది మరణించిరి. మంచెన ఘోరపరాజయముపాలై ఎక్కడికో పారిపోయెను.

ఒకవైపు దుర్జయ పృథ్వీ మహారాజును, మరి యొక ప్రక్క మంచెనయు వేంగీ

రాజ్యమునకు నేనే రాజుననగా నేనే రాజునని అధికారము నెరపసాగిరి.

సందులో సమారాధన యన్నట్లు వేంగీ రాజ్యములోని ఈ అనిశ్చిత పరిస్థితిని అదనుగా తీసికొని రాష్ట్రకూటులు మా పాళెముల మీదుగా బెజవాడపై దండెత్తిరి.

అప్పుడప్పుడే కోలుకొను ప్రయత్నములో నున్న మాకు ఈ దండయాత్రలు ప్రాణాంత కము లైనవి. పంటలు లేవు. పశువులు లేవు. ధాన్యము లేదు. ఎట్లు బ్రతుకవలె? దానికి తోడు వరుసగా రెండు సంవత్సరములు వర్షాభావము వలన మా పరిస్థితి మరింత క్షీణించినది. నాలుగైదు సంవత్సరములు కష్టపడి ఎట్లో నిలదొక్కుకొని బ్రతుకును సాగించుచుండగా సత్యాశ్రయ మహారాజు మరల పెద్ద సైన్యముతో వేంగిపై దండెత్తెను. మొదటిసారి దండెత్తి వచ్చి జయించి పోయిన తరువాత పంద్రెండేండ్లయినను వేంగి రాజ్యము పూర్తిగా తన హస్తగతముకాలేదను కోపముతో ఈసారి అపార సైన్యముతో వచ్చిపడెను. దుర్జయ పృథ్వీమహారాజును తరిమికొట్టెను. ఎక్కడనో దాగియుండిన మంచెనను పట్టుకొని వధించెను. తన సైనికులను నలువైపుల పంపి విష్ణు కుండినులపై సానుభూతి చూపిన వారినందరిని తెగటార్చజొచ్చెను. వారు మాపైనను పడినారు. మొదటి దండయాత్రలో మావారు వారిపై చాటు దెబ్బతీసిన కసితో వారు మా పాళెములను మరల ధ్వంసము చేయనారంభించిరి. చాటుదెబ్బ తీయుటకు మాకు అవకాశము లేకపోయెను. అంతటి శత్రువులను ముఖాముఖి ఎదిరించుశక్తి మాకులేదు. వారి కాళ్ళా వేళ్ళాపడి, ఉన్నదంతయు ఊడ్చి వారికి సమర్పించుకొని ప్రాణములు దక్కించుకొన్నాము. అయినను వారు ఊరుకొన లేదు. అడపదడపా మా పాళెములపైబడి మేము ఇంకను విష్ణుకుండినులకు విధేయులమై యున్నామని, చాళుక్యులపై కుట్రలు పన్నుచున్నామని వట్టి నిందలు మోపి మా బోయ యువకులను తీవ్రముగా శిక్షింపసాగిరి. వారి తీవ్రమైన శిక్షలకు తట్టుకొనలేక కొందరు మరణించిరి.

అదేపనిగా పగబట్టిన వారి మధ్య ఎంత కాలము బ్రతుకగలము?

అక్కడి నుండి ఎక్కడికైనను వలస వెడలిపోవుటయే మంచిదని తీర్మానించు కొంటిమి. ఎటువైపు పోవలెను? పల్లవరాజ్యము కొంత ప్రశాంతముగానున్నది. గుండ్లకమ్మనదితో మాకు విడరాని అనుబంధము. ఆ నది మా జీవము. మా ప్రాణము.

నేనొక్కడనే బయలుదేరి గుండ్లకమ్మ నది వెంబడి పోయిపోయి వంగవోలుకు తూర్పుగా విస్తారమైన చిట్టడవులను కనుగొంటిని. కందుకూరికి పోయి అక్కడ నున్న పల్లవరాజ ప్రతినిధిని దర్శించుకొని మాపాళెములవారందరును ఆ చిట్టడవుల ప్రాంతమున స్థిరపడుటకు అనుమతి పొందితిని. కందుకూరు రాజప్రతినిధి పల్లవ చక్రవర్తులకు బంధువట. ఆయన అనుమతించినచో పల్లవ చక్రవర్తులు అనుమతించినట్లేనట.

ఆరు నెలలలో ఆ ప్రాంతములోని యానాదులు, బెస్తలు మొదలగువారి సహాయమున కొంత భూమిని సేద్యమునకు అరువు చేసుకొని కొన్ని ఇండ్లు కట్టించి ప్రస్తుతము మూడు పాళెములవారిని అక్కడికి చేర్చుచున్నాను. త్వరలోనే మా అన్ని పాళెముల వారిని అక్కడికే తరలించెదను".

సుదీర్ఘమైన తమ విషాదగాధను చెప్పి వీరనబోయడు ఒక నిట్టూర్పు విడిచెను. ఎంత సమయము గడిచిపోయినదో తెలియలేదు. ఇరువురు కొంతసేపు నిశ్శబ్దముగా కూర్చుండిపోయిరి.

"ఇంకను ఎన్ని పాళెముల వారు రావలసియున్నది?"

"ఇంకను పది పాళెములవారు రావలసియున్నది. లెక్కకు పదిపాళెములేకాని మనుష్యులు కొందరే. చాలమంది ఈ అలజడులలో--" వీరనబోయడు ఆపైన మాట్లాడలేకపోయెను.

"వారందరును ఎప్పుడు వత్తురు?"

"మేము ముందుగా వెళ్ళి వారికిని కొన్ని వసతులు ఏర్పాటుచేసిన తరువాత వత్తురు. ఒక కాలు ముందు మోపిన తరువాత కదా వెనుక కాలు ఎత్తవలె."

"ఆ ప్రాంతము మీ పాళెముల వారి కందరికి సరిపోవునా?"

"చూడవలె. చాలని యెడల ఎటులైనను సర్దుకోవలె. మంచము పొడవుచాలనిచో కాళ్ళు ముడుచుకొని పండుకోవలె కదా."

బోయలు కందుకూరు దుర్గాధిపతి యొక్క అనుమతి పొందిన విషయము అణ్డెక్కి దుర్గాధ్యక్షునికి అంతకు పూర్వమే తెలియును. కాని వివరములు తెలియవు. కావున అతడు ఏమియు వ్యాఖ్యానించలేదు.

అంతలో ఇరువురు పరిచారికలు రెండు వెండి కలశములను తెచ్చిరి. ఇరువురు సేవకులు పది కొబ్బరి బొండములు తెచ్చిరి. కొబ్బరి బొండములను కొట్టి కలశములలో పోసిరి. పరిచారికలు కలశములను అందియ్యగా రుద్రమనాయకుడును, వీరనబోయడును నిదానముగా నిశ్శబ్దముగా త్రాగిరి.

"ఈ దినము మీకేమియు పనిలేదు కదా?"

"లేదు. అన్ని పనులును మావారు చూచుకొందురు."

"ఇక్కడికి ఆమడ దూరమున ధర్మపురము అను ఊరున్నది. అక్కడ భీమలింగేశ్వర స్వామి దేవాలయమున్నది. చాల మహిమగలదైవము. మరే క్షేత్రమునందును లేనంత గొప్ప శివలింగము. మీకు తీరికగా ఉన్న యెడల పోయి దర్శించుకొని వత్తము."

"చిత్తము. నేను బయటికి వెళ్ళి మావారు ఏమేమి కొనినారో, ఇంకను సమకూర్చుకొనవలసినవి ఏమైనా ఉన్నవో విచారించుకొని ఒక గడియలో వచ్చెదను".

"అట్లే-అట్లే- అంతలో నేనును లోనికి వెళ్ళి మా ఉద్యోగులతో కొంత సేపు మాట్లాడి వచ్చెదను." అని రుద్రమనాయకుడు లోనికి వెళ్ళిపోయెను.

వీరనబోయడు భవనము నుండి బయటకి వచ్చి తన అనుచరుని "మల్లన దొర ఎక్కడున్నాడు?" అని అడిగెను.

"కోమటి వీధిలో సరుకులు కొనుచున్నాడు."

"పద."

అందరును గుఱ్ఱములపై అయిదు నిమిషములలో మల్లనదొరను కలిసికొనిరి.

"దుర్గాధ్యక్షుల వారు నన్ను ధర్మపురములో భీమలింగేశ్వర స్వామి సన్నిధికి రమ్మను చున్నారు. మరొక పది మందిని నా వెంట వచ్చునట్లుచూడు" అన్నాడు వీరన బోయడు.

"మీరు బయలుదేరునప్పటికి మీ వెంట ఉందురు." అన్నాడు మల్లన దొర.

మరొక పది నిమిషములు వీరనబోయడు విపణివీధిలోని తన వారిని పలుకరించి, వారు కొన్న సరుకులను పరిశీలించి అట్లే రాజోద్యోగుల వీధియు, బ్రాహ్మణవీధియు, పోలేరమ్మగుడియు చూచుచు భవనమును చేరుకున్నాడు. పడసాలలోనికి వెళ్ళి ఆసనముపై కూర్చున్నాడు.

తమ ప్రభువులవారును, బోయదొరయు ధర్మపురమునకు ప్రయాణమగు చున్నారన్న విషయము పరిచారకులకు తెలిసినది. వారు గబగబ కదలి బోయల గుఱ్ఱములకు ఉడికించిన ఉలవలు తినబెట్టి నీరు త్రావించిరి.

అంతలో రుద్రమనాయకుడు లోపలి గది నుండి పడసాలలోనికి వచ్చెను. వీరన బోయడు లేచి నిలబడెను.

"భీమేశ్వరాలయమునకు"అని రుద్రమనాయకుడు తన పరిచారకునికి చెప్పగా అతడు "చిత్తము" అని వెలుపలికి వెళ్ళి భటులను హెచ్చరించెను.

నగరు ముందర ద్వారమునకు ఎదురుగా రుద్రమనాయకుని గుఱ్ఱము–ముఖము పైనను, పార్శ్వములయందును, తుంటి భాగమునను నలుపురంగు కలిగి దేహమంతయు తెల్లగానున్న గుఱ్ఱము– నిలిచియున్నది. దాని ప్రక్కనే వీరన బోయని తెల్లని గుఱ్ఱము నిలబడియున్నది. వాటి ముందును వెనుకను బోయవీరులు, అద్దంకి వీరులు ఈటెలు ధరించి గుఱ్ఱములపై సిద్ధముగా ఉన్నారు. వీరికి అందరికంటెను పది అడుగుల ముందర పరిచారకుడు గుఱ్ఱముపై పురోగామిగా సిద్ధముగానున్నాడు.

రుద్రమనాయకుడు స్వల్పముగా అలంకరింపబడిన తన గుఱ్ఱముపై ఆసీనుడు కాగానే వీరనబోయడు తన తెల్లని గుఱ్ఱముపై కుడిచేతిలో కళ్ళెమును పట్టుకొని లాఘవముగా ఎగిరి కూర్చుండెను. ఎడమచేతిపట్టు లేకుండా వీరనబోయుడు గుఱ్ఱము నెక్కిన ఒడుపును, లాఘవమును, వేగమును చూచి రుద్రమనాయకుడు అశ్చర్య చకితుడై కండ్లు పెద్దచేసికొని చూచుచు క్షణకాలము నిలబడిపోయెను.

రుద్రమనాయకుడు చేయి ఊపగానే అందరును ధర్మపురము వైపు కదలిరి. మిక్కిలి వేగమును, మిక్కిలి నెమ్మదియు కాకుండా, శ్రమ లేకుండా ప్రయాణము సాగుచున్నది. మైదానపు గాలి చల్లగా వీచుచున్నది. దారిపొడవునను పొలములలో రైతులు పనులు చేసికొనుచు వీరిని చూడగానే లేచి నిలబడి నమస్కారములు చేసి వీరు దాటిపోగానే తమ పనులలో దిగుచుండిరి.

"అక్కడ మీరు ప్రస్తుతము ఎంత భూమిని సాగునకు అరువు చేసుకున్నారు?"

"ఇరువది పుట్ల ఆడ్లుపట్టు నేలను అరువు చేసి యున్నాము. మూడు వీధులుగా ఇరువది నాలుగు ఇండ్లు ఒక పల్లెగా నిలిపియున్నాము".

"ఇకపై వచ్చువారికి?"

"వారు దూరదూరముగా పొలములు అరువు చేసికొని పల్లెలు కట్టుకోవలె."

అంతలో ప్రక్కనున్న పొలములో పరుగెత్తుచున్న ఏదుపందిని చూచి భటులు"ఏదు ఏదు" అని అరచుచు ఈటెలు పైకెత్తు లోపల వీరనబోయడు ప్రక్కనున్న భటుని ఈటెను లాగుకొని ఏదుపంది మీదికి శక్తి కొలది విసరెను. అది చూచుటకు దారిని పోవు కుక్కపై రాయి విసరినట్లు అలవోకగా కనబడెను. కాని ఆ ఈటె ఏదుపంది శరీరమున లోతుగా దిగిపోయినది. ఏదు కీచుకీచు మని అరచుచు ఇరువది అడుగులు నడచి అక్కడే పడిపోయి గిలగిలమని తన్నుకొనుచు కొంత సేపటికి తలవాల్చెను.

వీరన బోయడు వినయముగా తలవంచి రుద్రమనాయకునితో "తొందరపడితిని. క్షమింపవలె. మీ ఎదుట ఈ పని చేయవలసినదికాదు. కానీ వేట మా బోయల రక్తములో ఇంకి పోయిన విద్య. కంటబడిన జంతువు తప్పించుకొనిపోవుట మేము అవమానముగా భావింతుము. నా తొందరపాటును దయచేసి మన్నింపవలె."

రుద్రమనాయకుడు సమాధానముగా చిరునవ్వు నవ్వినాడు.

భటుడు గుఱ్ఱము దిగి ఏదుపంది యొద్దకు పోయి తన ఈటెను దాని శరీరము నుండి లాగుకొని ఆకులతోనూ, మట్టితోనూ ఈటెను తుడుచుకొని తిరిగి వచ్చెను. రైతులు పందిని ఎత్తుకొనిపోయిరి. ఈ సంఘటన అణ్ణెక్కి వీరుల గుండెలలో అదటు పుట్టించినది. అది యేమి వేగము! అది యేమిబలము! ఈ బోయవీరులందఱును అంతటివారేనా!

ఒక ఘడియలో అందరును ధర్మపురములో ప్రవేశించి ఊరి వెలుపలనున్న భీమేశ్వర స్వామివారి ఆలయము ముందు గుఱ్ఱములు దిగిరి. ముందుగానే వార్త అందుకొన్న అర్చకులు, గ్రామపెద్దలు అప్పటికే అక్కడ గుమికూడియుండిరి.

ఇరువురును కాలుసేతులు, ముఖము కడుగుకొని అర్చకులందించిన విబూది ధరించి లోనికి వెళ్ళిరి.

దేవాలయము చాల ప్రాచీనమైనది. సరియైన రక్షణ, పోషణ లేక కళాహీనమైయున్నది. గోడలు అక్కడక్కడ పగుళ్ళు వారినవి. శివలింగము చాల పెద్దది. ఒక మనిషి చేతులు చాపి కౌగిలించుకొన్నను అబ్బదు.

అర్చనలు పూర్తి అయినవి. అర్చకులు చక్కెర కలిపిన పాలు ఒక కొప్పెరలో దేవునికి నైవేద్యముగా అర్పించిరి. ఆ పాలను రెండు కోరలలో దైవ ప్రసాదముగా ఇరువురకును అందివ్వగా వారు కన్నుల కద్దుకొని స్వీకరించిరి. పగుల గొట్టిన కొబ్బరికాయల నుండి కొబ్బరిని పరిచారకులు తీసి ఇవ్వగా ఆరగించిరి.

అంతలో గ్రామ పెద్దలు వివిధములైన భక్ష్యములను అరటి ఆకులలో తెచ్చిపెట్టిరి.

ఇరువురును తనివి తీర భుజించిరి.

వీరనబోయని గంభీర రూపమును, దుర్గాధ్యక్షుడు అతని యెడల చూపుచున్న మర్యాదను చూచుచున్నగ్రామస్థులు అబ్బురపడుచున్నారు. అతనికి కేవలము నమస్కరించు చున్నారే కాని పలుకరించుటకు ఎవరును సాహసింపలేదు.

గ్రామస్థుల వద్ద సెలవు తీసుకొని అందరును వెనుదిరిగి ఒక ఘడియలో అణ్డెక్కి చేరుకొన్నారు. ప్రొద్దు వాటారుచున్నది.

వీరనబోయడు దుర్గాధ్యక్షునకు చేతులెత్తి నమస్కరించి సెలవడిగెను.

"మీరు కుదుటబడిన తరువాత మరి యొకసారి మా నగరుకు రావలె" అని దుర్గాధ్యక్షుడు "సెలవు" అన్నట్లు తల యూపెను.

బోయలందరును చింత తోపు చేరుకున్నారు. సరుకులకై పట్టణములోనికి వెళ్ళియుండిన పురుషులును, స్త్రీలును మూటలు మోసుకొని వచ్చి బండ్లలో సర్దిపెట్టి వంట ప్రయత్నములు చేయుచుండిరి.

ఆ రాత్రి నాలుగు పెద్దపెద్ద గుండిగలలో వరి బియ్యపు అన్నమును, ఆరు చిన్నచిన్న గుండిగలలో ఏదో ఆకుకూరల పుల్లగూరయు, పట్టణము నుండి రెండు కడవలలో తెచ్చిన మజ్జిగయు పెట్టుకొని అందరును తృప్తిగా భుజించిరి. మిగిలిన అన్నమును, పుల్లగూరయు రెండు గుండిగలకు సర్ది వాసెనలు కట్టిరి. మరునాటి ప్రయాణమునకు సజ్జ రొట్టెలు కాల్చి గంపలలో పెట్టి గొసెన కట్లుకట్టిరి.

మరునాడు ఉదయము తెల్లవారక మునుపే అందరును గుండ్లకమ్మనది వెంబడి ప్రయాణము సాగించిరి. వారి వెంట వచ్చిన వర్తకులును, యాత్రికులును బోయదొర వద్ద సెలవు తీసికొని కందుకూరి వైపు పయనమై పోయిరి.

ఆరు దినముల ప్రయాణము తరువాత ఏడవ దినము మధ్యాహ్నమునకు బోయ దొరల సాతు తమ గమ్యస్థానమును చేరుకొన్నది. అక్కడ అదివరకే ఉండిన బోయ యువకులు కొందరు క్రోసెడు దూరముననే వీరికి ఎదురువచ్చి అందరిని పలుకరించి యోగ క్షేమములు విచారించి వారితో కలిసి వెనుదిరిగి వచ్చిరి.

గమ్యస్థానము చేరగానే అందరును బండ్లుదిగి కొత్తగా నిర్మించబడిన ఊరిని,వీధులను, ఇండ్లను వింతగా చూచుచు ఆ ప్రాంతమంతయు కలయదిరిగిరి.

ఆ ప్రాంతము బాగుగా చదును చేయబడి కొంచెము మిట్టుగా లేపబడినది. తూర్పు పడమరలుగా మూడు వీధులు తీర్చబడినవి. వీధులకు ఇరువైపుల ఎదురెదురుగా నాలుగేసి నివాసములు–మొత్తము ఇరువది నాలుగు నివాసములు కట్టబడినవి. నివాసమనగా అయిదంకణముల మయమున ఇటుక గోడలపై తాటాకులు కప్పిన ఒక ఇల్లును, దాని ముందర గోడలు లేకుండా రాతి కూసములపై నిలిపిన తాటాకుల పశువుల కొట్టమును మాత్రమే. ఇండ్లన్నియు బొమ్మరిండ్లవలె చూడ ముచ్చటగానున్నవి. ప్రతి వీధిలోనూ ఒక చేదబావి యున్నది.

ఆ మూడు వీధులకు అభిముఖముగా పడమటి వైపున మూడు తాటాకు ఇండ్లును, రెండు పశువుల కొట్టములును ఉన్నవి. అవి బోయనాయకునికి అనగా వీరన బోయనికి ఉద్దేశింపబడినని. ఆరు నెలలుగా అక్కడనే ఉండి పనులు చేయించుకొనుచుండిన బోయ యువకులు అక్కడనే కాపురముండిరి.

అప్పుడే ఎవరును ఇండ్లలో ప్రవేశింపలేదు. బండ్లన్నియు నాయకుని ఇంటి ముందే నిలిపి బండ్ల నుండి అత్యవసరమైన కొంత సామాగ్రిని మాత్రము దించుకొనిరి. ఆ యింటి ముందరనే వెంటతెచ్చుకొన్న రొట్టెలు, అంబలి ఆరగించి అందరును నాయకుని ఇంటి ముందర కూర్చుండిరి.

వీరన బోయడు ఒక బండి నొగలపై కూర్చుండి మాట్లాడసాగెను.

“కష్టములు వచ్చుచుండును, పోవుచుండును. అందుకే కష్ట సుఖములు కావడి కుండలు అని పెద్దలు చెప్పిరి. కష్టములు వచ్చినపుడు భయపడరాదు. ధైర్యముతో ఎదుర్కొని బయటపడవలెను. మన దేశమున మనము పడరాని ఇడుమలు పడినాము. పొందరాని నష్టములు పొందినాము. మన మనుష్యులను కోల్పోయినాము. పశువులు పోయినవి. సేకరించి ఉంచిన ధనము, ధాన్యము అంతయు కొల్లబోయినది. అక్కడ బ్రతుకలేక ఇట్లు వలస రావలసి వచ్చినది. అంత మాత్రము చేత మనము ధైర్యము కోల్పోరాదు. మనము బోయదొరలము. ధైర్యమే మన బలము. కష్టపడుటయే మన ఊపిరి. ఇది కూడ మన కన్న తల్లి భూమాతయే. వేరే లోకము కాదు”.

అందరి హృదయములు బరువెక్కినవి. ఎవరును మాట్లాడలేకపోయిరి.

“ప్రస్తుతము మనము మనదేశము నుండి మూడు పాళెముల వారమే వచ్చియున్నాము. తక్కిన పాళెముల వారును తొందరగానే వత్తురు. వారి కొఱకు మనము ముందుగా కొన్ని సౌకర్యములు చేసి పెట్టవలె.

ఇప్పుడు వచ్చిన మూడు పాళెములలో అబ్బి బోయని పాళెము వారు ఈ ఉత్తర వీధిలో ఉండవలె. గండబోయని పాళెమువారు– అనగా మా పాళెమువారు మధ్యవీధిలో ఉండవలె. చెన్ను బోయని పాళెము వారు దక్షిణవీధిలో ఉండవలె. ప్రస్తుతమునకు ఒక్కొక్క ఇంటిలో దగ్గర బంధువులుగా ఉన్నవారు కలిసి ఉండవలె. రెండు మూడు నెలలలో వీధులకు పొడిగించి క్రొత్త యిండ్లు కట్టుకొన వచ్చును.

మనవారు ఇరువది మంది ఆరు నెలల క్రితమే ఈ ఇండ్లు కట్టించినారు. చిట్టడవిని నరికి ఏనాదులు, ఎఱుకుల సహాయముతో ఇరువది పుట్ల ఆడ్లు పట్టు నేలను అరువుచేసి సజ్జలు, జొన్నలు పండించి పాతరలలో పోసియున్నారు. ఇరువది పుట్లనేలను రేపు అన్ని కుటుంబములవారికి పంచెదను. వారివారికి చూపిన నేలలో వారు వెంటనే ఏదైనను పంట పెట్టుకోవలె. పంటలు చేతికి వచ్చునంత వరకు పాతరలలోని ధ్యానము అందరును వాడుకొనవచ్చును.

రెండు సంవత్సరములలో ప్రతి కుటుంబమువారును వారికి అనుకూలమైన చోట అవసరమైనంత మేర అడవిని నరికి పొలములు అరువు చేసికొనవలె. తరువాత ఈ ఇరువది పుట్ల భూమి నా కుటుంబమునకే చెందును.

ఇప్పుడు మీరు మీకు చూపిన వీధులలో కుటుంబ పెద్దల వయస్సు బట్టి వరుసగా పడమర నుండి తూర్పునకు ఇండ్లలో చేరుకొనవచ్చును.”

కూర్చొని యుండిన మూడు పాళెముల వారును బిలబిలమని లేచి తమకు నిర్దేశించిన వీధులలో తమబండ్లను నిలుపుకొనిరి. ఎవరెవరికి ఏయే ఇల్లు అను విషయములు త్వరగా తేల్చుకొనిరి. తమతమ ఇండ్లను కడిగి, అలికి, పూసి, ఇండ్ల ముందు కళ్ళాపి చల్లి ముగ్గులు వేసిరి. తెల్లగా సున్నము కొట్టియుండిన ఇండ్లకు సొగసుగా వివిధ ఆకారములతో ఎఱ్ఱమట్టి పట్టెలు తీర్చిరి. నేరేడు, మామిడి, మారేడు రెమ్మలు తెచ్చి తోరణములు కట్టిరి.

ప్రొద్దుపోవువేళకు ఈ పనులన్నియు ముగించుకొని నట్టిండ్లలో గూళ్ళలో చల్ల బెట్టి దీపములు వెలిగించిరి. ఆ జ్యోతులకే టెంకాయలు కొట్టి కర్పూరము వెలిగించి సామగ్రిని ఇండ్లలోనికి చేర్చుకొని సర్దుకొనిరి.

కొన్ని కుటుంబముల వారికి మాత్రమే రోళ్ళు ఉన్నవి. కొన్ని కుటుంబముల వారికి సన్నికల్లులు పాత్రములు ఉన్నవి. రోకళ్ళు, రోకలిబడులు అందరికిని ఉన్నవి. అన్నియు వారి వారి ఇండ్ల ముంగిట కొట్టములలో పెట్టుకున్నారు. బండ్లను, ఎడ్లను, తమవెంట తోలుకొని వచ్చిన ఒకటి రెండు ఆవులను, మేకలను, వేటకుక్కలను, కోళ్ళను కొట్టములలోనికి చేర్చుకున్నారు. ప్రతి ఇంటికిని ఒక్కొక్క కుమ్మరి తొట్టి అదివరకే పెట్టియున్నారు. ఆ తొట్లకు ఆ రాత్రియే నీరుచేది పోసుకున్నారు.

తెల్లవారక ముందే ఊరు మేల్కొన్నది. వీధులలో జనసంచారము కోలాహలముగా ఉన్నది. చేదబావుల వద్ద నీరు చేదువారు, ఇండ్ల ముంగిట మరల కళ్ళాపి చల్లుకొనువారు, ముగ్గులు వేయువారు, రోళ్ళలో సజ్జలో, జొన్నలో, కొఱ్ఱలో వేసి దంచెడివారు, వంట ప్రయత్నములు చేసెడివారు, ఊరి ప్రక్కన గుబురుచెట్ల చాటున కాల్యకృత్యములకు పోవువారు, చిన్నపిల్లలను వీధులలోనే కాల్యకృత్యములకు దించెడివారు, పశువులు, కుక్కలు, మేకలు, కోళ్ళు,–వీటి అరుపులతో ఎక్కడచూచినను సందడే–సందడి.

వీరనబోయడు,అతని భార్యలు ఇద్దరు, ఎలబ్రాయపు కుమారులిద్దరు, కుమార్తె లిద్దరు, వితంతువులైన కోడండ్రు మరి ఇద్దరు, వారి బిడ్డలు, అందరును ఆ పెద్ద ఇంటిలో నిలిచియున్నారు. వారి బండ్లు, ఎడ్లు మొదలైన వన్నియు వారి కొట్టములలో సర్దుకున్నారు.

వీరనబోయడు పెద్ద భార్యను వెంట బెట్టుకొని ప్రతి వీధియు, ప్రతి ఇల్లును తిరిగి వారి అవసరములను అడిగి తెలుసుకొనసాగెను.

“అవసరమైన వస్తువులను మా ఇంటికి వెళ్ళి తెచ్చుకోండి. సందేహపడవద్దు. ప్రక్కవారి వద్ద ఉన్నను సర్దుబాటు చేసుకోండి. వంగవోలు సంతకు గానీ, టంగుటూరు సంతకుగానీ వెళ్ళివచ్చువరకూ మన అందరిదీ ఒకే కాపురముగా భావించండి. తరువాత ఎవరి సంసారము వారిది,” అని ధైర్యము చెప్పసాగిరి.

“ఇప్పుడు మన ఇంటి దగ్గర పరమాన్నము వండుచున్నారు. అందరును రావలె”, అని మంగసాని మనిషి మనిషిని పిలుచుచు మూడు వీధులు తిరిగి ఇంటికి వచ్చెను.

ఒక గడియ గడవగానే నాయకుని ఇంటి ముంగిట మూడు వీధుల జనులు చేరి పోయిరి. ఎప్పుడు ఎవరు పెట్టిరోగానీ ఆయింటికి అప్పుడే "నగరు" అను పేరు వచ్చినది. "నగరులో అందరకు పరమాన్నము వడ్డించుచున్నారు" అని అందరును చేరిపోయిరి.

అట్లు ఆ క్రొత్త ఊరిలో క్రొత్తగా వచ్చి చేరిన జనులందరికి నోళ్ళు తీపి చేయుటతో అక్కడ క్రొత్త జీవితములు ప్రారంభమయినవి.

చాళుక్య సమ్రాట్టు సత్యాశ్రయ పులకేశి బెజవాడలో పెద్దసభను ఏర్పాటు చేయవలసి నదిగా ఆజ్ఞాపించెను. నెల దినముల వ్యవధి నిచ్చెను. ఈ నెల దినములలో వేంగి, హేలాపురము, గుంటూరు, తెనాలి, వినుకొండ, పిష్ఠపురము, ధాన్యకటకములలోని అధికారులకును, ఇదివరకు విష్ణుకుండినులకు సామంతులుగా నుండిన రాజులకును ఆజ్ఞాపత్రములు అంచెవార్తాహరుల ద్వారా పంపబడినవి.

సత్యాశ్రయ పులకేశి ఆజ్ఞకు ఆంధ్రదేశమే గడగడలాడుచున్నది. ఎక్కడో కన్నడ దేశమున బాదామి నుండి అపారమైన సైన్యముతో ఎత్తివచ్చి, విష్ణుకుండిన వంశమును సమూలముగా నిర్మూలించి, వేంగి సైన్యమును తలయెత్తనీయకుండా చేసినాడు. మరియొక వైపున వేంగి రాజ్యమును కబళింప జూచుచుండిన దుర్జయులను తుదముట్టించినాడు. వేంగిలో తన రాజప్రతినిధిని నియమించి పరిపాలింపజూచినాడు. ప్రయోజనము లేకపోయినది. సామంతులందరును స్వతంత్రించి చాళుక్య ప్రతినిధిని తరిమివేసినారు. సత్యాశ్రయ పులకేశి ఈసారి తన తమ్ముడైన విష్ణువర్ధనునితో బాటు పెద్ద ఎత్తున దండయాత్ర చేసి వేంగిని సంపూర్ణముగా లోబరచుకొన్నాడు. ఒక సంవత్సరము బెజవాడలో తిష్ఠ వేసి రాజ్యమున ఎక్కడగాని తిరుగుబాటు తలయెత్తకుండా చేసినాడు. రాజ్యమును శాంతియుతముగా నుంచుటకు పులకేశి యంతటి వానికి ఒక సంవత్సర కాలము పట్టినది.

సత్యాశ్రయుడు దీర్ఘముగా ఆలోచించినాడు. తాను వేంగిలో శాశ్వతముగా ఉండలేడు. అక్కడ బాదామి రాజ్యమున్నది. దానిని కబళించుటకు అనేకులు కాచుకొని యున్నారు. కనుక తాను బాదామికి వెళ్ళక తప్పదు. తాను అటు అడుగు పెట్టగానే వేంగి రాజ్యము మరల పరహస్తగతమై పోవుట నిశ్చయము. వేంగి రాజ్యమును వేంగి నుండియే పాలించవలె. ఆ పాలించెడివాడు తెలుగువారికి ఇష్టుడు కావలె. తాము తెలుగు రాజ్యమును కాక తెలుగువారి హృదయములను జయించుకొనవలె. తెలుగు రాజ్యమును పాలించువాడు తెలుగు వాడనిపించుకోవలె. బాదామిలో కూర్చుండి పాలించువాడు ఎన్నటికిని తెలుగువాడు కానేరడు. కావున వేంగిలో ఒక చాళుక్య రాజ్యముండవలె. దీని వలన మరియొక ప్రయోజనమును కలదు. వేంగి సేనలతో పల్లవులను, బాదామి సేనలతో రాష్ట్రకూటులను అణచివేసి దక్షిణాపథము నందంతటను చాళుక్య రాజ్యమును స్థాపింప వచ్చును. ఏనుగు పోటు కంటె ఇరుపోటు మేలందురు. దక్షిణపు చివరనున్న రాజ్యములొక లెక్కలోనివి కావు. అవి భయముతోనే లొంగిపోవును. దక్షిణాపథమంతయు చాళుక్యుల వశమగును. ప్రాక్పశ్చిమ

సముద్ర తీరములందలి రేవు పట్టణములన్నియు చాళుక్యుల అధీనమగును. సామ్రాజ్యము సంపన్న మగుటకు రేవు పట్టణములే కదా ప్రధానసాధనములు.

సత్యాశ్రయుడు ఒక నిర్ణయమునకు వచ్చి ఈ సభను ఏర్పాటు చేసెను. సభా దినము చేరువ కానుకానూ బెజవాడలో కోలాహలము అధికమయ్యెను. నానా దిక్కుల నుండి వచ్చిన వారందరును సత్రములలోనూ, దేవాలయములలోనూ, రాజపురుషులు ఏర్పాటు చేసిన విడుదులలోను నిలువసాగిరి.

కోట లోపల విశాలమైన ప్రదేశములో ఒక వైపున ఎత్తుగా వేదిక నిర్మింపబడినది. వేదికపైనను, వేదిక ముందరను విశాలమైన పందిళ్ళు వేయబడినవి. వేదికకు దిగువ ఇరువైపులా అగ్రవర్ణస్థులు, పుర ప్రముఖులు, వైశ్య వర్గము, కవి పండిత బ్రాహ్మణ వర్గము కూర్చుండుటకు రెండడుగుల ఎత్తు దీర్ఘమైన వేదికలున్నవి. ఈ వేదికల మధ్య ప్రధాన వేదిక ముందు భాగమున కొంత భాగము రాజభటులకు వదలి దాని వెనుక సాధారణ జనులు కూర్చుండు ఏర్పాట్లు చేయబడినవి.

అనుకొన్న సమయమునకు సభాప్రాంగణ మంతయు జనులతో నిండి పోయెను. రాజ భటులు వచ్చిన వారినందరిని వారి వారి అర్హతలను బట్టి తగిన ప్రదేశములలో కూర్చుండబెట్టుచుండిరి.

రూపుగొన్న ధర్మమూర్తియు, జనాశ్రయ బిరుదాంకితుడును అయిన విష్ణుకుండిన సార్వభౌముడు మాధవవర్మ చల్లని పరిపాలనమును అనుభవించిన అక్కడి ప్రజలు ఈ క్రొత్త విజేతలను మనఃపూర్వకముగా అంగీకరింపలేకున్నారు. మనస్సుల లోలోపల చాళు క్య ప్రభువులపై వ్యతిరేకభావమే ఉన్నది. కాని ఏమిచేయగలరు? విష్ణుకుండిన వంశస్థులు ఎవరైనను మరల తలఎత్తి వేంగి రాజ్యమును చేపట్టగలరను ఆశ ఎప్పుడో నశించినది. గత పదిపండ్రెండు సంవత్సరములుగా వేంగిరాజ్యము–అందునను బెజవాడ ప్రాంతము– తీవ్రమైన రాజకీయఅనిశ్చితిలో అల్లకల్లోలమై పోయినది. అస్తవ్యస్త మైపోయినది. శాంతిభద్రతలు పూర్తిగా నశించినవి. తమవారో పరాయివారో ఎవరో ఒకరు ఇక్కడ నిలబడి ఏలుబడిని సాగించిననేగాని రాజ్యము శాంతియుతముగా మనుగడ సాగించు దారి కనబడుట లేదు.కావున ప్రజలు నూతన ప్రభువును స్వాగతింపక తప్పదు. వారిని ప్రసన్నులను చేసికొనక తప్పదు. గత్యంతరము లేదు.

కావుననే నానా దిక్కుల నుండియు జనులు తండోపతండములుగా వచ్చిరి. వచ్చిన వారు వచ్చినట్లే భటులు చూపుచున్న ప్రదేశములలో కూర్చొనుచుండిరి.

వంది మాగధులు బరాబరులు పలుకు చుండగా ముందు భాగమున ప్రధానులు, సేనానులు నడువగా, ఇరువైపుల వీవనకత్తెలు వింజామరలు విసరుచుండగా, కొంత వెనుక భాగమున హెగ్గడి కత్తెలు జలకలశములు, తాంబూలకరండములు మోసికొని రాగా చాళు క్య సత్యాశ్రయ పులకేశి మహారాజుగారును, అతని తమ్ముడు యువరాజు విష్ణువర్ధనుడును వేదిక వెనుకవైపు నుండి వచ్చి వేదిక నధిరోహించి వారి వారికి నిర్దేశింపబడిన ఆసనములపై

కూర్చుండిరి. సభ నిశ్శబ్దమును, స్తబ్దమునైపోయెను. అందరును లేచి చేతులు పైకెత్తి నమస్కరించిరి. ప్రధానులు చేసన్నచేయగా కూర్చుండిరి. వెంటనే నూరు మంది భటులు విచ్చుకత్తులు ధరించి వచ్చి సభాజనుల మధ్య అక్కడక్కడ నిలబడిరి. నోరు తెరచిన యెడల తలలు తెగునట్లున్నది. చీమ చిటుకుమన్నను వినబడు నిశ్శబ్దము సభ అంతట అలముకొనెను.

సత్యాశ్రయ ప్రభువు సభ అంతయు కలయజూచెను. అక్కడక్కడ నిలిచిన విచ్చు కత్తుల వారిని చూచెను. క్షణకాలమాలోచించి విచ్చుకత్తుల భటులను తొలగి పొమ్మని చేసైగ చేసెను. వేదికపైనున్న చాళుక్య రాజ్య ప్రధానులు కలవరపడిపోయిరి. శత్రుదేశ ప్రజలను ఇంత తొందరగా నమ్మవచ్చునా! వేంగి రాజ్య ప్రజలలో ఇంతలోనే క్రొత్త ప్రభువులపైన విశ్వాసమేర్పడునా! మహారాజుగారు ఎంత ధైర్యముగా భటులను తొలగి పొమ్మనుచున్నారు! ప్రధానులలో ఒకరిద్దరు మహారాజు గారి కేదో విన్నవించుటకు లేవబోగా మహారాజు వారిని చేసన్నతో కూర్చుండజేసెను. సభా సదులును మొదట నివ్వెఱ పోయి తరువాత హర్షాతిరేకముతో కరతాళధ్వనులును, జయ శబ్దములును, సాధువాదములును చేసిరి. ప్రధానుల ఆశ్చర్యమునకు మేరలేదు.

సత్యాశ్రయుడు తన ఆసనముననే కొంచెము ముందునకు జరిగి కూర్చొని "సోదర తెలుగు ప్రజలారా – నమస్కారము". అనెను.

ఎక్కడో కన్నడ దేశము నుండి వచ్చిన చాళుక్య ప్రభువు ఇంత స్పష్టమైన తెలుగు మాట్లాడగలడని ఎవరో కొందరు రాజకీయోద్యోగులకు తప్ప తక్కిన జన సామాన్యమునకు తెలియదు. ప్రభువుల వారి ఆ సంబోధన వినగానే ప్రజలు పరవశించి మరల కరతాళ ధ్వనులు చేసిరి. సద్దుమణగిన తరువాత సత్యాశ్రయుడు మరల ప్రారంభించెను.

"మీ కందరకును తెలియును. శాతవాహన సార్వభౌములు అంతరించిన తరువాత భరతఖండములో దక్షిణాపథము కుక్కలు చింపిన విస్తరి అయిపోయినది. చిన్న చిన్న రాజ్యములు ఎక్కడి కక్కడ స్వతంత్రించి పరస్పరము కలహించుకొనిరి. అన్నియు బలహీన రాజ్యములే. ఇక్కడ ఇట్లుండగా ఉత్తర దేశమున పాటలీపుత్రమున గుప్త రాజులును, వారి తరువాత కన్యాకుబ్జమున ముఖారి రాజులును బలమైన సామ్రాజ్యములను నిర్మించుకొని సుస్థిరపాలన నెఱపినారు. దక్షిణాపథము నందు అట్టి రాజ్యమేదీ? లేదే! కావుననే ఉత్తరాది వారు దక్షిణాదివారిని నోటి మాటతో, కంటి చూపుతో, ప్రతారించి కప్పములు కొన్నారు. అట్టి చులకన భావముతోనే కన్యాకుబ్జ హర్షవర్ధనుడు దక్షిణా పథమును ఆక్రమింపవలెనని దండెత్తి వచ్చినాడు. దక్షిణాపథ మంతగొడ్డుపోయినదా? అతనికి బాగుగా బుద్ధి చెప్పి తరిమి వేసితిమి. తోకముడుచుకొని పారిపోయినాడు.

"వారు ఇంతటితో ఆగుదురా? పూర్వము అశోకుడాగెనా? మొన్నటికి మొన్న చంద్రగుప్త విక్రమాదిత్యుడాగెనా? ఆగరు గాక ఆగరు. వారికి దక్షిణాపథముపైననే కన్ను. కారణమేమి? దక్షిణాపథమున గల సముద్రమును, రేవు పట్టణములును వారికి కావలెను. సముద్రమున కావలనున్న సువర్ణ, బ్రహ్మ, మలయ, సింహళ ద్వీపములతో వర్తకము సమస్తము

దక్షిణాపథము నుండియే జరుగుచున్నది. ఈ రేవు పట్టణములను స్వాధీనము చేసికొనవలెనని వారి ప్రయత్నము.

"కావుననే నేను దక్షిణాపథమునంతయు ఒక గొడుగు క్రిందికి తేవలెనను కొనుచున్నాను. విష్ణుకుండినులు ఆపని చేయలేక పోయిరి. పల్లవులును చేయలేక పోయిరి. కనుక నేను ఈ వేంగి సామ్రాజ్యమును బాదామి సామ్రాజ్యముతో కలిపి దక్షిణా పథమున ఒక విశాల సామ్రాజ్యమును స్థాపించదలచితిని. మన ఈ సామ్రాజ్యము పూర్వ పశ్చిమ సముద్రముల నావరించియుండును. రెండువైపుల రేవులు మన స్వాధీనమున నుండును. తెలుగు వారును, తమిళులును నౌకా నిర్మాణమునందును, నౌకాయానము నందును భరత ఖండముననే పేరెన్నిక గన్నవారు. మన నౌకా వ్యాపారము మూడు పువ్వులు ఆరుకాయలుగా వృద్ధిచెందవలె.

"ఆ ఉద్దేశముతోనే నేను పంద్రెండు సంవత్సరముల క్రితమే వచ్చి ఈ వేంగి రాజ్యమును జయించి మా ప్రతినిధిని ఇక్కడ నియమించి వెళ్ళితిని". సత్యాశ్రయుడు ఒక్క క్షణము ఆగెను, హెగ్గడి కత్తె ఒక పసిడి కోరలో నీరు అందీయగా నెమ్మదిగా త్రాగి రెండు క్షణములు ఆలోచించెను. వేంగి తిరుగుబాటుదారులు తమ ప్రతినిధిని తరిమి వేయుటయు, తాను రెండవసారి దండెత్తుటయు ప్రస్తావించుట మంచిదికాదు.

సత్యాశ్రయుడు మరల ప్రారంభించెను.

"గత పంద్రెండు సంవత్సరములలో నేనొక విషయముగ్రహించితిని. తెలుగు ప్రజలు పరుల పాలనమునకు తల ఒగ్గు వారుకారు. వారి స్వాతంత్ర్య కాంక్ష అప్రతిహతము. వారి ఆత్మాభిమానము నిరుపమానము. కావుననే తెలుగు ప్రజలు ఉత్తరము నుండి వచ్చి పడుచున్న రాష్ట్రకూటులను దరిజేర నియ్యలేదు. దక్షిణము నుండి వచ్చుచున్న పల్లవులను ఆంగీకరింపలేదు. ఇట్టి తెలుగువారి ఆత్మాభిమానమునకు నా జోహార్లు".

ఈ మాటలతో తెలుగువారి ముఖములు వికసించినవి. సత్యాశ్రయుడు శత్రురాజు అన్న విముఖత కొంత కొంత వెనుకకు తగ్గుచున్నది.

"అందు వలన మేము ఒక నిర్ణయమునకు వచ్చినాము. వేంగి రాజ్యమును బాదామి రాజ్యముతో కలుపుకొనము. వేంగి రాజ్యమును కనీసము బాదామి రాజ్యమునకు సామంత రాజ్యముగా కూడ పరిగణింపము. వేంగి రాజ్యము వేంగి రాజ్యముగానే ఉండగలదు. ఇది తెలుగు వారి రాజ్యము. తెలుగు రాజోద్యోగులు పాలించు రాజ్యము".

సభలోనున్న తెలుగు రాజోద్యోగులును, పురప్రముఖులును, వర్తకశ్రేణుల వారును, ఆశ్చర్యచకితులైపోయిరి. సత్యాశ్రయుని ఈ ఎత్తుగడ ఏమియో వారికి అంతు చిక్కలేదు.

"మీలో చాలామందికి తెలియకపోవచ్చును. మేమును తెలుగువారమే. మా పూర్వీకులు రేనాటి సీమ నుండి కన్నడ సీమకు వెళ్ళి రాజ్యమును స్థాపించినారు. తెలుగు మా మాతృభాష. మేమును ఈ వేంగి రాజ్యము వారమే. వేంగి రాజ్యప్రజలు అందరు మా ప్రజలే."

"ఇప్పుడు మా నిర్ణయమును ప్రకటించుచున్నాము. శ్రద్ధగా వినవలసినది"

సభ అంతయు నిశ్శబ్దమైపోయెను. సభయే కాదు. వేదికపైన కొలువు తీరిన చాళుక్య ప్రధానులును, చాళుక్య భటులును సావధానులైపోయిరి.

"మేము జయించిన ఈ వేంగి రాజ్యమును మా తమ్ముడైన యువరాజు విష్ణు వర్ధనునికి సమస్త సార్వభౌమాధికారములతో, స్వయం నిర్ణయాధికారములతో ధారపోయు చున్నాము. విష్ణువర్ధన మహారాజును వేంగి సామ్రాజ్యమునకు పట్టాభిషిక్తుని చేయు చున్నాము. విష్ణువర్ధన మహారాజు గారు పట్టాభిషిక్తులై ఇక్కడే –ఈ రాజ్యములోనే– మీవాడుగా, మీ రాజుగా, తెలుగువాడుగా ఉండి, మీకు హృదయరంజకముగా పరిపాలన చేయగలడు. ఇక మీదట ఇతనిది ఒక స్వతంత్రవంశావళి".

ఈ ప్రతిపాదనను ఎట్లు స్వీకరించవలెనో సభా జనులకు అర్థము కాలేదు.

"ఇది ఏమి స్వతంత్ర ప్రతిపత్తి? అక్కడ అన్నయు, ఇక్కడ తమ్ముడును పరిపాలించు చుండగా రెండు రాజ్యములు ఒకటికాక రెండగునా?"

"అన్నను సంప్రదించకుండా తమ్ముడు ఏపనియైన చేయునా? ఎప్పటికైనను పైమాట అన్నగారిదే కదా".

"పేరుకు విష్ణువర్ధనుడు ఇక్కడ రాజుగా నుండునుగాని పరిపాలనము మాత్రము సత్యాశ్రయునిదిగానే యుండును. చూచుచుండుడు".

"సత్యాశ్రయుడు ఇచ్చిన మాటపై కడవరకు నిలబడునా? సమయము చూచి ఏదో ఒక నెపమున వేంగి రాజ్యమును బాదామి రాజ్యముతో కలిపి వేయకుండునా?"

"ఇంతటి మహారాజులు ఇంతటి సభలో బహిరంగముగా చేసిన ప్రకటనను అతిక్రమింతురా?"

సభాజనులిట్లు గుసగుసలు పోవుచుండగా మహారాజు మాటలకే పొంగిపోయిన అల్పసంతోషులెవరో కొంత మంది ఒకమూల కరతాళ ధ్వనులు చేసిరి. ఇక విధి లేక సభాజనులందరును కరతాళ ధ్వనులతోను, జయ జయధ్వానములతోనూ, దిక్కులు పిక్కటిల్లజేసిరి.

"వచ్చు మాఘమాసమున శుద్ధ దశమి గురువారమున వేంగి నగరమున శ్రీ విష్ణువర్ధనుల వారి పట్టాభిషేకము జరుగును. మీరెల్లరు రావలసినది." అని పలికి సత్యాశ్రయుడు లేచెను. వేదికమీదనున్న చాళుక్య ప్రధానులు, దండనాథులు ముందు నడువగా పరిచారకులు వెనుక నడువగా సత్యాశ్రయ విష్ణువర్ధనులు వేదిక వెనుక వైపు దిగి వెడలిపోయిరి. ప్రజలందరు మిక్కిలి కోలాహలము చేయుచు, తమతమ ఇండ్లకు వెడలిపోయిరి.

యుద్ధమున చావకుండా బ్రతికి చాళుక్యులకు లొంగిపోయిన వేంగి మంత్రులు దళపతులు, రాజోద్యోగులు మొదలైనవారు అక్కడనే కూర్చుండి తమ తదుపరి కార్యక్రమమును గురించి చర్చించుకొనిరి.

ఏవిధమైన వైముఖ్యము, వైమనస్యము, వైషమ్యము లేకుండా మనస్ఫూర్తిగా చాళుక్య ప్రభువులను కొలుచుటయే తమ కర్తవ్యమని తీర్మానించుకొనిరి. ఇప్పటికే అల్లకల్లోలమై అల్లాడుచున్న వేంగి రాజ్యములో శాంతి సుఖములను నెలకొల్పుటయే తమ ప్రధాన లక్ష్యముగా

గుర్తించిరి. చాళుక్య ప్రభువులు మన్నించి తమకు పదవులిచ్చిన యెడల విధేయతతో, విశ్వాసముతో సేవ చేయవలెనని తీర్మానించుకొనిరి.

ఈ వార్తయు వేగుల ద్వారా చాళుక్య ప్రభువులకు చేరిపోయెను.

త్రిపురాంతక ప్రాంతము నుండి కట్టెం వీరనబోయడు మొదలగు వారు వలస వచ్చిన తరువాత ఆరు నెలలకు అక్కడ నిలిచిపోయిన బోయపాళెముల నుండి కొంత మంది పెద్ద మనుషులు వీరనబోయని క్రొత్త ఊరికి వచ్చిరి. చుట్టుప్రక్కల ప్రదేశములను చాల దూరము తిరిగి పరిశీలించి చూచిరి.

అ ప్రాంతమంతయు కొన్ని ఆమడల దూరము చిట్టడవులు వ్యాపించియున్నవి. అక్కడక్కడ యానాదుల పల్లెలు, ఎరుకులగూడెములు, దొమ్మరజాతుల గుడిసెలు, మాల దాసరుల నివాసములునున్నవి. వారందరును సంచార జాతులవారు. సంవత్సరమున చాలా కాలము దేశద్రిమ్మరులుగా బ్రతుకుచు వర్షాకాలము నందు మాత్రము తమ స్థావరములకు వచ్చుచుందురు.

ఆ ప్రదేశమునకు ఉత్తరమున అయిదారుక్రోసుల దూరములో గుండ్లకమ్మ నదియు దక్షిణమున ఏడెనిమిది క్రోసుల దూరమున ముస్సి వాగును ప్రవహించుచున్నవి. తూర్పున పదిక్రోసుల దూరమున సముద్రము, పడమర ఒక వైపున కొన్ని క్రోసుల దూరములో వంగవోలును మరియొక వైపున మరి కొంత దూరమున కందుకూరు పట్టణమునున్నవి. వంగవోలు చిన్నపట్టణము. కందుకూరు పెద్దపట్టణము. అది రాజ ప్రతినిధి కాపుర ముండు పట్టణము. బలమైన కోటయున్నది. కోట లోపలను, బయటను పట్టణము విస్తరించియున్నది. పెద్ద సంఖ్యలో సైనికులును ఉన్నారు.

అంతయు తిరిగి వచ్చిన తరువాత బోయపెద్దలందరును వీరనబోయని నగరులో సమావేశమైరి.

"అన్నా–ఇక్కడ మీకు ఎట్లున్నది. ఏమిచేయుచున్నారు.. జీవనము ఎట్లు జరుగుచున్నది?" అన్నాడు క్రొత్తగా వచ్చిన మనిషి.

"బాగానే ఉన్నాము. మేము ఇక్కడికి వచ్చుటకు పూర్వమే మావారు కొందరు వచ్చి ఇరవైపుట్లనేలను అరువు చేసియుండిరి. ధాన్యములు పండించి పాతరలలో పోసియుండిరి. మేము వచ్చిన తరువాత ఇంకను కొంత భూమి అరువు చేయుచున్నాము. పంటలు పెట్టినాము. పొలముల దగ్గర బావులు త్రవ్వించినాము. కూరగాయలు, చెఱకు, వరి పండించుటకు ప్రయత్నములు చేయుచున్నాము". అన్నాడు వీరనబోయడు.

ఎగువ వీధికి చెందిన యువకుడొకడు చాలా ఉత్సాహముతో చెప్పసాగెను.

"పెద్దన్నా! ఇక్కడ అడవి పందులకు లెక్కేలేదు.అడవిలోనికి అర క్రోసెడు దూరము పోయినచాలును. కనీసము రెండుమూడు పందులను కొట్టుకొని రావచ్చును. ఇక కుందేళ్ళు, ఉడుములు చెప్పనవసరములేదు. చేతితో పట్టుకోవచ్చును."

దిగువవీధి కుఱ్ఱవాడొకడు అందుకొన్నాడు.

"మనప్రాంతమున ఈతచెట్లు తక్కువ. ఇక్కడ చిన్నచిన్న వాగుల వెంబడి ఈతచెట్లు దండిగా ఉన్నవి. కావలసినంత ఈతకల్లు గీచుకోవచ్చును. వద్దను వారు లేరు."

"అయిన--మమ్ములను కూడ ఇక్కడికి వచ్చి చేరిపొమ్మందురా" అన్నాడు. కొత్తగా వచ్చిన బోయ పెద్దమనిషి.

"అది నేను చెప్పవలెనా-అక్కడి పరిస్థితులను అనుభవించినారు. ఇక్కడి పరిస్థితి చూచుచున్నారు. అక్కడ మనకు ఏముండినది? మన పదునైదు పాళెముల వారును పది క్రోసుల విస్తీర్ణములో పాళెములు కట్టుకొని బ్రతుకుచుంటిమి. మనకు సరిపడ భూమి లేకుండెను. సంపాదన తక్కువ. గట్టి ఆయుధములు లేవు. శత్రువుల పోటెక్కువైపోయెను. దాదాపు వేయికి పైగా ఉండిన మన యువకులు ఈ పండ్రెండు సంవత్సరములలో మున్నూరు నన్నూరు మందికి తగ్గిపోయిరి. ఎవరెవరికో జరిగిన యుద్ధములలో అన్యాయముగా మనవారిని కోల్పోతిమి. ఆబోతులు ఆబోతులు పోట్లాడుకొనగా మధ్య దూడలు నలిగినట్లు మనము నష్టపోతిమి."

వచ్చిన పెద్ద మనుషులు ఒకసారి తమ జీవితములను తలచుకొనిరి.

"అక్కడ అందరికిని కావలసినంత భూమి లేదు. పొలములు తక్కువ కొండలు గుట్టలు ఎక్కువ. పంటలు తక్కువ. గొఱ్ఱెలు మేకలు మేపుటయే ప్రధాన జీవనాధారము. ఈ నడుమ ఆ ప్రాంతము దండుబాటగా మారిపోయినది. ఎప్పుడు ఏ దండు ఆ మార్గమున వచ్చునో తెలియదు. ఒకసారి ఆ దారిలో దండు పయనించినచో తరువాత రెండేండ్లు కరువే."

"అవునన్నా. ఇక అక్కడ బ్రతుకుట కష్టమే", అన్నారు వారు.

"అవును కదా. ఇక అటువంటి బ్రతుకు మనము బ్రతుకకూడదు. మన పదునైదు పాళెముల వారము ఇక్కడ రెండు మూడు క్రోసుల కొక పాళెము చొప్పున కట్టుకోవలె. కావలసిన నేలను సాగులోనికి తెచ్చుకోవలె. బావులు త్రవ్వుకోవలె. అన్ని విధములైన పంటలను పండించుకోవలె. ఆవులను, ఎనుములను, గొఱ్ఱెలను, మేకలను దండిగా మేపుకోవలె. అమ్ముకొని డబ్బు సంపాదింపవలె. మంచి ఇండ్లు కట్టుకోవలె. గుండ్లకమ్మ, ముస్సి నదుల మధ్య మనదే పెత్తనముగా బ్రతుకవలె. అందుకు కందుకూరు ప్రభువుల అనుమతి కూడ పొందినాను. కనుక భయములేదు."

"అయితే ఆలస్యమెందుకు? అందరమును బయలుదేరి వచ్చెదము."

"అట్లు కాదు. ముందుగా ఏ పాళెము వారు ఎక్కడ స్థిరపడుదురో తావు చూచుకొని నిర్ణయించుకోవలె. మేము చేసినట్లు మీరును ముందుగా కొందరు వచ్చి కొంత భూమి అరువుచేసుకొని కొన్ని ఇండ్లు కట్టుకొని పంటలు పెట్టిన తరువాత మీ జనములను పిలుచుకొని రావలె. పంటలు చేతికి వచ్చునప్పటికి ఇక్కడికి చేరుకోవచ్చును. ఇదంతయు ఒక సంవత్సరము లోపల జరిగిపోవలె".

క్రొత్తవారు లేచిరి.

"మనము ఈ కట్టెమువారి పాళెమునకు చుట్టును నాలుగైదు క్రోసుల దూరములో తగిన తావులను ఎన్నుకొందము రండి" అని నాలుగువైపుల వెళ్ళిరి. వాగుల ప్రక్కగా పల్లపు ప్రదేశములు వ్యవసాయమునకు, మిట్టప్రదేశములు నివాసములకు ఉండునట్లు గానూ, ఒక్కొక్క పాళెమునకు మధ్య రెండుమూడు క్రోసుల దూరముండునట్లు గానూ తావులు చూచి స్థిరము చేసుకొనిరి. ఆ ప్రాంతములోని యానాదులనూ, ఎరుకలనూ, ఇతర జాతుల వారిని మంచి మాటలతో వశపరచుకొని వారినే కూలీలుగా నియమించుకొని అడవి కొట్టి పొలములు తీర్చుకొను పని ప్రారంభించిరి.

సంవత్సరము తిరుగు సరికి ఆ ప్రాంతమున మరి ఎనిమిది బోయపల్లెలు ఏర్పడినవి. వీటిలో వీరన బోయడు కట్టించిన ఊరికి కట్టెమువారిపాళెం అను పేరు ఏర్పడిపోయినది. తక్కిన పల్లెలకు ఆయాపల్లెలలోని బోయపెద్ద పేరు మీదనో అక్కడి బోయల ఇంటిపేరు మీదనో పేర్లు వ్యవహారమునకు వచ్చినవి.

వేంగి నగరము కోలాహలముగానున్నది. నగరమంతయు కన్నులపండువుగా అలంకరింపబడినది. బెజవాడ, తెనాలి, గుంటూరు, వినుకొండ, పిష్ఠపురము, దశనపురి, ఎలమంచిలి, ధాన్యకటకము మొదలైన నగరముల నుండి రాజపురుషులు, సామంతులు, వణిక్ర్శేష్ఠులు, కవులు, పండితులు, నాట్యకత్తెలు, విప్రవినోదులు, జానపద కళాకారులు, తండోపతండములుగా విచ్చేసి సత్రములను, దేవాలయములను, చావళ్ళను, పూటకూళ్ళ ఇండ్లను ఆక్రమించుకొనిరి. బ్రాహ్మణాది కులస్థులు కొందరు వేంగిలో తమ సరికులస్థుల ఇండ్లను వెదకి వారితో నెయ్యము కలుపుకుని ఆశ్రయము సంపాదించుకొన్నారు. నగరవీధులు బండ్లతోనూ, ఆశ్వికులతోనూ, కావళ్ళవారితోనూ, పాదచారులుతోనూ కిక్కిరిసి పోయినవి.

కోట లోపల విశాలమైన సభా ప్రాంగణము అరటి స్తంభములతో, మామిడి తోరణములతో, రంగు రంగుల కలువడములతో సుందరముగా అలంకరింపబడినది.

ప్రాంగణము నందలి ప్రధాన వేదిక పది సోపానము లెక్కవలసిన ఎత్తున నిర్మింపబడినది. బెజవాడలో తీర్చినట్లుగానే విశిష్ఠ వ్యక్తులకు పొడవైన అరుగులు రెండు వైపులను నిర్మించి మధ్యభాగమున సామాన్య జనులకు వదలియున్నారు.

రాజుగారు గాని, ప్రధానులు గాని, ప్రధాన వేదిక మీదికి వేదిక వెనుకనున్న మార్గమున ప్రవేశింతురు. తక్కిన వారు ప్రాంగణ ప్రధాన ద్వారము నుండి ప్రవేశింతురు.

అంతఃపురము నందే బ్రాహ్మణుల వేదమంత్ర పఠనముల మధ్య నూట ఎనిమిది తీర్థముల నుండి తెచ్చిన పవిత్రోదకములతో విష్ణువర్ధనుని అభిషేకము జరిగిపోయినది. ఇక జరుగవలసినది సభా భవనమున మకుటధారణము మాత్రమే.

సభా ప్రాంగణము అప్పటికే కిటకిట లాడుచున్నది. వేదిక చుట్టును సాయుధులైన రాజభటులు నిలబడి యున్నారు. ఉన్నట్లుండి శంఖనాదములును, రాజభటుల "సద్దు సద్దు" అను గద్దింపులును వినవచ్చినది. బెత్తముల జళిపింపులు కనబడినవి. సభా భవనము నిశ్శబ్దమైపోయెను.

వేదిక వెనుకనున్న ద్వారముగుండా మొదట వేత్రహస్తులును, తరువాత చాళుక్య మంత్రులును, వారివెనుక క్రొత్తగానియమితులైన ఆంధ్రమంత్రులును, వేదికమీదికివచ్చిరి. క్రొత్త ఆంధ్రమంత్రులలో పూర్వ విష్ణుకుండిన ప్రధానమంత్రి సోమేశ్వరభట్టారకుడు ప్రముఖుడుగా నుండెను.

విష్ణుకుండిన మహారాజు మాధవవర్మ గతింపగానే సోమేశ్వరభట్టారకునికి రాజ్య వ్యవహారములపై ఆసక్తి పూర్తిగా నశించెను. విరక్తితో అతడు స్వగ్రామమైన ఒక పల్లెటూరు చేరుకొని నెమ్మదిగా జీవితమును వెళ్ళబుచ్చుచుండెను. సత్యాశ్రయుడు రెండవసారి దండెత్తి వచ్చి విజయమును సాధించిన తరువాత సోమేశ్వరభట్టారకుని వెదకించి, పిలిపించుకొని, అతనిని ఒప్పించి మంత్రిపదవిలో నిలిపెను. అంగరక్షకులు ఇరుగడలరాగా సత్యాశ్రయ మహారాజును, యువరాజు విష్ణువర్ధనుడును వేదికమీదికి మందగమనముతో ప్రవేశించిరి. వేదికపై ఒక భద్రసింహాసనమును, దానికిరువైపుల రెండు ఉన్నతాసనములునున్నవి. సత్యాశ్రయ మహారాజులుగారును, విష్ణువర్ధనులవారును భద్రసింహాసమునువదలి ఇరువైపుల నున్న ఉన్నతాసనములపై కూర్చుండిరి. వారి వెనుక పానీయవాహికయు, కరండవాహికయు, వింజామరలవారును నిలబడిరి. వారి వెనుక కోశాధికారి రెండు భోషాణములను భటులచేత పట్టించుకొని వచ్చి నిలబడెను. అతని సమీపమున ఇద్దరు అందగత్తెలైన వారాంగనలు నిలబడిరి.

సభ సద్దుమణగిన తరువాత సత్యాశ్రయుడు చక్కని తెలుగులో మాట్లాడసాగెను.

"మేము వేంగిరాజ్యమున అడుగుపెట్టి సంవత్సరమైనది.వేంగిరాజ్యమున చెలరేగిన అలజడులను అణచుటకును, శాంతిభద్రతలు నెలకొల్పుటకును, ప్రతీపశక్తులను తొలగించు టకును ఇంతకాలముపట్టినది. ఇప్పుడు వేంగి రాజ్యము నిరుపద్రవముగా నెమ్మదిగానున్నది.

"ఇది తెలుగుసీమ. ఇక్కడ ప్రజలు తెలుగువారు. ఇప్పుడు ఈ సీమను పాలించు వారును తెలుగువారే. ఇంతకు మునుపే మేము సెలవిచ్చినట్లు మేము తెలుగువారమే. మనము అందరమును తెలుగు సోదరులము. పాలకులు పాలితులు తాదాత్మ్యము పొందెవలెను.మేము చిరకాలము వేంగి రాజ్యమున నిలిచి పాలించలేము. అక్కడ మాకొక సామ్రాజ్యమున్నది. మేమక్కడ ఉండి ఇక్కడి వారిని పాలించుట కుదరదు. పాలకులకు పాలితులకు ఎడము ఉండరాదు. అట్లు ఎడముండిన యెడల ప్రజలకు, ప్రభువులకు మధ్య మమతానురాగములు సన్నగిల్లును. కావున మేమొక నిర్ణయమునకు వచ్చి దానిని బెజవాడలోనే ప్రకటించితిమి.

"వేంగి రాజ్యమునకు మా సోదరుడు రణరంగ పరశురాముడు, రాజనీతి విశారదుడు, కోదండపార్థపరాక్రముడు అయిన శ్రీ విష్ణువర్ధనులవారిని సమస్త సార్వభౌమాధి కారములతో, స్వయంనిర్ణయాధికారములతో మహారాజుగా పట్టాభిషేకము చేయుచున్నాము. పూర్వమువలెనే ఇక మీదటను వేంగి రాజ్యము స్వతంత్రరాజ్యము –అనగా ఇది బాదామిచాళుక్య రాజ్యమునకు సామంతరాజ్యముకాదు. ఇది వేంగి చాళుక్యరాజ్యము. "వేంగి రాజ్యమునకు సొంతముగా

పటిష్ఠమైన, సర్వసంపన్నమైన సైన్యము ఏర్పడు వరకు మా సైన్యము కొంత ఇక్కడనే యుండును. మీ విష్ణువర్ధన మహారాజులకు సర్వలోకాశ్రయ బిరుదము ప్రసాదించు చున్నాము."

సత్యాశ్రయ మహారాజు మాట్లాడి ఆసనముపై వెనుకకు చేరగిలబడి కూర్చుండగానే మంత్రి కనుసన్నలతో నలుగురు బ్రాహ్మణులు వేదిక మీదకి వచ్చిరి. భద్రసింహాసనమును వేద మంత్రములతో శుద్ధిచేసి పూజించిరి. ఇరువురు బ్రాహ్మణులు బంగారు పళ్ళెరములో కిరీటమునుంచి పట్టుకొనగా బ్రాహ్మణులు ఆ కిరీటమును కూడా పూజించిరి. ఆ కిరీటము బంగారుపోగులతో కలిపినేసిన చీనాంబరముతో చుట్టబడి బంగారు తీగలతో కూర్చబడిన శిరోవేష్టనము. కిరీటము ముందుభాగమున రత్నములు ముత్యములు పొదిగిన తురాయి ప్రకాశించుచుండినది.

తరువాత విష్ణువర్ధనుని భద్ర సింహాసనముపై కూర్చుండబెట్టి బంగారు కలశములలో తెచ్చిన పావన గోదావరీ జలమును అతనిపై సంప్రోక్షించి, గంధ పుష్పాక్షతలు ధరింప జేసి, బ్రాహ్మణులు వేదమంత్రములను పఠించుచుండగా, సత్యాశ్రయ మహారాజు స్వహస్తము లతో విష్ణువర్ధనుని శిరస్సున కిరీటధారణ గావించెను.

సభలోని జనులందరును లేచి సభాభవనము మారుమ్రోగునట్లు జయజయ ధ్వానములు గావించిరి.

సత్యాశ్రయుడు తన పూర్వాసనమున కూర్చుండగానే సభాజనులును కూర్చుండిరి.

కోశాధికారి బంగారు పళ్ళెరములో ఆకులు, వక్కలు, పుష్పము, పూర్ణఫలము, వస్త్ర యుగ్మము, కొన్ని బంగారునాణెములు పెట్టి వారకాంతలకందింపగా, వారు ఆ బంగారు పళ్ళెరమును పట్టుకొని సత్యాశ్రయమహారాజు ఎదుట ఒక ప్రక్కకు ఒదిగి నిలబడగా మహారాజు పట్టాభిషేకమును నిర్వహించిన బ్రాహ్మణ పండితులకు వరుసగా ఆ దక్షిణ తాంబూలములను ఇచ్చి సత్కరించెను.

విష్ణువర్ధనుడు సింహాసనము నుండి లేచి నిలబడెను.

విష్ణువర్ధనుడు పొడగరి కాడు. సత్యాశ్రయుని కంటే బెత్తెడు తక్కువ ఉండును. వీపు కొంచెము వంగినట్లుండును. కావున అతనిని పరోక్షమున కుబ్జ విష్ణువర్ధనుడు అనుచుందురు. ముఖమున తెలివియు, తేజస్సును, దృఢసంకల్ప దీక్షయు కొట్టవచ్చినట్లు గోచరించును. అన్నకంటెను దృఢకాయుడు. అనేక శస్త్రవిద్యానిపుణుడు. సూక్ష్మగ్రాహి.

విష్ణువర్ధనుడు మాట్లాడసాగెను.

"నా ఆత్మీయప్రజలారా, రాజోద్యోగులారా, బ్రాహ్మణోత్తములారా– వణిక్శ్రేష్ఠులారా– వేంగిరాజ్యమున ఇకమీదట ప్రభువువేరు, ప్రజలువేరు అనుభేదభావముండరాదు. ప్రజలే ప్రభువు– ప్రభువేప్రజలు. రాజొక్కడే రాజ్యమేలడు. రాజ్యమునకు రాజు, మంత్రి, మిత్రులు, కోశాగారము, రాష్ట్రప్రజలు, దుర్గములు, సైన్యము అను ఏడు అంగములుండును. ఈ తెలుగు వేంగి రాజ్యమునకు ఈ ఏడు అంగములును పటిష్ఠముగానున్నవి. కనుక వేంగి రాజ్యము సుస్థిరముగా, సుభిక్షముగా నుండగలదు.

మా పితృతుల్యుడైన అన్నగారు నాకు సంక్రమింపజేసిన ఈ వేంగి రాజ్యమును ధర్మ బద్ధముగా, భగవత్ప్రీతిగా, ఆత్మయేసాక్షిగా పరిపాలింతుననియు, రాజ్యమును సుభిక్షముగా నుంచుటకు అవసరమైన సమస్త చర్యలు గైకొందుననియు, మా అన్నగారి పాదములంటి ప్రమాణము చేయుచున్నాను". అని విష్ణువర్ధనుడు అన్నఎదుట మోకరిల్లి నమస్కారము చేసెను. అన్న తమ్ముని భుజములు పట్టి లేవనెత్తి కౌగిలించుకొనెను.

శ్రీశ్రీ. సత్యాశ్రయ సార్వభౌములకు జయజయ అనియు

శ్రీశ్రీ విష్ణువర్ధన సార్వభౌములకు జయ, జయ అనియు జయవాక్యములు మిన్ను ముట్టెను.

కొంతసేపటికి సభ సద్దుమణగెను. అంతలోపల బ్రాహ్మణసమాజములో పండితులు గుసగుస మాట్లాడుకొనిరి. సద్దుమణగిన వెంటనే ఇరువురు పండితులు వేదిక మీదికెక్కి ఒక ప్రక్కగా ప్రజలకభిముఖులై నిలిచిరి. ఒక పండితుడు కాశ్మీరశాలువను సవరించు కొనుచు గొంతుసవరించుకొని జయవాదమును ఈ విధముగా పలికెను.

శ్రీమత్సార చళుక్యవంశకలశాకూపార చంద్రోదయః
కన్యాకుబ్జ మహీశపర్వతపవిః, బాదామిభూపాలకః
వేంగీరాజ్యరమావశీకరణ విద్యాప్రోల్లసద్విక్రమః
విద్వద్విప్రజనాశ్రయో విజయతే చాళుక్య సత్యాశ్రయః

వెంటనే రెండవ పండితుడిట్లు పలికెను.

సంవర్ధతాం వేంగి ధరానురంజనః
ప్రత్యర్థి రాజన్యక గర్వభంజనః
చాళుక్య రాజాన్వయ కీర్తివర్ధనః
శ్రీసర్వలోకాశ్రయ విష్ణువర్ధనః

మరల మొదటి పండితుడందుకొనెను.

"స్వస్త్యస్తు తే భువన---"

అని ఆపండితుడు ప్రారంభింపగానే సత్యాశ్రయ మహారాజు "ఇక ఆపండి" అన్నట్లు చేయెత్తివారించెను.

పండితులు నిశ్చేష్టులైరి. ఆ పండితుల కొఱకు బంగారు పళ్ళెరములో సన్మాన సంభా రములు అమర్చుచున్న కోశాధికారి అట్లే నిలిచిపోయెను. బ్రాహ్మణసమాజములోని పండితులు ఒకరి మొగమొకరు చూచుకొనసాగిరి. శ్లోకములు చదివిన పండితులు తమ శ్లోకములలో ఏవైనను దోషములున్నవేమో అని భయపడసాగిరి.

ఆ ఇరువురిలో వృద్ధ పండితుడు ధైర్యముచేసి ఒకింతవంగి ఇట్లనెను.

"ప్రభువులవారెందుకో అప్రసన్నులుగానున్నారు. మా శ్లోకములు-మా శ్లోకములలో ఏవైనా--"

సత్యాశ్రయుడు రవంత తడబడి "లేదు లేదు. మీ శ్లోకములు మాకు చాల సంతోషము

కలిగించినవి. కాని మీ శ్లోకములు వినగానే నామనస్సు మరియొక విషయముపైకి పోయినది. ఆ విషయము నన్ను బాధించినది.” అనెను.

ఎవరును మాట్లాడలేదు.

సత్యాశ్రయుడు బ్రాహ్మణ సమాజమువైపు తిరిగి ఇట్లనెను.

“మనము తెలుగువారము. ఇది తెలుగుసీమ. ఈసభలోనున్న ప్రజలందరును, కవి పండితులతో సహా అందరును తెలుగువారే–మరి మనము తెలుగుభాషను వదలి సంస్కృతములో జయవాదములేల చెప్పవలె? ఏమి? తెలుగులో చెప్పరాదా? చెప్పలేమా? ఇక్కడ సంస్కృతభాష తెలిసిన వారు ఎందరున్నారు? సంస్కృతభాష తెలియని ఈ అశేష జనులకు మీ జయవాదములు ఏమర్థమగును? మీరిప్పుడు చెప్పిన నాలుగుమాటలు తీయవైన తెలుగు మాటలలో తేటగా చెప్పియుండిన ఈ ప్రజలెంత సంతోషించి యుందురు? నా అప్రసన్నతకు ఇదియే కారణము.”

పండితులకు ఏమి చెప్పుటకును తోచలేదు. ప్రభువుల కోరిక వింతగా ఉన్నది. ప్రభువులు తెలిసి మాట్లాడుచున్నారో తెలియక మాట్లాడుచున్నారో తెలియకున్నది. కాకున్న–తెలుగులో జయవాదములు పలుకుట ఏమి? వింతగానున్నది.

వృద్ధ పండితుడు సాహసించి పలికెను.

“ప్రభువులు మన్నించవలె. తెలుగులో జయవాదములు పలుకుట ఎట్లు? సామాన్య జనుల తెలుగు మాటలతో జయ వాక్యములు పలికిన ఇంత గంభీరముగా నుండునా? సభారంజకముగానుండునా? సభా గౌరవము నిలుచునా?”

“సామాన్యజనుల తెలుగు మాటలతో ఏల? పండితులు మాటలాడు తెలుగు మాటలతోనే పద్యములు వ్రాసి చదువవచ్చు కదా.”

“తెలుగులో పద్యమా? తెలుగులో పద్యమెక్కడున్నది? తెలుగులో జానపదులు, పామరులు పాడుకొను పదములు తప్ప పద్యములు లేవే.”

“పండితులు కవులు అయిన మీరు ఇట్లు పలుకుట భావ్యము కాదు. తెలుగుసీమలో చదువుసంధ్యలు లేని పామరజనులు ఇదివరకే తమభావములను తమవైన తెలుగు మాటలతో లయబద్ధముగా పదములు రచించుకొని పాడుకొనుచున్నారు. వాటిలో మేలిల్లిన ఏడునూర్ల గాధలను ఎన్నుకొని హాలచక్రవర్తి ప్రాకృతములోనికి అనువదించినాడు –మరి పండితులైన మీరు మరింత సంస్కారవంతములైన మాటలతో లయబద్ధములైన పద్యములలో చెప్పు కొనలేరా? “తెలుగులో పద్యములు లేవు” అనుట తెలుగు వారికి చిన్నతనముకాదా? ఇదివరకు లేనియెడల ఇప్పుడు సృష్టించుకొనవచ్చును కదా. పామరులైన జానపదులు చేసికోగలిగిన పనిని పండితులైన మీరు మరింత పరిణతితో సృష్టించుకొనలేరా?”

“చిత్తము చిత్తము. దేవరవారు చెప్పినది నిజమే. కాని తెలుగులో ఛందశ్శాస్త్రము లేదు. ఛందశ్శాస్త్రము లేనిది పద్యములెట్లు పుట్టును?”

"ఎట్లుపుట్టునో, ఎట్లు పుట్టింపవచ్చునో ఆలోచించవలసినది మీరు. ప్రయత్నించ వలసినది మీరు. ఏమి? సంస్కృత ఛందస్సు ఆకాశము నుండి ఊడిపడినదా? అదియుఎవరో ఒకరు సృష్టించినదే కదా. వారు సంస్కృతమునకు చేసికొన్నపని మనము మన తెలుగునకు చేసికొనలేమా? వ్యవహారము నుండి శాస్త్రము పుట్టునుకాని శాస్త్రము నుండి వ్యవహారము పుట్టదను విషయము మీకు తెలియనిది కాదు. ఇంత దూరము ఏల చెప్పుచున్నాననగా మీ–మన పొరుగున ఉన్న కన్నడభాషవారు పద్యరచనకు ప్రయత్నములు మొదలుపెట్టినారు. నేడో రేపో కన్నడ భాషలో పద్యకావ్యము వెలువడ వచ్చును. మన తెలుగుభాష వెనుకబడి యుండుట మనకు అవమానకరము కాదా? ఆలోచింపుడు. కవి పండితులు సమావేశమై తెలుగులో పద్యరచనకు శ్రీకారము చుట్టవలె." అని సత్యాశ్రయుడు తనకు అల్లంత దూరమున కూర్చుండియుండిన పూర్వవిష్ణుకుండిన మంత్రి సోమేశ్వరభట్టారకుని చూచి ఇట్లన్నాడు.

"మీకు రెండు నెలల వ్యవధి ఇచ్చుచున్నాను. తెలుగునేల నాలుగు చెఱగుల నుండి సాధ్యమైనంతమంది కవిపండితులను పిలిపింపుడు. ఒక పెద్దసత్రములో వారికి సమస్త సదుపాయములు ఏర్పాటు చేయింపుడు. ఈ వయోవృద్ధులైన పండితులవారే ఆ సదస్సుకు అధ్యక్షుడుగా ఉండవలె. తెలుగు సీమలో జానపద గీతములలో ప్రసిద్ధి పొందిన జానపదులను కూడా పిలిపింపుడు. జానపదులనోళ్ళలో పాటలుగా నిండుగా సాగుచున్న తెలుగుభాష సాహిత్య రూపమును పొందుటకు ఏమేమి చేయవలెనో అందరును చర్చించి కార్యాచరణకు పూనుకొందురుగాక–ఇందులకు కావలసిన వ్యయము కోశాగారము నుండి గ్రహించుటకు మీకు సంపూర్ణాధికారము లిచ్చుచున్నాము. రెండు నెలలే వ్యవధి."

ప్రభువులు కొలువుచాలించి వెడలిపోయిరి. వారితోబాటు ప్రధానులును, రాజకీయోద్యో గులును, సామాన్య ప్రజలును, రాజభటులును వెడలిపోయిరి. సోమేశ్వర భట్టారకులును, అతని అనుచరులైన కొందరు ఉద్యోగులును, కవి పండితులును నిలిచిరి.

"కవి పండితులను ఎక్కడి నుండి పట్టుకొని రాగలము?"

"రెండు నెలల వ్యవధి కలదు. ఇరువది దినముల ప్రయాణములో ఎంతదూరము వార్తాహరులు పోగలరో అంతదూరములో నున్న కవిపండితులను పిలిపింతము."

హేలాపురము, పిష్ఠపురము, దక్షారామము, వేములవాడ, గుంటూరు, బెజవాడ, తెనాలి, దశనపురి, వినుకొండ–––"

"చాలుచాలు. ఇంతమాత్రము చాలును. మరియు దూరమైనచో వారు రాలేరు. ఆయాపట్టణములలో మహారాజుగారి ఆజ్ఞను చాటింపు వేయింతము."

"చాటింపు వేయించుట మరియాద కాదు. ఆయా పట్టణములలోని కవి పండితులను గురించి పెద్దలను అడిగి తెలుసుకొని ఆహ్వానించవలె."

"ఈ పని సాధారణ వార్తాహరులు చేయలేరు. మరికొంత శక్తియుక్తులు గల యువకులను పంపవలె."

"ఇంతచేసినను, వచ్చువారు సంస్కృత కవి పండితులే కదా"

"అవును. వారి నుండియే తెలుగుకవిత్వమును పుట్టింపవలెను. అదియేకదా ప్రభువుల ఆజ్ఞ!"

ఆజ్ఞా పత్రికలు వ్రాయించుటయు, తగువారిని నియమించి నలువైపుల పంపుటయు రెండుమూడు దినములలో జరిగిపోయెను.

కందుకూరు నందు ప్రతి సోమవారము పెద్ద సంత జరుగును. కోటబయట రాజ మార్గమునకు దక్షిణముగా ఒక విశాలమైన వనములో సంత చేరును. ఆ ప్రదేశ మంతయు కడిమి, చింత, వేపచెట్లు విస్తరించి చక్కనినీడ నిచ్చుచున్నవి. సంతకు రెండు వైపుల రెండు చేదబావులు వాటికి రెండేసి గిలకలు, చేత్రాళ్ళు, బొక్కెనలు ఉన్నవి. ప్రక్కనే పశువుల కొఱకు నీటి తొట్టెలు కూడ ఉన్నవి.

అది చాలపెద్ద సంత. కొందరు వర్తకులు ఆ సంతలో తమ అంగడుల కొఱకు శాశ్వతముగా బండలతో దద్దళములు కట్టిపెట్టుకొనియున్నారు. కొందరు నాలుగుమూలల యందు రాతికూసములు నాటుకొనియున్నారు. సంతనాడు వారు ఆ రాతి కూసములకు జనుపనార సంచులు కప్పుగా కట్టుకొందురు. తక్కిన వారందరును తమ తమ సరుకులతో వీధులు తీర్చి కూర్చుందురు. ఈ వరుసలలోనే కోళ్ళు, అడవిపక్షులు, కుందేళ్ళు మొదలగు వానిని పెట్టుకొని అమ్ముదురు.

ఆ సంతకు రాని సరుకు లేదు. వెండి బంగారు తప్ప తక్కిన వస్తువులన్నియు ఇచ్చట లభ్యమగును. చుట్టును ఒక ఆమడ దూరము నుండి ప్రజలు వచ్చి తాముతెచ్చిన సరుకును అమ్మి తమకు కావలసిన సరుకులు కొనుచుందురు. సంతలలో వస్తువులిచ్చి వస్తువులు కొను వస్తు వినిమయ పద్ధతికి అవకాశములేదు. అంతయు రొక్కముతో వ్యవహారము.

కొందరు తమ సరుకులను బండ్లతో తోలుకొని వత్తురు. కొందరు ఎడ్లమీదను, గాడిదల మీదను, కొందరు కావళ్ళలోనూ, గంపలలోనూ మోసుకొని వత్తురు. రాజ భటులు అన్నిటికిని అన్నివిధములైన సుంకములు విధించుచుందురు. రాజభటులు పశువులకు మేత, నీరు ఏర్పాటుచేయుదురు. మనుష్యులకు భోజనముమాత్రము ఎవరికి వారు తెచ్చుకోవలసినదే. లేదా భోజనశాలలలో పైకమిచ్చి తినవలసినదే– బ్రాహ్మణులు నిర్వహించు శాకాహార భోజనశాలలు సంతకు తూర్పున ఉన్నది. బ్రాహ్మణేతరులు నిర్వహించు మాంసాహార భోజనశాలలు సంతకు పడమర దూరముగా ఉన్నవి.

ఈ సంతకు కొంత ఎడముగా పశువుల సంతయు ఉన్నది. ఆవులు, ఎడ్లు, గుఱ్ఱములు, గొఱ్ఱెలు, మేకలు మొదలైనవాని క్రయవిక్రయములు ఇక్కడ జరుగును. ఇక్కడ తరుగు బేరగాళ్ళ సందడి ఎక్కువ. ఎట్టి అవకరము కలిగిన జంతువునైనను మాయమాటలు చెప్పి అమ్మిపెట్టుటలో వీరు దిట్టలు.

ఎడ్లను కొనవచ్చిన ఒక రైతు కొంతదూరమున పోవుచుండిన మరియొక మనిషిని

చూచి "రంగోజు, రంగోజు, నిలు, నిలు" అని కేక వేసి అతనివైపు పరుగెత్తబోయెను. రంగోజు తిరిగి చూచి," ధర్మన్నా, నీవా, నిదానముగా రమ్ము. నేను నిలిచినాను కదా. తొందరెందుకూ? "అని పలికి ధర్మన్నవైపే రెండడుగులు వేసెను. ఇరువురును కలిసికొనిరి.

"నీ కొఱకు మూడుసంతలుగా వెదకుచున్నాను. నీదర్శనమే కరువైనది" అని ధర్మన్న రంగోజు భుజములపై చేయివేసి ఆప్యాయముగా పలుకరించెను.

"ఏమి? ఏమి నాతో అంత అవసరమైన పని?"

"కక్కుల కొడవండ్లు కొన్ని కావలసి వచ్చి నీకోసము వెదకుచున్నాను. వరి పంట, సజ్జ పంట కోతకు వచ్చినవి. కోయుటకు ఇంటిలో కక్కు కొడవండ్లు లేవు."

"అదేమి మాట. మీ యింటిలో కొడవండ్లు కరువా?"

"కరువే వచ్చినది. మా అన్నదమ్ములము నలువురము వేరుపోయినప్పుడు కొడవండ్లు కూడ పంచుకొన్నాము. నాభాగమునకు అయిదు వచ్చినవి. వాటిలో రెండు విరిగిపోయినవి. తక్కిన వాటికి కక్కు మొద్దుబారిపోయినది. మొద్దుబారిన వాటిని ఆకురాయితో రాయించు కోవలె. ఒక పది కొడవండ్లైనను క్రొత్తవి కొనవలె."

"సరే. రాబోవు సంతకు క్రొత్త కొడవండ్లు పట్టించుకొని వచ్చెదను."

"సంత వరకు ఆగుటకు వీలులేదు. రేపు ఉదయము మీ యింటికి వచ్చెదను. రేపు ఉదయము కొలిమి పెట్టి కొడవండ్లు పట్టిఇయ్యవలె–"

"నేను ఇప్పుడు కందుకూరులో లేను కదా."

"మరెక్కడున్నావు?"

"బోయకొట్టముల వద్ద కొలిమి పెట్టుకొని పనిచేసికొనుచున్నాను. ఇక్కడి నుండి ఇనుము, ఉక్కు తీసికొనిపోయి అక్కడ బోయదొరలకు కావలసిన పనిముట్లను చేసి ఇచ్చుచున్నాను"

"బోయకొట్టముల వద్దనా–బోయలు దౌర్జన్యపు మనుషులనీ, వారికి కోపమెక్కువ అనీ విన్నానే. ఎట్లు నెగ్గుకొని వచ్చుచున్నావు?"

"వట్టిమాటలు. వారు మనము అనుకొన్నంత దౌర్జన్యపరులుకారు. కాని వారి గౌరవ మునకు భంగము కలిగిన యెడల మండిపడుదురు. వారితో మర్యాదగా వ్యవహరించిన యెడల వారంతటిఉదారులు మరిలేరు. ముక్కుకు సూటిగా మాట్లాడుదురు. అట్లే వ్యవహరింతురు. కపటము, వంచన వారికి తెలియదు."

"ఏమో–నీవెట్లో ధైర్యము చేసినావు."

"నేనొక్కడనే కాదు. వంగవోలు, అమ్మనబ్రోలు, టంగుటూరు, చీమకుఱ్ఱుల నుండియు చాలామంది బోయకొట్టములకుపోయి అక్కడనే స్థిరపడుచున్నారు. చాకళ్లు మంగళ్ళు, గీతపనివారు, నేతపనివారు, కుమ్మరులు, వడ్రంగులు కుట్రపువాండ్రు. అనేక కుటుంబముల వారు ఈ బోయకొట్టముల చుట్టును, ప్రధానముగా కట్టెంవారి కొట్టము వద్ద చేరి వారి వారి వృత్తులు చేసికొని బ్రతుకుచున్నారు."

"అదేమి? ఈ వృత్తులవారు ఇదివరకు ఆ కొట్టములవద్ద లేరా?"

"బోయలు తమ పూర్వస్థలము నుండి ఇక్కడికి వలస వచ్చినప్పుడు, ఈ పనిపాటుల వారు కొద్దిమంది మాత్రమే వారితో వచ్చినారట. బోయవారి అవసరములకు వారు చాలలేదు. ఇప్పుడు బోయకొట్టములు పండ్రెండు ఏర్పడినవి. గుండ్లకమ్మ, ముస్సి నదుల మధ్య నుండి సముద్రతీరము వరకు బోయకొట్టములు విస్తరించినవి. చుట్టుప్రక్కల ప్రాంతములనుండి అనేక కుటుంబములవారు బోయల దాపునచేరి కొంతభూమిని అరువు చేసికొని, ఇండ్లు కట్టుకొని బ్రతుకుచున్నారు. బచ్చులు కూడా కొందరు ఆ కొట్టములలో చేరి అంగళ్ళు పెట్టుకొని జీవించుచున్నారు. మన పనితనము, నిజాయితీ వారిని బాగుగా ఆకట్టుకొన్నవి. అక్కడ స్థిరపడదలచిన పనివారికి అన్ని సౌకర్యములు కలిగించుచున్నారు. పైగా ఇక్కడివలె అక్కడ వృత్తి సుంకములు పెద్దగా లేవు. నామమాత్రమే. అంతే కాదు వారి ఏలుబడిలో కావలసినంత రక్షణ."

వీరిట్లు మాట్లాడుకొనుచుండగా కట్టెము వీరనబోయడును, అతని వెంట కుంత ధారులైన మరి ఇరువది మంది బోయలును గుఱ్ఱములపై కందుకూరు రాజమార్గమున పోవుచు కనబడిరి.

రంగోజు వారిని తన మిత్రునికి చూపి దారి తొలగి నిలబడెను, సంతకు వచ్చిన వారును వారి వైపుచూచుచు అట్లే నిలబడిపోయిరి. వర్తకులు కొందరు తమ వద్దనున్న సరుకు వైపు చేయిచూపుచు "కొనుటకు రండని" ఆహ్వానించసాగిరి. వీరనబోయడు తిరిగి వచ్చునప్పుడు వచ్చెదమని స్ఫురించునట్లు చేయి ఊపి ముందునకే పోసాగెను.

అట్లు బోయలందరును కందుకూరు కోటలో ప్రవేశించి రాజనగరుకు అభిముఖముగా సాగుచుండిరి.

కందుకూరులోని రాజప్రతినిధి దర్శనార్థమై నలువైపుల నుండి వచ్చు ప్రముఖులను పట్టణవాసులు నిత్యమును చూచుచునే యుందురు. కానీ ఇట్టి అనాగరిక వీరులు గంభీ రముగా గుఱ్ఱముపై పోవు ఠీవియు, వారి ముఖములలో కనబడు నిర్భయత్వమును, ఆత్మ స్థైర్యమును ఇదివరకు ఎప్పుడును ఎవరియందును చూచినదిలేదు. విశేషించి వీరనబోయని రూపమును, ఒక చేతితో అతడు కుంతమును, కళ్ళెమును పట్టుకొని గుఱ్ఱముపై స్వారిచేయు నైపుణ్యమును, మోచేతి వరకు తెగిపోయిన అతని ఎడమచేయియు చూపఱులకు వ్రేగై కనిపించుచుండెను. పురుషుల శరీరములపై గాయములు గానీ, అంగవైకల్యముగాని కనబడినచో అతడు యుద్ధములలో పాల్గొన్న వీరుడని అందరికిని తెలిసిపోవును. కావున వీధులలో బోయలకు ఎదురైన వారందరును వీరనబోయని వైపు కన్నులు పెద్దవి చేసికొని చూచుచు, దాటిపోయిన తరువాత కూడ మరియొకసారి వెనుదిరిగిచూచుచు పోవుచుండిరి.

అల్లంత దూరమున ఒక మండపము అరుగుపై పదిమంది యువకులు కూర్చొని ఇష్టాగోష్ఠి సలుపుచుండిరి. వారు ఈ బోయలను చూచి వారిలో వారు ఏవేవో మాట్లాడు కొని నవ్వుకొని ఒక్కసారిగా లేచి వచ్చి వీరనబోయని ముందు నిలబడిరి. వారిలో ఒక యువకుడు కోరమీసములవాడు, కొంత విలువైన ఉడుపులు ధరించినవాడు, దండలకు

తాయెతులును, మెడలో పులిగోరును ధరించిన వాడు-వీరనబోయని గుఱ్ఱపు కళ్ళెమును పట్టుకొని అధికారస్వరముతో మాట్లాడసాగెను.

"ఏ అడవి నుండి వచ్చుచున్నారు. ఈ పట్టణములో గుఱ్ఱములపై పోవుటకు మీకెంత ధైర్యము? పైగా చేతిలో ఈటెలు కూడానా? ఎవరు మీరు?"

బోయలు ఈటెలు సరిగాపట్టుకొని ఎదిరించుటకు సిద్ధపడిరి. వీరనబోయడు ఎడమ చేయి ఎత్తి వారిని వారించి ఆయువకునితో నెమ్మదిగా మాట్లాడెను.

"అయ్యా మేము బోయ పల్లెలవారము. ప్రభువుల దర్శనమునకు పోవుచున్నాము. ఎక్కడికి పోయినను మా గుఱ్ఱములను ఈటెలను వదలము. ఇంతకును మీరెవరో చెప్పలేదు. ఈపట్టణమున మీ పదవి ఏమి?"

"ఏమీ, పదవిచెప్పనిచో మాటవినవా. మంచిమాటలతో గుఱ్ఱములుదిగి, ఈ ఈటెలు మాకు అప్పగించి నడచి వెళ్ళుడు. తిరిగి పోవునపుడు తీసుకొనుడు."

వారి ప్రక్కగా వెళ్ళుచుండిన ఇరువురు పెద్దమనుషులు నిలబడిచూడసాగిరి.

"రెండవసారి అడుగుచున్నాను. ఈ పట్టణమున మీ పదవి ఏమి?" అన్నాడు వీరన బోయడు గట్టిగా. ప్రక్కన నిలబడిచూచుచున్న పెద్దమనుషులు" ఓరీ బుచ్చినాయుడూ. వారు ప్రభువులవద్దకు పోవుచున్నామని చెప్పుచున్నారుకదా. వారి జోలి నీకెందుకు? మీపని మీరు చూచుకొనరాదా ?" అని మందలింపగా "మీ దారిన మీరుపోవుట మంచిది" అన్నాడు ఆ బుచ్చినాయుడు అనబడు యువకుడు. "సరే, నీ ఖర్మ. చెప్పవలసినది చెప్పితిమి" అని వారు వెడలిపోయిరి.

వీరనబోయనికి పరిస్థితి అర్థమైపోయినది. వీరు పనిపాటులు లేని ఆకతాయి యువకులు. వీరిని ప్రభువుల యొద్దకు పట్టుకొని పోవుటయే మంచిది.

"వీరిని పారిపోనీయకుండా చుట్టు ముట్టి నగరువైపు నడిపింపుడు."

వీరనబోయని ఆజ్ఞ వెలువడుటయే తడవు. పది మంది బోయ అశ్వికులు ఆ యువ కులను చుట్టు ముట్టి ఈటెలను వారి వీపులకు ఆనించి నగరు వైపు నడిపింపసాగిరి. బోయ యువకుల ఈ హఠాత్ చర్యకు ఆకతాయి యువకులు నివ్వెఱపోయిరి. ఇదియేమి? ఈ బోయయువకులకు ఇంత ధైర్యమా? అకతాయి యువకుల ధైర్యము సడలిపోయెను. అయినను ఆ బుచ్చినాయుడు బింకముతో "ఏయ్. మీకెంత ధైర్యము. నన్నెవరను కొన్నారు. ఈ దినము మీకేమో మూడినది. మీకు కొరడా దెబ్బలు వ్రాసిపెట్టినది" అని ప్రేలసాగెను. బోయయువకులు వాని మాటలను కాసునకైనను లెక్కచేయకుండా వారిని ఈటెలతో నెట్టుకొనుచు పోసాగిరి. అది చూచి వీధిలోని జనులును నివ్వెఱపోయిరి. ఇంత వరకు సౌమ్యముగా మర్యాదగా మాట్లాడిన బోయలలో ఇంత పటుత్వము కూడ ఉన్నదా? వీరిలో మంచితనమునకు మంచితనము, దౌర్జన్యమునకు దౌర్జన్యము కలవు.

అంతలో ఆపట్టణ మహాతలవరి నడుమునకు ఒక ఖడ్గము వ్రేలాడుచుండగా చేత కుంతమును ధరించి వారికి ఎదురువచ్చి వీరనబోయని చూచి నమస్కరించుచు-.

"వీరన్నా ఎప్పుడు వచ్చినారు. అందరును క్షేమమేనా-వీరి నెక్కడపట్టినారు. ఎక్కడికి పట్టుకొని పోవుచున్నారు" అని అడిగెను.

"వీరెవరో మాకు తెలియదు. మమ్ములను అడ్డగించి మా గుఱ్ఱములను ఈటెలను అప్పగింపుడని దౌర్జన్యము చేయబూనినారు. ప్రభువుల దగ్గరికి పట్టుకొని పోవుచున్నాము."

మహాతలవరి ఆ యువకులవైపు తేరిపారజూచెను.

"ఓరీ-నీవా. కన్నమనాయని కుమారుడవు కదూ. అటువంటి ఉత్తముని కడుపున నీవెట్లు పుట్టితివిరా. వీరెవరునుకొనుచున్నావు. ప్రభువులకు కావలసినవారు. నీకేమో మూడినది. నీపై ఇదివరకే రెండు మూడు అభియోగములు ప్రభువుల దృష్టికి వెళ్ళినవి.

నీ తండ్రి ముఖము చూచి ప్రభువులవారు నిన్ను మన్నించుచున్నారు. ఈనాడు ఈ విషయము ప్రభువుల దృష్టికి వెళ్ళిన యెడల ఈసారి నిన్ను కొఱతవేయక వదలరు. మీ బోటివారి వలన మన పట్టణమునకు తలవంపులు వచ్చునట్లున్నది."

బుచ్చినాయుడుగానీ, అతని అనుచరులుగానీ ఏమియు మాట్లాడకుండా తలవంచుకొని నిలబడిరి. ఇప్పుడు తమ ఎదుటనున్నది దారినపోవు పెద్దమనిషికాదు. మహాతలవరి. ఇతడు తలచుకొన్నచో ఇప్పుడే ఇక్కడే-నడివీధిలో పదిమందిని భటులచేత కొరడాదెబ్బలు కొట్టించు అధికారము కలవాడు. కావున ఎవడును నోరు మెదపక నిలబడిరి.

"అన్నా, ఏమిచేయమందువు. ఇట్టి ఆకతాయి వెధవల వలన నాకు తలనొప్పిగా నున్నది. వీరికి పెద్దలు గడించిన ధనమున్నది. పెద్దలు గడించిన మంచిపేరున్నది. ఆ ధనమును, పేరును చెడగొట్టుటకు ఇట్టి కొడుకులు పుట్టుచున్నారు. వీని తండ్రి బ్రతికియున్నంతవరకూ వీనిని అందరును క్షమింతురు. వీని తండ్రి పోయిన తరువాత వీనిగతి కుక్కలకెరుక. వీరిని వదిలివేయుము-ప్రభువుల వారి దర్శనమునకు పోవుదము రమ్ము. ఆలస్యమైనచో ప్రభువులవారు లోపలి నగుళులలోనికి వెళ్ళిపోవుదురు. సాయంకాలము వరకు బయట కురారు."

వీరనబోయడు ఆ యువకులను వదలివేయమనెను. వారు తలలు వంచుకొని వెడలి పోయిరి. బోయదొరలు నగరువైపుసాగిరి.

"అన్నా వీరన్నా. ఈ విషయము ప్రభువుల వారికి చెప్పవద్దు-వాని తండ్రి కన్నమ నాయుడు ప్రభువులకొలువులో గణకుడుగా చాలాకాలము పనిచేసి చూపు మందగించుటచే కొలువు చాలించినాడు. చాల మంచి పేరు తెచ్చుకున్నాడు." అన్నాడు మహాతలవరి.

"అన్నన్నా-అంతపని చేయుదునా-నాకును బిడ్డలున్నారు. ఊరికే బెదరింతమని పట్టుకొంటిమి. అంతే" అన్నాడు వీరనబోయడు.

అట్లు పోయి వారు నగరు మొగసాల వద్దనిలిచి తమరాకను కావలి భటులద్వారా లోపలికి చెప్పిపంపిరి. పది నిమిషములలో కావలిభటులు తిరిగివచ్చి వారిని లోనికి తోడుకొనిపోయిరి.

లోపల పల్లవ రాజప్రతినిధి జయవర్మ ఒక ఉన్నతాసనముపైన కూర్చుండి యుండెను. అతని ఎదుట గోడల ప్రక్కల రెండు పొడవైన బల్లలున్నవి.

రాజప్రతినిధి జయవర్మ వీరనబోయని చూడగానే" ఏమి వీరనబోయడూ, బాగున్నావా? మీవారందరును బాగున్నారా" అని పలుకరించి కూర్చుండుమన్నట్లు బల్లవైపు చేయి చూపెను.

వీరనబోయడు "చిత్తము చిత్తము. తమ అనుగ్రహము వల్ల అందరము సుఖముగా ఉన్నాము," అని బదులిచ్చెను. కాని కూర్చొన లేదు. జయవర్మ మరి యొక్కసారి బల్లవైపు చేయిచూపెను. వీరనబోయడు బల్లచివర అంటియు అంటనట్లుకూర్చుండెను.

కట్టెము వీరనబోయడు అడ్డెక్కి దుర్గాధ్యక్షుని వద్ద కనుపరచిన ఆత్మస్థైర్యమును, గాంభీర్యమును కందుకూరు రాజప్రతినిధి ఎదుట కనుబరచలేకపోవుచున్నాడు. అడ్డెక్కి దుర్గాధ్యక్షుడు రుద్రన పేరుమోసిన పరాక్రమవంతుడు. వివిధాయుధ కౌశలము సాధించిన వాడు. అనేక యుద్ధములలో పల్లవచక్రవర్తులకు బాసటగానిలిచి గెలుపు సాధించినవాడు.

కాని అతడు పల్లవ సామ్రాజ్యమున కేవలము ఒక దళపతి మాత్రమే. అసంఖ్యాకులైన దళపతులలో రుద్రన ఒకడు. పల్లవ చక్రవర్తి అతని పరాక్రమమును, ప్రభుభక్తిని మెచ్చి అతనిని తన రాజ్యపు ఉత్తర సరిహద్దులోనున్న అడ్డెక్కి దుర్గమునకు దుర్గాధ్యక్షునిగా నియమించెను.

కందుకూరు రాజప్రతినిధి విషయము అట్టిదికాదు.జయవర్మ స్థాయి వేరు.అతడు పల్లవచక్రవర్తి బంధువు.అతని అధికారము విస్తృతమైనది.పల్లవరాజ్యమున కందుకూరు నుండి ఉత్తర సరిహద్దు వరకు అతని ఆజ్ఞ పల్లవచక్రవర్తుల ఆజ్ఞయే –దానికి తిరుగులేదు.

జయవర్మ పొడగరి, బక్కపలుచని శరీరము. శరీరదార్ఢ్యము విశేషముగా కనబడదు. కాని అసాధారణ ప్రజ్ఞాశాలి. రాజనీతి కుశలుడు. లౌకికము తెలిసినవాడు. వైభవములకు, విలాసములకు అలవాటుపడినవాడు. చక్రవర్తి రక్త సంబంధీకుడనను అహంకారము అతని మాటలలోనూ కదలికలోను తొంగిచూచుచుండును.

వీరనబోయడు మొదట జయవర్మను ఆశ్రయించి అతని అనుమతి తీసికొనియే తనవారినందరిని తరలించుకొని ఆ ప్రాంతమున స్థిరపడినాడు.

పై కారణముల వలన వీరనబోయడు జయవర్మ యెదుట విధేయతతో ప్రవర్తించుచున్నాడు. దానితో అతడు జయవర్మకు మరింత ప్రీతిపాత్రుడైనాడు.

"మీ వారందరును తరలి వచ్చినట్లేనా?"

"చిత్తము. దాదాపు అందరును వచ్చినట్లే. ఇంకను రెండు మూడు పల్లెల జనులు రావలసియున్నది. వారును కొన్ని నెలలలో వత్తురు."

"నేను చెప్పినట్లే, నేను చెప్పిన చోటనే స్థిరపడినారు కదా?"

"చిత్తము, చిత్తము. ముస్సివాగునకును, గుండ్లకమ్మనదికిని నడుమ సముద్రతీరము వరకు గల మధ్యదేశమున మేము ప్రస్తుతమునకు ఎనిమిది పల్లెలు–రెండు మూడు క్రోసుల

ఎడముతో నిర్మించుకొన్నాము. ఇంకను రావలసిన వారికి మరి నాలుగు పల్లెలు సిద్ధమైనవి."

"మంచిది. మీరున్నది పల్లవ రాజ్యపు ఉత్తర సరిహద్దు. చాళుక్యులు అప్పుడప్పుడు మీపై కన్నువేయవచ్చును. మీరు జాగ్రత్తగా ఉండవలె. ప్రతి బోయకొట్టమునకు ఒక చిన్నపాటి కోట గోడ కట్టుకొనుట మంచిది."

"మావి అన్నియు కొట్టములు కావు. కొన్ని మిద్దెలును ఉన్నవి."

జయవర్మ చిన్నగానవ్వెను. "కొట్టము అనగా పూరిల్లు అనికాదు. కాంచీపురము నందలి భాషలో కొట్టము అనగా ఒక చిన్నపరిపాలనా విభాగము. మీ ఒకొక్క బోయ పల్లెయు దాని చుట్టుప్రక్కల గల చిన్నపల్లెలును కలిసి ఒక కొట్టము. అనగా ఒక పరిపాలనా విభాగము. ఆ బోయపల్లెలోని పెద్దదొర దానికి నాయకుడు. ప్రస్తుతము ఎనిమిది బోయపల్లెలు ఉన్నవనుచున్నావు. మరి నాలుగు సిద్ధమైనవనుచున్నావు. అనగా మీవి పం[డెండు బోయకొట్టములన్నమాట. ఈపం[డెండింటికి ప్రధాన స్థానముగా ప్రస్తుతము నీవు ఉన్న కొట్టమును–అనగా మీ పల్లెను– అభివృద్ధి చేసుకొనవలె. దానిని ఒక బలమైన దుర్గముగా నిర్మించుకొనవలె. నీవు నిర్మించుకొను దుర్గమునకు ఒక పేరుండవలెనుకదా. ఏమి పేరు పెట్టదలచుకొన్నావు."

"ఇంకను ఏమియు అనుకొనలేదు. ఈ తలంపు ఇప్పుడే కదా వచ్చినది"

"అవునవును–అయినను పేరు ఇప్పుడే పెట్టుట మంచిది–ఆ!––ఆ!, మీ ఇంటిపేరు ఏమన్నావు?

"కట్టెమువారు"

"సరి, సరిపోయినది–మీ దుర్గమునకు కట్టెందుర్గము అని పేరు. కట్టెపుదుర్గము, కట్టెంకోట అనియు చెప్పుకొనవచ్చును. పం[డెండు కొట్టములకు కట్టెపుదర్గమే కేంద్రము. నీవును, నీవంశమువారును పం[డెండుకొట్టములకు పాలకులుగా ఉండవలె. తక్కిన కొట్ట ములు నీయాజ్ఞలోనుండవలె.

వీరనబోయని ముఖము వికసించెను. "చిత్తము చిత్తము––మీరు చెప్పినట్లే."

"మీరు మీప్రాంతమున రైతుల నుండి మూడింట ఒకభాగము పన్నుగా గ్రహింప వచ్చును. అందులో సగము పల్లవరాజ్యపు బొక్కసమునకు, సగము మీకు. మీ ప్రాంతమున జరుగు వ్యాపారములపైనను తగుమాత్రము సుంకము విధించుకొనవచ్చును. అయినచో ఆ వ్యాపారులకు రక్షణ కలిగించు భారము మీది"

"మరియొక్క ముఖ్య విషయము. మీది సరిహద్దుప్రదేశము. మీ జనులందరును యుద్ధవిద్యలలో ఆరితేరి యుండవలెను. ముఖ్యముగా విలువిద్యలో మీది పైచేయిగా నుండ వలె. మీకు కావలసిన కుంతములు, ఖడ్గములు, బాణముల అలుగులు మొదలైన వాటికి కావలసిన ఇనుము, ఉక్కు నేను సమకూర్చెదను."

"చిత్తము. చిత్తము. బాణములకు కావలసిన ఇనుము లేక ఇబ్బంది పడుచున్నాము. మీమాట మాకు వరప్రసాదమైనది. ఇక మాలో విలుకాండ్రకు కొదువయుండదు."

"సరే. మీరు సెలవు తీసికొనవచ్చును. ఉగ్రాణము ప్రక్కనున్న భోజనశాలలో అందరును భోజనము చేసి వెళ్ళవచ్చును. జాగ్రత్త నాలుగువైపుల కన్నుకలిగి మెలగవలె."

"చిత్తము చిత్తము," అని వీరనబోయడు లేచి నిలబడి నమస్కరించెను.

జయవర్మలోపలికి వెళ్ళగానే బోయదొరలందరును ఉగ్రాణమువైపు వెళ్లి, గుఱ్ఱములకు మేతవేసి, తాము‌ను భోజనములు ముగించుకొని తిరుగు ప్రయాణములో సంతలో కావలసిన సరుకులు కొని గుఱ్ఱముల కిరువైపుల సంచులు వ్రేలాడవైచి తమ తమ పల్లెలవైపు తరలిపోయిరి.

జయవర్మ బోయలయెడ ఇంత ప్రత్యేక ఆదరము చూపుటకు కారణము వేరే ఉన్నది.

"చాళుక్యులు చీటికి మాటికి పల్లవ రాజ్యముపై దండెత్తుచున్నారు. పల్లవుల ఉత్తర సరిహద్దు దుర్గము అణ్డెక్కి. దానిని దాటిన తరువాత చాళుక్య సైన్యము ఎకాఎకిని కందుకూరుపై పడుచున్నది. మధ్యలో బోయకొట్టముల వంటి మరియొక అడ్డంకి ఉండుట మంచిది. బోయలు తమస్థావరమును కాపాడు కొనుటకు ప్రాణము లొడ్డి పోరాడుదురు. వారు మేటిధానుష్కులు. చాటుదెబ్బతీయుటలో నిపుణులు. సత్యాశ్రయుడు మొదటి దండ యాత్ర చేసినపుడు ఈ బోయదొరలు చాటు దెబ్బకొట్టి చాళుక్యసైన్యమునకు పెద్దనష్టము కలిగించిన విషయము అందరెరిగినదే. బోయదుర్గములు పటిష్టమగుట పల్లవులకు లాభ దాయకము. కావున వారికి కావలసిన సహాయముచేసి వారిని కృతజ్ఞతాపాశముతో కట్టివేసుకోవలె."

వీరనబోయడు తనపల్లెకు వచ్చిన తరువాత పల్లవ రాజప్రతినిధి చెప్పినట్లు తన పల్లెచుట్టును విశాలమైన మైదానమును కలుపుకొని మట్టితో ఒకగోడను కట్టించెను. అది కేవలము అపరిచితులు, దోపిడి దొంగలు, దారిదొంగలు పల్లెలో ప్రవేశింప కుండుటకే. గోడ రెండు మూరల మందము, పదునైదడుగుల ఎత్తు ఉండునట్లు మట్టితో గట్టించి కట్టించెను.

ఇప్పుడు దానిపేరు కట్టెంకోట, కట్టెపుదుర్గము.

# 2

# దేశికవిత

వేంగి నగరములో ఒక పెద్దదేవాలయమును, దానికి అనుబంధముగా ఒక పెద్ద సత్రమును ఉన్నవి. కొంత దూరమున ఒక చెఱువు కూడ ఉన్నది. తెలుగు నేల నాలుగు చెఱగుల నుండియు వచ్చిన దాదాపు నలుబదిమంది కవిపండితులు, ఇరువదిమంది జానపద కవులు, గాయకులు, – నలుగురు వ్రాయసగాండ్రు ఆ సత్రమున విడిసియున్నారు. వీరందరూ ఓరుగల్లు, దక్షారామము, వినుకొండ, రాజమహేంద్ర వరము, శ్రీశైలము, పిష్ఠపురము, తెనాలి, గుంటూరు, బెజవాడ, ధాన్యకటకము మొదలైన పట్టణముల నుండి రెండుమూడు దినములుగా వచ్చి చేరుచున్నారు. సోమేశ్వర భట్టారకుడు వీరికందరికిని తగిన సౌకర్యములను కలిగించుటకు ఒక అధికృతుని నియమించి తాను పర్యవేక్షించుచున్నాడు.

కవిపండితుల సేవకై అధికృతుడు పగలు ఇరువురు బ్రాహ్మణవటువులను, ఇరువురు శూద్రపురుషులను, ఇరువురు శూద్రస్త్రీలను నియమించినాడు. రాత్రులయందు ఒక శూద్రపురుషుడును, ఒక బ్రాహ్మణ వటువును వారికి అందుబాటులోనుందురు. ప్రతిదినము ఉదయము ముర్వురు మంగలివారును, ముర్వురు చాకలివారును సత్రమునకుపోయి వారి అవసరములను గమనించవలెను.

అధికృతుడు తొలినాడే వచ్చిన వారికందరికిని తలకొక జత పంచెలును, ఒకజత అంగవస్త్రములును, ఒక జంబుచాపయు, ఒకక్రొత్తదుప్పటియు, ఒక రాగిచెంబును ఇచ్చెను. బ్రాహ్మణేతరులైన జానపద గాయకులు మొదలైనవారికి సత్రములోనే ఒక చివర విడిదిగా ఏర్పాటు చేయించెను. వారికిని పంచెలు, చాపలు, దుప్పట్లు ఇప్పించెను.

అందరును ప్రతిదినమును ఉదయముననే లేచి చెఱువు వద్ద స్నానాదికములు ముగించు కొని, దేవాలయములో అర్చనయు, తీర్థప్రసాద వినియోగమును చూచుకొని సత్రములోని పెద్ద పడసాలలో చేరుదురు.

వచ్చిన వారందరును ఒక దినము విశ్రాంతి తీసికొని ఒకరినొకరు పరిచయము చేసికొనిరి. చర్చలో పాల్గొనుటకు కావలసిన విషయములను వ్రాసుకొన్న పొత్తములను సిద్ధముగావించుకొనిరి.

"శంకరాచార్యులను ఒక మహామహిమోపేతుడైన పరివ్రాజకాచార్యులు శైలమునకు విచ్చేసినప్పుడు వారు శివానందలహరి, సౌందర్యలహరి అనుగ్రంథములు వ్రాసిరట. అద్భుత మైన గ్రంథములు. అవి నా యొద్దనున్నవి. కావలసిన వారు ప్రతులు వ్రాసికొనవచ్చును."

అని శ్రీశైలపండితుడు చెప్పగానే అందరును వాటి కొఱకై ఎగబడిరి. సోమేశ్వరభట్టారకుడు ఆ పనిని వ్రాయసగాండ్ర కప్పగించెను.

"హర్షవర్ధనచక్రవర్తి ఆస్థానకవి బాణుడు వ్రాసిన గద్యకావ్యము నాయొద్దనున్నది. "గద్యం కవీనాం నికషం వదన్తి" అని పెద్దలు ఎందుకు చెప్పిరో ఆ గ్రంథమును చదివిన అర్థమగును. అంత అద్భుతమైన గద్యము, అచ్చెరువు గొలుపు కథా సంవిధానము. కావలసిన వారు వ్రాసికొనవచ్చును." అని ఓరుగల్లు పండితుడు ప్రకటింపగానే–దానికొఱకును అందరును చేతులు చాపిరి. సోమేశ్వరభట్టారకుడు దివాణము నుండి మరి కొందరు లేఖకులను పిలిపించి కట్టలు కట్టలుగా అలేఖ్యములను తెప్పించి ఆపనిని కొనసాగింప జేసెను. పనిలోపనిగా ఎవరెవరి యొద్ద యే యే గ్రంథములున్నవో, అడిగి తెలిసికొని తమ యొద్దలేని వానిని వారి యొద్ద తీసికొని వ్రాసికొనసాగిరి.

మరునాడు రాజనగరులో మహారాజుల సమక్షమున పండితసభ జరుగుననియు, ఉదయము మొదటి జాముననే భోజనాదికములు ముగించుకొని సత్రములో విడిసిన వారందరును నగరుకు చేరుకొనవలసినదనియు సోమేశ్వరభట్టారకుడు ప్రకటించెను.

రాజనగరులో ఒక విశాలమైన మండపమున సభ ఏర్పాటు చేయబడినది. సత్యాశ్రయ సార్వభౌములవారికిని, విష్ణువర్ధన మహారాజుల వారికిని బూరుగదూది పరుపులును, వానిపై బూరుగదూది ఒరుగుదిండ్లును అమర్చబడినవి. వారి ప్రక్కన కొంత ఎడముగా సోమేశ్వర భట్టారకునికి ఒక రత్నకంబళమును, వారికి అభిముఖముగా కవిపండితులు, జానపద గాయకులు కూర్చుండుటకు మెత్తని విశాలమైన కంబళములును, వానిపై తెల్లని దుప్పట్లును పరుపబడినవి.

అధికృతుడు సత్రములోని వారినందరిని తోడుకొని వచ్చి సభామండపమున ఆసీనులను జేసెను. మరికొంతసేపటికి సోమేశ్వరభట్టారకుడు ముందురాగా సత్యాశ్రయ సార్వ భౌములును, విష్ణువర్ధన మహారాజుగారును మండపము ప్రవేశించిరి. వెంటనే సభాసదులు లేచి అభివాదములు చేసి, వారు కూర్చున్న తరువాత తాము కూర్చుండిరి.

వెంటనే ధాన్యకటకపు పండితుడు లేచి ఒక పద్యమును చదివెను.

"చాళుక్యాన్వయదుగ్ధవార్నిధిశశీ! వేంగీపురాధీశ్వరా!
నానారాజ కిరీట రత్నరుచిమత్పాదాబ్జ! సత్యాశ్రయా!
ధర్మాధర్మ వివేక ధర్మతనయా! ధానుష్క భీమానుజా!
వర్ధిల్లన్‌వలె నీవు ఎల్లపుడు మాకున్ ఏలికై భూవరా!"

వెంటనే వినుకొండ పండితుడు లేచి తన పద్యమునిట్లు చదివెను.

"కన్యాకుబ్జ మహీశమౌళినిహితాంఘ్రి ద్వంద్వ! సత్యాశ్రయా!
మాకున్ ఏలిక విష్ణువర్ధన మహారాజుండ, వారండ మా
భాగ్యంబుల్ అధికంబులై కొఱత ఏదీలేక ఎల్లర్ ప్రజల్
మీశ్రేయంబునె ఎప్పుడున్ ఎదలలో కాంక్షింత్రు ఈ వేంగిలోన్"

సభ అంతయు కొంతసేపు నిశ్శబ్దముగా నుండిపోయెను. వారు తెలుగులో పద్యములు వినుట ఇదియే మొదటిసారి. వాటిపై వ్యాఖ్యానించుటకు ఎవ్వరికి ఏమియు తోచలేదు.

సత్యాశ్రయుడే ప్రారంభించెను.

"బ్రాహ్మీస్వరూపులైన కవిపండితులకు నమస్కారము. ఇప్పుడు ఇరువురు పండితులు పద్యములు చదివిరి. మొదటి పద్యము అంతయు సంస్కృతమయము. రెండవ పద్యమున తెలుగు కనబడుచున్నను, ఏవో కొన్ని లోపములు కనబడుచున్నవి. ఆ లోపము లేవో మీరే తేల్చవలె. నేను ఇదివరకే చెప్పియున్నాను. భరతఖండములో తెలుగువారు నివసించు దేశమే తక్కిన వాటికంటె విశాలమైనది. తెలుగు మాట్లాడువారే తక్కిన భాషలవారి కంటే అధిక సంఖ్యాకులు.

నేను మహారాష్ట్ర, ఘూర్జర, మాళవ, మగధ కళింగదేశములను చూచియున్నాను. అనేక మార్గములలో విషయసేకరణ చేసి నేను కనుగొన్న సత్యమిదియే. తెలుగున కొక ప్రత్యేక ఛందశ్శాస్త్రముండవలె. తెలుగు కవులు ప్రత్యేక ఛందోరీతులను సృష్టించుకోవలె. కవిత్వము వ్రాయవలె. వాటిని తెలుగువారు చదువవలె. వారము దినములుకానీ, నెల దినములుకానీ –దీనికొక రూపమును కల్పించి తెలుగు దేశికవిత్వమునకు బాటలు వేసిన తరువాతనే మీరు మా సత్కారసంభావనలు స్వీకరించిపోవలసియుండును. ఆనాడు మాకు జయవాదములు పలికిన వయోవృద్ధులు, పండితులు విష్ణుశర్మగారు ఈ సభకు అధ్యక్షులుగా నుందురు. ఈసభలో ఇప్పుడు వారి మాటయే ప్రమాణము. వారిమాటయే తుదితీర్పు–స్వామీ! మీరిటువచ్చి ఇక్కడ ఆసీనులుకండి." అని సత్యాశ్రయుడు తన ఎదుట కుడివైపున నాలు గడుగుల దూరమున కంబళముపైన కూర్చుండవలసినదిగా చేయిచూపెను.

విష్ణుశర్మ తనసంచిని చంకలో పెట్టుకొని వచ్చి తనకు నిర్దేశించిన చోట కూర్చుండెను.

"నాకు సహాయముగా ఉండవలసినదిగా బెజవాడపండితులు కనకస్వామిని, దక్షా రామము నుండి వచ్చిన రత్నాకరభట్టును కోరుచున్నాను. వారు వచ్చి నా ప్రక్కన ఆసీనులు కావలసినది."అని విష్ణుశర్మ చెప్పగానే వారిరువురు వచ్చి విష్ణుశర్మకు ఇరువైపుల కూర్చుండిరి.

విష్ణుశర్మ మాట్లాడసాగెను.

"నానా దిక్కుల నుండి విచ్చేసిన కవిపండితులకు నమస్కారములు. ఇంత వరకు మనము ఏ సమయముననైనను, ఏ సందర్భముననైనను సంస్కృతభాషలోనే శ్లోకములు వ్రాసి పఠించుచున్నాము.తెలుగువారు అనేకులు సంస్కృతకావ్యములను, వ్యాఖ్యానములను వ్రాసి కీర్తిగడించియున్నారు. సంస్కృత కవిత్వము మనకు నల్లేరుపై బండినడక. కాని సార్వభౌములవారు సెలవిచ్చినట్లు తెలుగుభాషలో కవిత్వప్రక్రియగానీ, సాహిత్యముగానీ లేకుండుట విచారింపవలసిన విషయమే. విష్ణువర్ధన మహారాజులవారి పట్టాభిషేక సమయముననే ప్రభువులవారు ఈ విషయమై హెచ్చరించియున్నారు.

ఇప్పుడు ఈసభలో ఇరువురు పండితులు రెండు తెలుగు పద్యములు చదివినారు. రెండింటిలో ఏదియు తెలుగు ఛందస్సుకు చెందినదికాదు. సంస్కృత ఛందస్సులోని శార్దూల

విక్రీడిత వృత్తములే. మొదటిపద్యములో సంబోధనలనన్నింటిని దీర్ఘాంతములు చేసి "తెలుగు" అనిపించినారు. నాలుగవ పాదములో తెలుగు కనబడుచున్నది. కాని అది యెందుకో వేరు వేరు తునియలుగా కనబడుచున్నది. వాటిని ఏదో ఒక విధముగా అతుకవలసిన అవసరము కనబడుచున్నది. రెండవ పద్యమును అంతే. అందులో తెలుగుతనము కొంచెము ఎక్కువగా కనబడుచున్నది. కాని అదియు విడివిడి ముక్కలే. ధార లోపించినది. ఏదోవిధముగా అతుకవలసియున్నది."

రాజమహేంద్రవరము నుండి వచ్చిన పండితుడు అడ్డుపడెను.

"తెలుగున పదములు ముక్కలు ముక్కలుగా కాక సమాసములుగానుండునా? తెలుగు పదములను సమాసములుగా కూర్చుట సాధ్యమా? దానికేదైనను విధానము ఏర్పడినదా?"

"ఒక విధానమును ఏర్పరచినచో తెలుగులో సమాసములు కూర్చుటయు సాధ్యమే అని మీమాటలలోనే ధ్వనించుచున్నది." అని విష్ణుశర్మ అనగానే విష్ణువర్ధనుడు "బాగుగా సెలవిచ్చినారు." అనెను. ఆమాటలు విని రాజమహేంద్రవర పండితుడు మారు మాట్లాడక ఊరకుండిపోయెను.

విష్ణుశర్మ మరల చెప్పసాగెను. "తెలుగు పదములు ఒకదానితో ఒకటి పొందికగా కలిసి యుండుటకు ఒక సంధి విధానమును సూత్రీకరించవలసియున్నది."

వెంటనే గుంటూరు పండితుడు అందుకొనెను.

"అవునవును. వాక్యములమధ్యకానీ, పదములమధ్యకానీ అచ్చులను యథాతథముగా ఉచ్చరించుటగానీ వ్రాయుటగానీ సంస్కృత ప్రాకృతములలోనున్నది. తెలుగులో అట్లు ఉచ్చరింపము. "మా యన్న, మా యప్ప" అని మనకు తెలియకయే స్పష్టాస్పష్టమైన ఒకలఘురూపమైన యకారము వచ్చి చేరుచున్నది. కొన్నిచోట్ల వాడున్నాడు, వాడెక్కడ అని కలిసిపోవుచున్నది. దీనిని ఒక విధముగా వ్యవస్థీకరింపవలె. వినుకొండ పండితులు చెప్పిన పద్యములో "వారి" "అండ" అను రెండుపదములను "వారండ" అని కలిపినారు. దానిని వ్రాయునప్పుడు "వారండ" అనియు, పలుకునప్పుడు వారెండ అనియు పలుకవలసియున్నది. అది అంత అర్థస్ఫోరకముగాలేదు. ధాన్యకటకపు పండితులు "నీవు ఎల్లపుడు" అని తునియలుగా చెప్పినారు. అదియు శ్రావ్యముగా లేదు."

విష్ణుశర్మ అందుకొనెను–"కావున తెలుగులో సంధి విధానమును సమాస విధానమును రూపొందించవలసియున్నది. ఈ సమావేశ దినములు ముగియులోపల ధాన్యకటక పండితులును. వినుకొండ పండితులును, గుంటూరు పండితులును చర్చించి ఒక రూపకల్పన చేయవలసినదిగా కోరుచున్నాను. ఇక తెలుగుఛందస్సును గురించి చర్చించవలె".

బెజవాడ పండితుడు కనకస్వామి చెప్పసాగెను. "విష్ణుకుండిన ప్రభువులు జనాశ్రయ బిరుదాంకితులు మాధవవర్మ మహారాజుగారి కాలమున మాతాతగారైన గణస్వామి తనరాజు పేర జనాశ్రయఛందోవిచ్ఛిత్తి అను ఛందశ్శాస్త్రమును వ్రాసియుండెను. నా బాల్యమున మా తండ్రిగారు చదువుచుండగా వినియుంటిని. సంస్కృత వృత్తములలో వచ్చుగణములేకాక

ఇంద్రగణములు, సూర్యగణములు అనుపేర్లు వినియుంటిని. వివరములు నాకు సరిగా జ్ఞాపకము లేదు."

"ఆ గ్రంథమేమైనది?" విష్ణుశర్మయు, తక్కిన పండితులును ఆతృతతో అడిగిరి.

"అప్పటిలో తెలుగులో పద్యములు వ్రాయు సంకల్పము ఎవరికిని లేదు కదా. కావున ఎవరును దానిని గురించి పట్టించుకొనలేదు. అది మా తండ్రిగారి కాలముననే ఖిలమై పోయినది."

"దాని ప్రతులెవరియొద్దనైన నున్నవా?"

"ఏమో. మా తాతగారి కాలముననే ఎవరో ఇద్దరు పండితులు మాయింటిలోనే బసచేసి దానిప్రతులను వ్రాసుకొనిపోయిరట. వారు ఎవరో ఎక్కడివారో నాకు తెలియదు. చెప్పితిని కదా? క్రొత్తఛందస్సుపై ఎవరికిని ఆసక్తి లేకపోయినది. మాతాతగారు చేసిన కృషి అంతయు గాలిలో కలిసిపోయినది."

"అందులో మీరు విన్న విషయములేవైనా జ్ఞాపకమున్నవా?"

"ఒక వాక్యము మాత్రము జ్ఞాపకమున్నది. "ప్రాసో వర్ణస్య సారూప్యం. యతిర్వర్ణస్య మిత్రతా." అనగా ప్రాసలో వర్ణసారూప్యమును యతిలో వర్ణమైత్రిని పాటింపవలెనని అర్థము కాబోలు."

"మరి వీరిప్పుడు చదివిన పద్యములలో యతియు, ప్రాసయు లేవు. అవియు ఉండిన బాగుండును కదా!"

"సరి. సరి ఈ యతిప్రాసల విషయము మీరును, మీసమీపస్థులైన ఆ తెనాలి పండితులుగారును వేరుగా చర్చించి ఒక ప్రమాణమును రూపొందించుడు."

విష్ణుశర్మ ఇట్లు చెప్పగానే తెనాలిపండితుడు లేచి ఏదోచెప్పబోయెను.

విష్ణుశర్మ "మీరు కూర్చొనియే మాట్లాడవచ్చును" అనెను.

"లేదు. ఇది అందరును సావధానముగా వినవలసినది. ప్రభువులు కూడా చిత్తగింప వలసినది. నేనును "జనాశ్రయ ఛందోవిచ్ఛిత్తి"ని గురించి మా తండ్రిగారు చెప్పగా వినియు న్నాను. యతియనగా సంస్కృతము నందువలె విరామముకాదనియు, వర్ణమైత్రి యనియు అందులో చెప్పబడినట్లు మా తండ్రిగారు చెప్పియుండిరి. ఆమాటలు జ్ఞప్తియందుంచుకొని నేను తేటతెల్లముగా ఒక గీతమును రచించినాను. ప్రభువులు అనుమతించినచో చదివెదను." అని తెనాలి పండితుడు వినయముతో పలికెను.

సత్యాశ్రయ మహారాజు మందహాసము చేసి "ఈ సమావేశములో ఏ విషయమున కైనను మా అనుమతి అవసరములేదు. మీ అధ్యక్షులున్నారు. ఆపై సోమేశ్వర భట్టారకు లున్నారు."

తెనాలికవి "మహాప్రసాదము"అని పద్యమును చదువ దొడగెను.

ధనదునకు నీసుగొల్పు నిందలి ధనాళి
దర్పకుని దర్పమడచు నిందలి జనాళి

నందన విడంబనంబు లిందలి వనాళి
మా సరస్వతీ వాహ్యాళి మా తెనాలి.

దీనికి ముందుగా స్పందించినది ప్రభువులే-సత్యాశ్రయ మహారాజు "సాధుసాధు. తెలుగు పద్యము ఇట్లుండవలెననియే నేను కోరునది" అనెను.

విష్ణువర్ధనుడు చేతులుచరచి "కవిగారు చెప్పినట్లు ఈ గీతి చాల తేటగా, సొంపుగా ఉన్నది. దీనికి-దీనికి-తేటగీతి అని పేరుపెట్టవచ్చును." అనెను.

గుంటూరు పండితుడు తెనాలి పండితుని వైపు గుఱ్ఱుమనిచూచి "మా సరస్వతి అనుచున్నావు. సరస్వతీదేవి తెనాలి వారికే సొంతమా?" అనెను.

తెనాలిపండితుడు ఫక్కున నవ్వి "ఇదియేనా మీ వ్యాఖ్యాన ప్రజ్ఞ." అనెను.

ఆ మాటతో అక్కడి పండితుల మెదడులలో దానిభావము తళుక్కున మెఱపుమెఱసి నట్లయ్యెను.

"మా సరస్వతీ అనగా లక్ష్మీసరస్వతులని యర్థము." అని నలుగురైదుగురు ఏకకంఠముతో పలికిరి. గుంటూరు పండితుడు తలవంచుకొనెను.

"తెనాలికవిగారిని ప్రశంసింపకుండ ఉండలేకున్నాను. మనమిక్కడ తెలుగు ఛందస్సును గురించి తర్జనభర్జన పడుచుండగా ఆయన చాలాముందుకు వెళ్ళిపోయినారు. మొదటి ప్రయత్నములోనే శబ్దాలంకారమును, అర్థాలంకారమును గుప్పించి, చక్కని పద్యమును చెప్పినారు. దీనికి గణనిర్దేశమును ఆయనయే తరువాత వివరింతురు. ప్రస్తుతము జానపదుల పదములనుండి క్రొత్తఛందములను సృష్టింప వలనుపడునేమో ప్రయత్నింపుడు" అని అంత వరకు మౌనముద్రవహించి యుండిన సోమేశ్వరభట్టారకుడు విప్పారు మొగముతో పలికెను. విష్ణుశర్మ జానపద గాయకులవైపు చూచెను. వారిలో ఒక గాయకుడు ప్రభువులకు నమస్క రించి "ఇది మేము పల్లెలలో నవ్వులాటకై పాడుకొను పదము. పెద్దలకు నచ్చునో నచ్చదో. అయినను పాడెదను"అనిపాడెను.

పూలరైకచిన్నదాన్ని పొంకమైనచండ్లదాన్ని ॥రెండుసార్లు॥
పొందకుండా నేనుపోనిత్తునా-దాన్ని - పొందకుండా నేను పోనిత్తునా
ఎఱ్ఱాపావడదాన్ని ఎత్తూ పిఱ్ఱల దాన్ని ॥రెండుసార్లు॥
మఱ్ఱిమానూ కిందా మాటెయ్యనా-దాన్ని-మఱ్ఱిమానూ కిందమాటెయ్యనా

అంతలో విష్ణుశర్మ "ఆపు-ఆపు" అని వానిని ఆపి "ఈ రెండునుడువులను నాలుగు పాదముల పద్యముగా ఎట్లు దిద్దవచ్చునో ఆలోచింపుడు" అనెను. అందరును ఆలోచనలో పడిరి. కొంతసేపటికి పిష్ఠపుర పండితుడిట్లు చదివెను.

పూలరైకలదాని, బిగువుచన్నులదాని పొందకనేనెట్లు పోవనిత్తు.
ఎఱ్ఱపావడదాని, ఎత్తుపిఱ్ఱల దాని మఱ్ఱిమాకుల నీడమాటువైతు

ఇవి రెండుపాదములు-ఇట్టివి మరిరెండు పాదములు కూర్చిన యెడల పెద్దపద్య మగును. సీసపుగుండ్లు దొర్లినట్లు దొర్లిపోవును"

"ఇంకేమి. దీనికి సీసపద్యమనియే పేరు పెట్టుదము". విష్ణుశర్మ ఇంకను ఏమియో చెప్పబోవుచుండగా దక్షారామపండితుడు అందుకొనెను.

"దీనినే నాలుగుపాదములతో చిన్నపద్యముగా చెప్పవచ్చును. ఇంచుకంతయే భేదముండును. గణనిర్ణయము భిన్నముగానుండును.

పూలరైకదాని బిగువుచన్నులదాని
పొందకెట్లు నేను పోవనిత్తు
ఎఱ్ఱచీర దాని ఎత్తు పిఱ్ఱలదాని
మఱ్ఱిమాని క్రింద మాటువేతు.

తెనాలి పండితుడు లెస్స. లెస్స. "ఇది పైదానికంటె క్లుప్తముగా గంతులు వేయు చున్నట్లు దుముకుచు నడచుచున్నది. ఎట్లైనను తమరు దక్షారామము వారు కదా–రసికత ఎక్కడికి పోవును? దక్షారామము ఆటవెలదులకు నిలయము–రసికులకు ఆలవాలము". అని నవ్వెను.

సత్యాశ్రయ మహారాజును, సోమేశ్వరభట్టారకుడును కలకలమని నవ్విరి– సోమేశ్వర భట్టారకుడు. "అట్లయినచో దీనికి ఆటవెలది అని పేరుపెట్టవచ్చును" అనెను. అందరును "తథాస్తు" అనిరి.

వినుకొండపండితుడు మాట్లాడసాగెను.

"నేను ఒకసారి అణ్డెక్కికి వెళ్ళియుండగా అక్కడ బోయకొట్టముల యువకులు పాడుచుండగా వింటినని ఒక యువకుడు ఒక పాట వినిపించెను. చదివెదను వినుడు"

యాడబోయేవురా వీరభద్రూడా
మారాడకా నన్ను మనువాడుకోర
పిలిచి నాతండ్రి నీపేరు అడిగేను
కూర్చుండబెట్టి నీకులము అడిగేను
కొండకిందా చేను కోరకిచ్చేను
ఊరిపెత్తనము నీకూరకిచ్చేను
కుచ్చులా జీనేసి గుఱ్ఱమిచ్చేను
పట్టు పుట్టాలనూ కట్టబెట్టేను
బొమ్మలా మంచమూ పండనిచ్చేను
బూరగాదూదేసి పరుపులిచ్చేను
దువ్వలువ కలనేత దుప్పటిచ్చేను
చెప్పులూగొడుగులూ చెప్పకిచ్చేను
యాడబోయేవురా ఎఱ్ఱి నాగన్నా–
మారాడకా నన్ను మనువాడుకోర–"

శ్రీశైల పండుతుడు వెంటనే అందుకొనెను. దీనిని మా ప్రాంతమున ద్విపద అందురు. ద్విపదలో రెండేసి పాదములకు ప్రాసపెట్టి ఎంత దీర్ఘముగానైనను చెప్పవచ్చును. శ్రీశైలమున శైవభక్తులు ఇట్టి ద్విపదలను ఎక్కువగా పాడుచుందురు."

రత్నాకరభట్టు కలుగజేసికొనెను. "ఈ ద్విపదపాదములు చాలచిన్నవి. రెండేసి పాదములు ఒకపాదముగాచేసి నాలుగు పాదములకు నియమించి యతిప్రాసలు పెట్టినచో సంస్కృతము నందలి స్రగ్ధరవలె కడుగంభీరముగా ఒక మహావృక్షము నిలబడినట్లుండును.

శ్రీశైల పండితుడు అంగీకారముగా తలయూచుచు "బాగుగానేయుండును. పద్యమునకు ఒక ప్రమాణము ఏర్పడును. మహావృక్షమువలె నుండునన్నారు. కనుక దీనికి తరువోజ అను పేరుపెట్టెదము" అనెను. అందరును తథాస్తు అనిరి.

రాజమహేంద్రవరపండితుడు ఇట్లనెను.

"మాఘకవి శిశుపాల వధకావ్యములో "చంపకావళి" అను ఒక వృత్తమున్నది. అది మరి యే సంస్కృత కావ్యము నందునులేదు. దాని యందు లఘువు లెక్కువ. తెలుగుపదములు లెస్సగా ఇముడును. దానిని యతిప్రాసలు పెట్టి తెలుగులోనికి తెచ్చుకొన వచ్చును. దానికి చంపకమాల అని పేరుపెట్టవచ్చును."

వెంటనే పిష్ఠపుర పండితుడు "అవునవును నేనును చదివియున్నాను. మా గురువుగారు నాకు ఆ శ్లోకమును బోధించుచు ఈ పద్యములోని మొదటి రెండు లఘువులను ఒక గురువుగా మార్చిన యెడల మరియొక చక్కని వృత్తము రూపొందును. దానికి ఉత్పలమాల అని పేరు పెట్టవచ్చును. అనిచెప్పెడివారు." అనెను.

విష్ణుశర్మ "ఇదియు పరిశీలింపవలసిన విషయమే. మనము ఇంతటితో వదిలి పోయిన యెడల ఎక్కడవేసిన గొంగడి అక్కడనే యుండును. ప్రభువులవారు మనకు అన్ని సౌకర్యములు సమకూర్చినారు. వారము, పక్షము దినములైనను మనము ఇక్కడనే ఉండి క్రొత్త పద్యములకు ఛందోనిర్ణయము, యతిప్రాసనిర్ణయము, తెలుగుపదముల సంధి విధానము మొదలగునవి నిర్ధారించవలె. మనము ప్రతిదినము సత్రము నందు ఇదివరకే నేను సూచించినట్లు వర్గము లుగా కూర్చుండి ఈ సంగతులన్నియు తీర్చి పక్షము లోపల ప్రభువులవారికి నివేదించవలె." అని పలికెను.

సోమేశ్వరభట్టారకుడు తానును మాట్లాడదలచినట్లు పొడిదగ్గు దగ్గెను. సభ నిశ్శబ్దమై పోయెను. అందరును అతనివైపు చూడసాగిరి.

"విష్ణుకుండిన మహారాజు మాధవవర్మగారి కొలువున గణస్వామి పండితుడు తెలుగుభాషలో ఛందస్సును రూపొందించుటకు కొంతప్రయత్నించెను. ఒక ఛందశ్శాస్త్రమును వ్రాసెను. కాని విష్ణుకుండిన ప్రభువులు సంస్కృత భాషాభిమానులు. ఇక మన పండితుల విషయము చెప్పవలసిన పనియేలేదు. వారి సిరలలో సంస్కృతమే ప్రవహించుచున్నది. కావున గణస్వామి ప్రయత్నము కొండెక్కినది. ఇప్పుడు సత్యాశ్రయ సార్వభౌములు తెలుగు దీపమును వెలిగించినారు. ఇక్కడ చేరిన దాదాపు నలుబది మంది కవిపండితులు ఆంధ్రభూమి

నలుమూలల నుండి వచ్చినవారు. మీరందరును ఈ బృహద్దీపము నుండి దీపములను వెలిగించుకొని మీమీప్రాంతములకు చేరవేయవలె. మీమీప్రాంతములలో ఈ సమావేశములకు రాలేక నిలిచిపోయిన కవిపండితులకు మీ తెలుగు దివ్వెల నుండి క్రొత్త దివ్వెలను వెలిగించి ఇయ్యవలె. తెలుగునేలపై తెలుగుకాంతులు దేదీప్యమానముగా వెలుగవలె. ఎక్కడెక్కడివారు అక్కడక్కడే తెలుగులో పద్యరచనకు పూనుకోవలె. కావ్యములు వ్రాయవలె. మీరు తీర్థయాత్రలకు వెళ్ళినప్పుడును, అన్యవిధముగా ప్రయాణములు చేసినప్పుడును, అక్కడి కవిపండితులను కలిసికొని, మీప్రాంతమున రచింపబడిన గ్రంథములను వారికి పరిచయము గావించి, అక్కడి గ్రంథములను మీరు వ్రాసితెచ్చు కొనవలె. ఇది నిరంతరము జరుగవలసిన ప్రక్రియ. ఈనాటితో ఆగిపోకూడదు.”

సోమేశ్వరభట్టారకుని సుదీర్ఘప్రసంగమును అందరును హర్షధ్వానములతో ఆమోదించిరి.

విష్ణుశర్మ మరల ఇట్లనెను “ఒక విషయము గుర్తించుకొనుడు. మనము ఈ మహత్కార్యమును కేవలము మహారాజులను సంతృప్తి పరచుటకు చేపట్టుటలేదు. తెలుగుభాషకు, తెలుగుజాతికి, తెలుగుతల్లికి ప్రాభవమును చేకూర్చుటకే చేపట్టు చున్నాము.”

సత్యాశ్రయుడు చేతులుచరచి “భళా, విష్ణుశర్మగారు నామనస్సులోని మాటను చక్కగా ఆవిష్కరించినారు. ఈ ఆవేశము కవిపండితులందరిలో కలుగవలె. తెలుగుకవులలో తెలుగు కవిత్వబీజముపడినది. ఇక అది మొలిచి మహావృక్షము కాగలదని నాకు నమ్మకము కుదిరినది. ఇక మాకు సెలవు” అని తనపరివారముతో కలిసి వెడలిపోయెను.

కవిపండితులును, జానపదగాయకులును ఆనాటి సభను ముగించి తమ విడిది పట్టైన సత్రమునకు వెడలిపోయిరి. మరునాటి నుండియు సత్రమునందే సమావేశములు చర్చలు కొనసాగెను.

ఒక చిన్న సాతు సాగిపోవుచున్నది. ఆ సాతు ముప్పురుబచ్చులది. ఇరువది గూడబండ్ల నిండుగా వివిధములైన విక్రయపు సరుకులును, రెండుబండ్లలో వంట సరుకులును, పాత్రలును, పదిగాడిదలపైన ఉప్పుమూటలును, పదిమంది కూలీల భుజములపై గాజు, పింగాణి, మొదలైన సున్నితపు వస్తువుల కావళ్ళును, ఇవియే సాతులోని వర్తకపు సరుకులు. బండ్లలోని సరుకులు బండ్ల కుదుపులకు జారి రాలిపోకుండా ముందు వెనుకల వెదురుతడకలు అంటగట్టియున్నారు. ఇరువదిమంది కుంతాలవారు గుఱ్ఱములపై ముందు నడుచుచున్నారు. ఇరువదిమంది పరివారజనము బండ్లకు ఇరువైపులను వెనుకవైపునను గుంపులు గుంపులుగా నడుచుచున్నారు.

ఒక సాతు పయనించుచుండగా ఒంటరి ప్రయాణికులు, యాత్రికులు వారితో చేరి ప్రయాణించుట సహజమే. అట్టి ప్రయాణికులు మరియొక గుంపు వీరి వెనుక వచ్చుచున్నారు.

ఈ సాతు మధ్యభాగమున కురుచ కొమ్ములు, జంపు, లావు గల తెల్లని బలిష్టమైన ఎడ్లు పూన్చిన ఒక గూడుబండిలో ముప్పురు శ్రేష్ఠులు మెత్తని పరుపులపై కూర్చొని ఒరుగు

దిండ్లకు ఆనుకొని ఇష్టాగోష్టిగా మాట్లాడుకొనుచున్నారు. ఆ మెత్తని పరుపుల క్రింద బండి పొరుపట్టెల మధ్య ఇనుపమేకులతో బిగగొట్టబడిన ఇనుపరేకుల పెట్టెలు మూడు పైకి కనబడని రీతిలో అమర్చబడి వున్నవి. అందులో బంగారు, వెండి, మిశ్రలోహములతో చేయబడిన నాణెములు వివిధ పరిమాణములు, వివిధ విలువలు కలవి భద్రపరుపబడి యున్నవి. బచ్చులు ముప్వరును వారివారి డబ్బుపెట్టెలపైననే పరుపులపై కూర్చుని యున్నారు. పెట్టెల మధ్యనున్న సందులలో తాంబూలకరండములు, నీటి కలశములు, తాటాకుబుట్టలలో చిరుతిండ్లు సిద్దముగానున్నవి. బచ్చులకు చిరుతిండ్లు లేనిదే ప్రొద్దుగడువదు. తినుచు మాట్లాడుదురు.

"అన్నా, చాళుక్యరాజులు ఆవైపున కాళింగులతో పోరుచుండగా ఈవైపున పల్లవులు మెల్లమెల్లగా మేరమీరి సాగివచ్చుచున్నారు. అణ్ణెక్కిని ఎప్పుడో ఆక్రమించుకొనిరి. ఇప్పుడు వినుకొండపై కన్నువేసినారు. ఎంత అన్యాయము."

"ఈదినములలో ఏరాజ్యపు సరిహద్దు ఎంతవరకు అనుప్రశ్నయేలేదు. త్రాసుపైన ముల్లు అటుఇటు ఊగునట్లు సరిహద్దులు ఊగుచున్నవి. ఇట్లు సరిహద్దులు రెండుమూడు సార్లు చేతులు మారగానే–ఈప్రాంతములు పూర్వమునుండియు మావే అని రెండు పక్షములవారును పోరాడుకొనుచున్నారు. ఇటీవలి కాలములో రాజులకు యుద్ధములే బ్రతుకులైపోయినవి. యుద్ధముజరుగని దినము లేదు. యుద్దముజరుగని ప్రదేశములేదు. నెత్తుటితో తడువని నేలలేదు."

"అవునవును. దేశములు తిరిగిచూచుచున్నాము కదా. సామాన్యప్రజల జీవితములు దుర్భరమైపోయినవి. ముఖ్యముగా సరిహద్దు ప్రాంతములవారి బ్రతుకులు దినదినగండమై పోయినవి.

"రైతులు పండించిన పంటలో సగభాగము కూడా వారికి దక్కుట లేదట"

"ఎట్లు దక్కును? రాజులకు నిరంతరము యుద్ధములే వ్యాసంగమై పోయెను. యుద్ధవ్యయము తలకు మించిపోయెను. రైతులపంటలలో మూడింట ఒకభాగము పన్నుగా లాగుకొని పోవుచున్నారు."

"ఆమూడింట ఒక భాగము రాజుగారికి చెందునది. ఇక్క సామంతరాజులకు, గ్రామాధికారులకు అప్పుడప్పుడు వచ్చిపడు రాజోద్యోగులకు సమర్పింపగా సమర్పింపగా ఇక రైతుకేమి మిగులును? వారెట్లు బ్రతుకవలెను?"

"మనబ్రతుకులు మాత్రము సవ్యముగానున్నవా? అవియు అట్లేఉన్నవి. తలయెత్తిన ప్రతి యొక్కడును మనలను సుంకమడుగువాడే–ఎప్పుడు, ఎవడు, ఎక్కడ అడ్డగించి సుంకమడుగునోయని భయపడిచచ్చుచున్నాము. ప్రస్తుతము మనకు లభించు లాభములో రెండు వంతులు అడిగినవారికందరికి సుంకములు చెల్లించుటకే సరిపోవుచున్నది. ఒక వంతు మాత్రము మనకు దక్కుచున్నది. అదియు దారిలో ఏ దోపిడి దొంగలో తారసపడనంత వరకే–పూర్వము రాజులు వర్తకుల సాతుల రక్షణకు కొంతసైన్యమును నియమించుచుండిరి. ఇప్పుడు ఎంతసైన్యమైనను యుద్ధమునకే చాలుటలేదు. మన రక్షణకు మనమే భటులను

నియమించుకొనుచున్నాము. ఇది మనకు అదనపువ్యయము. ప్రస్తుతము మనము వేంగి రాజ్యములోనూ పల్లవరాజ్యములోను వ్యాపారము చేయుచున్నాము. ఆ ప్రభువులకు ఇరువురికి సుంకముచెల్లించుచున్నాము. కానీ ఈ సరిహద్దు ప్రాంతములలోని చిల్లర నాయకులు కూడ సుంకములడుగు వారే అయిరి. ఎన్ని సుంకములు భరింపగలము? ధరలు పెంచిన యెడల ప్రజలు కొనలేరు. వ్యాపారము మందగించును. ఈసారి వేంగిలోనూ, కంచిలోనూ రాజదర్శనమునకు వెళ్ళినప్పుడు ఈ విషయము మనవి చేసికొనవలె. సుంకములు తగ్గించమని వేడుకొనవలె."

"పల్లవులది అలజడి లేని రాజ్యము. కనుక వారు ఒప్పుకొనవచ్చును. కాని వేంగి చాళుక్యరాజ్యము క్రొత్తగా ఏర్పడినది. విష్ణువర్ధన మహారాజు గతించి జయసింహవల్లభుడు రాజైనాడు. నిలద్రొక్కుకొనవలసియున్నది. కావున పన్నులు వేయక తప్పదు."

"వేంగి రాజులకేమి తక్కువ. కాళింగులతో జరిగిన యుద్ధములలో బాగుగా కొల్లగొట్టి నారు. అనేక రేవుపట్టణములు స్వాధీనముచేసికొన్నారు. సముద్రముల కావల మలయ, సువర్ణ, కర్పూర ద్వీపములనుండియు, కాంభోజ, చంపా దేశములనుండియు వచ్చు ఓడలన్నియు ఆంధ్రతీరముననే దిగుచున్నవి. వానిపై ఎడాపెడా సుంకములు విధించి పైకము పిండుకొనుచున్నారు. ఇంకను ఏమికావలెను?"

"రాజులతో ఎట్లైను వేగవచ్చును. ఈ స్థానిక అధికృతులతోనూ, చిన్నచిన్న సామంతుల తోనూ వేగలేకున్నాము. వీరిని కట్టిడిచేయు మార్గము ఆలోచింపవలె."

వీరిట్లు మాట్లాడుకొనుచుండగా ఒక బండివాడు కొంచెము తూగుటచేత ఎడ్లు జడువు తప్పి నడచుటచేత బండిచక్రము ఒక గుండుపైఎక్కి వాలి పడిపోయెను. ఇరుసు విరిగి పోయెను. బండి కుప్పకూలిపోయెను. బండిలోని సరుకులు బాటపై నాలుగువైపులా చెల్లాచెదురుగా పడిపోయెను. ఎడ్లు కాడినుండి విడువడి దూరముగా నిలబడినవి.

సాతుప్రయాణము ఆగిపోయినది.

ఒకశ్రేష్ఠి మాత్రము బండిదిగి వచ్చిచూచి బండివానిని తిట్టి ఆ సరుకంతయు మూటలు కట్టి మోసుకొనివచ్చునట్లును, విరిగిన బండిచక్రములు, నొగలు మొదలైన వాటిని ఇతర బండ్లపై వేసి కట్టుకొని రావలసినదనియు ఆజ్ఞాపించి వెళ్ళి బండిలో కూర్చుండెను.

పనివారు చెదరిన సరకును గోనెసంచులకెత్తి మూతులుబిగించికట్టిరి. పదునైదు మూటలు సిద్ధమైనవి. ఇక మోయువారెవరు? ఉన్న పనివారలలో పదిమూటలు మోయుటకు తగినవారు తేలిరి–తక్కిన మూటల గతిఏమి?

నూరు గజముల దూరమున వింటి బద్దలలో గులకరాళ్ళుపెట్టి కౌజులను, పూరేడులను కొట్టుకొనుచుండిన నలుగురు యువకులు వారికి కనబడిరి. నలుగురును నల్లనివారు. బలిష్ఠులు, పొడగరులు. పంచెలుగోచిపెట్టి బిగించినారు. శరీరములపై చట్టలుగానీ, పైబట్టలు కానీలేవు. వారిచేత మూటలు మోయించవచ్చును. అనుకొనిరి. "ఓరీ అబ్బాయిలూ–ఇటు రండిరా" అని ఆ బచ్చుల పరివారమును శాసించు పెద్దకంగాణి ఎలుగెత్తిపిలిచెను. ఆ

నలుగురిలో ముప్వురు యువకులు తాముకొట్టిన పిట్టలను తమలో చిన్నవాడైన నాని చేతికిచ్చి వానిని అక్కడే ఉండమని చెప్పి సాతు వద్దకువెళ్ళిరి.

"ఎవరురా మీరు?" పెద్దకంగాణి దర్పముతో అడిగెను. యువకులకు కోపమువచ్చెను. ఏమి వీనిఅధికారము? వీడు తమను 'రా' అని పిలుచుట ఏమి? అయినను వారు శాంతముగానే సమాధానమిచ్చిరి.

"మేము బోయదొరలము."

"బోయదొరలు" అనుమాట సాతువారికి వింతగా వినిపించినది.

"బోయ---?" మరియొక్కసారి చెప్పుమన్నట్లు ప్రశ్నించినాడు పెద్దకంగాణి.

"బోయదొరలము"

"బోయదొరలా? బోయలు దొరలెప్పుడైనారు." కొంటెగా నవ్వినాడు పెద్దకంగాణి.

"బోయలెప్పుడును దొరలే" బోయయువకుడు రోషముతో సమాధానమిచ్చెను.

"మీ యిండ్లెక్కడ?"

"ఇక్కడి నుండి పదునైదు క్రోసులుదూరము మాదే-మాయిండ్లే."

"ఎట్లెట్లూ? పదునైదు క్రోసుల దూరము మీయిండ్లేనా-అట్లు ఎన్నియిండ్లు?"

"మావి పండ్రెండు బోయపల్లెలు. ఒక్కొక్కపల్లెలో ఏబది అరువది ఇండ్లున్నవి"

"ఇంతకు మునుపెన్నడును ఇక్కడ బోయపల్లెలు ఉన్నట్లు మేము వినియుండలేదే? క్రొత్తగా వచ్చిచేరినట్లున్నది. ఎప్పుడు వచ్చిచేరినారు?"

"మావారు ఇక్కడ చేరి సుమారు ముప్పది నలుబది సంవత్సరములైనవి. మేము పుట్టకముందే."

"ఓహో! ఈప్రాంతమున పెద్దపెద్ద మార్పులే జరిగిపోయిననే! ఏవోకొన్ని చిన్నచిన్న పల్లెలు ఏర్పడినవని పెరిక బేహారులు చెప్పుకొనుచుండగా వింటిమి. కాని ఏకముగా పండ్రెండుపల్లెలు పుట్టుకొచ్చినవా? అది సరే మీరిక్కడ ఏమిచేయుచున్నారు?"

"కాలక్షేపమునకు వింటి బద్దలతో పిట్టలను కొట్టుకొనుచున్నాము."

పిట్టలను కొట్టినచో మీకేమి వచ్చును? ఇదిగో ఈ మూటలను కందుకూరు వరకు మోసుకొని రండు. కూలి ఇచ్చెదము"

"మేము కూలివారముకాము. దొరబిడ్డలము. వేరెవరినైనను చూచుకొనుడు."

"వేరెవరోఏల? మీరేమి? కూలియిత్తుమనుచున్నాము కదా"

"చెప్పితిమి కదా. మేము కూలివారము కామనియు, దొరబిడ్డలమనియు."

"ఏమి మీ పొగరు. మాటి మాటికి దొరబిడ్డలమనుచున్నారు. బోయలు ఎటువంటి వారో, వారి బ్రతుకులెటువంటివో మాకు తెలియదా. మంచి మాటలతో మూటలు నెత్తికెత్తుకొనుడు. మూటలు మోయుటకు నలుగురు తక్కువైనారు."

"తక్కువెందుకైనారు? అదిగో గుట్టములపై ఇరువది మంది ఉన్నారు కదా. వారి చేత ఎత్తించుకోవచ్చునుకదా?"

"ఏయ్,ఎవరితో మాట్లాడుచున్నావు?వారు వీరభటులు మూటలుమోయువారు కారు"

"మేమును వీరులమే. మూటలు మోయువారముకాము,"

"పిట్టలను కొట్టుకొని బ్రతుకువారికి ఇంత గర్వమా?"

"ఉప్పు పప్పు అమ్ముకొని బ్రతుకువారికి ఇంత గర్వమా?"

మాటలు మాటలు పెరిగినవి. ఒకరినొకరు పట్టుకొనుట, త్రోసికొనుట వరకు వచ్చినది. ఈటెలవారు వచ్చి ముగ్గురిని చుట్టుముట్టిరి. వారుఈటెలతోనూ, వీరు వింటి బద్దలతోనూ కొట్టుకొనిరి. వీరి వింటిబద్దలన్నియు విరిగినవి. ఈటెల వారివి కొన్ని ఈటెలును విరిగినవి. నిరాయుధులైన బోయయువకులను ఈటెలవారు పడద్రోసి పిడిగ్రుద్దులు గ్రుద్ది బండ్లకు కట్టివేసిరి. దూరముగా నిలబడి చూచుచుండిన బోయబాలుడు పరుగు పరుగున పోయి పల్లెలో ఈవార్త అంటించెను.

ఆ యువకులు ముప్వురును వీరనబోయని కుటుంబములోనివారు. పరుగెత్తి పోయిన వాడు పాలేరు కొడుకు.

వీరనబోయడు రెండేండ్లక్రితమే మరణించెను. ఉన్న ఒక కొడుకు అంతసమర్థుడు కాడు. వీరనబోయని పెద్దభార్య మంగసానియే పెద్దరికమును పైనవేసికొని పండ్రెండు బోయకొట్టముల వ్యవహారములన్నియు చూచుచున్నది.

ఈ వార్త తెలియగనే యేబది మంది యువకులు గుమిగూడిపోయిరి. బోయసానికి తెలిసిన యెడల ఆమె మంచి మాటలతో రాయబారములు జరుపును. యువకులు ప్రతీకారమునకు ఉరకలువేయుచున్నారు. కావున ఆమెకు తెలియక మునుపే వారిని దెబ్బతీయవలె, బుద్ధిచెప్పవలె. ముప్వురిని విడిపించుకొని రావలె. అని తీర్మానించుకొని ఈటెలు, కత్తులు చేతబట్టి బయలుదేరిరి.

"ఆగండి, ఆగండి" అనుచు చెన్నుబోయడు వచ్చి వారిని నిలువరించెను. బాలుని అడిగి మరికొన్ని వివరములు తెలిసికొనెను.

ఆ సాతులో ఆశ్వికులైన కుంతాలవారు ఇరువది మందియు, ఆయుధములు పట్టగల పరివార జనము మరియొక ఇరువది మందియు ఉన్నారు. వారి వద్ద విండ్లు అమ్ములు కనబడలేదు. యాత్రికులు ఎందరున్నను వారితో తగవు లేదు.

"విల్లమ్ములు, కుంతములు తీసుకొని నలువది మంది రండు చాలును. చిన్న అమ్ములు ఎక్కువగానూ, పెద్ద అమ్ములు తక్కువగానూ తీసుకొనిరండి. పది మంది పిల్లలు దారిలో అక్కడక్కడ నిలబడి వార్తలు చేరవేయుడు చాలును. రండు పోదము".

అప్పటికి ప్రొద్దు బాగుగా వాటారినది. ఇక రెండు మూడు గడియలలో ప్రొద్దు గ్రుంకవచ్చును.

నలుబది మంది బోయ యువకులు నిశ్శబ్దముగా బాటకు కొంతదూరమున చెట్ల మాటున చేరి నిలబడిరి.

"మీరు పది మంది చిన్నబాణములతో ఎడ్లను కొట్టవలె. బాగా నొప్పి పుట్టి ఎంతగా బిగబట్టినను ఆగక అవి పారిపోవలె. మీరు పది మందియు గుఱ్ఱములపై బాణములు

వేయుడు. అవియు అట్లే పారిపోవలె. మీరు పది మంది పరివార జనులపై బాణములు వేయుడు. వారు భయభ్రాంతులు కావలె. మీరు పది మంది గుఱ్ఱాలవారిపై గురిచూచికొట్టండి. ప్రాణములు పోరాదు. కొన్ని దినములు కోలుకోరాదు."

అందరును దూరదూరముగా వెళ్ళి చెట్ల చాటున పొంచి చెన్ను బోయని నుండి సంకేతము కొఱకు వేచియుండిరి.

ఈ లోపల బోయ యువకులకును, పరివార జనమునకును మధ్య జరిగిన గొడవ తెలిసి శ్రేష్ఠులు ముష్వరును బండి దిగి వచ్చిరి. కట్టి వేయబడిన బోయ యువకులను చూచిరి.

"ఎవరు వీరు. వీరినెందుకు కట్టి వేసినారు?"

"మేము బోయ దొరలము – మీ వారు మమ్ములను ... " అనుచుండగానే కుంతాల వారు కుంతములు తిరుగవేసి బోయ యువకుల మొగములపై కొట్టిరి.

పెద్ద కంగాణి "వీరు బోయదొరలట. ఈ ప్రాంతము వీరిదేనట. మనము సుంకము కట్టవలెనట. బండ్లు కదలనియ్యమని అడ్డగించినారు. మన రక్షకభటులు వారిని కట్టివేసినారు" అన్నాడు.

"మేము సుంకము అడుగలేదు. వీరే మమ్ములను..." అనుచుండగానే పెద్దకంగాణి "చూచితిరా... చూచితిరా దెబ్బలు పడగానే మాట మార్చుచున్నారు". అనెను.

శ్రేష్ఠి పరివార జనముపై మండిపడెను.

"నేను మీకు నూరుసార్లు చెప్పియున్నాను. మనము స్థానికులతో విరోధము పెట్టుకొన రాదని. స్థానికులను రాజుల చేతనే దండింపజేయవలె. దోపిడీదొంగలను ఎదిరించువరకే మన రక్షకభటుల పని. వారిని వదలివేయుడు."

రక్షకభటులు బోయ యువకుల కట్లు విప్పి వదలివేసిరి. అంతలో పరివార జనము హెచ్చుగానున్న సరుకు మూటలను బండ్లపై వేసి అంటగట్టిరి. శ్రేష్ఠులు తమ బండిలో కూర్చొనిరి. ఆశ్వికులు గుఱ్ఱములెక్కిరి. బోయ యువకులు బాట దిగి పల్లెవైపు నడవసాగిరి.

అంతలో "గీ"యని చెన్నుబోయని ఈల వినబడినది. వెంటనే రివ్వున బాణములు వచ్చి పడినవి. ఎడ్లు బాణముల దెబ్బకు, నొప్పికి బెదరి బాటకు అటు ప్రక్కన చేలలోనూ బీడులలోనూ పడి, వెనుదిరిగి, వచ్చిన దారిలో పరుగెత్తినవి.

ఆ ఎగుడుదిగుడు నేలలో, ఆ వేగములో కొన్ని ఎడ్లు మెడపట్టెడలు త్రెంపుకొని కాడి తప్పించుకొని బండ్లను వదలి పరుగెత్తినవి. గుఱ్ఱములును బాణములు గ్రుచ్చుకొనగా నొప్పితో కుప్పించి గంతులు వేసి వెనుదిరిగినవి. పరివారజనులు బాణముల దెబ్బలకు నొచ్చియు ఆయుధముల కొఱకు వెదుకజొచ్చిరి. ఆశ్వికులు కొందరు బాణముల దెబ్బలకు గుఱ్ఱములపై వాలిపోగా కొందరు కుంతములను చేతబట్టి బాణములు వచ్చిన వైపు గురిచూడసాగిరి.

అంతలో రివ్వురివ్వుమని రెండవ తేప బాణ వర్షము కురిసెను. ఈ బాణ వర్షములో సాతు అంతయు కకావికలైపోయెను.

శ్రేష్ఠులుండిన బండివాడు క్రిందపడి లేచి నొగలపై కూర్చొనెను. ఎడ్లు బలిష్ఠమైనవి. బండిలో సరుకు లేదు. మనుష్యులే. ఎడ్లు బెదరి బాట ప్రక్కన చేలలో పడి వెనుదిరిగి పరువులిడసాగెను. బండివాడు అతికష్టము మీద బండిని చేలలో నుండి బాటమీదికి మరలించి వెనుకకు వంగవోలు వైపు పోనిచ్చెను.

యాత్రికులును, ఒంటరి ప్రయాణికులును రెండు చేతులెత్తి కంటికి కనబడని శత్రువులకు దండము పెట్టుచు నిరపాయముగా కందుకూరు వైపు పరుగు తీసిరి.

బండిలోని శ్రేష్ఠులు తమ జనుల వైపు చేయి ఊపి "వంగవోలు, వంగవోలు" అని అరచిరి. దూరదూరముగా దిక్కునకొకరుగా పరుగుతీయుచున్న వారందరును "వంగవోలు, వంగవోలు" అని ఒకరినొకరు హెచ్చరించుకొనుచు వంగవోలు వైపు పరుగులు తీసిరి.

ప్రాణభయముతో పరుగులు తీయుటచేత అందరును మూడునాలుగు గడియలలో వంగవోలు చేరుకొనిరి. అక్కడ లెక్కచూచుకొనగా ఎనిమిది బండ్లు వచ్చినవి. పరివార జనులందరును వచ్చినారు. పదునైదు మంది ఆశ్వికులు గుఱ్ఱములతో వచ్చినారు. అయిదుగురు ఆశ్వికులు గుఱ్ఱములు పోగొట్టుకొని కాలి నడకన వచ్చినారు. తక్కిన బండ్లును, ఎడ్లును, గుఱ్ఱములును ఏమైనవో తెలియదు. వచ్చిన మనుష్యులకును, గుఱ్ఱములకును, ఎడ్లకును దేహముల నిండా గాయములే. శ్రేష్ఠులకు బాణముల దెబ్బలు లేవుకానీ, బండి అడ్డదిడ్డముగా మిట్టపల్లములలో పరుగెత్తుట చేత బండిలోనే అటుఇటు పడి తలలు బొప్పికట్టినవి. శరీరములు అక్కడక్కడ గీచుకొనిపోయి రక్తము క్రమ్ముచుండినది. మరికొంత సేపటికి మరి రెండు బండ్లు వచ్చినవి. సరుకులు మోయు గాడిదలును, కావళ్ళ వారును తలమోపుల వారును రాలేదు. ఏమైపోయిరో? వర్తకులకు తమ సరుకును గురించిన ఆందోళన అధికమైపోయెను.

వంగవోలులోని వైద్యులకు రాత్రియంతయు వారికి చికిత్స చేయుటకే సరిపోయినది.

సత్రమువారు తొలుత అందరికిని వేడివేడిగా పలుచని అంబలి కాచి యిచ్చిరి. భోజనము వడ్డించిరి.

ఉదయము అందరును సమావేశమైరి. వెనుక వదలివేసి వచ్చిన బండ్ల కొఱకు గానీ, తప్పిపోయిన ఎడ్లు, గుఱ్ఱముల కొఱకు గానీ తిరిగి ఆ ప్రదేశమునకు వెళ్ళుటకు ఎవరికిని ధైర్యమాగలేదు. పెరికసంచుల గాడిదలును, కావళ్ళ వారును, తలమోపుల వారును రాత్రి చాల ప్రొద్దుపోయిన తరువాత సత్రమునకు చేరుకొనిరి. గాయములకు ఇంకను మంచి చికిత్స అందలేదు. సాధ్యమైనంత శీఘ్రముగా వేంగి నగరమునకు వెళ్ళి బోయల దుండగములను రాజుగారికి విన్నవించుట కంటె గత్యంతరము లేదు. ధనము గుప్త పరచబడిన శ్రేష్ఠుల బండి పదిలముగా ఉన్నది. అది చాలును. తమకు తగిన సౌకర్యములును, వైద్యమును వంగవోలులో లభింపదు. తెనాలికి గానీ, బెజవాడకు గాని చేరుకొనవలెను.

ఇట్లు తీర్మానించుకొని అందరును మధ్యాహ్నమునకు ముందే ఆ గాయములతోనే బయలుదేరి ఉత్తరముఖముగా వెళ్ళిపోయిరి.

మరునాడు ఉదయమునకు గానీ ఈ వర్తమానము మంగసానికి చూచాయగానైనను తెలియలేదు. తెలిసిన వెంటనే అందరిని సమావేశపఱచినది. మొదట యువకులను విచారించినది. ముప్వురును తన కుటుంబములోని వారే. కుంతాల వారు కొట్టిన దెబ్బలకు వారి ముఖములు అక్కడక్కడ వాచి యున్నవి. తలలపైనను, శరీరములపైనను చిన్నచిన్న గాయములున్నవి.

"ఏమిరా. ఏమి జరిగినది? ఆ గాయములేమి? వారితో మీకు తగవేల కలిగినది"

"మేము కౌజుపిట్టలను వేటాడుచుండగా వారు మమ్ములను పిలిచి కందుకూరు వరకు వారి మూటలు మోయమనీ, కూలి ఇచ్చెదమనీ అడిగినారు. మేము కూలివారము కామనీ, బోయదొర బిడ్డలమనీ చెప్పగా వారు మమ్ములను ఎగతాళి చేసి మాట్లాడినారు. మేము గట్టిగా సమాధానము చెప్పినాము. "అంత పొగరా" అని వారు కుంతాలవారిని మాపై ఉసిగొలిపి మమ్ములను కొట్టించి కట్టివేసినారు. ఈ విషయము తెలిసి మనవారు వచ్చి వారిపై బాణములు వేసి బెదరగొట్టినారు. వారు పారిపోయిరి. మేము తిరిగి వచ్చితిమి" అన్నారు యువకులు.

"మరి ఈ విషయము నిన్ననే నాకెందుకు చెప్పలేదు?"

ఈసారి చెన్నుబోయడు సమాధానమిచ్చెను.

"అమ్మా, నీతో చెప్పునంత సమయము లేదు. వారు మన బిడ్డలను కొట్టి బండ్లకు కట్టివేసినారని వినగానే ఇక జాగు చేసినచో వారు బిడ్డలకు ఏమి హాని చేయుదురో అని తొందరగా వెళ్ళవలసి వచ్చినది."

"మరి వారితో మాట్లాడక ఒకేసారి బాణములు వేయుట న్యాయమా–"

"అమ్మా – వారు నాగరికులు. వారికి అహంకారమెక్కువ. సరే మన పిల్లలదే తప్పనుకొందము. పెద్దవారము మనమున్నాము కదా. మనతో చెప్పవలదా – చేతికి దొరికిన పిల్లవాండ్రను కుంతాలవారిచే కొట్టించి కట్టివేయవచ్చునా? మనము సామరస్యముగా మాటలాడబోయినచో వారు మనలను బలహీనులమని ఎంచి మరింత అపహాస్యము చేయుదురు. అది మనము ఓర్వలేము. మన మెంతటివారమో, మన శక్తి ఏపాటిదో లోకమునకు వెల్లడికాకపోయినచో లోకుల దృష్టిలో మనము గడ్డిపోచలమైపోదుము". అన్నాడు చెన్ను బోయడు ఆవేశముతో.

చెన్నుబోయని మాటలకు గట్టిగా బదులియ్యలేకపోయినది మంగసాని.

"ఏమైనను వీరు చేసిన పని ప్రమాదకరమైనది. మనము పల్లవుల అండను చేరినామని చాళుక్యులకు ముందుగానే మనమీద కన్నెఱ్ఱగానున్నది. ఈ వర్తకులు సందు చూసుకొని ఈ వృత్తాంతమును చిలువలు పలువలుగా వర్ణించి, లేనిపోనివి కల్పించి, చాళుక్య ప్రభువుల వద్ద మొఱపెట్టుకొన్నచో చాళుక్యులు ఏమి చేయుదురో. వారు తమతమ సామగ్రితోనూ బండ్లతోనూ వెళ్ళిపోయి యుండిన ఇంత ఆందోళన పడవలసిన పనియుండదు. వారు బండ్లను, సరుకులను వదలి అందరును పారిపోయినారని మీరు చెప్పుచున్నారు. మనమే

వారిని కొట్టి తరిమివేసి వారి సరుకులను దోచుకున్నామని వారు ప్రచారము చేయుదురు. అదియే నా భయము. అక్కడ ఏమేమి ఉన్నవో చూచెదము – లెండు"

అందరును బాటవైపు వెళ్ళిరి. అక్కడ పది బండ్లు అస్తవ్యస్తముగా పడియున్నవి. బండ్ల నుండి కొన్ని వస్తువులు జారిపడి చిందర వందరగానున్నవి. పదునైదు ఎడ్లు ఎక్కడెక్కడ తిరిగినవో మరల వచ్చి వాటివాటి బండ్ల వద్దనే నిలబడియున్నవి. తమ శరీరములో నాటుకొని యుండిన బాణములను తోకలతోనూ, కొమ్ములతోనూ, పొదలలో దూరి రాచుకొనుటతోనూ రాల్చుకొన్నవి. నాలుగు గుఱ్ఱములు అక్కడే బాట ప్రక్కన ఏపుగా పెరిగిన గడ్డిపోచలను కొరుకుచు తిరుగుచున్నవి.

బోయ యువకులు ఎడ్లను, గుఱ్ఱములను బుజ్జగించి భయము వాపి పట్టుకొన్నారు. బండ్లను సరిగా నిలబెట్టి బాట ఓరగా నిలిపినారు. చెల్లాచెదరుగా పడియుండిన వస్తువులను సేకరించి దగ్గరగా ఉన్న బండ్లలోనికి చేర్చినారు. ఏ బండిలోని సరుకో తేల్చుకొనలేక పోయిన సరుకును మూటలు కట్టినారు. బండ్లను అక్కడనే నిలబెట్టి ఎడ్లను, గుఱ్ఱములను తోలుకొని వచ్చి రచ్చ దగ్గర సమావేశమైనారు.

"జాడలను బట్టి చూడగా అందరును వంగవోలుకు పారిపోయినట్లు తెలియుచున్నది. మనలో ఎవరైనను వెళ్ళి జరిగిన దానికి క్షమాపణ చెప్పి వారి బండ్లను వారు తోలుకొని పోవచ్చునని చెప్పిరావలె" అన్నది మంగసాని.

"దెబ్బ తినిపోయిన శత్రువు దగ్గరికి ఎవరుపోగలరు? వారు ఊరకుందురా – నేడో, రేపో వారే వచ్చి తీసుకొనిపోగలరు" అన్నాడు చెన్నుబోయడు.

"అట్లు కాదు – నేడో రేపో వారు ఊరకరారు. తగినబలగముతో వచ్చి మన ఊళ్ళపై బడుదురు. ముందుగా మనమే చెప్పిన యెడల శాంతించి వారి బండ్లను వారు తోలుకొని పోవుదురు."

"ఏమో– వారు శాంతింతురను నమ్మకము నాకు లేదు. వారి యొద్దకు మనము వెళ్ళుట క్షేమము కాదు" అన్నాడు చెన్నుబోయడు.

"అది సరికాదు. ఎవరైనను పోవలె. ఇప్పుడే" అన్నది దృఢముగా మంగసాని.

ఆమె అంత దృఢముగా చెప్పిన తరువాత ఎవరును ఏమియు మాట్లాడలేకపోయిరి.

డెబ్బదేండ్ల వృద్ధుడు అప్పనబోయడులేచెను.

"అమ్మా. నేను పోయెదను. నన్ను ఎవరును ఏమియు చేయరు. వంగవోలు ఆడవికాదు. అదియు ఊరే. అక్కడకూడా మంచిచెడ్డలు, న్యాయాన్యాయములు చెప్పగల పెద్దమనుష్యులు ఉండకపోరు. వంగవోలులో నా స్నేహితులు చాలమంది ఉన్నారు. వారిని తోడు బెట్టుకొని పోయి వర్తకులతో నేను మాట్లాడివచ్చెదను."

మంగసాని తృప్తిగా నిట్టూర్పు విడిచెను. "అన్నా, ఈ పని చేసిపెట్టుము. నీకు పుణ్యముండును. ఈ పిల్లలు తలమీదికి తెచ్చుచున్నారు." అని అప్పనబోయనికి దారి సెలవుకై కొంత ధనమిప్పించి ఇంటిలోనికి పోయెను.

ఈ తతంగమంతయు జరిగి అప్పనబోయదు పయనమగునప్పటికి ప్రొద్దుబాగుగా వాలి పోయినది. అప్పనబోయదు గుఱ్ఱపుస్వారి ఎరుగడు. కాలినడకనే వంగవోలుకు పోవునప్పటికి ప్రొద్దుపోయెను. తన మిత్రులను కలిసి వారికి జరిగినదంతయు చెప్పి వారిని వెంటబెట్టుకొని సత్రమునకు వెళ్ళగా వర్తకులు మధ్యాహ్నమే వెళ్ళిపోయిన సంగతి చెప్పి సత్రపు యజమాని "విషయమేమి?" అని అడిగెను.

"ఏమియు లేదన్నా, వంగవోలు నుండి కందుకూరుకు పోవుబాట మాపల్లెకు అరక్రోసెడు దూరములో ఉన్న విషయము నీకును తెలియునుకదా. ఈ వర్తకులు అక్కడ తిరుగుచుండిన మా పిల్లవాండ్రను పిలిచి కందుకూరు వరకు మూటలు మోసుకొనిరండి. కూలి ఇచ్చెదము అన్నారట. మా పిల్లవాండ్రు మేము కూలీలము కాము దొరబిడ్డలము అన్నారట. వారు అవమానకరముగా మాట్లాడినారట. మాటమాట పెరిగి వర్తకుల మనుష్యులు మా పిల్ల వాండ్రను కొట్టి బండ్లకు కట్టివేసినారట. అది తెలిసి మా పల్లె యువకులు కొందరు వెళ్ళి చాటు నుండి బాణములు వేసిరట. వర్తకులు, వారి మనుష్యులు భయపడి బండ్లను సరుకులను వదలి పారిపోయి వచ్చినారట. ఆ సంగతి తెలిసి మా బోయసాని పిల్లవాండ్రను బాగా మందలించినది. సంఘటన జరిగినది మా పల్లె వద్ద కనుక మా బోయసాని వర్తకులకు క్షమాపణ చెప్పమని, వారు వచ్చి వారి బండ్లను తోలుకొని పోవలెనని చెప్పమని నన్ను పంపినది. వారి బండ్లు, సరుకులు బాటపైననే భద్రముగా ఉన్నవి. మా పిల్లవాండ్రే కావలి కాయుచున్నారు. నేను తప్పెవరిది అని నిరూపించుటకు రాలేదు. బండ్లను తోలుకొని పొమ్మని వర్తకులకు చెప్పుటకు వచ్చితిని. వారు కట్టివేసినది ఎవరినో తెలియునా? వీరనబోయని మనుమలను".

సత్రపు యజమాని "ఆఁ" అని నోరు తెరచెను.

"వీరనబోయని మనుమలనే కొట్టి కట్టివేసిన వర్తకుల మనుష్యులను మీవారు ప్రాణములతో వదలినారు. అదియే పెద్దసంగతి. నిజమునకు వారే మీకు క్షమాపణ చెప్పి తమ బండ్లను తాము తోలుకొని పోవలెను. మీ బోయసాని దొడ్డమనస్సుకలది. కాని దైవ ఘటన. వారు మధ్యాహ్నమే వెళ్ళిపోయిరి" అన్నాడు సత్రపు యజమాని సానుభూతిగా.

ఈ కథను ఇంత వివరముగా బహిరంగముగా చెప్పుటలో అప్పనబోయని ఉద్దేశము వేరుగా ఉన్నది. ఆ సమయమున సత్రములో బాటసారులు చాలమంది విడిసియున్నారు. వారిలో గుఱ్ఱములపై పోవువారు కూడ ఉన్నారు. వారిలో ఎవరైనను మరునాడుదయమే పయనమైపోవుచు దారిలో బండ్లపై పోవు వర్తకులను కలుసుకొని ఈ వర్తమానము తెలియజేయవచ్చును. అంతవరకు తాను చెప్పిన కథలో తప్పంతయు వర్తకుల మనుష్యులదే అని పదేపదే చెప్పి అచ్చటి వారిని ఒప్పించగలిగినాడు. బోయ యువకులు తమ వారిని విడిపించుకొనుటకే బాణప్రయోగము చేసిరి కానీ సరుకును దోచుకొనుటకు కాదు. సరుకంతయు భద్రముగా బాటపైనే ఉన్నదనియు అందరికి తెలిపినట్లయ్యెను.

అతని ఉద్దేశము నెరవేరినది.

పల్లవులు వేంగి రాజ్యముపై దండెత్తు ప్రయత్నములో ఉన్నారని వేంగిరాజులకు వేగు తెలిసినది. ఈ ప్రాంత పరిస్థితులు తెలుసుకొనుటకై వేంగిరాజు చారులను పంపియుండెను. చారులు మారువేషములలో ఆ సత్రమునందే విడిసియుండిరి. వారు సమస్తము వినిరి.

కాని అప్పనబోయడు ఊహించినట్లు చారులు ఈ విషయమును వర్తకులకు చెప్పలేదు. సాక్షాత్తు వేంగి మహారాజు గారికే నివేదించిరి. ఇది కాకతాళీయముగా జరిగినను బోయలకు మహోపకారమే అయినది.

వర్తకులు వెళ్ళిపోయినారను వార్త విని మంగసాని చాల కలవరపడినది. వారు తిరిగి వత్తురను ఆశతో ఆ బండ్లను బాటపైననే ఉంచి మూడు దినములు బోయ యువకులను కావలి యుంచినది. అంతలో మరికొన్ని ఎడ్లు బండ్ల వద్దకు వచ్చినవి. నాలుగవ నాడు బండ్లను తమ పల్లెకు తోలించుకొని వచ్చినది. బండ్లలో సరుకులను పరిశీలించినది. త్వరగా చెడిపోవు పదార్థములను వాడుకొనుటకు ఊరివారికే పంచివేసినది. గట్టి సరుకును బండ్లలోనే పెట్టి ముందు వెనుకల తడికలు గట్టిగా కట్టి ఒక్కొక్క బండిని ఒక్కొక్కరి ఇంటి పశువుల కొట్టములో ఉంచినది. ఎడ్లను, గుఱ్ఱములను తన స్వాధీనములో ఉంచుకొనినది.

సర్వలోకాశ్రయ, సర్వసిద్ధి బిరుదాంకితుడు జయసింహ వల్లభ మహారాజు వేంగి నగరమున సింహాసనము నధిష్ఠించి కొలువుదీరియున్నాడు.

అతడు సింహాసనము నధిష్ఠించినప్పటి నుండియు ఉత్తరమునను, పడమరను తన యెల్లలు స్థిరపరచుకొనుట యందే శ్రద్ధ చూపి అచ్చట తన యధికారమును సుస్థిరము గావించుకొనెను. రేవు పట్టణములను అభివృద్ధిగావించి సముద్రతీరమున ఎత్తైన బురుజులు కట్టించెను. అక్కడ పగటి పూట పతాకములు ఎగురవేయుటకును రాత్రులయందు పెద్ద నెగళ్ళు మండించుటకును ఉద్యోగులను నియమించెను. ఓడలు రాగానే అందలి సరుకులపై వివిధములైన సుంకములు రాబట్టుటకు ఆయతిగాండ్రను నియమించెను. వర్తకులకు కావలసిన సౌకర్యములు ఏర్పాటు చేసెను. బొక్కసమునకు ఆదాయము పెరిగినది. చీన, బ్రహ్మ, సువర్ణ, యవ మొదలైన దూరదేశములకు సముద్ర యానము చేయు సామర్థ్యము గల పెద్దపెద్ద నౌకలను పెక్కింటిని రేవు పట్టణములలో నిర్మింపసాగిరి. యుద్ధములు లేవు. రాజ్యము సుభిక్షముగానున్నది. ఇక దక్షిణ ప్రాంతముపై దృష్టిసారింప వలసియున్నది. అక్కడ పల్లవులు అప్పుడప్పుడు ఒత్తికొని వచ్చుచున్నారు. కందుకూరులోనూ, అణ్ణెక్కిలోనూ గట్టిగా తమ ప్రతినిధులను ప్రతిష్ఠించినారు. వంగవోలు ప్రాంతమున క్రొత్తగా పంద్రెండుబోయ కొట్టములు వెలసినట్లును, వారు పల్లవులకు విధేయులుగా నున్నట్లును వార్తలు వచ్చినవి... కందుకూరు వరకు మరల తమ ప్రాబల్యమును స్థాపించుకొనవలెను.

జయసింహ వల్లభ మహారాజు కొలువు తీరియుండగా బోయకొట్టముల వద్ద బోయలచే దెబ్బలు తిన్న వర్తకులు రాజదర్శనమునకు వచ్చిరి. తమరాకను ప్రతీహారులచే రాజునకెరిగించి అనుమతి వడసి బచ్చులును, భటులును, పరివారజనమును కొలువుకూటములో ప్రవేశించిరి.

“మహాప్రభూ సర్వనాశనమైపోతిమి. మా సరుకులు సమస్తము కొల్లబోయినది. అదృష్ట వశమున ప్రాణములతో తప్పించుకొని బయటపడినాము. దేవరవారే మమ్ము కాపాడవలె” విఠ్ఠల బచ్చు, తనకు చేతనైనంత దీనస్వరముతో విన్నవించుకొన్నాడు.

“మేము బెజవాడలో, హంసలదీవి రేవులో ఓడల వద్ద కొనిన సరుకంతయు దోచుకున్నారు ప్రభూ! సర్వనాశనమైనాము” విన్నవించుకొన్నాడు భైరవ శ్రేష్ఠి.

భటులును, బచ్చులును, గోలగోలగా తమ గోడును వినిపింపసాగిరి. వారికి జరగరాని హాని ఏదో జరిగిపోయినదను ఒక మాట తప్ప మరేదియు స్పష్టముగా వినపడుట లేదు.

మంత్రి చేయెత్తి “సద్దు సద్దు” అనగానే గోల సద్దుమణగినది.

“మిమ్ములను దోచుకొన్నవారెవరు? దోపిడి యెక్కడ జరిగినది?” మంత్రి నెమ్మదిగా అడిగెను.

“వంగవోలుకు అయిదారుక్రోసుల దూరమున పండ్రెండు బోయకొట్టముల వద్ద బోయలు పొంచియుండి మాపై బడి మమ్ములను బాణములతో కొట్టి బండ్లను, బండ్లలోని సరుకులను ఎడ్లను, గుఱ్ఱములను సమస్తము దోచుకున్నారు దేవరా. ఎట్లో కొన్ని బండ్లతోనూ, కొందరు భటులతోనూ వారికి చిక్కక పారిపోయి వచ్చితిమి.” అని విఠ్ఠల బచ్చు ఏడ్చుచు మొఱ పెట్టుకొనెను.

“చూపండిరా, మీ గాయాలను చూపండి” అని భైరవశ్రేష్ఠి తన భటులను, పరిజనమును హెచ్చరించెను. వారందరును తమతమ అంగీలను విప్పి శరీరముపై నున్న బాణముల గాయములను చూపిరి. అన్నియు బాణముల గాయములేకాని ప్రాణాంతకమైన గాయములు కావు.

“ఇది దోపిడీదొంగల పనికాదు. బోయలు దొంగలు కారు. ఇటీవలనే అక్కడికి వలస వెళ్ళి వ్యవసాయము చేసికొనుచు ప్రశాంతముగా జీవించుచున్నారు. వారు దారిదోపిడీలకు పాల్పడుచున్నట్లు ఇంతవరకూ మాకు సమాచారము లేదు. అక్కడమరేదో జరిగినది. అది బయటపడవలె” అన్నాడు మంత్రి.

“కాదు దేవరా మా బండ్లను దోచుకున్నది బోయలే. వారే స్వయముగా చెప్పినారు” అన్నాడు పెద్దకంగాణి.

“మిమ్ములను దోచుకొనుటకు వచ్చిన వారు మీతో అంత తీరికగా మాట్లాడిరా? వారి కులగోత్రములు, ఊరు, పేరు చెప్పుకొనిరా”?

బచ్చులకు ఏమి చెప్పుటకు తోచలేదు.

“వారు ఇన్ని విషయములు ఇంత తీరికగా మాట్లాడినారనగా వారు దోపిడీకి రాలేదని ఋజువగుచున్నది. వారు మీ వద్దకు ఏల వచ్చినారు?”

భయముతో వణకుచున్న ఒక సేవకుడు “మేమే వారిని.. కాదు – వారే మమ్ములను...” అని యేదో చెప్పబోయెను.

పెద్దకంగాణి వానిని వారించి తానే చెప్పసాగెను.

"వారే మా వద్దకు వచ్చి మాసాతును అడ్డగించినారు దేవరా. ఆ ప్రాంతమంతయు పదునైదు క్రోసుల దూరము వారి రాజ్యమట. వారి రాజ్యముగుండా పోవు వర్తకులు వారికి సుంకము కట్టవలెనట. మమ్ములను సుంకము చెల్లింపమన్నారు.

"తల ఎగిరి పోగలదు జాగ్రత్త. అబద్ధములు అల్లుచున్నావా. సుంకము పేరిట మాకు క్రొత్త సమస్యలు సృష్టించుచున్నావా?" అని మంత్రి కోపముతో తలవరివైపు చూచి పెద్దకంగాణి వైపు వ్రేలు చూపగానే తలవరి తన చేతి బెత్తముతో వాని తలపైన వీపుపైన, కాలుసేతులపైన వాతలేర్పడునట్లు పెళ్ళు పెళ్ళుమని వాయించసాగెను. పది దెబ్బల తరువాత మంత్రి "చాలు", అనెను. తలవరి తొలగిపోయెను.

ఆ దెబ్బతో శ్రేష్ఠులందరును మహారాజు ఎదుట సాష్టాంగపడిరి. విఠ్ఠలశ్రేష్ఠి మోకరిల్లి "దేవరవారికి మాపైన దయతప్పిన తరువాత మేము ఎక్కడ బ్రతుకగలము? ఎట్లు బ్రతుకగలము? మా సరుకులు, బండ్లు, ఎడ్లు, కొన్ని గుఱ్ఱములు బోయలస్వాధీనములో ఉన్నమాట మాత్రము యథార్థము. మా ప్రాణములన్నియు ఆ సరుకుల యందే ఉన్నది. మా సరుకులు మాకు దక్కునట్లు ప్రభువులు అనుగ్రహింపవలె. మీ పాదములను ఆశ్రయించినవారము. మీరే ఆగ్రహించిన యెడల మాకు దిక్కెవరు?" అని దీనముగా వేడుకొనెను. ముప్పురు శ్రేష్ఠులును కన్నీళ్ళ పర్యంతమైనారు.

మంత్రి అందరిని లెమ్మని సైగ చేసెను. అందరును లేచి వణకుచు నిలబడిరి.

"బోయకొట్టముల దగ్గర ఆ దినము జరిగిన దంతయు పూసగ్రుచ్చినట్లుగా వివరములతో బాటు నాలుగు దినములలోనే వేగులవారి ద్వారా మాకు చేరిపోయినది. ఎవరు ఎంతటివారో తెలిసికొనకుండా బోయదొరలను కూలికి పిలుచుట మొదట తప్పు. వారు ఒప్పుకొనలేదని వారిని కొట్టి కట్టివేయుట రెండవ తప్పు. సుంకమడిగినారని అబద్ధము సృష్టించుట మూడవ తప్పు. ఈ మూడు తప్పులకును మిమ్ములను శిక్షించవలసియున్నది. కాని మీరిప్పుడు నష్టములోనున్నారు కనుక మిమ్ములను శిక్షింపము"

"బోయదొరలు సుంకమడిగినారని అబద్ధము కల్పించి మాచేత వారిని శిక్షింపజేయ జూచినారు. అది క్షమింపరాని నేరము" జయసింహ వల్లభుని మాటలు విని శ్రేష్ఠులు గడగడవడకిపోయిరి. అందరును పెద్దకంగాణి వైపు కోపముగా చూచిరి. ఏదో గొణుగుకొనిరి.

"మీది శ్రేణీ వ్యాపారపు సాతుకాదు – చిల్లర వ్యాపారపు సాతు. మీరు దారిలోని గ్రామస్థులతో మంచితనముతో వ్యవహరింపవలె. కాని మీరు గర్వముతో, దుడుకు తనముతో బోయదొరలతో తగవు పెట్టుకొన్నారు. వారు మీకు బాగుగా బుద్ధి చెప్పినారు. వారు వారి పిల్లవాండ్రను విడిపించుకొనుటకును, మిమ్ములను బెదరగొట్టుటకును బాణప్రయోగము చేసినారే కాని మిమ్ములను చంపజూడలేదు. వారు మిమ్ము చంపదలచి యుండిన మీరు ఒకరును మిగిలియుండరు. అందుకు సంతోషించవలె. పాపము ఆ బోయసాని మీ సరుకులను మీ కప్పగించుటకై మరునాడు మీ కొఱకు ఒక మనుష్యుని వంగవోలుకు పంపినది. అంతలో మీరు వంగవోలు వదలినారు. మీ కొఱకు మీ సరకుబండ్లను మూడు దినములు బాట

ప్రక్కనే పెట్టి కాపుంచినది. వారి దోషమేమియు లేదు" అని మంత్రి ముగించెను.

శ్రేష్ఠులు చేతులు నలుపుకొనుచు "మా సరుకులను తెచ్చుకొనుటకు మాకు కొంత రక్షణ కావలె" అని మెల్లగా నివేదించుకొనిరి.

జయసింహ వల్లభ మహారాజు మెల్లగానిట్లనెను.

"ఆ ప్రాంతమును పల్లవ రాజప్రతినిధులు పాలించుచున్నారు. పన్నులు, సుంకములు గైకొనుచున్నారు. ఆ ప్రాంత ప్రజలు మనలను ఔననలేక వారిని కాదనలేక సతమత మగుచున్నారు. అది తెలుగుభూమి. వారు మన తెలుగువారు. ఆ ప్రాంతమంతయు వేంగీరాజ్యమునకు చేరవలసిన ప్రాంతము.

శ్రావణశుద్ధ సప్తమీ దినమున మేము ససైన్యముగా ఆ ప్రాంతముపైకి ఎత్తిపోయి, పల్లవులను పారద్రోలి, ఆ ప్రాంతమునంతయు తెలుగురాజ్యములో కలుపదలచినాము. అప్పుడు మీరును వచ్చి మీ సరుకులు తెచ్చుకొనవచ్చును."

వర్తకుల ఆశలపై నీళ్ళు చల్లినట్లయ్యెను. మహారాజు తలపెట్టినది పల్లవులతో యుద్ధము. జయాపజయములు దైవాధీనములు. ఒకవేళ జయము చాళుక్యులనే వరించినను, ఆనాటికి బోయకొట్టములలో నున్న తమ సరుకులలో సేదమైపోవునదెంత? మిగులునదెంత? దానికై ఎంతకాలము వేచియుండవలె.

వర్తకులు ఏమియు మాట్లాడలేక మౌనముగా రాజుకును, మంత్రికిని నమస్కరించి మెల్లగా వెడలిపోయిరి.

చాళుక్య జయసింహ వల్లభ మహారాజు పదివేల కాల్బలముతోనూ, వేయిమంది ఆరితేరిన ధానుష్కులతోనూ, వేయిమంది ఆశ్వికులతోనూ, ఇరవై ఏనుగులతోనూ దక్షిణమువైపుగా దండువెడలినాడు. మొదట పల్లవుల రాజ ప్రతినిధి నెలవై యున్న అణ్డెక్కిని ముట్టడించెను. దుర్గాధిపతియైన రుద్రమనాయకుడు దుర్గరక్షణకు పటిష్ఠమైన యేర్పాట్లు గావించియుండెను. కోటలోపలి సైనికులు కేవలము అయిదు వేల మంది మాత్రమే. అందులో విలుకాండ్రు బహుస్వల్పము. కోటగోడలపైకి లగ్గలెత్తు శత్రు సైనికులపై దొర్లించుటకు పెద్దపెద్ద బండ రాళ్ళు కోటగోడలపై సిద్ధముగానున్నవి. శత్రుసైనికులు కోటను సమీపింపనీయకుండుటకై కోట బురుజుల వద్ద ధానుష్కులు సిద్ధముగానున్నారు. రుద్రన అశ్వారూఢుడై వీరన బోయడిచ్చి యుండిన ముమ్మొనవాలు చేతబట్టి సైనికుల యుద్ధ సన్నాహమును పర్యవేక్షించుచు కలయదిరుగుచున్నాడు.

కంచి నుండిగానీ, కందుకూరు నుండిగానీ సైనిక సహాయము లభించునన్న ఆశయే లేదు. చాళుక్యుల దాడిని త్రిప్పి కొట్టగలమను ధైర్యము ఎవరికిని లేదు. కాని ఊపిరి యున్నంత వరకు పోరాడవలె.

దండనాథుల ఆజ్ఞపై యుద్ధ బేరీలు, కొమ్ముబూరలూ, తప్పెటలు హోరుమని మ్రోగగానే చాళుక్య సైనికులు కోటను చుట్టుముట్టి కోటపైకి లగ్గలెత్తనారంభించిరి. కోటలోని పల్లవ

సైనికులు లగ్గదింపులు దొర్లించసాగిరి. బయట అయిదు ఏనుగులు కోట తలుపులు పగులగొట్టుటకు పూన్పబడినవి. చాళుక్య ధానుష్కులు తమ బాణ వర్షముతో పల్లవ వీరులను కోట గోడలపై తలచూపనిచ్చుటలేదు. కోట బురుజుల నుండి పల్లవ విలుకాండ్రు ప్రయోగించు బాణములను క్రిందనున్న చాళుక్య సైనికులు ఇనుప తగడులతోనూ, వెదురు డాళ్ళతోనూ అడ్డుకొనుచు తమ ధానుష్కులను కాపాడుకొనుచుండిరి. ఒక గడియలోపల కోట గోడ పైభాగము భటశూన్యమై పోయినది. మరికొలది సేపటికి కోటతలుపులు విరిగి పడినవి. చాళుక్య సైనికులు పొలోమని కోటలోనికి ప్రవేశించిరి. కోటలోపల దొమ్మియుద్ధము ప్రారంభమయినది.

అణ్ణెక్కి దుర్గాధిపతి రుద్రమనాయకుడు డెబ్బది యైదేండ్ల వృద్ధుడు. అయినను ముమ్మొన వాలు ధరించి గుఱ్ఱము నదలించుచు వీరవిహారము చేయుచున్నాడు. అతని త్రిశూలము ఏవైపు తిరిగిన ఆ వైపు ఒకరిద్దరు చాళుక్యవీరులు నేలకొరుగుచుండిరి. రుద్రన తన త్రిశూలమును పైకెత్తి "జైత్రిభువనాంకుశ" అని పెడబొబ్బ పెట్టగనే అతని చుట్టును క్రమ్ముకొని వచ్చుచున్న చాళుక్య సైనికులు వెనుకంజ వేయుచున్నారు. అతనికి ఇరు ప్రక్కలను, వెనుకను కేవలము ఇరవై ముప్పై మంది పల్లవ సైనికులు ప్రాణములపై ఆశ వదలుకొని తెగించి పోరుచున్నారు. రుద్రన ఒడలంతయు రక్తమోడుచున్నది. వయోభారము చేత మిక్కిలి ఆయాసపడుచున్నాడు. అయినను తన త్రిశూలమును చిత్ర విచిత్ర గతుల విన్యాసములు చేయుచు శత్రుసైన్యములోనికి దూసుకొని పోవుచున్నాడు.

దూరము నుండి చూచుచుండిన జయసింహ వల్లభునికి ఆశ్చర్యమైనది. అది ఏమి ఆయుధము? వజ్రాయుధమువలె నున్నది. ఏ వైపు త్రిప్పినను అక్కడ శత్రుసైనికులు హతమగుచున్నారు. అతడేమి వీరుడు! డెబ్బదైదేండ్ల వృద్ధుడు. ఆ ముమ్మొన వాలును అనాయాసముగా త్రిప్పుచు శత్రుసైన్యములోనికి దూసుకొని పోవుచున్నాడు. చాళుక్య సైనికులు భయపడిపోవుచున్నారు. అతని వెంటనున్న పల్లవ సైనికులు మరింత తెగువతో ముందుకు దూకుచున్నారు.

ఇక తడయుట మంచిది కాదని జయసింహ వల్లభుడు కుంతమును గట్టిగా పట్టుకొని గుఱ్ఱముపై వేగముగా పోయి రుద్రనను ఢీకొనెను. సంకుల సమరములో రుద్రన దానిని గుర్తింపలేదు. జయసింహ వల్లభుని కుంతము రుద్రన రొమ్మున గాఢముగా నాటినది. ఆ పోటునకాగలేక రుద్రన గుఱ్ఱము పైనుండి క్రింద పడెను. ఆ హఠాత్సంఘటనను చూచిన పల్లవ భటులు కకావికలైపోయిరి. నేలపై సాగిపడియున్న రుద్రన శరీరముపైన పొడవునను త్రిభువనాంకుశము పడియుండెను. జయసింహవల్లభుడు రుద్రమనాయకుని సమీపించి అతని రొమ్మున నాటిన తన బల్లెమును లాగివేసెను. రుద్రన తల వాల్చెను. అతని కంఠము నుండి "జై త్రిభువనాంకుశా," అను మాటలు వెలువడెను. మహావీరుడస్తమించెను.

జయసింహ వల్లభుడు రుద్రమనాయకుని శరీరముపైనున్న త్రిశూలమును తన చేతిలోనికి తీసికొని దాని పనితనమును, బరువును వాదరను పరీక్షించి చూచెను. పైకెగురవేసి

పట్టుకొనెను. అటునిటు త్రిప్పెను. మనసారామెచ్చుకొనెను. పరవశించెను. రుద్రన "జై త్రిభువనాంకుశ" అని వేసిన కేక జయసింహవల్లభుని చెవిలో ప్రతిధ్వనించుచుండెను. అప్రయత్నముగా అతడును ఆ త్రిశూలమును పైకెత్తి పట్టుకొని "జయత్రిభువనాంకుశ" అని గట్టిగా కేకవేసెను.

ఆనాటి నుండియు ఆ ముమ్మొనవాలు త్రిభువనాంకుశమను పేరుతో చాళుక్య విజయ చిహ్నముగా మారినది.

యుద్ధము ముగిసినది. పల్లవ సైనికులు చిక్కిన వారు చిక్కగా పారిపోయినవారు పారిపోయిరి.

జయసింహవల్లభుడు ఎంత హెచ్చరించినను, ఎంత వారించినను సైనికులు అణ్డెక్కిలో తమ నైజ గుణమును చూపనే చూపిరి. యుద్ధములో గెలిచిన సైనికులు ఓడిపోయిన వారిపై బడి దోచుకొనుట, పీడించుట, స్త్రీలను బాధించుట, లెస్సగా తినుట, త్రాగుట లేని యెడల గెలుపులో ఆనందమేమున్నది? ఉత్సాహమేమున్నది. ఈ పనులన్నియు గెలిచిన సైనికులు తప్పక చేయుదురు. అది వారి హక్కు. రాజులు, సేనాధిపతులు ధనాగారములను కొల్లగొట్టుదురు. సైనికులు కొంపలపైబడి దోచుకొందురు. అంతే భేదము. జరుగునది దోపిడియే.

ఊరివారు ఎంతో జాగ్రత్తగా గోడలలోనూ, భూమిలోనూ దాచుకొన్న సొమ్మును సైనికులు ఇంటి వారిని హింసించి తెలిసికొని త్రవ్వి తీసుకొనిరి. కోళ్ళు, మేకపోతులు, పొట్టేండ్లు గుండ్లకమ్మ తీరమును చేరినవి. అక్కడ విడిసియున్న చాళుక్య సైనికుల విజయ కోలాహలమునకు హద్దులు లేవు. ఊరివారు భయభ్రాంతులై ఇండ్లలో తలుపులు బంధించుకొని బిక్కుబిక్కుమని కాలము గడుపసాగిరి. కోట బయటి పాళెములలో పనిపాటులు చేసి బ్రతుకు వారి యిండ్ల వద్ద ఈ కోలాహలము మరింత అధికమాయెను. వారితో కలిసి త్రాగుట, తినుటతో ప్రారంభమైన వారి ఆగడములు చివరకు వారి స్త్రీలతో సరసక్రీడల వరకు సాగిపోయెను. పాపము ఓడిన జనులు ఏమి చేయగలరు? గెలిచిన వారి ఆగడములనన్నింటిని భరింపవలసినదేకదా.

జయసింహవల్లభుడు రాజప్రతినిధి భవనము నుండి పల్లవ పరివారమునంతటిని తరిమివేసెను. స్త్రీజన మెప్పుడో పట్టణము వదలి కందుకూరుకు వెళ్ళిపోయినారు. ఊరంతయు వెదకి వెదకి పల్లవ సైనికులను, ఉద్యోగులను, ఆశ్రితులను పట్టి బంధింపజేసెను. తన బావమరిది కుమారుడు బయ్యన్నను అక్కడ చాళుక్య రాజప్రతినిధిగా నిలిపెను.

"ఈ జైత్రయాత్రను కందుకూరు వరకు జరుపదలచినాను. తిరిగి వచ్చునప్పుడు కొంత సైన్యమును ఇక్కడ వదలెదను. నీవును స్థానికుల నుండి యువకులను కొందరిని ఎన్నుకొని సైన్యమును కూర్చుకో" అని చెప్పెను. పట్టణములో ఇంకను ఆగడములు చేయుచున్న తన సైనికుల నందరిని గుండ్లకమ్మ తీరమున విడియవలసినదిగా ఆజ్ఞాపించెను.

గాయపడిన తన సైనికులకు తక్షణ చికిత్స చేయుటకు పట్టణములోని వైద్యులను

రప్పించి సత్రములలో నుంచి వైద్యము కొనసాగించెను. లేవలేనంతగా గాయపడిన పల్లవ సైనికులు సైతము ఎట్లో వచ్చి సత్రముల వద్ద పడిపోయిరి. చంపినను బ్రతికించినను మీరే దిక్కు అని వైద్యుల కాళ్ళపైబడిరి. జయసింహవల్లభుడు దయతో వైద్యులకనుమతినిచ్చెను. వైద్యులు వారికిని చికిత్స చేసిరి.

జయసింహవల్లభుడు పట్టణములోని ప్రజలందరును నిర్భయముగా తమతమ వ్యాపారములను, వృత్తులను, సేద్యపు పనులను చేసికొన వచ్చుననియు, అందరికిని చాళుక్య ప్రభువులు రక్షణ కల్పింతురనియు పట్టణములో చాటింపు వేయించెను. పట్టణములోని ప్రముఖులను నగరుకు పిలిపించుకొని వారికి అభయమిచ్చెను.

“ఇది తెలుగు నేల, మనము తెలుగువారము. పల్లవులు తెలుగువారు కారు. వారి పాలనలో తెలుగువారుండుట తెలుగు వారికి సిగ్గుచేటు. పల్లవులు మరల ఇటువైపు రాకుండ మనము సంఘటితులమై నిలువవలె.” అని వారికి బోధించెను.

అందురును సెలవు తీసుకొని వెళ్ళుచుండగా జయసింహవల్లభుడు ఒక వృద్ధ బ్రాహ్మణుని తన యొద్ద నిలుపుకొనెను.

“ఈ అణ్ణెక్కికి ఉత్తరముగా ఒక చిన్న కొండపైన ఒక ఇల్లు కనబడుచున్నది. అది ఎవరిది? అక్కడ ఎవరున్నారు. కొండపై బురుజుల వలె కనబడుచున్న కట్టడములేవి?”

“అది అర్కభట్టారకుని ఇల్లు. వారికి అణ్ణెక్కిలోనూ ఒక ఇల్లున్నది. కోటకు ఉత్తరమున ఉన్న రెండస్థుల భవనము వారిదే. వారు మహాపండితులు. జ్యోతిశ్శాస్త్రవేత్తలు. ఆ బురుజుల వంటి కట్టడములపై నుండి గ్రహగతులను పరిశీలించి ఏవేవో గుణించుచుందురు. తిథివార నక్షత్రములను గుణించి పంచాంగములు వ్రాయుచుందురు. చుట్టుప్రక్కల కొన్ని ఆమడల దూరము నుండి ఎందరో బ్రాహ్మణులు వచ్చి పంచాంగముల ప్రతులను వ్రాసికొని పోవుచుందురు. ధర్మ సందేహములను అడిగి తెలిసికొనుచుందురు. వారి తాత ముత్తాతల నుండియు వారు అదే పని చేయుచున్నారు. అంతటి ప్రసిద్ధులువారు.”

“అయినచో రేపు మనము వారి దర్శనమునకు వెళ్ళవచ్చునా”

“రేపు సూర్యగ్రహణముకదా. రేపు వారు పగలంతయు కొండమీదనే యుందురు.”

“మరియు మంచిది. రేపు ఉదయము పది గడియలకు మీరు రావలె. మనము కొండ మీదికి వెళ్ళవలె.”

“చిత్తము” అని బ్రాహ్మణుడు సెలవు తీసికొని వెళ్ళిపోయెను.

చాళుక్య సైన్యము అణ్ణెక్కిని సమీపించుటకు ముందే అర్కభట్టారకుడు తన కుటుంబమును కొండమీది భవనమునకు తరలించి యుండెను. ఆ భవనము కూడ సర్వవస్తు సమృద్ధమై నిత్యవాసయోగ్యమై యున్నది. వర్షాకాలము నుండి వసంత ఋతువు వరకు కొండపైన పడియలలో శుభ్రమైన నీరు ఊరుచునే యుండును. వేసవికాలమున కొండ దిగువ దిగుడు బావి నుండి గొల్లవారు కొండమీదికి మంచినీరు మోసుకొని పోయి బ్రాహ్మణ కుటుంబము నకందింతురు.

ఆనాడు జయసింహ వల్లభ మహారాజు తన భవనమునకు విచ్చేయుచున్న వార్త అర్కభట్టారకునికి రాజభటులు వెళ్ళిచెప్పిరి. అర్కభట్టారకులు మహారాజుగారికి కొన్ని భోజ్యపదార్థములు, పానీయములు, ఫలములు సిద్ధము చేసి మహారాజుల రాకకై ఎదురు చూచుచుండెను.

పది గడియలు దాటిన తరువాత జయసింహవల్లభ మహారాజుగారును, మంత్రి చౌడ మరసు గారును, వృద్ధ బ్రాహ్మణుడును. అతని కుమారుడును, పది మంది కుంతాలవారును కొండపై భవనమునకు చేరుకొనిరి. తనకు నమస్కరించుచున్న మహారాజును అర్కభట్టారకుడు వేదమంత్రములతో ఆశీర్వదించెను. వృద్ధ బ్రాహ్మణుడు మంత్రిని అర్కభట్టారకునికి పరిచయముల చేసెను. చౌడమరసు బ్రాహ్మణుడని తెలిసికొని అర్కభట్టారకుడు అతనిని ఆప్యాయముగా పలుకరించెను. అందరిని ఉన్నతాసనములపై ఆసీనులను గావించి మొదట చల్లని మజ్జిగను వెండికలశములలో పోసి సమర్పించెను.

"చౌడమరసు అను పేరు ఆంధ్ర దేశముది కాదే. మీరు ఇక్కడికి ఎక్కడి నుండి వచ్చినారు?" అని ఆర్కభట్టారకుడు సంభాషణ ప్రారంభించెను.

"మా తండ్రి కొండమరుసు బాదామిలో సత్యాశ్రయ చక్రవర్తుల వద్ద మంత్రిగా నుండిరి. నేను విష్ణువర్ధనులతోబాటు వేంగికి వచ్చితిని. శ్రీవత్స గోత్రము వారము. మా వారందరును ఇటు మంత్రిత్వము, అటు సైన్యాధిపత్యము వహింపగల వారే – నా కుమారుడు భద్రిరాజు ప్రస్తుతము చాళుక్య సైన్యాధిపతిగా నున్నాడు."

"చాల సంతోషము. మేము భారద్వాజస గోత్రీకులము. మా పూర్వీకులందరును జ్యోతిశ్శాస్త్ర సిద్ధాంతులు. పంచాంగకర్తలు. మీబోటి పెద్దల దర్శనము మాభాగ్యము. మా గృహము పావనమైనది."

"ఎంతమాట ఎంతమాట. మీబోటి శాస్త్రజ్ఞుల దర్శనము మాకు సులభముగా లభించునా?"

అర్కభట్టారకుడు మహారాజువైపు మరలి నమస్కరించి "ప్రభువులు మన్నించవలె. మీ మంత్రివర్యులు శ్రీవత్సగోత్రీకులు. మామేనమామలును శ్రీవత్స గోత్రీకులే. త్రిపురాంతక వాస్తవ్యులు. గోత్రబాంధవ్యము నాలో కొంత కుతూహలము రేపినది."

జయసింహవల్లభుడు చిరునవ్వు నవ్వుచు "ఎట్లయినను మీరు మీరు ఒకటే కదా. మేము పరాయివారమే కదా" అనెను.

"అవునవును. పక్షులును, పక్షులును ఒకటే. కాని అన్ని పక్షులకు ఆశ్రయమిచ్చు మహావృక్షము మీరు" అన్నాడు అర్కభట్టారకుడు.

"చమత్కారులే" అని నవ్వి జయసింహవల్లభుడు అంతలో గంభీరుడైపోయి మెల్లగా మాట్లాడదొడగెను.

"మేము అణ్ణెక్కిపై దండెత్తుటయు, రణరంగమున రుద్రమనాయకుడు మరణించుటయు పల్లవ సేన పారిపోవుటయు, ఈ భూభాగము చాళుక్య పాలన క్రిందికి వచ్చుటయు మీకు విచారము కలిగించుచున్నదని అనుకొనుచున్నాను".

అర్కభట్టారకుడును అంతే గంభీరముగా నెమ్మదిగా సమాధానమిచ్చెను.

"మాదేమున్నది. సామాన్య ప్రజలము. అణ్డెక్కిలో ఎవరు అధికారములో ఉందురో మేము వారి ప్రజలము. నిన్నటి వరకు మేము పల్లవ రాజ్య ప్రజలము. నేటి నుండి చాళుక్యరాజ్య ప్రజలము. రేపు ఏమగునో ఎవరికెరుక. నందోరాజాభవిష్యతి".

"ఇది తెలుగునేల. మీరును మేమును తెలుగువారము. వేంగి రాజ్యము తెలుగువారి రాజ్యము. పల్లవులు కాంచీపురస్థులు. వారు తెలుగువారుకారు. వారి పాలన నుండి తెలుగు నేలను విడిపించి విశాల తెలుగు సామ్రాజ్యమున లీనము చేయుటలో దోషము లేదనియు, మీదుమిక్కిలి అదియే ధర్మమనియు తలంచుచున్నాను."

"నిజమే. మీ ఆశయము మంచిదే. కాని ఏ ఆశయమును అంతటితో ఆగుట లేదు. మీకు అనువు పడినచో మీరు కాంచీపురముపై దండెత్తరా? అటువైపున హొయసల రాజ్యముపై ఎత్తిపోరా? మీరేకాదు. రేపు వారును అంతే. రేపు రాష్ట్రకూటులు ఈ ప్రాంతముపై ఎత్తి రావచ్చును. హొయసలులు రావచ్చును. అప్పుడు మేము ఎవరి ప్రజలము?"

"కానీ–కానీ– తెలుగు సీమ – తెలుగు ప్రజలు అనునవి శాశ్వతములు కదా – దానిని మరువవచ్చునా? ఆ భావనను కాపాడుకొనవలెకదా?"

"ప్రభువులు క్షమించవలె. ఈ విషయమును గురించి మాట్లాడుటకు ముందు నేను కొంత ఇతిహాసమును – అనగా చరిత్రను – చెప్పవలసియున్నది. ఆసక్తియు, తీరికయు ఉన్నచో విన్నవించెదను".

"ఎంతమాట ఎంతమాట. చరిత్ర అవశ్యము వినవలసినదేకదా. అందునను మీవంటి పెద్దలు చెప్పెదమన్నప్పుడు వినుట మా కర్తవ్యము. ఇటువంటి అవకాశము మాకు మరెప్పుడు లభించును? గాయపడిన మా సైనికులు చికిత్స పొందుచున్నారు. రెండు దినములు మేము ఇక్కడనే ఉండవలసియున్నది. చరిత్ర వినవలెనను కుతూహలమును కలదు. చెప్పుడు".

"పూర్వము మన భరతఖండము ఏబది యారు దేశములుగా – అనగా రాజ్యములుగా – విభజింపబడియుండినది. వాటి ఎల్లలు నిర్దిష్టముగా నిర్ణయింపబడియుండినవి. ఆయా రాజ్యములను ఆయా రాజవంశములవారే వంశపారంపర్యముగా పాలించుచుండిరి. ఆ రాజ్య ప్రజలను, రాజును ఆరాజ్యము పేరుతోనే – అనగా పాంచాలురు, మాగధులు, వైదర్భులు – అని వ్యవహరించెడివారు. ఒకవేళ ఒక రాజ్యమువారు మరొక రాజ్యముపై దండెత్తి ఓడించినను, కప్పములు కానుకలు అను పేరుతో వారి సంపదను సంగ్రహించి, ఆ రాజ్యమును ఆ రాజునకే వదలిపెట్టి – ఒక వేళ యుద్ధములో ఆ రాజు మరణించిన యెడల వాని వారసునికి వదలిపెట్టి వెళ్ళిపోయెడివారు. అంతేకానీ ఆ రాజ్యమును ఈ రాజ్యముతో కలుపుకొనుట యెప్పుడును జరిగెడిది కాదు.

సార్వభౌమత్వ బిరుదము కోరి ఏ రాజైనను అశ్వమేధము, రాజసూయము మొదలైన యజ్ఞములు చేయునపుడు జైత్రయాత్రలు చేసి అనేక రాజ్యములను జయించి వారి నుండి కప్పములు కానుకలు గ్రహించి తమ సార్వభౌమత్వమును వారి చేత అంగీకరింపజేసెడివారే

గానీ ఆ రాజ్యములను తమ రాజ్యములో లీనము చేసికొనెడివారు కారు. ఎంతటి పరాక్రమ వంతులైన రాజులైనను ఈ కట్టడిని మీరిన వారు కారు. శ్రీరాముడు ఏలినది కోసలనే. దుర్యోధనుడు, ధర్మరాజు ఏలినది కురురాజ్యమునే. నలచక్రవర్తి ఏలినది నిషధనే.

ఈ విధానము యుగముల పర్యంతము కొనసాగినది. అప్పుడు ఆయా రాజ్యప్రజలకు ఇది మా రాజ్యము, ఇతడు మా రాజు, ఇది మా రాజవంశము అను స్పృహయు, ఏకీభావమును ఉండెడివి. రాజులోనూ అట్టి భావమే ఉండెడిది. అదే రాజభక్తి. అదే దేశభక్తి అదే జాత్యభి మానము. ఈ విధానము మౌర్యచంద్రగుప్తుడు మగధ సామ్రాజ్యమును స్థాపించు వరకు కొనసాగినది.

యవనుల దండయాత్ర మన భరతఖండ స్వరూపమును మార్చివేసినది. స్వరూపమునే కాదు. స్వభావమును కూడ మార్చివేసినది. యవనుల దండయాత్రలను అడ్డుకొనుటకు విశాలమైన, బలమైన సామ్రాజ్యములుండవలెనని కౌటిల్యుడు భావించెను. విస్తృత మగధ సామ్రాజ్యమును ఏర్పాటు చేసెను. పాంచాల, కురు, విదేహ, నిషధ, అంగ, అవంతి రాజ్యములన్నియు మగధ సామ్రాజ్యమున చేరిపోయెను. ఆయా రాజ్యముల నిర్దిష్టమైన, స్థిరమైన సరిహద్దులు చెరగిపోయెను. ఆ కారణముచేతనే ఈ సామ్రాజ్యము మాది అని ఆత్మీయముగా చెప్పుకొనువారును లేకపోయిరి. చిన్న రాజ్యములకే కాదు సామ్రాజ్యములకు కూడ స్థిరమైన హద్దులు లేకపోయెను. చిన్న రాజ్యములవారి తిరుగుబాటు కారణము చేతను, వారి జయాపజయముల కారణము చేతను మహా సామ్రాజ్యముల హద్దులు కూడా తరచు మారిపోజొచ్చెను.

అశోకుడు దక్షిణ దేశము వరకు సామ్రాజ్యమును వ్యాపింపజేసెను. తరువాత ఆ రాజ్యము కుంచించుకొని పోయెను. కొంతకాలము మగధ సామ్రాజ్యము, కొంతకాలము ఉజ్జయిని సామ్రాజ్యము, కొంతకాలము ధాన్యకటక సామ్రాజ్యము – అనగా శాతవాహన సామ్రాజ్యము. ఎవరెవరి సామ్రాజ్యమెంత? ఆ సామ్రాజ్యములు ఎవరివి. ప్రజలవా? రాజులవా? వాటి హద్దు లెక్కడివరకు? చేతనైన వాడు ఆక్రమించుకొన్నంత, చేతకానివాడు వదలుకొన్నంత. ఒక్కొక్క సామ్రాజ్యము ఏ ఒక్క జాతివారిది కాదు. ఏ ఒక్క భాష వారిది కాదు. భిన్న అస్తిత్వముల వారు, భిన్న జాతుల వారు, భిన్న భాషల వారు తమ అస్తిత్వమును కోల్పోయి మరియొక రాజ్యములో కలిసి యుందురా? మొన్నటికి మొన్న హర్షవర్ధనుని సామ్రాజ్యమేది? ఎంత విస్తీర్ణము? ఎన్ని జాతులు? సత్యాశ్రయపులకేశిగారి సామ్రాజ్యమేది? ఎంత విస్తీర్ణము, ఎన్ని జాతులు? వీరందరు బలవంతముగా కలిసి యున్నను నివురుకప్పిన నిప్పువలె లోలో రాజుకొనుచుందురు కాని సమరసముగా నుందురా? ఫలితముగా నిరంతర యుద్ధములు, అణచివేతలు, అసంతృప్తి, అనాసక్తి.

ఈ సామ్రాజ్యముల సైన్యములో 'ఇది నా రాజ్యము' అని అభిమానముతో పోరాడు సైనికులేరీ? అందరును కూలికొఱకో, జీతముకొఱకో పోరాడు సైనికులే. రాజులకు సైనిక వ్యయము అధికమాయెను. ఫలితముగా ప్రజలపై పన్నులు అధికమాయెను. పూర్వమెప్పుడో ఆరింట ఒక భాగము పన్నుగా ఉండెడిది. అది నాలుగింట ఒక భాగమునకు హెచ్చెను.

ఇప్పుడు మూడింట ఒక భాగమునకు హెచ్చిపోయెను. ప్రజలకు సుఖశాంతులు నిప్పచ్చర మాయెను. ఇది ఇప్పటి భరతఖండ స్వరూపము, స్వభావము." అర్కభట్టారకుడు తన దీర్ఘ ప్రసంగమును ముగించి మౌనము వహించెను. కొంత సేపు ఎవరును మాట్లాడలేదు.

జయసింహ వల్లభునకు అర్కభట్టారకుని మాటలలో ఒక సన్నని నూలుపోగు దొరికెను. అతడు దానిని పట్టుకొని సాగదీసెను.

"దేశాభిమానమునకు జాతిగాని, భాషగానీ ఆధారమగునని మీ మాటల వల్ల స్పష్టమగు చున్నది. అదియే మేమును చెప్పుచున్నాము. తెలుగుజాతి, తెలుగుభాష ఐక్య భావనతో నుండవలె. ఇతరుల పాలన నుండి తెలుగు వారిని తప్పింపవలె. తెలుగు వారందరు ఒక గొడుగు క్రిందికి రావలె. ఇప్పుడు ఆ గొడుగు వేంగి సామ్రాజ్యమే".

అర్కభట్టారకుడు చిరునవ్వు నవ్వి ఇట్లనెను.

"మీ పెద తండ్రి గారు ఉదారస్వభావముతో తెలుగునేలను మీ తండ్రిగారికి ధారవోసి స్వతంత్ర రాజ్యముగా వెలయించినాడు కనుక సరిపోయినది కాని లేనిచో ఈపాటికి ఈ తెలుగునేల బాదామి సామ్రాజ్యమున కన్నడిగులతో కలిసిపోయి యుండెడిది కాదా? మన భాగ్యవశమున హర్షవర్ధనుడు ఓడినాడు కనుక సరిపోయినది. కానీ, అతడే గెలిచి యుండిన యెడల ఈ తెలుగువారును, ఆ కన్నడిగులును అందరమును కన్యాకుబ్జ సామ్రాజ్యమున చేరిపోయి ఆ ఉత్తరాది భాషల వారికి దండములు పెట్టిడివారము కాదా? మేము తెలుగువారమై యుండియు, నిన్నటివరకు పల్లవరాజ్య ప్రజలుగా నుంటిమి. ఈనాడు వేంగిరాజ్య ప్రజలమైతిమి. పల్లవరాజ్యమును స్వాధీనము చేసికొనవలెనను కోరిక మీకు లేదా. మీ కోరిక నెరవేరినచో తమిళుల గతియేమి? వారు ఏ రాజ్యము వారు? వారు వేంగి రాజ్యప్రజల గుదురా? కనుక జాత్యభిమానము, భాషాభిమానము ఇక చెల్లవు. బలమున్నవాని జాతియే ప్రజలజాతి. బలమున్న వాని భాషయే ప్రజల భాష."

జయసింహ వల్లభుడు తల అడ్డముగా ఆడించుచు ఇట్లు సమాధానమిచ్చెను.

"లేదు లేదు. ఇది వరకు సంస్కృత భాష రాజ్యమేలిన ఈ సీమలో మేము తెలుగు భాషను బలోపేతము చేయుచున్నాము. శాసనములు తెలుగులో వ్రాయించుచున్నాము. తెలుగులో ఛందస్సును సృష్టించు ప్రయత్నములు జరుగుచున్నవి. త్వరలోనే తెలుగులో కవిత్వము వెలయగలదు. తెలుగులో సాహిత్యము ఆవిర్భవించగలదు. గ్రంథములు వెలయ గలవు. ఇదంతయు మావలననే – చాళుక్యుల వల్లనే జరుగును."

"తథాస్తు. సంతోషమే. కాని తెలుగులో శాసనములు వ్రాయించు పనిని రేనాటి చోడులు ప్రారంభినారని అక్కడి నుండి వచ్చిన పురోహిత బ్రాహ్మణులు చెప్పినారు".

"తెలుగు భాషకు ప్రాబల్యమును, ప్రాచుర్యమును చేకూర్చు శక్తి రేనాటి చోడులకు లేదు. వారి పరిధి తక్కువ".

"శక్తి లేకపోవచ్చును. కాని ఆసక్తి కలదు".

"అది ఆసక్తి కాదు. అశక్తత. రేనాటి సీమలో సంస్కృత భాషలో శాసనములు వ్రాయు

పండితులు లేరు. కావున తమ వ్యవహారములో నున్న తెలుగులోనే శాసనములు వేయించి నారు. మేమట్లు కాదు. సంస్కృత కవుల మెడలు వంచి తెలుగుభాషలో సారస్వతమును పుట్టింతుము"

అర్కభట్టారకుడు చిరునవ్వు నవ్వి ఊరకుండిపోయెను.

భోజన సమయమైనది.

తన చేతనున్న త్రిభువనాంకుశ త్రిశూలమును ఒక దళపతి కప్పగించి జయసింహ వల్లభుడును, మంత్రి చౌడమరసును అర్కభట్టారకుని వెంట లోపలి గదుల లోనికి వెళ్ళిరి. తక్కిన పరివారమునకు అణ్డెక్కి నుండి భోజనము వచ్చినది. వారందరు బయట చెట్లక్రింద రచ్చలపై భోజన కార్యక్రమము ముగించిరి.

జయసింహవల్లభుడును, మంత్రియు, అర్కభట్టారకుడును భోజనమునకు కూర్చొనగానే వాడుక చొప్పున జయసింహవల్లభుని భోజన శోధకుడు వచ్చి నిలబడెను. జయసింహవల్లభుడు వానిని వెడలిపొమ్మని సైగ చేసెను.

"పరీక్షింపనిండు" అర్కభట్టారకుడు నవ్వుచు పలికెను.

"అక్కరలేదు. మీరేమి వడ్డించినను అది మాకు అమృతప్రాయమే".

భోజన శోధకుడు వెడలిపోయెను.

ప్రొద్దువాటారినది. జయసింహవల్లభునకు అణ్డెక్కిలో చేయవలసిన పనులేవియు లేవు. కావున అతడు చీకటి పడువరకు కొండపైననే గడుపదలచినాడు.

ముువ్వురును కలసి భవనము వెలుపల సంచరించుచు బురుజుల వంటి కట్టడముల సమీపమునకు వచ్చిరి.

"భట్టారకా, ఇక్కడ మీరు కట్టియున్న బురుజుల ప్రయోజనమేమి? వానిపై కనబడుచున్న పరికరముల ఉపయోగమేమి? ఇవి నాకు వింతగా కనబడుచున్నవి. ఇవి మీరు ఆత్మరక్షణకై నిర్మించుకొన్న కట్టడములా? ఆ పరికరములు శత్రువులపై ప్రయోగించు ఆయుధములుగా నాకు కనబడుట లేదు. మీకు అభ్యంతరము లేనిచో నాకు బోధపడునట్లు వివరింప గోరుచున్నాను."

భట్టారకుడు ఇంచుక నవ్వి ఇట్లనెను.

"ఇక్కడ నాకు ఆత్మరక్షణ చేసికొనవలసిన అవసరము లేదు. దొంగలు దోచుకొందు రనుటకు మా వద్ద సంపదలు లేవు. మాకు కీడు చేయతలపెట్టు శత్రువులును లేరు. "భయం భీతాత్ హి జాయతే". మనలను గురించి ఎవరు భయపడుచున్నారో వారి వలననే మనకు భయము, అపాయము కలుగును. ఇక్కడ మాకు భయపడువారెవరును లేరు. కనుక మాకు ఎవరివలనను భయములేదు. అపాయమును లేదు. ఇవి ఆయుధపరికరములు కావు. ఖగోళ పరిశీలనా పరికరములు. దిగంతములు అడ్డములేకుండా కనబడుటకై బురుజులు కట్టినాము. వానిపై నుండి నక్షత్రములను, గ్రహములను పరిశీలించుచున్నాము."

"ఖగోళ పరిశీలనమా? ఇక్కడనా? అది ఎక్కడో ఉజ్జయిని యందు వరాహమిహిరుల వారి గురుకులమున జరుగుచున్నదని వింటిమి. అదియు ఇదియు ఒక విధమైన పరిశీలనలా, లేక వేరువేరా?"

జయసింహవల్లభుని ఆసక్తి అర్కభట్టారకునికి సంతోషము కలిగించెను.

"మహారాజా, మీ ఆసక్తిని చూడగా నాకొక అభిప్రాయమేర్పడినది. చాళుక్యరాజులు కేవలము రాజ్యకాంక్షయు, యుద్ధకాంక్షయు మాత్రమే కలవారు కారు. కొంత శాస్త్రజిజ్ఞాసయు, భాషాభిమానమును కలవారుగా తోచుచున్నది. మీ వంశపరిపాలనలో తెలుగునేలపై కళలును, తెలుగుభాషయు మూడు పువ్వులు ఆరుకాయలుగా విస్తరించగలవు. మీకు ఆసక్తియు, తీరికయు ఉన్నచో మీకు అర్థమగునంత వివరింతును.

ఈ ఖగోళ పరిశీలన ఉజ్జయిని యందు జరుగుచుండుట వాస్తవమే. మాతాత గారు ఉజ్జయినిలో వరాహమిహిరుని యొద్ద కొంత కాలముండి ఖగోళ శాస్త్రమున కొంత కృషి సలిపినారు. ఆ కృషిని మాతండ్రిగారును అందుకొన్నారు. మా తండ్రిగారు నాలుగైదు సంవత్సరములకొకసారి ఉజ్జయినికి పోయి వచ్చుచుండిరి. ఇక్కడ మా తండ్రిగారు చేసిన పరిశోధనలను అక్కడ ఉజ్జయిని వారు చేసిన పరిశోధనలను కలిపి సిద్ధాంతములను రూపొందించుచుండిరి. ఇప్పుడు నేను ఆ పరిశోధనను అందుకొన్నాను. ఇప్పటికే నేను మూడు సార్లు ఉజ్జయిని వెళ్ళివచ్చినాను."

"ఇప్పుడు ఇక్కడ మీరు చేయుచున్న పరిశోధన యేమి?" జయసింహవల్లభుడు కుతూహలముతో అడిగెను.

అంతలో ముప్వురును బురుజులపైకి ఎక్కిపోయిరి. అంతట కలయదిరిగిరి.

"ఇదిగో ఇది ఖగోళమునందు సగభాగము. ఆకాశమునందు మనకు కనబడు ఖగోళము సగము మాత్రమే. మనకు కనబడక అవతల నుండునది సగభాగము. మనకు కనబడుచున్న సగభాగములో దినదినమును కొంత భాగము పడమరవైపున దిగిపోవుచు మనకు కనబడని సగ భాగములో కొంత భాగము తూర్పున ఎక్కి వచ్చుచున్నది. సూర్యుడు ఈ ఆకాశమును ఒక చుట్టు తిరిగి వచ్చుటకు అరువది ఘడియలు పట్టును. ఒక ఘడియకు అరువది విఘడియలు. అనగా మూడువేల ఆరు నూర్ల విఘడియలన్నమాట. అందులో సగమైన వేయిన్ని ఎనిమిది నూర్ల విఘడియలతో ఈ కనబడుచున్న ఆకాశమును విభజించినాము. అది ఈ అర్ధగోళపు రేకు. ఈ రేకుపై నేను గీచిన గీతలు, చుక్కలు గ్రహముల యొక్క సంచార మార్గములు. సూర్యుడు ఖగోళమును చుట్టి వచ్చుటకు దాదాపు మున్నూట అరువది అయిదు దినములపై కొన్ని ఘడియలు పట్టును. అదియే సౌరమాన సంవత్సరము. అట్లే గ్రహములన్నియు ఖగోళము చుట్టును వేరువేరు వేగములతో చుట్టి వచ్చుచున్నవి. అన్ని గ్రహముల చారములను ఉజ్జయినిలోనూ, కాశ్మీరమునందును, పాటలీపుత్రమునందును, మన అణ్డెక్కిలోనూ దాదాపు నిర్దుష్టముగా లెక్కకట్టియున్నారు. కాని ఒక్క శనిగ్రహము యొక్క సంచారము మా లెక్కలను చిక్కుపెట్టుచున్నది. శనిగ్రహము ఖగోళమును చుట్టి వచ్చుటకు

దాదాపు ముప్ఫై సంవత్సరములు పట్టుచున్నది. అందులోనే వక్రగతులును ఉన్నవి. ఈ వక్రగమనము సమానవేగమున జరుగుట లేదు. కొంతకాలము స్తబ్దత కనబడుచున్నది. దీనిని సరిగా లెక్కకట్టుటకు శనిగ్రహము యొక్క ఒక పరిభ్రమణమును పరిశోధించినచాలదు. ఎన్నియో భ్రమణములను పరిశోధించవలసి యుండును. ఆ లెక్కన రెండు మూడు తరముల శాస్త్రజ్ఞులు పరిశోధించిననే కాని శనిగ్రహ సంచారము నిర్దుష్టముగా లెక్కలోనికి రాదు. మా తండ్రిగారును నేనును కలిసి ఇప్పటికి మూడు పరిభ్రమణములను మాత్రము గుర్తించి లెక్కలు కట్టియున్నాము. ఇదిగో ఈ పటములన్నియు ఆ లెక్కలే. మైనపు వస్త్రములపై ఆ లెక్కలు లిఖించిపెట్టినాము. నేను రెండుసార్లు ఉజ్జయినికి పోయినప్పుడు నా లెక్కలను వారి లెక్కలతో సరిపోల్చినాము. వక్రగతిలోని స్తబ్దతకు కారణమును కొంత వివరించినాను. ఇంకను పరిశీలింప వలసియున్నది. ఈసారి పోయినప్పుడు దీనిపై ఒక స్థిరమైన లెక్కకట్టి ఒక సిద్ధాంతమును రూపొందించెదము."

"ఆ స్తబ్దతకు కారణమేమో ఇప్పుడు వివరింపగలరా?" రాజు ఆసక్తితో అడిగెను.

"వివరింపవచ్చును గానీ అది మీకు అర్థము కానలెనన్న అనేకములైన ప్రాథమిక విషయములు తెలిసి యుండవలె. అది అట్టి గణిత పండితులకు మాత్రమే అర్థమగును. ఇతరులకు అర్థము కాదు. అటులన్నందులకు క్షమించవలె. అన్యథా భావింపవలదని మనవి."

"ఇక్కడ ఈ పరిశోధనలన్నియు మీరొకరే చేయుచున్నారా. లేక మీకు సహాయకులెవరైనా ఉన్నారా?"

"సహాయకులు లేకుండా ఇంత పరిశోధన యెట్లు జరుగును. నా యొద్ద ఎల్లప్పుడును ఇరువది మందికి తక్కువ లేకుండా శిష్యులు శిక్షణ పొందుచు సహాయకులుగా ఉందురు. క్రొత్తగా వచ్చువారు వచ్చుచుండగా పాతవారు వెళ్ళిపోవుచుందురు. కొందరు వచ్చి నేను గుణించి వ్రాసిపెట్టిన పంచాంగములకు ప్రతులు వ్రాసికొని పోదురు. కొందరు కొన్ని సంవత్సరములు నా యొద్దనే యుండి పంచాంగ గణన విద్యను నేర్చుకొని వారివారి స్వస్థలములకు పోయి పంచాంగములు వ్రాసుకొందురు. కొందరు ఖగోళ పరిశోధనపైన ఆసక్తి చూపి గ్రహనక్షత్ర చారములను పరిశీలించి గుణించుట నేర్చుకొందురు. ఇట్టి విద్యలో ప్రవీణులైన వారికి నౌకా యానములో ఎక్కువ అవసరమేర్పడును. మన తూర్పు సముద్ర తీరములలోని అనేక రేవు పట్టణముల నుండి బ్రహ్మ, సువర్ణ, చంపా, యవ, చీన దేశములకు నౌకల రాకపోకలు విశేషముగా జరుగుచున్నవి. నెలల పర్యంతము సముద్రములోనే ప్రయాణము. పగలు సూర్య గమనమును, రాత్రుల యందు నక్షత్ర స్థితిని ఏమరకుండా గమనించిననే గానీ నౌక గమ్యము చేరదు. అందుచేత ప్రతి నౌకలోను ముప్వురు నలువురు ఖగోళ పరిజ్ఞానముకలవారుందురు. వారిలో అధికులు ఇక్కడ శిక్షణ పొందిన వారే."

ప్రొద్దుపోయి చుక్కలు పొడిచినవి. ఆర్కభట్టారకుడు జయసింహవల్లభునకు అక్కడ ఉన్న పరికరములు ద్వారా ఆనాడు ఆకాశమున పడమర కనబడుచున్న శుక్రగ్రహమును... నడిమింట కనబడుచున్న శనిగ్రహమును చూపెను. ఆకాశమున ఆ గ్రహములు రెండును

ముందునాడు ఉండిన స్థానములను, ఆనాడు ఉండిన స్థానములను గుర్తింపజేసెను. వెంౖడుకవాసి భేదమును గుర్తింపజేసెను. శని యొక్క మందగమనమును వివరించెను. ఆ మంద గమనము వల్లనే శనిౖగహమునకు శనైశ్చరుడనియు, మందుడనియు పేర్లు వచ్చెననియు చెప్పెను.

చీకట్లు దట్టముగా ౖకమ్ముకొన్నవి. అందరును బురుజు దిగి ఇంటిలోనికి వచ్చిరి. జయసింహవల్లభుడు అణ్డెక్కికి పోవుటకై అర్కభట్టారకుని సెలవడిగెను.

"ఇక్కడినుండి మీరు ఎక్కడికిపోనున్నారు. మీ ఉపరికార్యౖకమమేమి?"

"ఇప్పుడు మా జైౖతయాౖత కందుకూరుపైకి. మధ్యలో మరియొక చిన్న పనియు ఉన్నది. ఇక్కడికి తూర్పుగా కొంతదూరమున ౖకొత్తగా పంౖడెండు బోయకొట్టములు వెలసిన వట. వారు పూర్వము మన సాౖమాజ్యములోనివారే. యుద్ధములలో బాగుగా చితికిపోయి ఇక్కడికి వచ్చి పంౖడెండు కొట్టములు నిర్మించుకొని ౖబతుకుచున్నారట. కొట్టము అనగా కొన్ని ౖకోసుల విస్తీర్ణముగల పరిపాలనా విభాగము. ఆ బోయలు మొన్నకొందరు వర్తకులతో ఏదో గొడవ పడినారట. ఆబోయలెవరో, ఎటువంటివారో చూడవలె. వారిని పల్లవుల ఆధిపత్యము నుండి విడిపించవలసియున్నది. మన ఆధీనములోనికి తెచ్చుకొనవలసి యున్నది. ఎల్లుండి అక్కడికే ౖపయాణము".

"ఇంతటి సైన్యముతోనా?"

"అవునుమరి. ఎంతో కొంత దెబ్బతగలనిదే బోయలు మనకులోబడుదురా?"

"వారిని కేవలము యుద్ధములో జయించిన చాలదు. వారిని మానసికముగా కూడ జయింపవలె."

"అది ఎట్లో తోచుటలేదు"

"వారిని చతురుపాయములతో స్వాధీనము చేసికోవలె. వారు అనాగరికులు. స్వతంౖతులు. మొరటువారు. వారితో నెయ్యము కానీ కయ్యము కానీ అతిత్వరలో ఏర్పడును. మీ సైనికులు కూలికి, జీతమునకు యుద్ధము చేయువారు. బోయలు ఆత్మరక్షణకై యుద్ధము చేయువారు. వారి యెదుట మీ సైనికులు నిలుచుట కష్టము. వారిని లొంగదీసుకొన్న తరువాత మీరు చేయవలసినపని చాల ఉన్నది" అర్కభట్టారకుడు కొంతసేపు ఆలోచించి మరల చెప్పసాగెను.

"ఆ ౖపాంతమున ఇంకను కొందరు బౌద్ధ బిక్షువులు సంచారము చేయుచు బౌద్ధ ధర్మమును ౖపచారము చేయుచున్నారట. వారు బౌద్ధ ధర్మమును ౖపచారము చేయుట వలన కొంత నష్టమున్నది. బౌద్ధులు నిరీశ్వరవాదులు. స్వర్గనరకములు లేవందురు. అందువలన ౖపజలలో పాపభయమునశించును. పామరులు విశృంఖలత్వమునకు అలవాటగుదురు. వైదికమతము కూడ భగవంతుని నిరాకారుడనియు, నిర్గుణుడనియు, నిరంజనుడనియు పేర్కొనుచున్నది. అట్టి నిరాకార నిర్గుణ భగవత్తత్త్వము నందు జ్ఞానులు మాౖతమే మనస్సును లగ్నము చేయగలరు. పామరులకు సగుణ, సరూప దేవతామూర్తి కనబడిననేగాని మనస్సు లగ్నముకాదు. భగవంతుని యందు మనస్సులగ్నమైననేకాని పాపపుణ్యముల భావనయు,

ధార్మిక భావనయు ఏర్పడదు. స్వర్గనరకముల భావన ఉండిననేకాని ప్రజలు సన్మార్గ ప్రవర్తకులు కాలేరు. కావున పామరులైన బోయలకు స్వర్గనరక భావన కలిగించవలె. వారి కొట్టములకు కొందరు బ్రాహ్మణులను పంపవలె. ఆ బ్రాహ్మణులు ఆ కొట్టములలో కాపురముండి వారికి ధర్మబోధ చేయవలె. గుండ్లకమ్మ నుండియు ముస్సివాగు నుండియు కాలువలు తీసి వ్యవసాయ మును వృద్ధి చేయవలె. చాళుక్యరాజులు కేవలము పన్ను గుంజుకొని పోవువారే కాని ప్రజలకు ఏమియు మేలు చేయువారు కారు అను అపప్రథ రానీయకుండా చూడవలె. చాళుక్యరాజులు తమవారే. తమ శ్రేయోభిలాషులే అనుభావమును వారిలో కలిగించవలె."

అర్కభట్టారకుని మాటలు జయసింహవల్లభుని మనస్సుపై తమ ప్రభావమును చూపనే చూపినవి. ఆలోచించి ఆలోచించి "అవును ఇది మంచి ఆలోచన. అవశ్యము ఆ విధముగానే చేయుదుము" అనెను.

జయసింహవల్లభుడును, అతని పరివారమును నగరు చేరుకొనిరి. మూడవ దినము పెద్ద చాళుక్య సైన్యము బోయకొట్టముల దిశగా బయలుదేరెను.

# 3

# మంగసాని

జయసింహ వల్లభుని జైత్రయాత్ర వార్త కట్టెపు దుర్గములోనూ, పండ్రెండు బోయ కొట్టములలోనూ కల్లోలమును రేపినది. వీరనబోయని భార్య మంగసాని వృద్ధురాలు. కొడుకులు మరణించినారు. మనుమలు పసివారు. వారిలో పెద్దవాని వయస్సు పదునెనిమిది యేండ్లు. వాడే వర్తకుల భటులతో గొడవ పెట్టుకొని రెండు దెబ్బలు కొట్టి నాలుగు దెబ్బలు తిని వచ్చినవాడు.

అట్టి పరిస్థితులలో బోయలు చాళుక్య సైన్యమును ఎదిరించుట కలలోని వార్త.

అణ్డెక్కిలో జరిగిన యుద్ధము, రుద్రమనాయకుని వీరమరణము మొదలగు వార్తలు పల్లవరాజ్యమంతట దావానలము వలె వ్యాపించెను. కందుకూరు రాజప్రతినిధి జయవర్మ మరణించి చాల కాలమైనది. ఇప్పుడతని కుమారుడు గోవిందవర్మయే రాజప్రతినిధి. ఈ గోవిందవర్మ పరాక్రమవంతుడును కాదు, రాజనీతి చతురుడును కాదు. చాళుక్యుల దండయాత్రను గురించి విని వానికి కాళ్ళు చేతులాడలేదు. కాంచీపురము నుండి మరింత సైన్యమును కొనివత్తునను నెపముతో అతడు కాంచీపురమునకు పారిపోయెను. ఇక బోయకొట్టములవారిని పల్లవులు ఆదుకొందురను మాట కల్ల. ఈ సంగతులన్నియు మంగసానికి తెలియును. తామెంత, తమ శక్తియెంత? ఎక్కడి నుండియో యెత్తివచ్చి ఇక్కడ ఇప్పుడిప్పుడే నిలద్రొక్కుకొనుచున్న తాము జాగ్రత్తగా ఉండవలె. ఝంఝామారుతము నెదిరించి తాటిచెట్టు కూలిపోవుచున్నది. తలవంచుకొనిన గడ్డిపోచ తరువాత తల యెత్తుకొని నిలబడుచున్నది. ప్రస్తుతమునకు అదియే రాజనీతి.

మంగసాని తన మనుమలు తన ఇరువైపులా రాగా, వారి వెనుక కొందరు వృద్ధులు రాగా, వారి వెనుక ఇతర ప్రముఖులు నూరుమంది నిరాయుధులైరాగా, వారి వెనుక సాధారణ ప్రజలు వేయి మంది వెంటరాగా కదలినది. కోటకు కొంత దూరముననే చాళుక్య సైన్యమునకు ఎదురేగినది. అప్పటికే చాళుక్య సైనికులు కోటను ముట్టడించుటకు, కోట చుట్టును తిరిగి వచ్చుటకు సిద్ధపడుచున్నారు.

ఈ నిరాయుధులైన జనసమూహమును, వారికి నాయకత్వము వహించి నడిపించుచున్న వృద్ధురాలిని చూచి జయసింహవల్లభుడు నివ్వెఱపోయినాడు. ఆ నిరాయుధ జనముపై తన సైనికులు తొందరపడి ఆయుధములను ప్రయోగింపకుండా కొమ్ముల వారిచే నిలువుధార పట్టించెను. రణోత్సాహముతో ఆయుధములను ఊపుచు ముందుకు వచ్చుచుండిన సైన్యము ఆగినది. బెత్తాలవారి హెచ్చరికతో సైన్యము దారి వదలగా జయసింహ వల్లభుడు ముందుకు

వచ్చి తన భద్రగజమును నిలిపి క్రిందికి దిగి నిలబడెను.

మంగసాని చేసైగ చేయగా ప్రక్కనున్న వారు తమతో తెచ్చిన జింక చర్మములు, తేనె, కంచి నుండి తెచ్చిన సరిగంచు చీనాంబరములు, రత్న ఖచితమైన ఒక సువర్ణహారమును పళ్ళెరములో పెట్టి మంగసానికి అందిచ్చిరి. ఆమె వాటిని అందుకొని జయసింహ వల్లభుని పాదముల చెంత పెట్టి నమస్కరించెను. తన మనుమల చేత జయసింహవల్లభునికి సాష్టాంగ నమస్కారములు చేయించెను.

"మా భాగ్యము. దేవరవారు మా కొట్టములను చూడవచ్చినారు. పేదవారము. మీ సైన్యమునకంతటికిని ఆతిథ్యమునిచ్చుటకు మేమెంతవారము. దేవరవారును, తమరి పరివారమును మా నగరుకు దయచేసి మా ఆతిథ్యమును స్వీకరించి మమ్ములను అనుగ్రహింపవలెనని ప్రార్థించుచున్నాము." మంగసాని చేతులు కట్టుకొని వినయముగా పలికెను.

జయసింహవల్లభుడు అవాక్కయ్యెను. ఆమె వాక్చాతుర్యము అతనిని అబ్బురపఱచినది. చౌడమరసువైపు చూసెను.

చౌడమరసు చిరునవ్వుతో "ఇక మన ప్రయత్నములన్నియు ఆపివేయవలసినదే" అన్నట్లు రెండు చేతులును పెల్లకిల వేసి ఊపెను.

మంగసానివెంట వచ్చిన బోయ జనులు జయసింహవల్లభునికి కానుకలు సమర్పించు సమయమున ఆమెతో "చిత్తము దొరసానీ, అలాగే దొరసానీ" అని గౌరవముగా మాట్లాడుటను జయసింహవల్లభుడు గమనించుచునేయున్నాడు. కనుక ఆ పండ్రెండు బోయకొట్టములకు ఏలిక ఈ వృద్ధురాలే అని గ్రహించినాడు. ఆమెపై ఏలనో ఒక సదభిప్రాయమేర్పడినది.

"దొరసానీ, మీ ఆతిథ్యము ఇప్పుడు కాదు. మొదట మీరు మాకొక సమాధానమీయవలె. మారాజ్యము నుండి కంచికి పోవుచుండిన బేహారులపై మీరు దాడి చేసి దోచుకున్నారని అభియోగము వచ్చినది. బేహారుల నుండి సుంకములు అడిగినారని వర్తమానము వచ్చినది. దీనికి మీ సమాధానమేమి?"

"చిత్తము చిత్తము. దేవరవారికి అంతయు ఎఱుకయే. ఎవరెన్ని కల్పించి చెప్పినను దేవరవారి సూక్ష్మదృష్టికి యథార్థమంతయు తేటతెల్లమే. సుంకమడుగు వారు దోచుకొనరు. దోచుకొనువారు సుంకమడుగరు. బచ్చుల సరుకులను ఎవరును దోచుకొనలేదు. వారే వదలిపెట్టిపోయిరి. వారి సరుకంతయు భద్రముగానున్నది. వారు ఎప్పుడైనను వచ్చి తీసుకొని పోవచ్చును".

"ఏమీ, సరుకంతయు అట్లే ఉన్నదా?" జయసింహవల్లభుడు ఆశ్చర్యముగా అడిగెను.

"చిత్తము. చెడిపోవు సరుకును తీసివేసినాము. చెడని సరుకంతయు వారివారి బండ్లలోనే మాయిండ్ల వద్ద భద్రముగా ఉన్నవి. నెలలుగడచిపోయినవి. ఎంతకాలమైనను అవి అక్కడ నవసి పోవలసినదేకాని ప్రాణము పోయినను పరుల సొమ్ము సున్నపాకు తొడిమైనను తాకము."

ఆమె మాటలకు జయసింహవల్లభుడును, అతని చుట్టునున్న పరివారమును ఆశ్చర్య చకితులైరి.

జయసింహవల్లభునకు మరి ఏమి మాట్లాడుటకును తోచలేదు. అయినను బింకముతో మరల అడిగెను.

"మరి బచ్చులనెందుకు కొట్టి తరిమినారు"

"వారు మా బిడ్డలను మూటలు మోయుటకు కూలికి రమ్మన్నారు. ఇదిగో వీడు. వీడు పంద్రెండు బోయకొట్టములకు నాయకుడుగా ఉండిన వీరనబోయని మనుమడు. అదిగో వారు. వారు వీరనబోయని తమ్ముని మనుమలు. వీరినా వారు మూటలు మోయ రమ్మనుట? చెప్పినప్పుడైనను తెలిసికొనవలెకదా. వారు మా బిడ్డలను కొట్టి బండ్లకు కట్టివేసినారు. వారిని విడిపించుకొనుట కొఱకు మావారు కొందరు పోయి స్వల్పముగా బాణప్రయోగము చేసినారు. వారు బెదరి పారిపోయినారు."

"స్వల్పముగా బాణప్రయోగమా? భటులు, గుఱ్ఱములు. ఎడ్లు అన్నియు గాయపడినవి. అది స్వల్పబాణప్రయోగమా?"

"చిత్తము. స్వల్ప బాణప్రయోగము కనుకనే గాయములతో బయటపడినారు. గట్టి బాణ ప్రయోగమే అయి యుండిన యెడల పరిస్థితి దారుణముగా నుండెడిది."

జయసింహవల్లభుడు మరల అప్రతిభుడైనాడు. ఏమి ఈ ముసలామె మాటలలోని తీవ్రత, ధైర్యము. గట్టి బాణప్రయోగమే అయినచో పరిస్థితి దారుణముగా నుండెడిదా? అనగా అందరును చచ్చియుందురనియే కదా అర్థము. బోయజనులంతటి విలుకాండ్రా?

"ఇప్పుడు మీ పరిస్థితి దారుణము కాదా"

బోయజనుల వెన్నులలో వణకు పుట్టెను. మంగసాని యెంతమాత్రము బెదరలేదు.

"చాళుక్య ప్రభువులు న్యాయము తప్పక పాలింతురని మా నిండు నమ్మకము" జయసింహవల్లభుడు మెచ్చుకోలుగా తలయూపెను. చౌడమరసు చిరునవ్వునవ్వెను.

అంతలో బచ్చులు ముందుకు వచ్చిరి. బండ్లలో లక్షలు విలువచేయు సరుకున్నది. అంతయు భద్రముగా ఉన్నదట. ఎంత అదృష్టము!

"దేవరవారి సెలవైనచో మేము మాసరుకులు తెచ్చుకొందుము".

మంగసాని మెల్లగా "ఒక మనవి. ఎడ్లను, గుఱ్ఱములను ఇన్ని నెలలుగా జాగ్రత్తగా మేపుకొన్నాము. అవి మాకు బాగా మాలిమియై పోయినవి. మాకు చాల ఉపయోగపడుచున్నవి. అందుపై దేవరవారి చిత్తము" అనెను.

జయసింహవల్లభునికి నవ్వు వచ్చెను. దొరసాని ఉద్దేశము అర్థమైపోయెను. ఎడ్లను గుఱ్ఱములను తనకే కావలెననుచున్నది.

"మరియొకమనవి"

వృద్ధురాలు మంగసాని ఏమి మాట్లాడినను జయిసింహ వల్లభునికి విసుగుగానీ కోపము గానీ కలుగుటలేదు. సంతోషముగానే ఉన్నది. ఆమె స్థిరచిత్తతయు, మాటల పొందికయు, మాటలలో దాగియున్న నిశితత్వమును, వినయమును అతనికి ముచ్చట గొలుపుచున్నది. ఇట్టి బోయవారినా అనాగరికులు, మొరటువారు అనుచున్నారు!

"ఏమి?" అన్నట్లు జయసింహవల్లభుడామె వైపు చూచెను.

“సాతువారిని గానీ, చిన్నవర్తకులనుగానీ ఎవరినీ మేము ఎన్నడును సుంకము అడుగలేదు. మా హద్దులు మేమెఱుగుదుము. మా సమీపమున దిగు ఓడ సరుకులపైననే మేము సుంకము గ్రహించుచున్నాము. అదియు పల్లవ ప్రభువుల ఆజ్ఞ చొప్పుననే. ఇది యథార్థము.”

వేగులు చెప్పిన మాటలును, ఇప్పుడు దొరసాని చెప్పుచున్నమాటలును సరిపోయినవి. బచ్చులును, వారిభటులును అతిశయోక్తులు, అబద్ధములు కలిపి చెప్పినారు. తప్పంతయు సాతువారిదే. దొరబిడ్డలమని చెప్పుచున్నను వారిని కూలికి పిలుచుట తప్పు. వారిని కొట్టి కట్టివేయుట రెండవ తప్పు. కట్టివేయబడిన బోయ యువకులను విడిపించుటకు బోయలకు మరియొక మార్గము లేదు. కానీ ఎవరినీ చావనీయక కేవలము గాయపరచిన వీరి విలువిద్యా నైపుణ్యము మెచ్చుకొనదగినది. ఒకసారి పరీక్షించి చూడవలె.

రాజు వర్తకుల నాజ్ఞాపించెను.

“శ్రేష్ఠులు ఎక్కడైనను ఎడ్లను విలుచుకొని వచ్చి మీ బండ్లను, సరుకులను తోలుకొని పోవచ్చును.”

శ్రేష్ఠులు వెంటనే తమ మనుష్యులకు పైకమిచ్చి దూరపు గ్రామములకు తరిమిరి. జయసింహవల్లభుడు మంత్రితో “రేపటి వరకు మనము ఇక్కడే ఉండవలె” అనెను. మంత్రి ఆ ఏర్పాట్లను గావించుటకు తగు మనుష్యులను ఆజ్ఞాపించెను.

“దొరసానీ, మాకు ఆతిథ్యమిచ్చు శ్రమ తీసికోవలదు. నీ మాటయే చాలును. ఈ సాయంత్రము ప్రొద్దుగ్రుంకకముందే మీరును. మీపంద్రెండు బోయకొట్టముల ప్రముఖులును మా దర్శనము చేసికొనవలసినది. రేపు మీ బోయకొట్టముల విలుకాండ్రకు పరీక్ష పెట్టబోవు చున్నాము. నూరు మందిని ఎన్నికచేసి పిలిపించండి” మహారాజు గారి ఈ మాటతో బోయజనులు బ్రతుకు జీవుడా అని దండములపై దండములు పెట్టుచు వెడలిపోయిరి. ఒక ఘడియలో గొల్లెనలు లేచినవి. మరి రెండు ఘడియలలో ఆహార పదార్థములు సిద్ధమైనవి.

సాయంత్రమునకు క్రొత్త ఎడ్లు వచ్చినవి. బచ్చులు తమ తమ బండ్లలోని సరుకులను సరిచూచుకొని, మూటలు కట్టియుంచిన సరుకులను కూడ తీసుకొని బండ్లు కట్టించుకొని వంగవోలు వైపు సాగిపోయిరి.

ప్రొద్దుగ్రుంకు సమయమున మంగసానియు, ఆమె పెద్ద మనుమడు వీరనబోయడును, పంద్రెండు కొట్టముల నుండి ఇద్దరేసి చొప్పున ఇరువది నలుగురు పెద్దలును మహారాజు దర్శనావసరము వేచి నిలిచిరి. అంతలో రాజపరివారము గొల్లెనల ముందు భాగమున నాలుగు ఉన్నతాసనములను తెచ్చి పెట్టి కొంత ఎడముగా నిలబడిరి. గొల్లెన ద్వారముకడ మహారాజు రాకను సూచించుచు కలకలము వినబడగానే బోయలు మాటలు చాలించి సావధానులైరి.

మహారాజును, మంత్రియు, సేనాధిపతియు, పురోహితుడును గుడారము వెడలివచ్చి ఆసనములపై కూర్చుండిరి. మహారాజు ఆసనమున కానింపబడిన త్రిభువనాంకుశము ధగధగ మెఱయుచుండెను. మహారాజు బోయలను కూర్చుండమని చేతితో సైగ చేసెను. దొరసానియు, ఆమె మనుమడును బోయలు తెచ్చి వేసినచాపపై కొంతముందు భాగమున కూర్చుండగా

తక్కినవారందరును ఆమె వెనక కూర్చుండిరి. మంగసాని మనుమనికి త్రిభువనాంకుశమును చూపి "అది మీతాత చేయించినది" అని చెప్పెను. వీరనబోయడు దాని వైపు కుతూహలముతో చూడసాగెను.

"వీడేనా వీరనబోయని వారసుడు?" మహారాజు అడుగగా వెనుకనున్న ఇద్దరు ముగ్గురు పెద్దలు "చిత్తము చిత్తము" అని పలికిరి.

"పేరు?"

"వీరనబోయడు – తాతగారి పేరే మనుమనికిని పెట్టినాము"

"మీ తాత గొప్ప వీరుడనీ, అనేక యుద్ధములలో పాల్గొన్నవాడనీ. ఈటెను విసరుటలో అంతటి నేర్పరి మరియొకడు లేడనీ వినియుంటిమి. మీ తాత పేరు నిలబెట్టవలె" సేనాధిపతి కన్ను లెగురవైచుచు చెప్పెను. బాలవీరన బోయడు తలవంచుకొనెను.

"జాగ్రత్తగా వినుడు" జయసింహవల్లభుడు ప్రారంభించెను. "మా తండ్రి గారును, మా పెదతండ్రిగారును వేంగి రాజ్యమును స్వాధీనము చేసికొను సందర్భమున జరిగిన యుద్ధములోనూ, తరువాత జరిగిన మరికొన్ని యుద్ధములలోనూ మీరు విశేషముగా నష్టపోయినారు. ఆ గందరగోళ పరిస్థితులలో మాకు మిమ్ములను గురించి ఆలోచించు అవకాశము లేకపోయెను. మీరు అంత తొందరగా మీ తావును వదలిరాకుండా అక్కడనే నిలిచి యుండిన యెడల మా తండ్రిగారు మీకు రక్షణయు, జీవికయు కలిగించి యుండెడి వారు. తొందరపడి మీరు మాకు దూరమైతిరి."

జయసింహవల్లభుడిట్లనగానే మంగదొరసాని "లేదు లేదు దేవరా – మేము ఎప్పుడును దేవరవారికి దూరస్థులముకాము. మీరే మమ్ములను దూరము చేసికొంటిరి. యదార్థము చెప్పుటలో తప్పులేదు. ఆనాడు మేము మా ప్రభువులైన విష్ణుకుండినుల పక్షమున మీకు వ్యతిరేకముగా యుద్ధము చేసిన మాట నిజమే. కానీ రాజ్యము మీ స్వాధీనమైన తరువాత మాకు ప్రభువులెవరు? మీరే కదా. మీరు మమ్ములను మీ ప్రజలుగా చూడవలె కదా.

మీరు ప్రభువులైన తరువాత మీ సైనికులు మమ్ములను శత్రువులుగానే చూచి అనేక విధముల వేధించిరి. హింసించిరి. మాకు గత్యంతరము లేక మా జన్మస్థలమైన త్రిపురాంతకము వదలి పల్లవ రాజుల ప్రాపకములో ఇక్కడ చేరవలసి వచ్చినది." అనెను. ఆనాటి సంగతులు జ్ఞాపకము వచ్చి ఆమె కంఠము గద్గదమైపోయెను.

"సరిసరి. జరిగిపోయినదేమో జరిగిపోయినది. మీరు తెలుగువారు. మేమును తెలుగు వారము. ఇది తెలుగు గడ్డ. మనమందరము ఒకజాతి. విష్ణుకుండినులు అసమర్థులై ఈ దేశమును పల్లవులకు ధారపోసిరి. ఇక అట్టివి జరుగవు. అణ్ణెక్కిని పల్లవుల చేతి నుండి విడిపించితిమి. రేపు మేము కందుకూరుపైకి ఎత్తిపోవుచున్నాము. అదియు మన రాజ్యము లోనిదే – కావున ఇక మీదట మీరు వేంగి రాజ్యమునకు విశ్వాసపాత్రులై ఉండ వలె. పల్లవులుమీకు ఎట్టి అనుమతులు ఇచ్చియుండిరో ఆ అనుమతులన్నియు మేమును ఇచ్చు

చున్నాము” అని మహారాజు అనగానే బోయలు” చిత్తము చిత్తము. ధర్మప్రభువులు.” అని చేతులెత్తి నమస్కరించిరి.

మహారాజు మంత్రివైపు చూచెను.

మంత్రి ప్రారంభించెను.

“మీ పండ్రెండు బోయకొట్టములకు ఈ బాలుడు వీరనబోయడే ప్రభువు. ఇది వంశపారం పర్యముగా కొనసాగును. సమర్థుడనిగానీ, పరాక్రమవంతుడని గాని, మేధావి అనిగాని ఒక్కొక్కసారి ఒక్కొక్క ప్రభువును మార్చుచుండిన యెడల ఆ పదవిని ఆశించువారు పెక్కురు బయలుదేరుదురు. స్పర్థలు పెరుగును. ఐకమత్యము చెడును. ప్రభువు పట్టము వంశపారం పర్యము చేసిన యెడల ఈ స్పర్థలుండవు”

బోయలు “చిత్తము చిత్తము. ఈ వీరనబోయడే మా నాయకుడని మేమెప్పుడో తీర్మానించు కొంటిమి” అనిరి.

మంత్రి కొనసాగించెను. “మీ ఫలసాయములో నాలుగింట ఒక భాగము మాకు పన్నుగా చెల్లించవలె. మీరు మేపుకొను గొఱ్ఱెలలో, మేకలలో ఇరువది జీవముల మందకు ఒక పోతు జీవమును పన్నుగా చెల్లించవలె. ఇవి మహారాజుగారి బొక్కసమునకు చేరును.

ఇక మీ అవసరములకు, పరిపాలనకు, రక్షణకు కావలసిన పన్నును మీయిష్టము చొప్పున విధించుకొన వచ్చును. దానితో మాకు సంబంధములేదు.” అని మంత్రి చెప్పగానే బోయలు – “ప్రభువులు ధర్మాత్ములు – చల్లగా ఉండవలె.” అనిరి.

“మీరు విలువిద్యలో గట్టివారని విన్నాము. మీరు ఆ పేరు నిలబెట్టుకొనవలె. యువకులకు గట్టిగా శిక్షణ ఈయవలె. అత్యవసర యుద్ధ సమయములలో మీ పండ్రెండు బోయకొట్టముల నుండి విలుకాండ్రు మా సేవలోనికి రావలె.” అని మంత్రి అనుచుండగా మంగ దొరసాని–

“దేవరవారు క్షమించవలె. మేము ఇప్పుడిప్పుడే ఇక్కడ కుదురుకొనుచున్నాము. అప్పటి యుద్ధములలో చాలమందిని కోల్పోయినాము. విలువిద్యా నిపుణులందరును పోయిరి. ఉన్నవారు అందరును పిల్లవాండ్రే. ఇంకను అభ్యాసస్థితిలోనే యున్నారు” అనెను.

తరువాత పురోహితుడు మహారాజువైపు చూచెను. మహారాజు తలయూచెను. పురోహితుడు మెల్లగా ప్రారంభించెను.

“మనుష్యులకు తినుట, పనిచేయుట, నిద్రపోవుట, సంసారము చేయుట, పిల్లలను కనుట ఇవియే పరమార్థము కాదు. ఈ పనులన్నియు జంతువులు కూడ చేయుచున్నవి. మనము మనుష్యులమైనందుకు మనము జంతువులకంటే మేలుగా ఉండవలెకదా. జీవునికి ఈ లోకమొకటే కాదు. పరలోకమొకటి యున్నది. పునర్జన్మ యొకటి ఉన్నది. మనము తెలిసియో తెలియకయో ఏవేవో తప్పులు చేయుచున్నాము. ఆ తప్పుల వలన పాపము కలుగును. ఆ పాపము వలన మనము పరలోకములో నరక శిక్షను అనుభవింతుము. మంచి పనులు చేయుట వలన పుణ్యము కలుగును. ఆ పుణ్యము వలన పరలోకమున సుఖములను అనుభవింతుము. మన పాపపుణ్యములను గమనించి తీర్పు చెప్పు భగవంతు

దున్నాడు. ఆ భగవంతుడే ప్రపంచమును సృష్టించుచున్నాడు, రక్షించుచున్నాడు, చివరకు నశింపజేయుచున్నాడు. అట్టి భగవంతుని యెడల మనము భక్తి కలిగి యుండవలె. పూజించవలె. ధ్యానించవలె. అప్పుడే మనము భగవంతునికృపకు పాత్రులమై పాపమునుండి దూరమగుదుము.

"ఈ బౌద్ధభిక్షువులు దేవుడు లేడనుచున్నారు. పాపపుణ్యములు, స్వర్గనరకములు లేవను చున్నారు. ఎంత తప్పు! ఎంతో మంది మహా ఋషులు ఎంతోకాలము తపస్సు చేసి కనుగొన్న విషయములను ఈ బౌద్ధులు ఒక మాటతో కొట్టి వేయుచున్నారు. వారు నరకమునకు పోవుదురు. వారి మాటలు నమ్మరాదు. మనము దేవాలయములు కట్టుకొనవలె. సదా చారములను అలవాటు చేసికోవలె. చదువునేర్చుకోవలె. చదువనగా సంస్కృతము కాదు. మనము మాట్లాడుకొను తెలుగే. చదువను వ్రాయను నేర్వవలె. భారతము, రామాయణము చదివించుకొని వినవలె".

"అవన్నియు మాకెట్లు తెలియును? మాకెవరు చెప్పుదురు? ఎవరునేర్పుదురు?" అని ఒక వృద్ధ బోయడు పెదవి విరిచెను.

"మేము అణ్ణెక్కి నుండియు, వంగవోలు నుండియు, వినుకొండ నుండియు కొందరు బ్రాహ్మణులను పంపెదము. వారిని మీ గ్రామములలో నుంచుకొని పోషించవలె. వారు మీకు పురాణములన్నియు చదివి వినిపింతురు. మీకు చదువను వ్రాయను నేర్పుదురు. మీ పండ్రెండు పల్లెలలో ఎక్కడ చాలా ఇండ్లున్నవో అక్కడ చిన్న చిన్న శివాలయములను కట్టుకోవలె. నిత్యము పూజలు, భజనలు చేసుకొని ఉత్తమలోకములను సాధించుకొనవలె. ముఖ్యముగా ఈ బౌద్ధ సన్యాసుల మాయమాటలలో పడరాదు." పురోహితుడు ముగించగానే బోయలు "చిత్తము చిత్తము అంతకంటే మాకేమి కావలె" అనిరి.

సేనాధిపతి వీరనబోయని వైపు చూచి "వీరనబోయడూ ఇటురా," అనిపిలిచెను. వీరనబోయడు లేచి తన జనులవైపు చూచెను. వారు "పొమ్మ"ని కన్నులతోనే సైగ చేసిరి. వీరనబోయడు పోయి సేనాధిపతి ఎదుట నిలబడెను.

వీరనబోయడు తాతవలె పొట్టివాడుకాడు. కొంత పొడగరియే. పదునెనిమిది యేండ్ల వాడైనను బలిష్ఠుడు. కన్నులలో చురుకుతనము, ధైర్యము కొట్టవచ్చినట్లు కనబడుచున్నవి.

సేనాపతి లేచి నిలబడి వానివైపు ఎగాదిగా చూచి హఠాత్తుగా మెరుపు వేగముతో పిడికిలి బిగించి వాని ముఖము మీదికి విసిరెను. ఆ దెబ్బకు వాని ముక్కు పగిలి పండ్లురాల వలసినదేకాని ఆశ్చర్యము! ఆ బాలుడు అంతకంటె వేగముగా చటుక్కున కూర్చొని వ్రేటు తప్పించుకొని మరల చివ్వున లేచి రెండవ దెబ్బను కాచుకొనుటకై తన ఎడమ ముంజేతిని ముఖమునకు అడ్డముగా పెట్టుకొని కుడిచేతి పిడికిలి బిగించి డేగ కన్నులతో సేనాపతి కదలికలను గమనించసాగెను.

బోయలు ఆఁ ఆఁ అని లేవబోయిరి. మంగసాని వారిని వారించెను.

సేనాపతి నవ్వుచు "భేష్ చురుకైన వాడివే. నాయకుడన్న ఇట్లుండవలె. వీరుడన్న

ఇట్లుండవలె. ధైర్యశాలివి." అని వానిని అక్కున జేర్చుకొనెను. బోయలకండ్లు చెమర్చెను. మంగసాని కన్నులు వెల్లువలైనవి.

అందరును సెలవు తీసికొనిరి.

మరునాడు ఉదయమే చాళుక్య సేనాధిపతి వేయిమంది ఆశ్విక దళముతో బయలుదేరెను. వారిలో ఐదునూర్ల మంది కుంతాలవారును, అయిదునూర్ల విండ్లవారును ఉన్నారు. ఈ బలగముతో అతడు పండ్రెండు బోయ కొట్టములను చుట్టివచ్చుటకు బయలుదేరెను. ఈ పయనములో ఒక ఉద్దేశము బోయలకు చాళుక్య సైన్యము యొక్క మచ్చు చూపుట. రెండవది బోయకొట్టములు విస్తరించిన భూభాగమును పరిశీలనగా చూచుట. వారు మొదట కట్టెపు దుర్గములో సంచరించిరి. కోటలోపలి ఇండ్లు చాల వరకు పూరి యిండ్లే. కొన్ని మాత్రము ఇటుక గోడలపై దూలములు దంతెలు వేసి కట్టిన మిద్దెటిండ్లు. వీరనబోయనిది రెండస్థుల మిద్దె. చుట్టును విశాలమైన ఆవరణము. అక్కడి నుండి వారు పల్లెలను చూడనేగిరి. సముద్ర తీరము వరకు వెళ్ళిరి.

వారు తిరిగి వచ్చునప్పటికి పగలు మూడు జాములు గడిచినవి. రాజుగారి గుడారము ముందర బోయ జనులు చాలమంది చేరియుండిరి. వారిలో యేబది మంది బోయ విలుకాండ్రు ఒక చోట సోలుపులు తీరి విల్లమ్ములు చేత బట్టి నిలుచుకొని యుండిరి.

నిన్నటి వలెనే రాజుగారును, మంత్రియు, పురోహితుడును ఆసీనులై యుండిరి. సేనాధిపతి వచ్చి వారిని కలిసికొని తన ఆసనముపై ఆసీనుడయ్యెను.

నిన్నటి దినమున ప్రకటించినట్లు ఆ సమయమున బోయ విలుకాండ్రకు విలువిద్యలో పరీక్ష నిర్వహింపబడుచున్నది.

చెన్నుబోయడు మహారాజునకు నమస్కరించి "ప్రభువులు మన్నించవలె. మా యువకులందరును ఇంకను ఎక్కువ అభ్యాసము చేయవలసి యున్నది. శిక్షణ ఇవ్వగల మేటి విలుకాండ్రు కొందరే ఉన్నారు. చాలమంది యుద్ధములలో గతించిరి. ఆపైన మా బ్రతుకులు తీర్చి దిద్దుకొను ప్రయత్నములో యువకులు – తీరిక లేకపోవుచున్నారు. యేబది మందిని మాత్రమే ఎన్నికచేసి తేగలిగితిని" అని విన్నవించి వెనుకకు వచ్చెను.

మొదటి పరీక్ష దూర లక్ష్య భేదనము. సేనాధిపతి లేచి ఇట్లు ప్రకటించెను.

"అదిగో అక్కడ చాల చెట్లున్నవి. కొన్ని దగ్గరగా నున్నవి. కొన్ని దూరముగా నున్నవి. మీ మీ సామర్థ్యమును బట్టి మీరు ఆ చెట్లను లక్ష్యములుగా చేసికొని బాణప్రయోగాలు చేయవలెను. ఎవరు ఎక్కువ దూరమున నున్న చెట్టును కొట్టగలరో వారు గెలిచినట్లు. బాణములు చెట్లకు గ్రుచ్చుకొనవలెను. చెట్టుకు తగిలి క్రింద పడిపోయినవి లెక్కకురాదు. దీని వలన మీరు ఎంత దూరము నుండి శత్రువును కొట్టగలరో తెలియును".

ఒక్కొక్క విడతకు పది మంది యువకులు వచ్చి వరుసలో నిలబడిరి. వారివారి మదింపులకు తగిన దూరములలో ఉన్న చెట్లను లక్ష్యముగా ఎన్నుకొనిరి. బాణములను లాగి వదలిరి – అట్లు ఏబది మందియు అయిదు విడతలుగా వచ్చి బాణములు వేసిరి. చివరి విడతలో వీరనబోయడు వచ్చెను. వీరనబోయడు ఎన్నుకొన్న చెట్టును ముప్పురు

కొట్టిరి. వీరనబోయని బాణము గట్టిగా గ్రుచ్చుకొన్నది. తక్కిన ఇరువురి బాణములు చెట్టుకు తగిలి పడిపోయినవి. అదియే అతి దూరపు చెట్టు.

రెండవ పరీక్ష: చల లక్ష్య భేదనము.

విలుకాండ్రముందు యువకులు నిలబడి జామపండ్లను నిలువుగా పైకి విసిరివేయుదురు. ఆ పండ్లు క్రింద పడకముందే ఎవరు ముందుగా పండును బాణముతో కొట్టి దూరముగా పడవైతురో వారు గెలిచినట్లు.

పదిమంది ధానుష్కులు పండ్లు పైకెగురుచుండగానే కొట్టిరి. తొమ్మిది బాణములు పండ్లను కొట్టుకొని పోయి దూరముగా పడినవి. వీరనబోయని బాణము పండును పైకెగుర గొట్టుకొని చాలా ఎత్తునకు వెళ్ళి చాలసేపటికి నేలపై బడెను. తక్కిన వారి బాణములన్నియు పండ్లు కిందికి రాలుచున్న సమయమున కొట్టినవి. అందులో ఆరు బాణములు పండ్లకు తగులనే లేదు.

"పండ్లు పైకెగురునప్పుడు వాటి వేగములు వేరువేరుగానుండును. అది ఎగుర వేసిన వాని బలమును బట్టియుండును. అప్పుడు దానిని కొట్టుట కష్టము. పండును వెన్నంటి పోయి తగులు బాణము పండును చాల దూరమున లాగుకొని పోజాలదు. పండు దిగునప్పుడు అన్నింటి వేగమును తగ్గిపోయి సమానముగా నుండును. అప్పుడు బాణముతో కొట్టుట సులభము. వీరనబోయడు పండును పైకెగురుచున్నప్పుడే బాణముతో కొట్టినాడు. ఆ బాణము పండును పైకి చాలా దూరము లాగుకొని పోయినది. కావున వీరనబోయడే గెలిచెను", అని సేనాధిపతి ప్రకటించెను.

బోయలందరును సంతోషము పట్టలేక లేచి అంగవస్త్రములు విసరుచు కేకలు వేయ సాగిరి. పిల్లలు గంతులు వేయసాగిరి.

సేనాధిపతి సంతోషముతో లేచి నిలబడినాడు. వీరనబోయని దగ్గరికి పిలిచినాడు. రెండు చేతులతో వాని రెండు భుజములు పట్టి ఊపినాడు. తనపైనున్న సరిగ అంచు అంగవస్త్రమును తీసి వాని తలకు స్వయముగా చుట్టినాడు. "మేము తిరిగి వేంగికి వెళ్ళు నప్పుడు వీనిని నా వెంట తీసికొని పోయెదను. నెల దినములు మరికొంత శిక్షణ నిచ్చి పంపెదను" అనెను.

వీరనబోయడు ఆశ్చర్యచకితుడై పోయెను. నోటమాట రాలేదు. వెంటనే సేనాధిపతికి నమస్కరించుటకు ఇంచుక వంగి అంతలో తెలివి తెచ్చుకొని జయసింహ వల్లభుని పాదము లంటి నమస్కరించి పిదప సేనాధిపతికిని, మంత్రికిని, పురోహితునికి నమస్కరించెను. వాని సమయస్ఫూర్తిని గమనించి మహారాజు మరింత ప్రసన్నుడైపోయెను. బోయ దొరసాని మంగసాని లేచి వచ్చి మనుమని కౌగిలించుకొని వాని వీపును కన్నీళ్ళతో తడిపి వేసెను.

సద్దుమణిగిన తరువాత జయసింహ వల్లభ మహారాజు మరల ఇట్లు ఉద్ఘోషించెను. "ఈ పన్నెండు బోయకొట్టములకు వీరనబోయడే రాజు. ఇతడు ఆరు నెలల కొకసారి వేంగికి వచ్చి పది దినములు మా కొలువులో కూర్చుండవలె. ఇది మీకు శాశ్వత కట్టడ. తప్పరాదు".

మరుసటి దినము జయసింహవల్లభ మహారాజు ఆ ఏబది మంది విలుకాండ్రను తన సైన్యములో చేర్చుకొని కందుకూరి వైపు దండు వెడలెను. సేనాధిపతి వీరనబోయని వదలలేదు. తన వెంట పెట్టుకొనియే యుండెను.

బోయ యువకుల విలువిద్యా నైపుణ్యమును కన్నులారా చూచిన చాళుక్య సైన్యములోని ధానుష్కులకు గుండెలదరినవి. వారి యెడల భయమును, గౌరవమును హెచ్చినవి.

చాళుక్య సైన్యము కందుకూరు చేరునప్పటికి పల్లవరాజ ప్రతినిధి గోవిందవర్మయు అతని కుటుంబమును, పరివారమును కంచికి పారిపోయి యుండిరి.

జయవర్మ పరాక్రమవంతుడు కాకపోయినను రాజనీతి చతురుడు. అతని కుమారుడు గోవిందవర్మ పరాక్రమవంతుడును కాడు. రాజనీతిజ్ఞుడును కాడు. కంచినుండి పెద్ద సైన్యమును తెచ్చెదనని తన సైనికులకు నమ్మబలికి కంచికి పారిపోయెను. చాళుక్య సేనలు కందుకూరును సమీపింపగానే కంచి నుండి సైనిక సహాయము కొఱకు ఎదురుచూచుచుండిన కోటలోని పల్లవ సైనికులును పారిపోయిరి. చేజీతగాండ్రైన సైనికులు మాత్రముండిరి. వారు ఆ ప్రాంతీయులే. వారు ఎక్కడికి పారిపోగలరు? ఆ పట్టణము ఎవరి స్వాధీనమున నుండునో వీరు ఆ పక్షమున చేరి పోరాడుదురు. వీరికి ఏ రాజ్యముతోడను బలమైన అనుబంధము లేదు. నిన్నటి వరకు వీరు పల్లవరాజ సైనికులు. ఇప్పుడు పట్టణము చాళుక్యుల వశమైనచో వీరు చాళుక్య సైనికులై పోవుటకు సిద్ధముగా నుందురు. మొదట వీరికి కొంత ఇబ్బందిగానే యుండును. ప్రభువులు వీరిని పూర్తిగా నమ్మరు. నమ్మక తరిమి వేయనులేరు. క్రొత్త ప్రభువులు వీరిని తగు మాత్రపు నమ్మకముతో తమ సేవలో వినియోగించుకొందరు. యుద్ధ సమయము లందు వీరిని అగ్రభాగమున నిలుపుదురు. అప్పుడు వీరు తమ ప్రాణ రక్షణ కొఱకైనను తెగించి పోరాడుదురు. అది ప్రభువుల స్వీయ సైనికులకు కొంత వెసులుబాటు.

కందుకూరు చాళుక్యులకు వశమై పోయెను. యుద్ధములేదు. జననష్టము లేదు.

యుద్ధము జరుగునేమో, తమ వారిని కొందరిని కోల్పోవలసి వచ్చునేమో అని భయపడు చుండిన వీరనబోయడు ఊపిరి పీల్చుకొనెను. జయసింహవల్లభుడు కందుకూరులో తన అధికారమును సుస్థిరము గావించుకొని తన ప్రతినిధిని కొంత సైన్యమును అక్కడ నిలిపి వెనుదిరిగెను.

బోయవీరులందరును క్షేమముగా బోయ కొట్టములకు వచ్చి చేరిరి.

చెప్పిన చొప్పుననే చాళుక్య సేనాధిపతి వీరనబోయని తన వెంట వేంగికి పిలుచుకొని పోయి తన యింటనే ఉంచుకొని నెల దినములు ఆయుధ విద్యలలో విశేషమైన శిక్షణ యిప్పించెను. రాజదర్శనము చేయించెను. రాజుకొలువులోని ప్రధానులకు పరిచయము చేయించెను. అందరికిని అతని విలు విద్యా నైపుణ్యమును ప్రశంసించి చెప్పెను. ఒక

నెలలో వీరనబోయదు వేంగిలో చాల మందికి పరిచయమైపోయెను. పన్నెండు బోయకొట్టముల ప్రభువు అని అందరును అతనిని పిలువసాగిరి. వీరనబోయని రూపమును, చురుకుదనమును, నడవడియు అందరిని ఆకట్టుకొన్నది. ఉడుపులు మాత్రము కొంత అనాగరికముగా కనబడినవి. మాట పొందికయు కొంత మోటు దనమును తెలుపుచున్నవి. అవి రెండును మారుట ఎంత సేపు! రెండుసార్లు వేంగిని దర్శించిన యెడల మారకుండునా!

రెండు నెలల తరువాత వీరనబోయదు వేంగి నుండి తిరిగి కట్టెపు దుర్గమునకు వచ్చెను.

రెండు నెలలుగా కన్నులకు కరువై పోయిన వీరనబోయదు రాగానే బోయలందరును అతనిని చుట్టు ముట్టి ప్రశ్నలతో ముంచెత్తిరి. బోయలెవరును అటు కందుకూరు, ఇటు వంగవోలు దాటి పోయిన వారుకారు. వారిలో ఎవరును కందుకూరు కంటె పెద్ద పట్టణమును చూచిన వారు కారు. కొందరు కందుకూరును కూడ చూడనివారే.

"వేంగి నగరము చాల పెద్ద పట్టణమా?"

"ఈ చివర నుండి ఆ చివరకు క్రోసెడు దూరముండునా?"

"ఎంత పెద్ద ఊరైనను క్రోసెడు దూరముండునా? అరక్రోసెడు దూరముండునేమో. ఏమి నాయనా?"

"క్రోసెడు దూరమా! అట్లయినచో వారు ఉదయమున బహిర్భూమికి ఎంత దూరము నడువవలె?"

"వారు ఇండ్ల పెరడులలో లోతుగా గోతులు త్రవ్వి దానిపై ఒక బండను మూసి దానికొక పెద్ద రంధ్రము పెట్టి ఆ పనికై వాడుకుందురట."

"ఛీ–ఛీ. కంపు కొట్టదా?"

"ఇండ్లు చాల ఎత్తుగా నుండునా. ఎన్ని అంతస్థులుండును?"

"వీధులలో ఏనుగులు, గుఱ్ఱములు సందడిగా తిరుగుచుండునని చెప్పుదురు. నిజమేనా?"

"వీధులలో క్రొత్తవారెవరైనా కనపడిన యెడల రాజభటులు పట్టుకొని పోయి చెఱసాలలో వేయుదురట. నిజమేనా?"

"అక్కడ కొన్ని యిండ్ల వారు బాటసారులకు అన్నము పెట్టి డబ్బు తీసుకొందురట. నిజమేనా – అక్కడ నీకెవరైనా అన్నము పెట్టి డబ్బడిగిరా?

"ఛీ–ఛీ– అన్నము పెట్టి డబ్బడుగుదురా. అంత నీచమా? అంత దరిద్రమా?"

"అక్కడ వేశ్యల కొఱకే కొన్ని వీధులున్నవట గదా. ప్రొద్దుగ్రుంకినదే తడవు, ఊరిలోని పెద్దమనుష్యులు గుఱ్ఱములపై వారి ఇండ్లకు పోవుదురట. నిజమేనా?"

"వారు ఆ యిండ్లకు పోవుట అందుకొఱకు కాదట. ఆ వేశ్యలు బాగా నాట్యము చేయుదురట, బాగుగా పాడుదురట. పెద్ద మనుష్యులు పోయి పాటలు విని నాట్యము చూచి వారికి బహుమానములిచ్చి వత్తురట."

"వారు అందుకు పోవుచున్నారో, ఇందుకు పోవుచున్నారో నీకు చెప్పిరా? అవన్నియు నెపములు."

"అట్లయినచో ఆ ఊరి వైద్యులకు నిత్య పంటయే"

"ఎంతసేపును ఇట్టి కంపు మాటలేనా? చాలించండి. నీవు చెప్పునాయనా. అక్కడ దేవాలయములున్నవా. భజనలు చేయుచుందురా?"

"వీధికి రెండుమూడు దేవాలయములున్నవట – ఆ దేవాలయములలో అర్ధరాత్రి వరకు భజనలో పురాణ పఠనమో జరుగుచుండునట. మొన్న కంచికి పోవు దాసరులు నగరు వద్ద విడిది చేసినప్పుడు మాటల సందర్భమున చెప్పినారు."

"అక్కడ అందరు డబ్బులు తిత్తులలో వేసుకొని రొండిలో చెక్కుకొని తిరుగుదురటకదా' అందరి వద్దను అంతంత డబ్బులు ఉండునా?"

వీరనబోయడు అందరి ప్రశ్నలకును తనకు తెలిసినంత వరకు ఓపికగా సమాధానము లిచ్చినాడు. కొన్ని ప్రశ్నలకు ఎవరికి వారే సమాధానములు ఊహించి చెప్పుకొన్నారు.

ఒక నెల దినములు వేంగీ నగరమున ఉండివచ్చినందులకే వీరనబోయని మాటతీరు లోనూ, యాసలోనూ కించిత్తు భేదము కనబడుచున్నది. అది కనిపెట్టుకొని అతడే త్వరగా తన సహజమైన మాటతీరుకు, యాసకు తిరిగి వచ్చుచున్నాడు.

రెండునెలల తరువాత వినుకొండ నుండి ముప్వురు పాఱులును, ఒక రాజోద్యోగియు కట్టెపు దుర్గమునకు వచ్చిరి. వారు పౌరోహిత్యము, అర్చకత్వము, జ్యోతిషము, పురాణ పఠనము అరకొరగా అభ్యసించిన వారు. వారికి తమ ప్రాంతమున అంతగా ఆదరణ లభింపలేదు. వినుకొండలో ఈ విద్యలలో ప్రవీణులైన పాఱులెందరో ఉండగా వీరి నెవరాద రింతురు? కావున వారు మరెక్కడైనను బ్రతుకు తెరువు చూచుకొనవలెనని ఆలోచించుచుండగా రాజుగారి వర్తమానము వచ్చినది. బోయకొట్టములకు పురోహితులుగా కొందరు బ్రాహ్మ ణులను పంపవలసినదనియు అందుకు తగిన వారిని ఎన్నిక చేయవలసిన దనియు వినుకొండలోని బ్రాహ్మణులకు రాజు గారి ఆజ్ఞా పత్రమును రాజోద్యోగులు అందజేసిరి.

"మరెక్కడికైనను సరేకాని పోయిపోయి బోయకొట్టములకా" అని అందరును వెనుకంజ వేసిరి. ఒక నెల దినములు తర్జన భర్జనలు పడిన తరువాత ముప్వురు బ్రాహ్మణులు తమ సంసిద్ధతను వెల్లడిచేసిరి. దాని ఫలతమే కట్టెపు దుర్గమునకు వీరిరాక.

ముప్వురును కలిసి రాజోద్యోగితోనూ, కొందరు బోయపెద్దలతోనూ కలిసి పండ్రెండు బోయ కొట్టములను తిరిగి చూచివచ్చిరి.

కట్టెపు దుర్గపు పరిస్థితి తక్కిన బోయపల్లెల కంటె కొంత భిన్నముగా ఉన్నది. భద్రతకై చిన్నకోటగోడ యున్నది. వర్తకుల ఇండ్లును అంగళ్ళును కొన్ని ఉన్నవి. కట్టెపు దుర్గము తక్కిన బోయ కొట్టములకు ప్రధానమైన నెలవు. కట్టెపు దుర్గపు నాయకుడే పండ్రెండు బోయకొట్టములకు ప్రభువు. అందుచేత కట్టెపు దుర్గములోని బోయలకు స్వాతిశయము రవంత ఎక్కువ. అంతేకాక జయసింహ వల్లభుడు వచ్చిపోయిన తరువాత బోయనాయకుడును, అతని అనుచరులును చాళుక్యులకు అనుకూలురైనట్లు మెలగుచున్నారు. సాధారణ ప్రజలు మాత్రము ఇంకను పల్లవుల వైపే మొగ్గియున్నట్లు కనబడుచున్నది. తక్కిన బోయకొట్టముల పరిస్థితియు అంతయే. మాటలు చాళుక్యుల వైపు ఎదలు పల్లవులవైపు. కాబట్టి వచ్చిన

పాఱులు కట్టెపు దుర్గమునందే కాపురముండుటకు తీర్మానించుకొనిరి. సౌకర్యవంతమైన ఇండ్లు మూడు కట్టించవలసినదిగా వారు వీరనబోయనికి చెప్పి ఇండ్లు పూర్తి అయిన తరువాత వర్తమానము పంపిన యెడల తాము సకుటుంబముగా తరలివత్తుమని చెప్పి వెడలి పోయిరి. వీరనబోయడు వెంటనే పని ప్రారంభించెను.

కొంత విశాలమైన ప్రదేశమున చుట్టును మూడు మూరల ఎత్తున అడవరి కట్టించి అందులో మూడు లాదుమిద్దెలను, వాటికి అనుబంధముగా మూడు పశువుల కొట్టములను కట్టించెను. మూడిండ్లకు చేరువగా ఒక చేదబావి త్రవ్వించెను. ఈ పనులు పూర్తి అగుటకు ఆరు నెలలు పట్టెను.

బోయకొట్టముల నాయకుడు ఆరునెలల కొకసారి వేంగికి వచ్చి రాజదర్శనము చేసికొన వలెనను రాజాజ్ఞను పాటింపవలసి యున్నది. కనుక వీరనబోయడు వేంగికి ప్రయాణమై పోయెను.

వేంగిలో ఒక పూటకూళ్ళ ఇంటిలో విడిది చేసి మరునాడు ఉదయమే తగినరీతిలో సిద్ధమై గుఱ్ఱమెక్కి రాజప్రసాదమును సమీపించెను. అక్కడ ఒక యేబది ఏండ్ల ప్రాయపు పెద్దమనిషి ఎదురై “ఓ, వీరనబోయడా! ఎప్పుడు వచ్చితివి. ఎక్కడ బస చేసితివి.” అని పలకరించెను. వీరనబోయనికి అతడెవరో ఎంత ఆలోచించినను గుర్తురాలేదు. అతడట్లే తెల్లబోయి చూచుచు నిలబడిపోయెను.

“నేను నీకు గుర్తుకు రాకపోవచ్చును. జయసింహవల్లభ మహారాజు బోయకొట్టములపై ఎత్తివచ్చినపుడు నేను వారి వెంట వచ్చినాను. రాజుగారు బయలు వెడలినప్పుడు వారి సమస్త సౌకర్యములు చూచుట నాపని. గుడారము లెత్తించుట, ఆసనములు, పడకలు సవరించిపెట్టుట, రాజుగారికిని వారి ఆంతరంగికులకును భోజనములు చేయించుట. భోజన శోధకునిచేతను, వంట వాని చేతను భోజన శోధనము చేయించుట, మొదలైన సమస్త కార్యములను నేనే నిర్వహింపవలెను. నా క్రింద ఎల్లప్పుడు ఏబది మంది సేవకులు పనిచేయుచుందురు. ఈ కర్తవ్య నిర్వహణమునకగు వ్యయమంతయు కోశాగారము నుండి ధారాళముగా తీసికొను అధికారము నాకు కలదు. నా పేరు ధనపాలుడు. నా పదవి పేరు సువిధాని”.

వీరనబోయడు ధనపాలునికి నమస్కరించెను. “మా ఊరిలో మిమ్ములను గమనింపలేదు. క్షమించవలెను. అప్పుడు మేము చాలా ఆందోళనలో నుంటిమి. మహా సైన్యముతో మాపై ఎత్తి వచ్చిన మహారాజుగారిని శాంతింప జేయుట ఎట్లా అని సతమతమగుచుంటిమి”

“శాంతింప జేయుట ఏమి? ప్రసన్నుని చేసికొంటివి. కొలువులో ఒక ప్రత్యేకమైన గుర్తింపు తెచ్చుకొంటివి. మహారాజు గారి సమక్షమున నీవు ప్రదర్శించిన ప్రతిభకు మహారాజుగారే ముగ్ధులైనారు. మీ అవ్వగారు బాగున్నారా? ఆమె వాక్చాతుర్యము, కార్యదక్షత మహారాజుగారిని కట్టి పడవేసింది.”

“మా అవ్వగారు మునుపటి వలె లేరు. కొంత బలహీన పడినారు.”

"ఉండవచ్చును. వయస్సు మీరినది కదా."

వీరనబోయడు తన గుఱ్ఱమును ధనపాలుని గుఱ్ఱము ప్రక్కనే కట్టివేసెను.

ఇరువురును రాజుగారి కొలువు కూటములో ప్రవేశించినారు.

కొలువుకూటములోనికి ప్రవేశము పరిమితము. ముందుగా ప్రతీహారులకు విన్నవించ వలెను. వారు మంత్రికి విన్నవింతురు. మంత్రి గారు వచ్చిన వారి ప్రాధాన్యతను బట్టి దర్శనమునకు సమయము నిర్దేశింతురు.

కాని సువిధానికి ఆ నిబంధనలు ఏమియు లేవు. అతడు మహారాజుగారి ఆంతరంగి కులలో నొకడు. కావున ఇరువురును నిరాటంకముగా లోపలికి ప్రవేశించినారు. అప్పటికే అక్కడ కొందరు సామంతులు, ప్రధాన పురుషులు ఉండిరి.

వీరనబోయని చూడగానే మహారాజు కన్నులలో ఒక ఆత్మీయత మెరసెను. "అదిగో అర్జునుడు వచ్చుచున్నాడు. కోదండపార్థుడు. పంద్రెండు బోయ కొట్టముల రాజు. ఏమయ్యా వీరనబోయడూ! క్షేమమా. మీ అవ్వగారు బాగున్నారా? ఆహా! మనిషి అనగా ఆమెయే మనిషి. ఏమి వాక్చాతుర్యము, ఏమి కార్యదక్షత" అనెను.

వీరనబోయడు మహారాజు గారికి వంగి నమస్కరించి, ఆ నమస్కారమునే మంత్రి వైపునకు కూడా కొనసాగించి "చిత్తము చిత్తము. అంతయు దేవరవారి అనుగ్రహము. అందరము క్షేమముగానున్నాము. మా అవ్వగారు ఎప్పుడును దేవరవారిని తలంచుచునే యున్నది."

మహారాజు వీరనబోయని వైపు అభయమిచ్చుచున్నట్టు చేయి ఊపి మరియొక సామంతరాజుతో మాట్లాడసాగెను.

వేంగి సామ్రాజ్యాధిపతి తన నిండు కొలువులో ఇంకను మీసములైనను సరిగా మొలవని ఒక బోయ యువకునితో ఇంత అక్కరగా మాట్లాడుటయే అతిశయము. అది అందరికి అబ్బురముగానున్నది. అందరును వీరనబోయనివైపు ఆసక్తితోనూ ఆశ్చర్యముతోనూ చూడసాగిరి.

ధనపాలుడును, వీరనబోయడును ఒక అయిదు నిమిషములు అట్లే నిలబడిరి. మంత్రి వైపు చూచిరి. మంత్రి "ఇక మీరు వెళ్ళవచ్చును" అన్నట్లు చేయి ఊపెను. వీరనబోయడు రాజువైపు తిరిగి వంగి నమస్కరించి వెనువెనుకకే నాలుగైదు అడుగులు నడచి వెనుదిరిగి కొలువు కూటము నుండి బయటపడెను. ధనపాలుడును వచ్చి అతనితో కలిసికొనెను.

బయట పురోహితుడు ఎదురయ్యెను. ఇరువురును ఆయనకు నమస్కరించిరి. పురోహితుడు వీరనబోయని ఎగాదిగా చూచి "నీవు బోయదొరవు కదూ" అనెను.

"చిత్తము చిత్తము. కట్టెపు దుర్గమున తమ దర్శనము లభించినది". వీరన వినయముతో పలికెను.

"వినుకొండ నుండి బోయకొట్టములకు బ్రాహ్మణులను పంపితిని. వచ్చిరా?"

"చిత్తము. ముప్పురు బ్రాహ్మణులు వచ్చిరి. ఇండ్లు కట్టించి యుంచుమని చెప్పి వెళ్ళి

పోయిరి. ఇండ్లు కట్టించినాము. తిరుగు ప్రయాణములో వారిని కలుసుకొని వారిని త్వరగా రావలసినదిగా చెప్పిపోయెదను."

"వారు సిద్ధముగా నున్నచో నీవెంటనే తోడుకొనిపొమ్ము."

"చిత్తము అట్లే."

పురోహితుడు కొలువు కూటములోనికి వెళ్ళిపోయెను.

"నీవిప్పుడు పూటకూళ్ళ ఇంటిలో ఉండవలసిన పనిలేదు. ఇక్కడ మనకొక ఇల్లున్నది. నా కుమారుడు జయపాలుడు ఇక్కడ అయిదునూర్ల మంది కుంతాల వారికి దళపతి. అక్కడ మనకు సౌకర్యముగా నుండును. వాడును మహారాజు వెంట బోయకొట్టములకు వచ్చినవాడే. నిన్నెఱుగును."

ఇరువురును గుఱ్ఱము లెక్కి పూటకూళ్ళ ఇంటికేగి వీరనబోయని మూటాముల్లె సర్దుకొని ధనపాలుని ఇంటికి చేరుకొనిరి. ధనపాలుని కుమారుడు దళపతి జయపాలుడు వీరనబోయని చూడగానే సంతోషముతో ఎదురు వచ్చి రెండు చేతులు పట్టుకొని స్వాగతించెను.

జయపాలుడు వీరనబోయని కంటెను మూడు నాలుగేండ్లు పెద్ద వాడు. స్వయంప్రతిభ వల్లనూ, తండ్రి పలుకుబడి వల్లనూ, చిన్న వయస్సులోనే దళపతి పదవి పొందినవాడు.

"మునుపు నీవు వేంగికి వచ్చి నెల దినములు సేనాధిపతిగారి ఇంట నుండినపుడు మేము వేంగిలో లేము. వినుకొండలో నుంటిమి. తరువాత సేనాధిపతులుగారు చెప్పిరి. నిన్ను కలుసుకోలేకపోయినందులకు చాల చింతించితిమి. అదృష్టవశాత్తు ఇప్పుడు అందరము ఇట్లు కలిసికొన్నాము." అని జయపాలుడు అతనిని లోపలి గదులలోనికి తోడుకొని పోయి తల్లికిని చెల్లెలు జయశ్రీకిని చూపి పరిచయముగావించెను.

వీరనబోయడు బోయదొరయని చెప్పగానే జయపాలుని తల్లి అతనిపై ఎక్కువ ఆదరము చూపలేకపోయినది. తాము వానికంటెను అధికులమనియు, నాగరికులమనియు ఒక స్వాతిశయము ఆమెలో పొడసూపినది. జయశ్రీ వానివైపు కొంత కుతూహలముతో చూచెను. యువకుడు చూచుటకు చక్కగానున్నాడు. తెలివియు, చురుకుదనమును కన్నులలోనే కనబడు చున్నవి. వయస్సు ఇరువదికి అటు ఇటు నుండ వచ్చును. వేషమును, భాషయు కొంత భిన్నముగానూ, మోటుగానూ ఉన్నవి. కాని అన్న యొక్క ఆదరణకు పాత్రుడైన వాడు. అన్న పరిచయము చేయగానే నమస్కరించి ఊరకున్నది.

జయపాలుడును, వీరనబోయడును త్వరగానే బాగుగా కలిసి పోయిరి. ఆత్మీయులై పోయిరి. జయపాలుడు ఆ దినము తల్లి యెదుటను, చెల్లెలి యెదుటను వీరనబోయని ప్రతిభను గురించి నాలుగైదు సార్లైనను ప్రస్తావించెను.

"విలువిద్యలో అసాధారణ ప్రజ్ఞ కనపరచి సేనాధిపతి నుండి అపూర్వమైన ప్రశంసల నందుకొన్న వాడు. సేనాధిపతి వీనిని స్వయముగా పిలుచుకొని వచ్చి నెల దినములింటిలోనే పెట్టుకొని ఆయుధ విద్యలలో ప్రత్యేక శిక్షణ నిచ్చినాడు. మహారాజు ఇతనిని చూడగానే ప్రత్యేకముగా పలుకరించినాడు. పండ్రెండుబోయ కొట్టములకు ప్రభువు. పండ్రెండు బోయ

కొట్టములనగా కొన్ని ఆమడల విస్తీర్ణముగల చిన్న రాజ్యము. వేంగి రాజ్యములోని సామంత రాజ్యములలో ఒకటి. బోయదొరలు అందరును ఇతని కొఱకు ప్రాణములైన అర్పింతురు."

ఇట్టి వర్ణనలు పదే పదే విని విని జయపాలుని తల్లిలోనూ, చెల్లెలిలోనూ కొంత పరివర్తన వచ్చినది.

తాము కేవలము చిన్న రాజోద్యోగులు. ఇతడు ఒక చిన్న రాజ్యమునకు ప్రభువట.

ఈ అభిప్రాయము ఏర్పడగానే జయపాలుని తల్లి వీరనబోయని పట్ల కొంత ఆదరము కనపరచసాగెను. జయశ్రీ కొంత చనువుగా మాట్లాడసాగెను.

ఆరు నెలల కొకసారి వేంగికి వచ్చి పది దినములు కొలువులో ఉండవలెనని కదా జయసింహ వల్లభుల వారి ఆజ్ఞ. ఆ ఆజ్ఞ చొప్పున వీరనబోయడు ప్రతిదినమును కొలువు కూటమునకు పోయి అక్కడ ప్రముఖుల సరసన కూర్చుండి వచ్చుచుండెను. ప్రతి దినమును వీరనబోయడు కొలువులో ప్రవేశించి రాజునకు నమస్కరింపగా రాజు గారు "చూచితిని" అన్నట్లు తల ఊపుట తప్ప ఇంకేమియు విశేషములు జరుగుట లేదు. ఐదవ దినము వీరనబోయడు సేనాధిపతిని, మంత్రిని దర్శించుకొని తన తిరుగు ప్రయాణమునకు అనుమతి పొందెను.

కాకతాళీయముగా ధనపాలుని కుటుంబము కూడ వినుకొండకు ప్రయాణము తలపెట్టి యుండిరి. అందరును ఏకకంఠముగా వీరనబోయని వినుకొండకు రమ్మని ఆహ్వానించిరి. వారి ఆహ్వానమును కాదనలేక వీరనబోయడు వారితో కలసి వినుకొండకు బయలుదేరెను. పదునైదు దినములు కలిసి చేసిన ప్రయాణములో ఎంత వలదనుకొన్నను వీరనబోయనికి ధనపాలుని కుటుంబముతో అనుబంధము అధికమైపోయెను.

జయశ్రీ పదునారు పదునేడేండ్ల పడుచు. నాగరికముగా, నాణ్యముగా పెరిగినది. తండ్రి మంచి ఆదాయము గల కొలువులో ఉన్నాడు. కనుక అనేక విధములైన ఉడుపులును, తగుపాటి నగలును కొని పెట్టినాడు. వివిధములైన అలంకార ద్రవ్యములను, పరిమళ ద్రవ్యములను వాడుట అలవాటైనది.

పదునైదు దినముల ప్రయాణములో దారిలో భోజనములకు నిలిచినప్పుడు, రాత్రుల యందు సత్రములలో విడిసినప్పుడు, మాటలాడుట, ఒకరికొకరు పనులలో తోడ్పడుట, మొదలైన చర్యల ద్వారా వీరనబోయడును జయశ్రీయు ఒకరి కొకరు బాగుగా చేరువైనారు. మనసుల లోలోపల ఆకర్షణలు మొలకెత్తుచున్నవి. కాని కుటుంబ నేపథ్యములలోని అంతరము కొట్ట వచ్చినట్లు కనబడుచున్నది. ఇది పరిచయస్థుల మధ్య ఉండవలసిన సౌజన్య పూర్వకమైన ఆదరాభిమానములో, లేక అంత కంటె మించిన అభిమానమో ఇంకను తేలని పరిస్థితి.

"లోతెరిగి దిగవలె" అను సామెత యున్నది కదా. ఇంకను లోతు తెలియలేదు. ఇరువురిలోనూ ఇదియే ఆలోచన.

అందరును వినుకొండకు చేరగానే ధనపాలుడు ముప్వురు బ్రాహ్మణులను ఇంటికి పిలిపించెను. వీరనబోయడు వారితో మాట్లాడెను.

"మీ కొఱకు మూడు మంచి ఇండ్లు కట్టించినాము. ఒక బావియు త్రవ్వించినాము. మీరెప్పుడైనను రావచ్చును. మీరు సిద్ధముగా నున్న యెడల రేపే నాతో బయలుదేరవచ్చును"

"లేదు లేదు. అంత తొందరగా మేము బయలుదేరలేము. బిడ్డలు పాపలు కలవారము. ఈ దారిలో ఏదైనను చిన్న సాతు సాగివచ్చినప్పుడు దానితో కలిసి వత్తుము."

"సరే – మీ యిష్టము."

"మరి – మరి... మాకు దారి బత్తెమునకు..."

"మీరు అడుగకపోయినను నేను ఇచ్చి యుందును. తొందరపడితిరి" అని ముగ్గురికి కొంత ధనము నిచ్చెను. వారు వెడలిపోయిరి.

"వట్టి కక్కుర్తి మనుషులు. డబ్బునకు పడి చచ్చెదరు. విద్య మాత్రము అంతంతమట్టుకే" అన్నాడు ధనపాలుడు.

"పెద్ద విద్యావంతులు మా దగ్గరికి వచ్చి యుందురా. గంతకు తగిన బొంత".

మరునాడు వీరనబోయడు అందరి వద్దను సెలవు తీసుకొని ధనపాలుని భార్య మూటకట్టి ఇచ్చిన ఆహార పదార్థములు గుఱ్ఱము ప్రక్కలపై వేలాడ వైచుకొని పయనమై పోయెను.

మరి రెండు నెలల తరువాత వినుకొండ నుండి ముప్వురు బ్రాహ్మణ కుటుంబముల వారు బండ్లు కట్టించుకొని సకుటుంబముగా ఒక చిన్ని సాతుతో కలిసి వచ్చిరి. వారితోబాటు మరి రెండు కుటుంబముల వారును వచ్చిరి. వారిది వినుకొండ సమీపము నందలి ఒక అగ్రహారము. వారును వైదిక విద్యలు అంతంత మాత్రమే నేర్చినవారు. ఆ అగ్రహారమున బ్రాహ్మణులు ఎక్కువై పోవుటచే వీరి అరకొర వైదిక విద్యను ఆదరించు వారు లేకపోయిరి. పండ్రెండు బోయకొట్టములలో బ్రాహ్మణులే లేరని విని "చెట్టు లేని చోట ఆముదపు చెట్టే మహా వృక్షము" అన్నట్లు అక్కడ వెలిగిపోవచ్చునని వారును వీరితో బాటు ఏకముగా సకుటుంబముగా బయలుదేరివచ్చిరి.

క్రొత్తగా వచ్చిన బ్రాహ్మణులు బోయకొట్టములన్నియు తిరిగి చూచిరి. కట్టెపు దుర్గము కంటె చిన్నదియు, తక్కిన కొట్టముల కంటె కొంత పెద్దదియునైన బేత కొట్టమును ఎన్నుకొనిరి. అది కట్టెపు దుర్గమునకు నాలుగైదు ఘడియల ప్రయాణ దూరము. అక్కడి వారు ఇక్కడికిని, ఇక్కడి వారు అక్కడికిని తలచుకొన్నప్పుడెల్ల తడవు లేకుండ వెళ్ళి కలిసి కొనవచ్చును.

బేత కొట్టములో రెండు బ్రాహ్మణ కుటుంబములకు రెండిండ్లు త్వరగా కట్టి ఇవ్వవలసి నదిగా బ్రాహ్మణులు బేత కొట్టములోని బోయ దొరలను కోరిరి. ఇండ్లు పూర్తి అగు వరకు వారు కట్టెపుదుర్గమునందు బ్రాహ్మణ కుటుంబములతో కలిసి యుండిరి.

ఒక నెలలో బేత కొట్టము పడమటి వైపున రెండు పూరిండ్లును, రెండు పశువుల కొట్ట ములును లేచినవి. బ్రాహ్మణులు పోయి ఆ యిండ్లలో చేరుకొనిరి. వీరనబోయడు ఒక్కొక్క బ్రాహ్మణ కుటుంబమునకు ఏబది శేర్ల ఆడ్లు పట్టు నేలను మాన్యముగానిచ్చెను.

మొదట వచ్చిన ముప్వురు బ్రాహ్మణులలో ఒకడు చక్కని పౌరాణికుడు. శ్రావ్యమైన

కంఠముతో రాగయుక్తముగా శ్లోకములు చదువుచు, రసోచితమైన హావభావములతో అనేక పురాణగాథలను చెప్పువాడు. వైదిక విద్యలలో తక్కిన వారికంటే కొంత మెరుగైనవాడు. అతని పేరు మంచనశర్మ.

ఉగాది పండుగ సమీపించుచుండగా మంచనశర్మ వీరనబోయని యొద్దకు పోయి ఇట్లు చెప్పెను.

"ఈ దినము సోమవారము – శుక్రవారము ఉగాది పండుగ వచ్చుచున్నది. ఈ విషయము పండ్రెండు బోయకొట్టముల వారికిని తెలియజేయుడు. ఆ దినము ఇండ్లన్నియు అలికి, పూసి, ముగ్గులు పెట్టి మామిడాకు తోరణములు కట్టి ఇండ్లను, ఊరిని అలంకరించుకోవలె. నట్టింట దీపములు పెట్టి గతించిన మీ పెద్దలకు అర్పితముగా ఒక పీటపైన క్రొత్త బట్టలు పెట్టి తళిగలు వేసి మ్రొక్కుకొనవలె. పంచాంగము వినవలె. ఈ ఊరిలో నేను పంచాంగము చదివెదను. మా ప్రక్క యిండ్లలో తండ్రి కొడుకులు ఇద్దరేసి ఉన్నారు. బేత కొట్టము నందు ఇద్దరు బ్రాహ్మణులు కాక, ఒకరి యింటిలో ఒక యువ బ్రాహ్మణుడున్నాడు. నా కుమారుడును ఉన్నాడు. వీరందరును ఒక్కొక్కడు రెండూళ్ళలో పంచాంగములు చదువుదురు. ఆ దినము సాయంత్రము నేను మన నగరు ముందర పురాణ పఠనము చేయుదును. ఈ విషయము లన్నియు అన్ని పల్లెలకును తెలియజేసిన బాగుండును."

వీరనబోయడు వెంటనే నలుగురు యువకులను పిలిచి వారికి మంచన శర్మ చెప్పిన దంతయు చెప్పి "మీరు గుఱ్ఱములపై పోయి ఈ విషయమును పల్లెలలో చెప్పి రావలసినది" అని ఆజ్ఞాపించెను.

ఉగాదికి ముందు దినము నుండియు పండ్రెండు బోయకొట్టములలోనూ పండుగ వేడుకలు వ్యాపించెను. ఊళ్ళును, ఇండ్లును కళకళలాడెను. బ్రాహ్మణులు పల్లెలకు పోయి రచ్చ పట్టులపై కూర్చొని పంచాంగ పఠనముగావించిరి. ఆ సంవత్సరమున వర్షము, ధరలు, పంటలు, పశు సమృద్ధి, రోగ బాధలు, గ్రహణములు మొదలగు వివరములు చెప్పిరి. నామ నక్షత్రములను బట్టి ఏ యే పేర్ల వారికి ఎట్టి ఫలితములు సంభవించునో చెప్పిరి. చెడ్డ ఫలితములు వ్రాసి పెట్టిన వారికి వారు చేసికొనవలసిన శాంతులును చెప్పిరి. బ్రాహ్మణులకు సంభావనలు బాగుగా ముట్టినవి. సంభావనలన్నియు ఎక్కువగా వస్తు రూపమే కాని ధన రూప సంభావన చాల తక్కువ.

పండుగ భోజనములైన తరువాత సమీప బోయకొట్టముల నుండి జనులు చాల మంది బండ్లు కట్టుకొని కట్టెపు దుర్గమును చేరుకొనిరి. దుర్గము ప్రక్కన ఉన్న వనములో వాడుక ప్రకారము కఱ్ఱసాము, కత్తిసాము, కుంతములు విసరుట, విలు విద్యా ప్రదర్శనము, బరువు గుండ్లెత్తుట మొదలగు పోటీలు జరిగెను. ఈ వేడుకలు సాయంత్రము వరకు జరిగెను. యువకులందరును మరియొకసారి చెఱువులో స్నానము చేసి వచ్చిరి. వనములోనే భోజన ములు వండి వడ్డింపబడెను. అందరును సందకడనే భోజనములు ముగించుకొని పెద్ద దొరగారి నగరు ముందర విశాలమైన వీధిలో చేరిపోయిరి. చాపలు, కంబళ్ళు, గోనె పట్టలు

వేసుకొని కూర్చుండువారు కూర్చొనగా తక్కిన వారు వీధి ఇరువైపుల అరుగుల మీదను, మంచముల మీదను కొలువు దీరిరి.

మంచన శర్మ వచ్చి అరుగుపై కూర్చుండి ఖంగుమని మ్రోగు కంఠముతో మొదట విఘ్నేశ్వరుని ప్రార్థనయు, తరువాత సరస్వతీ ప్రార్థనయు చేసి తరువాత కార్తికేయ జననము పురాణము చెప్పనారంభించెను.

"అది అద్భుతమైన కథ. శివుని వీర్యము భూమిపై బడెను. భూమి దానిని భరింపలేక గంగలో వదలెను. గంగయు భరింపలేక రెల్లు గడ్డిలో వదలివేసెను. అక్కడ శిశువు జననమయ్యెను. రెల్లు గడ్డిలో పుట్టినందున అతనికి శరవణభవుడని పేరు వచ్చెను. శిశువును చూచి ఆర్వురు కృత్తికలు అతనికి స్తన్యము నిచ్చుటకు వచ్చిరి. ఆ శిశువు ఆరు ముఖములు ధరించి ఆరుగురి యొద్దను ఒకేసారి స్తన్య పానము చేసెను. ఆరు ముఖములు కలుగుటచే అతనికి షణ్ముఖుడు అను పేరు కలిగెను. ఆరుగురు తల్లుల దగ్గర స్తన్యపానము చేయుట చేత అతనికి షాణ్మాతురుడు అను పేరు కలిగెను. కృత్తికలచే పోషింపబడినందున అతనికి కార్తికేయుడనియు పేరు కలిగెను. అతడు వెంటనే పెరిగి పెద్దవాడై తండ్రి కంటెను శక్తి సంపన్నుడై తారకాసురుని వధించెను. ఈ కథ చెప్పిన వారికి విన్నవారికి సకల సంపదలు కలుగును. శత్రు జయమును కలుగును."

ఈ కథను మంచన శర్మ చిలువలు పలువలుగా వర్ణించి ఉప కథలు, పిట్ట కథలు జోడించి ఒకజాము కాలము మనోహరముగా చెప్పెను. జనులు పరవశించి వినిరి. మంగళ హారతి పళ్ళేరములో చిన్న నాణెములు దండిగా పడినవి.

ఇదియే అదనని మంచెన శర్మ ఇట్లు చెప్పసాగెను.

"భక్తులారా, విన్నారు కదా కార్తికేయుని చరిత్ర. కార్తికేయుడు మహా మహిమోపేతుడు. త్రిమూర్తులు కూడా జయించలేని తారకాసురుని అవలీలగా సంహరించిన వాడు. ఆ దేవుని సదా పూజించుట వలన మానవులకు అనేక సత్ఫలితములు కలుగును. సర్వ రోగములు నివారణ యగును. శత్రువులపై జయము కలుగును. కాబట్టి ఆ కార్తికేయునికి మన కట్టెపు దుర్గములోనే ఒక దేవాలయము కట్టించి నిత్య ధూపదీప నైవేద్యములు సమర్పించుట మన ఊరికే కాదు ఈ పండ్రెండు బోయకొట్టములకును మంగళకరము. శుభకరము. బెజవాడలో ప్రతియేటా కార్తికేయుని తిరునాళ్ళు జరుగుచున్నవి. ఊరికి దేవాలయము శిరస్సు వంటిది. దేవాలయము లేని ఊరికి కళయే యుండదు. పోలేరమ్మ దేవాలయము వలన అణ్డెక్కికి ఎంత కళ వచ్చినదో చూచినారు కదా. వంగవోలునందును కందుకూరులోనూ, అమ్మనబ్రోలు నందును దేవాలయములు చూచినారు కదా. కాబట్టి మీరందరును ఆలోచించి ఒక నిర్ణయమునకు వచ్చి "సరే" అనిన యెడల నేను బెజవాడనుండి శాస్త్రజ్ఞులను, శిల్పులను పిలిపింతును. ప్రతి బోయకొట్టము నందు చిన్నదో పెద్దదో శివాలయమో, గ్రామదేవత ఆలయమో ఏదో ఒకటి ఉండవలెను. ఏమందురు?" అని ఆగెను.

బోయలకు ఆలోచింపవలసిన అవసరమే లేదయ్యెను? వివిధ పట్టణముల నుండి వచ్చి

బోయకొట్టములలో స్థిరపడిన వివిధ జాతుల వారికి, వృత్తులవారికి ఈ ప్రతిపాదన చాల సంతోషమును కలిగించెను. వారందరును పూర్వము వారివారి పట్టణములలో పండుగలకు పబ్బములకు, వ్రతములకు, మ్రొక్కుబడులకు దేవాలయములకు పోయెడువారు. దేవాలయ ములలో పూజలలో పాల్గొని తీర్థప్రసాదములు తీసికొనెడివారు. అది ఒక సంబరముగా నుండెడిది. ఈ బోయకొట్టములకు వచ్చి చేరిన తరువాత ఒక మంచి లేదు, ఒక చెడ్డ లేదు. ఒక పూజ లేదు, పునస్కారము లేదు. ఒక ఉత్సవము లేదు, ఒక వేడుక లేదు. ఊరిలో ఒక దేవాలయముండిన యెడల అవి అన్నియు వచ్చును. ఊరికొక చైతన్యము వచ్చును. బ్రాహ్మడు మంచి ప్రతిపాదన చేసినాడు.

అప్పటికే కొన్ని పల్లెల వారు ఊరి నడిబొడ్డున గ్రామదేవతలను నిలుపుకొని కొలుచు చుండిరి. కాని పెద్ద దేవాలయములు లేవు. వీరనబోయదు జనుల మొగములలో కనబడుచున్న ఉత్సాహమును, సంతోషమును గమనించినాడు.

"అయ్యా, మా కొట్టములలో దేవాలయములు కట్టుట మాకును సంతోషమే. మీరు వెంటనే బెజవాడ నుండి శాస్త్రజ్ఞులను, శిల్పులను పిలపించు ప్రయత్నము చేయవలసినది. మీరు ఎప్పుడు బయలుదేరుదురో చెప్పిన యెడల మీ ప్రయాణమునకు కావలసిన ఏర్పాట్లు చేయుదుము" అని గట్టిగా చెప్పినాడు.

వారము దినముల తరువాత మంచెన శర్మ ఒక చిన్న సాతుతో కలిసి బెజవాడకు ప్రయాణమై పోయెను.

వీరనబోయనికి ఇప్పుడు ఇరువదేండ్లు దాటినవి. కోరమీసముల వాడైనాడు. రావిచెట్టు వలె ఏపుగా అందముగా, పుష్టిగా పెరిగినాడు. చంద్రచెట్టు వలె చేవదేరినాడు. తియ్య మామిడి చెట్టు వలె అందరికి ప్రీతిపాత్రుడైనాడు. చాళుక్య సేనాధిపతి శిక్షణలో రాటు తేలినాడు. మంగసాని పెంపకములో బుద్ధిమంతుడని పేరు తెచ్చుకున్నాడు.

పంద్రెండు బోయకొట్టములలోని ఈడు వచ్చిన ఆడ పిల్లల కన్నులును, వారి తల్లిదండ్రుల కన్నులును వాని మీదనే యున్నవి. ఎన్నడును నగరుకు రాని వారు కూడ అక్కా, అత్తా అని వరుసలు కలుపుకొనుచు నగరుకు వచ్చి మంగసానిని పలుకరించి యథాలాపముగా చెప్పినట్లు తమ బిడ్డల గుణగణములు వర్ణించి చెప్పి పోవుచున్నారు. మంగసాని ఏమియు చెప్పుట లేదు. వానిని ఇంకను పసిబాలునిగానే చూచుచున్నదా ఏమి?

–లేదు లేదు మంగసాని అంతయు గమనించుచునేయున్నది.

వినుకొండ నుండి రాజోద్యోగి కుమారుడు జయపాలుడను వాడు వీరనబోయని స్నేహితుడు ఈ ఆరు నెలలలో రెండు సార్లు కట్టెపు దుర్గమునకు వచ్చినాడు. నాగరికుడైనను తమ ఇంటిలో బాగుగా కలిసిపోయినాడు. ఆమె ప్రక్కనే కూర్చుండి అతడు తన తల్లిదండ్రులను గురించియు, అధికముగా తన చెల్లెలిని గురించియు చెప్పుచుండెను. ఇంతకుముందు సారి వచ్చినపుడు అడుగనే అడిగినాడు. "ఏమవ్వా వీరనకు పెండ్లి చేయవా – మా వైపు

చూడమందువా? నీవు ఊ అను చాలును. క్షణములో నీ కన్నులు చెదరిపోవు సంబంధము కుదిరించెదను" అన్నాడు. అప్పుడు మంగసాని చాలా తెలివిగా తప్పించుకున్నది. "పెద్ద వాడవు నీవున్నావు. నీ సంగతి చెప్పుము. మొదట మీ ఇంట పప్పన్నము తరువాతనే మా ఇంట పప్పన్నము. ఏమి? మా బోయకొట్టములలో చూడమందువా?"

వీరనయు చేతులు తట్టుచు "అవునవును, మొదట నీది. తరువాత నాది," అన్నాడు.

జయపాలుడు "మావైపు చూడమందువా" అనగానే మంగసాని మనస్సులో ఒక సందేహ బీజము పడి వెంటనే అది గబగబమని పెద్ద వృక్షమైపోయినది.

"ఈ నాగరికులు బహు టక్కరి వారు. పండువంటి పిల్లవానిని చూచుచు వదలిపెట్టరు. పట్టి బుట్టలో వేసికొందురు. తరువాత వగచి లాభము లేదు. ఈ మధ్య వీడు ఏదో ఒక నెపము మీద వినుకొండకు ఒకటి రెండు సార్లు వెళ్ళి వచ్చినాడు. తన వంశరక్తము నందు వేరే వంశ రక్తము కలియరాదు. తన బోయలలోనే తగిన పిల్లను ఎన్నుకొని కట్టబెట్టవలె."

దేవాలయమునకు శంకుస్థాపన చేసిన శుభముహూర్తముననే బేత కొట్టము పెద్ద దొర చెన్నుబోయని కుమార్తె సంపంగికిని వీరన బోయనికిని వైభవముగా పెండ్లి జరిగిపోయినది. పెండ్లికి జయపాలుడు వచ్చెను కాని మునుపటి వలె ఉత్సాహముగా పెండ్లి పనులలో పాల్గొనలేదు. వీరనతో సరసములాడలేదు. ముభావముగా ఉండి రెండు మూడు దినములకే వెడలిపోయెను.

వీరనయు మొదట కొంత ముభావముగా నుండెను కాని బంధువుల కోలాహలములో, ఆత్మీయతలో, ఆర్ద్రతలో కలిసి పోయి దారిలో పడిపోయెను. వీరిరువురి ధోరణులను గమనించిన మంగసాని మనుమనికి తొందరగా పెండ్లి చేసి వానిని పెను ప్రమాదము నుండి కాపాడితినని తృప్తిగా ఊపిరి పీల్చుకొన్నది.

# 4

# వీరనబోయడు

వీరనబోయని వివాహము జరిగిన రెండు నెలలకే సహస్ర మాస జీవి, ధీరవనిత, మంగసాని మరణించెను. పంద్రెండు బోయకొట్టములును శోకసముద్రమున మునిగిపోయెను. విశాలమైన బోయ రాజ్యము వీరనబోయని భుజస్కంధములపై బడినది.

పులిమీద పుట్రవలె వేంగి నగరమున జయసింహ వల్లభుడు మరణించెననియు ఆయన తమ్ముని కుమారుడు విష్ణువర్ధనుడు సింహాసనము నధిష్ఠించెననియు వార్త దావానలము వలె దేశమంతయు వ్యాపించినది.

జయసింహ వల్లభునికి సంతానము లేదు. తమ్ముని కుమారుడు విష్ణువర్ధనుడున్నాడు. ఏలనో కానీ మహారాజునకు విష్ణువర్ధనునిపై సదభిప్రాయము లేదు. తాను బ్రతికి యుండగానే, తనకు చెప్పకయే విష్ణువర్ధనుడు కొన్ని నిర్ణయములు తీసుకొని నెరవేర్చుకొనుచున్నాడు. తన తరువాత విష్ణువర్ధనుడు రాజగుట జయసింహ వల్లభునకు ఇష్టము లేదు.

జయసింహ వల్లభునికి ఆరోగ్యము క్షీణించుచున్నది. ఒక నాడు జయసింహ వల్లభుడు విష్ణువర్ధనుని తన చెంతకు పిలిపించుకొని మాట్లాడెను.

"నాకు తిలోదకము లిచ్చుటకును పిండ ప్రదానము చేయుటకును ఒక కుమారుడు కావలెను."

విష్ణువర్ధనునకేమియు పాలు పోలేదు. ఈ వయస్సున ఇది ఏమి కోరిక. మహారాజునకు కుమారుడు కావలెననగా ఇప్పుడు వివాహము చేయవలెననియా?

"చిత్తము. వెంటనే ఒక ఉత్తమ కుల సంజాతను తెచ్చి మీకు వివాహము గావింతును" అని లేవబోయెను.

"అది కాదు. అదికాదు. నేను చెప్పదలచినది అది కాదు"

"మరి – మరి – మీరు చెప్పునదేమో నా కర్థము కాలేదు"

"నా కొక వాగ్దానము చేయగలవా?"

"ఆజ్ఞాపించండి"

"నీ కుమారుని – అదే – మన మంగిని – నాకు దత్తత ఈయవలె".

విష్ణు వర్ధనుడు అయోమయములో పడిపోయెను.

అపుత్రకుడైన జయసింహు వల్లభుని తరువాత రాజు కావలసిన వారసుడు తానే కదా. తన తరువాత రాజు కావలసిన వాడు తన కుమారుడు మంగి. ఇప్పుడు పెద తండ్రి గారు

మంగిని దత్తు తీసుకొన్న యెడల పెద తండ్రి తరువాత ఎవరు రాజగుదురు. తానా? తన కుమారుడా?

తాను రాజగుట పెద తండ్రి గారికి ఇష్టము లేదు. రాజ్యమును నేరుగా మంగికే సంక్రమింప జేయదలచినాడు. అందుకే ఈ దత్తత స్వీకార ప్రతిపాదన.

ఈ ప్రతిపాదనను అంగీకరించి తాను శాశ్వతముగా సింహాసనమునకు దూరమగుటయా? లేక ఈ ప్రతిపాదనను తిరస్కరించి సింహాసనమునకు తన వారసత్యమును నిలుపుకొనుటయా?

మహారాజు గారు ఈ ప్రతిపాదనను బహిరంగముగా కొలువు కూటమున చెప్పిన యెడల ఎవరును మహారాజు నిర్ణయమును కాదనరు. కాని తన అనుచరులును తనకు కలరు. తాను రాజు కావలెనని వారందరును వేయి కన్నులతో ఎదురుచూచుచున్నారు. రాజైనట్లే కొందరు భావించుచున్నారు. వారు ఈ ప్రతిపాదనను ఎదిరింతురు. రాజ్యములో చీలిక లేర్పడును. సింహాసనము కొఱకు పోరాటమా? రాజ్యము అల్లకల్లోలము కాదా? వేంగి చాళుక్య వంశము ఏర్పడిన ఈ కొలది కాలములోనే మూడవ తరములోనే అంతఃకలహములా?

రాజు తానైననేమి, తన కుమారుడైననేమి?

"విష్ణూ మాట్లాడవేమి?"

"మీ ఆజ్ఞను నేను ఏనాడు కాదంటిని!"

శాస్త్రోక్తముగా మంగి - దత్తస్వీకారము జరిగిపోయెను. మంగిని యువరాజుగా ప్రకటించిరి.

జయసింహ వల్లభుని తరువాత మంగియే రాజగునని అందరు తలంచిరి. కాని మంగి అందరి ఆలోచనలను తలక్రిందు చేసెను. జయసింహుని మరణానంతరము మంగి పట్టాభిషేకమునకు సన్నాహములు జరుగుచుండగా మంగి గట్టిగా వ్యతిరేకించెను.

"తాతగారు చివరి దినములలో నిశ్చింతగా ప్రాణములు వదలవలెనని యువరాజు పట్టమునకంగీకరించితిని. కాని తండ్రిగారుండగా నేనెట్లు రాజగుదును? లోకము నవ్విపోవును. ఇది ద్వాపరయుగము కాదు. మా తండ్రి గారు భీష్ములు కారు. ఒక వ్యక్తి అభీష్టము మేరకు వారసత్వ ధర్మమును భంగపరుపరాదు. పట్టాభిషేకము తండ్రి గారికే జరుగవలెను"

చివరకు విష్ణువర్ధనునకే పట్టాభిషేకము జరిగిపోయెను. మంగి మరికొంత కాలము యువరాజుగానే మిగిలిపోయెను. చివరకు అతనికి "మంగి యువరాజు" అను పేరే స్థిరమైపోయెను.

ఇప్పుడు బోయలు జయసింహ వల్లభుని మరణమునకు సంతాపము వెల్లడింప వలసి యున్నది. విష్ణువర్ధనుని పట్టాభిషేకమునకు సంతోషమునూ వెల్లడింపవలసి యున్నది.

కానీ బోయలకు చాళుక్యులపై సదభిప్రాయము లేదు. వారి మనస్సులు పల్లవుల వైపే ఉన్నది.

తాము సర్వస్వము పోగొట్టుకొని, దిక్కులేని వారై, నిలిచిన చోట నిలువలేక, అల్లాడు చుండిన సమయమున తమ అభ్యర్థనను మన్నించి తమకు నిలువ నీడయు, బ్రతుకుతెరువును చూపినవారు పల్లవులే కదా. తాముండిన దేశమును జయించి ఆక్రమించుకొన్న చాళు క్యులు తమ స్థితిగతులను పట్టించుకొనరైరి. మీదు మిక్కిలి తమను అనుమాన దృష్టితో చూచి హింసించిరి.

నిజమునకు బోయలు పూర్వము విష్ణుకుండినుల పక్షమున పల్లవులతో సైతము పోరాడ లేదా? కాని పల్లవులు దానిని పట్టించుకొనలేదు. ఈ కాలమున ప్రజలదేమున్నది? ఎప్పుడు ఎవరు పాలకులుగా నుందురో అప్పుడు ప్రజలు వారినే కొలుతురు. అప్పుడు బోయలు విష్ణుకుండినుల ప్రజలు కావున వారి పక్షమున పోరాడిరి. వారిని తాము చేరదీసినారు. కనుక ఇప్పుడు వారు తమ పక్షమున పోరాడరా? ఇది పల్లవుల తలంపు.

ఈ తలంపు ఆనాడు చాళుక్యులకు కలుగలేదు. చెదరిపోవుచున్న ప్రజలను మరల సమీకరించు ప్రయత్నము చేయలేదు. అనాది నుండి తమ స్వస్థలముగా నుండిన త్రిపురాంత కమును వదలి ఈ కానరాని క్రొత్త దేశమునకు వచ్చుటకు చాళుక్యులే కదా కారణము.

"జయసింహ వల్లభుడు వచ్చి నాలుగు తీయని మాటలు చెప్పినప్పుడు అందరును సంతోషమును ప్రకటించిరి. ఏల? ముంచుకొని వచ్చిన పెనుముప్పును తప్పించుకొనుటకు. అంతమాత్రమున మనము చాళుక్యుల మనుష్యులమైపోవుదుమా" అని కొందరి వాదము.

"కాని ప్రస్తుతము చాళుక్యుదే పైచేయిగా ఉన్నది. పల్లవులు వెనుకకు తగ్గినారు. కందుకూరు కూడ ప్రస్తుతము చాళుక్యుల వశమైనది. మన నాయకుడు వీరనబోయనికి చాళుక్యుల కొలువులో గౌరవ స్థానము లభించినది. కావున మనము చాళుక్యుల మనుష్యులమే. కనీసము మాటలలోనూ, చేతలలోనూ అట్లే కనబడవలె" ఇది కొందరి వాదము.

జయసింహ వల్లభుని మరణమునకు సంతాపమును తెలిపి కొత్త మహారాజు యెడల తమ విశ్వాసమును ప్రకటించుటకు సామంతరాజులందరును వేంగికి పోవుచున్నట్లు సమా చారము వచ్చుచున్నది. వినుకొండ నుండి ధనపాలుడును ఈ విషయమై వర్తమానము పంపి యున్నాడు. కావున వీరనబోయడును వేంగికి ప్రయాణమయ్యెను. పౌరాణిక పండితుడైన మంచన శర్మను వెంట పిలుచుకొని పోయెను. ఇరువురును దారిలో వినుకొండలో రెండు దినములు ధనపాలుని ఇంటిలో నిలిచిరి.

ధనపాలుని ఇంటిలో అందరును మంగసాని మరణమునకు తమ సంతాపమును ప్రకటించిరి. వారి మాటలలో మొగమోటముతో కూడిన సభ్యత కనబడుచున్నది కాని మునుపటి ఆత్మీయత కొఱవడినట్లు కనబడుచునే యున్నది. కారణము స్పష్టమే. కాని ఇప్పుడు చేయదగినదేమియు లేదు. మంగసాని ముందు జాగ్రత్తగా చేయవలసిన పని చేసి పోయినది.

మంచనశర్మ వినుకొండలో తన బంధువులను మిత్రులను కలిసికొనెను. బోయ కొట్టములలో తమ క్రొత్త జీవితమును గురించి లెస్సగా వర్ణించి చెప్పుకొనెను. దానితో కొందరు బ్రాహ్మణులు బోయకొట్టములకేగు ఆలోచనలో పడిరి.

మూడవ దినము వీరనబోయడు మంచనశర్మను, జయపాలుని వెంట బెట్టుకొని వేంగికి పోయెను. వేంగి నగరమున వీరనబోయడు క్రొత్త మహారాజు గారిని దర్శించి యథాశక్తి కానుకలర్పించెను. జయపాలుడు వీరనబోయని విష్ణువర్ధన మహారాజునకు పరిచయము గావించెను.

"మహారాజు గారు పోవుటచే మేము దిక్కులేని వారమైపోతిమి. ఇక దేవరవారే మాకు దిక్కు. మహారాజు గారిని దేవర వారిలో చూచుకొని మునుపటి వలెనే సేవించుకొందుము". అని వీరనబోయడు సమయస్ఫూర్తితో వినయముగా పలికెను.

విష్ణువర్ధనుడు వీరనబోయని ఇదివరకే చూచి యున్నాడు. వాని సామర్థ్యమును గురించి వినియున్నాడు. కావున సాదరముగా చూచి క్షేమ సమాచారములడిగి సమయోచితమైన హెచ్చరికలు చేసి సెలవిచ్చి పంపివేసెను.

తిరుగు ప్రయాణమున వినుకొండలో ఒక దినము ఆగిరి.

"కట్టెపు దుర్గమున కార్తికేయ దేవాలయము పని ముమ్మరముగా జరుగుచున్నది. నిర్మాణము పూర్తియై విగ్రహ ప్రతిష్ఠ జరుగుటకు ఇంకను సంవత్సరము పట్టవచ్చును. అప్పుడు మీకు వర్తమానము పంపెదను. మీరందరును తప్పక రావలెను. సాకులు చెప్పినచో ఒప్పుకొనను. తప్పక అందరును రావలెను." అని వీరనబోయడు ఒక్కొక్కరిని ప్రత్యేకముగా పిలిచెను.

వీరనబోయడు సెలవు తీసికొనుచుండగా జయశ్రీ హృదయము విలవిలలాడెను. గుండె బరువెక్కెను. శరీరమున నిస్సత్తువ ఆవరించెను. కన్నులలో నీరు చిప్పిలెను.

వీరనబోయడును క్షణకాలము – క్షణకాలమే. విహ్వలుడైపోయెను. మనస్సు క్షణకాలము చెదరిపోయెను. ఏదియో బలహీనత ఆవరించినట్లయ్యెను. ఎట్లో మనస్సును కూడదీసికొని అందరి యొద్ద సెలవు తీసికొని బయట పడెను.

దేవాలయ నిర్మాణము నిర్విరామముగా మూడు సంవత్సరములు కొనసాగెను. శంకు స్థాపన నాడు పెండ్లి జరిగిన వీరనబోయనికి ఇప్పుడు రెండేండ్ల కుమారుడున్నాడు.

ఏబది మంది శిల్పులు శ్రద్ధగా పనిచేయుచున్నారు. రాతి దూలములపైన, స్తంభముల పైన స్వల్పమైన శిల్పములు మాత్రమే చెక్కుచున్నారు. సూక్ష్మమైన, నైపుణ్యముతో కూడిన శిల్పములు చెక్కుటకు వీరు సరిపడరు. అందులకు పెద్ద శిల్పులు కావలెను. వ్యయమెక్కు వగును. ఈ బోయ కొట్టములలోని దేవాలయములకు ఇంత మాత్రపు పనితనము చాలును. స్తంభములు బోసిపోకుండా స్వల్పమైన శిల్పములు చాలును.

కానీ ఆలయమునకు కావలసిన రాయి ఆ ప్రాంతమున లేదు. సింగరాయకొండ నుండి బండలను చీల్చి బండ్లపై అతి కష్టము మీద తోలుకొని వచ్చిరి. కొంత చీమకుర్తి నుండి తెప్పించిరి.

శిల్పులకు, పనివారికి కావలసిన సౌకర్యములు, భోజనాదికములు, వారి చిన్న చిన్న

అవసరములు అన్నియు వీరనబోయని పినతల్లి అన్నెమసానియే పర్యవేక్షించుచున్నది. పినతల్లి అనగా వీరనబోయని తండ్రికి రెండవ భార్య. ఈమెకు ఇద్దరు కుమార్తెలు మాత్రమే. ఇరువురికిని వివాహములైనవి.

మంగసాని బ్రతికి యుండినప్పుడే పండ్రెండు బోయకొట్టముల వ్యవహారములు తాను చూచుకొనుచు కుటుంబ వ్యవహారములు చిన్నకోడలు అన్నెమసానికి అప్పగించెను. పెద్ద కోడలు అమాయకురాలు. వీరనబోయని పోషణ భారమును కూడా అన్నెమయే వహించి వానిని పెంచినది. ఇప్పుడు వీరనకు పినతల్లి మాట వేదవాక్కు. ప్రతి విషయమును ఆమెను అడిగి, లేదా చెప్పియే చేయును. కుటుంబ విషయముగా అతనిని ఎవరేమి అడిగినను పినతల్లిని చూపును.

విగ్రహ ప్రతిష్ఠాపనకు ముహూర్తము నిర్ణయమైపోయినది. బంధుమిత్రులను ఆహ్వానించుటయునైనది. అన్ని బోయకొట్టములకు బంధువుల సందడి అధికమైనది. కట్టెపు దుర్గమున ఈ సందడికి మితి లేకుండెను. వచ్చిన వారందరును వారి వారికి నచ్చిన బంధువుల ఇండ్లలో దిగిరి.

ప్రతిష్ఠాపనోత్సవమునకు వినుకొండ నుండి ప్రసిద్ధులగు బ్రాహ్మణులు విచ్చేసిరి. అణ్డెక్కి నుండి అర్కభట్టారకుని కుమారుడు ఆదిత్య భట్టారకుడు విచ్చేసెను. అర్కభట్టారకుడు మరణించినాడట. ఆయన వ్రాసిపెట్టిన ఖగోళ శాస్త్ర పటములును, గుణించి యుండిన లెక్కలును ఆదిత్యభట్టారకుడు ఉజ్జయినికి పంపివేసెను. ఆదిత్య భట్టారకునికి ఈ పరిశోధనలపై ఆసక్తి కలుగలేదు. పంచాంగములు గుణించు విద్య మాత్రము నేర్చుకొనెను. వైదిక విద్యలు క్షుణ్ణముగా అభ్యసించెను. ప్రస్తుతము అతడును. అతని కుమారుడు భాస్కర భట్టారకుడును ఆయుర్వేద ఔషధములను గురించి పరిశోధనలు చేయుచున్నారు. విగ్రహ ప్రతిష్ఠాపనల యందు అతని విజ్ఞానము నిరుపమానము.

ప్రతిష్ఠకు మూడు దినములకు ముందు నుండియు దేవాలయమునకు, విగ్రహములకు వివిధములైన పూజలు జరుగుచున్నవి. హోమములు నిరంతరముగా జరుగుచున్నవి. విగ్రహములకు జలాధివాసము, ధాన్యాధివాసము మొదలగునవన్నియు జరిగిపోయినవి.

విగ్రహ ప్రతిష్ఠ కార్యక్రమమునకు యజమానులుగా దీక్ష వహింపవలసినదిగా మంచెన శర్మ వీరనబోయని దంపతులను కోరెను. తాను దీక్ష పూనిన యెడల బయట చేయవలసిన పనులకు ఇబ్బంది కలుగునని వీరనబోయడు కట్టెపు దుర్గములో వయోధికులైన ఒక బోయ దంపతులను యజమానులుగా దీక్ష వహింపజేసెను.

"ఇది నా ఒక్కని దేవాలయమా? నే నొకడనే కట్టించుచున్నానా? రేపు నేనొకడనే పూజలు జరిపింతునా? ఇది అందరిది. కావున మనలో వయోవృద్ధులైన దంపతులే ఈ పనికి అర్హులు" అని చెప్పి ప్రక్కకు తొలగిపోయెను. అయినను ఆ వృద్ధ దంపతులుగానీ, బ్రాహ్మణులుగానీ ప్రతి చిన్న విషయమును వీరనబోయనినే అడుగుదురు. వీరనబోయడు పినతల్లివైపు చూచును. పినతల్లి "నీయిష్టము" అనును. వీరన చెప్పినదే ఆచరింపబడును.

వినుకొండ నుండి ధనపాలుడును, అతని భార్యయు, కుమారుడు జయపాలుడును, కుమార్తె జయశ్రీయు వచ్చిరి. వారి నాగరికపు ఉడుపులు, మాటతీరు, అలవాట్లు బోయ కొట్టముల వారికి కొంత వేరుగా కనిపించినవి. వారు మహారాజు కొలువులోని వారు కదా అట్లే యుందురు అని సరిపెట్టుకొని ఆప్యాయముగా పలుకరించిరి.

కానీ ఈ ధనపాలుని కుటుంబము వారికి ఇక్కడి పరిస్థితులు చూడగా కన్నులు తిరుగునట్లున్నది. వీరనబోయని ప్రాభవమును, ఐశ్వర్యమును, పండ్రెండు బోయ కొట్టముల వారిపై వీరనబోయనికున్న అధికారమును చూచుచుండగా నోటమాట రాకున్నది. ఇది వరకును జయపాలుడు అనేక విధములుగా వర్ణించి చెప్పుచుండగా అతిశయోక్తులని భావించిరి. ఇప్పుడు ప్రత్యక్షముగా చూచుచుండగా జయపాలుడు చెప్పినది తక్కువ అనిపించుచున్నది. వీరిముందు తామెంత? తమ స్థాయి ఎంత? వేంగిరాజు కొలువులో చిన్న ఉద్యోగులు. నూర్లకొలది ఉద్యోగులలో ఒకరు. రాజు కొంత విముఖుడైనచో ఊడిపోవు ఉద్యోగములు తమవి.

కానీ వీరనబోయడు? కొంత విస్తీర్ణము కలిగిన బోయరాజ్యమునకు రాజు. రాజు అనుపేరు లేకపోయినను రాజుకంటె మించిన గౌరవమును, అధికారమును అనుభవించు చున్నాడు. వయస్సున చిన్నవాడైనను పెద్దలందరును గౌరవించుచున్నారు. అతని మాటను ఆజ్ఞగా భావించి తలదాల్చుచున్నారు.

ఇంతవరకును వినుకొండలో వీరనబోయని ఎదుట తమ పొడగరి తనమును వెలార్చు చుండిన వారు ఇప్పుడు వాని ముందర మరుగుజ్జులైపోయిరి. ఇంచుక విలాసవంతమైన జీవితము గడుపుచున్న నాగరికులమను ఒక అహంకారమే కానీ తక్కిన యేవిషయములోనూ తాము ఇతని దరిదాపులనైనను నిలువగలవారా? అతడు ఒక బోయరాజ్యమునకు ప్రభువు. ఎదురులేని నాయకుడు. అతని చేతిసైగతో, కంటి చూపుతో కొన్ని నూర్ల మంది వీరులు కదలుదురు. ప్రాణములిత్తురు.

విగ్రహ ప్రతిష్ఠకు ముందు దినము పగలు రెండవజాముున భోజనములైన తరువాత నగరు ముందర ఒక విశాలమైన అరుగుమీద వీరనబోయని ఇంటి వారును, ధనపాలుని కుటుంబమును, కట్టెపు దుర్గములోని కొందరు బోయదొరలును, వారిభార్యలును, ఇతర బోయకొట్టముల నుండి వచ్చిన ప్రముఖబోయదొరల కుటుంబముల వారును తీరికగా కూర్చొని యిష్టాగోష్టిగా మాట్లాడుకొనుచుండిరి. ఆ గుంపునకు కొంత దూరముగా ఒక చోట ఎఱ్ఱచందనపు కొయ్యలతో మంచి పనితనముతో చేసిన పెద్ద ఆసనము పైన వీరనబోయడు కూర్చుండి ప్రక్కన బల్లలపై కూర్చొనియున్న పెద్దలతో ఏదియో ముచ్చటించు చుండెను. వీరనబోయని తల్లులిద్దరును, భార్య సంపంగియు అక్కడనేయుండిరి.

ఒక మధ్య వయస్కురాలైన బోయసాని ధనపాలుని భార్య ప్రక్కన కూర్చొని జయశ్రీవైపు చూచుచు ఇట్లనెను.

"అమ్మా, మేము మోటువారము. మీరు నాగరికులు. మిమ్ములను ఈ విషయము

అడుగవచ్చునో అడుగరాదో తెలియుట లేదు. ఇట్లు మాట్లాడుచున్నానని ఏమియు అనుకోవద్దు. మా ఇండ్లలో ఆడపిల్లలు ఈడేరగానే తొందరగా పెండ్లచేయుదుము. కొందరు ఇంకను ముందుగానే – ఈడేరకముందే చేయుదురు. నాగరికులు ఆలస్యముగా చేయుదురేమో. మీరు మీ బిడ్డ పెండ్లికి చాలా ఆలస్యము చేయుచున్నారనిపించుచున్నది. అదిగో అట్లు చూడకుము – ఊరకే అడిగితిని".

ఒక్కసారిగా అందరును నిశ్శబ్దమైపోయిరి.

అంతవరకూ గోలగోలగా ఉన్న పరిసరములు ఉన్నట్లుండి నిశ్చబ్దము కాగానే వీరనయు, అతని ప్రక్కన కూర్చొని యున్న పెద్ద మనుష్యులును నిశ్శబ్దముగా అటువైపు చూడసాగిరి. ఈ ప్రశ్నకు ఎవరో ఒకరు ఏదో ఒక సమాధానము చెప్పవలె కదా!

ధనపాలుని భార్య మాట్లాడినది.

"ఎందుకో మా పిల్ల పెండ్లి వద్దనుచున్నది".

ఈసారి ఆ బోయసాని సూటిగా జయశ్రీనే ప్రశ్నించినది.

"ఎందుకమ్మా – పెండ్లి ఎందుకు వద్దను చున్నావు. జన్మయెత్తిన తరువాత జరుగవలసిన వన్నియు జరుగ వలయును కదా."

జయశ్రీ ఏమియు మాట్లాడలేదు. తలవంచుకొని యుండిపోయెను. అందరును ఆమె సమాధానమునకై ఎదురు చూచుచుండిరి. దూరమున నున్న వీరనయు, పెద్దమనుషులును ఇటే చూచుచున్నారు.

మరి యొక బోయసాని అందుకొనెను.

"ఏమి? పెండ్లి చేసికోకుండ బౌద్ధ సన్యాసినులలో చేరదలచినావా? ఆ పని మాత్రము చేయవద్దు. ఈ దినములలో బౌద్ధ సన్యాసినులు ఎంత అపఖ్యాతిపాలగుచున్నారో వినుచు న్నాము కదా"

ధనపాలుడు వెంటనే "లేదు లేదు అదేమియు లేదు" అనెను.

వీరనబోయని పినతల్లి అన్నెమసాని జయశ్రీ చేయిపట్టుకొనిలాగి తన ప్రక్కన కూర్చుండ బెట్టుకొని చుబుకమును పట్టి ఊపుచు చెప్పసాగెను.

"మనము సన్యాసులముకాము. సంసారులము. ఆడువారము. పెండ్లి లేకుండ ఉండ లేము. ఉండరాదు. ఆడది పెండ్లి చేసుకోవలె. బిడ్డలను కనవలె. వారిని పెంచి పెద్ద చేయవలె. మగవానికేమి? మహారాజు. మగవానికి నూరు పనులుండును. ఆడదే సంసారమును ఈదవలె. బిడ్డలను ప్రయోజకులను చేయవలె. వారికి పెండ్లిండ్లు చేయవలె. మనుమలను, మనుమ రాండ్రను ఎత్తుకోవలె. చివరకు అందరికన్నుల ముందర తృప్తిగా కన్నుమూయవలె. మగవాడు నూరు విధములుగా బ్రతుకవచ్చును. కాని ఆడుది బ్రతుకవలసిన పద్ధతి ఇది ఒకటియే. ఇది ఆడ జాతి నొసట బ్రహ్మదేవుడు వ్రాసినవ్రాత. మీ తల్లిదండ్రులకు తెలియనిదేమున్నది."

జయశ్రీ మాట్లాడలేదు. తలవంచుకొనియే యున్నది.

వీరనబోయని తల్లి కల్పించుకొన్నది. "ఏ వయస్సునకా ముచ్చట" అన్నారు. ఆ ముచ్చట

తీరవలె కదా? ఏమి?" అన్నది.

జయశ్రీ తల మరింత క్రిందికి వంచుకొని "ఆ ముచ్చట తీర్చవలసిన వానికి పెండ్లి అయిపోయినది." అని వినబడియు వినబడనట్లు పలికెను.

అందరును అవాక్కయిపోయిరి. ఒక ఆడపిల్ల ఇంత స్పష్టముగా చెప్పుటయా? ఇది బోయ కొట్టములలో కనీ వినీ ఎరుగనిది. నాగరికులు ఇట్లే ఉందురు కాబోలు.

వీరన పినతల్లి అన్నెమసాని కల్పించుకొన్నది.

"వానికెవనికో పెండ్లి అయిపోయినదని నీవు సన్యాసిగా ఉందువా? లోకములో మరి మగ వారే లేరా? లోకము గొడ్డు పోయినదా?"

"నా మనస్సే గొడ్డు పోయినది"

ఇది మరి యొక పిడుగుపాటు. ఏమి మాట్లాడుటకును, ఎవరికిని నోరు పెగలలేదు. ఏ ఆడపిల్ల అయినను ఇంత ధైర్యముగా మనస్సు బయట పెట్టగలదా?" ఈమె మనస్సుకు గట్టి దెబ్బయే తగిలినట్లున్నది. పాపము.. అందరిలోనూ సానుభూతి పెల్లుబుకుచున్నది.

'పోనీ అతనినే చేసికొనవచ్చును కదా?" అన్నది అన్నెమ.

'మా కంత దౌర్భాగ్యము పట్టలేదు" అన్నాడు ధనపాలుడు కొంత రోషమును కనపరచుచు.

అన్నెమ అతనివైపు తిరిగి సరిగా కూర్చొని "అన్నా, అన్నా. ఎంత మాటన్నావన్నా? ఇది దౌర్భాగ్యమా? ఒక మగవానికి రెండవ భార్యగా బిడ్డనిచ్చుట దౌర్భాగ్యమా? ఎంత మాట అంటివన్నా. మా మామగారికి ఇద్దరు భార్యలు. మా వారికి మేమిద్దరము భార్యలము. మా తండ్రులందరును దౌర్భాగ్యముతోనే మమ్ములనిచ్చినారా? అంతెందుకు. మీ తాతగారికి ఇద్దరు భార్యలట కదా? మీ అన్నగారికి ముగ్గురు భార్యలట కదా. వారిలో ఇద్దరు ఇప్పుడును ఉన్నారట కదా? వారి తల్లిదండ్రులందరునూ దౌర్భాగ్యముతోనే వారి బిడ్డలను రెండవ మూడవ పెండ్లికి ఇచ్చిరా? ఎంత మాటన్నా వన్నా" అన్నది.

ధనపాలుడును, అతని భార్యయు ఏమియు మాట్లాడలేక తలలు వంచుకొనిరి.

అంత వరకూ వీరనబోయనితో మాట్లాడుచుండిన పెద్దమనుషులలో ఒకడు కల్పించు కొనెను.

"ఇదేమంత పెద్ద విషయమని మాట్లాడుచున్నారు? ఇది లోకములో ఉన్నదే. లేనిదేమియు కాదు. అనాదిగా జరుగుచున్నది. ఈ దినములలో యుద్ధము లెక్కువై పోయినవి. పెండ్లికాని యువకులను బలవంతముగా సైన్యములోనికి లాగుకొని పోవుచున్నారు. చాల మంది యువ కులు యుద్ధములో చనిపోవుచున్నారు. లోకములో ఆడపిల్లల సంఖ్య ఎక్కువైపోయినది. ఒక్కొక్క మగవానికి ఇద్దరిని ముగ్గురిని కట్టబెట్టిననే గానీ సమస్యతీరదు"

మరి యొక పెద్ద మనిషియు మాట్లాడ సాగెను.

"మహా మహా రాజులే తమ కుమార్తెలను సాటిరాజులకు రెండవ భార్యగా, మూడవ భార్యగా ఇచ్చి చేయుచున్నారు మనమెంత?"

అక్కడున్న వారందరును తలకొకమాటగా వారి మాటలనే సమర్థించిరి.

అన్నెమ జయశ్రీ తల నిమురుచు "చెప్పమ్మా. నీవు వలచిన వాడెవడు. ఏ వూరు? పేరేమి? మా కుమారుడును, మీ అన్నయు కలిసిపోయి మాట్లాడివత్తురు. చెప్పమ్మా" అని మెల్లగా అడిగెను.

జయశ్రీ మాటలాడలేదు

"చెప్పమ్మా. ఇంతదూరము వచ్చిన తరువాత దాచి ప్రయోజనమేమి?" ఈసారి వీరనతల్లి అడిగెను.

"అతడు ఒప్పుకొనవలె కదా" జయశ్రీ మెల్లగా అనెను.

"మగవానికేమి? లక్షణముగా ఒప్పుకొనును. సిరి రా మోకాలొడ్డుదురా? నీవు వలచిన మగవాడెవడు? ఏ ఊరు? పేరేమి?" అన్నెమ గట్టిగా అడిగెను.

జయశ్రీ మెల్లగా తల పైకెత్తి అల్లంత దూరమున పెద్ద మనుషుల మధ్య ఆసనముపైన కూర్చొని యున్న వీరనబోయని వైపు చూచెను. అతని పైననే చూపు నిలిపెను. ఒక నిమిషము ఆ చూపు అట్లే నిలిపి "అతడే" అన్నట్లు తలతో సైగ చేసి మరల తలదించుకొనెను.

వీరనబోయని తల్లి ఉలికి పడినది "ఎవడు – నా కొడుకా" అన్నది నమ్మలేనట్లు.

అన్నెమ నివ్వెఅపోవుచూ "నిజమా, మావాడా, నిజమా హాస్యము కనుచున్నావా?" అన్నది.

జయశ్రీ ఏమియు మాట్లాడక అవునన్నట్లు తలఊపి నేలపై వ్రేలితో గీతలు గీయసాగినది. ఇది ఎవరును ఊహించని వార్త. బోయలకందరికిని దిగ్భ్రాంతి కలిగించు వార్త– ఏమి బదులు చెప్పవలెనో తోచనీయని వార్త. చాలసేపు ఎవరును మాట్లాడలేదు. దూరముగా వారివారి పనులపై తిరుగుచుండిన వారును సంగతి తెలిసికొని గబగబమని వచ్చి చుట్టును గుమిగూడిపోయిరి. క్రొత్తగా వచ్చి గుంపులో చేరిన వారు తమకు ముందున్న వారిని "ఏమిఏమి" అని గుసగుసలుగా అడుగుచున్నారు. ముందున్న వారు సంగతిని వెనుక వచ్చిన వారికి గుసగుసలుగా అందించుచున్నారు.

ఈ సంభాషణ ప్రారంభమైనప్పటి నుండియు వీరనబోయడు పెద్ద మనుషులతో మాటలు ఆపి వినుచున్నాడు. అతనికి ముండ్లపై నిలబడినట్లున్నది. గుండె దడదడ కొట్టుకొనుచున్నది. సంభాషణ ప్రారంభములోనే జయశ్రీ ఆలోచనయు, నిశ్చయమును అతనికి అర్థమైపోయినది. కాని ఒక ఆడ పిల్ల ఇందరిలో ఇంత స్పష్టముగా తన హృదయమును విప్పి చెప్పునా అని సందేహించుచుండెను. తన తల్లులు పట్టుదలగా అడుగుచుండుట చూడగా ఇక కుండబ్రద్దలు కాక మానదని తెలిసిపోయెను.

సంపంగితో తన పెండ్లి జరిగిన నాడే అతడు జయశ్రీపై ఆశలు చంపుకొన్నాడు. ఆశనైతే చంపుకోగలిగెను గాని అంతరంగమును చంపుకోలేకపోయెను. అంతరంగము జయశ్రీని కోరుచున్నది. దానిని కూడ చంపుకొను ప్రయత్నములోనే ఉన్నాడు. ఇందులో తన తప్పేమియు లేదు. తాను ఎప్పుడును ఎవరికిని మాట ఇవ్వలేదు. కనీసము తన అభిప్రాయమును కూడ జయశ్రీకి గాని, జయపాలునికి గాని చెప్పలేదు. తన తల్లుల ఎదుట

తలదించుకోవలసిన విధముగా తానెన్నడును ప్రవర్తింపలేదు. ఇప్పుడు జయశ్రీ చివరి మాటలు వినగానే వాని గుండెలలోని బరువు ఒక్కసారిగా దిగిపోయినట్లైనది. ఇక జరుగవలసినది జరిగిపోవును. జంకవలసిన పనిలేదు.

ఆ స్తబ్ధతలో మొదట తేరుకొన్నది అన్నెమయే. అల్లంత దూరమున ఆసనముపైన తలవంచుకొని కూర్చొని యున్న వీరనను చూచి

"ఏమి వీరా. ఏమిది. ఏమి నీ సంగతి?" అన్నది. వీరన ఏమియు మాట్లాడక తల వంచుకొనియే యుండెను.

"తలవంచుకోవద్దు. తలయెత్తు. మాట్లాడు" అన్నది అన్నెమ్మ.

వీరన తలపైకెత్తెను. పినతల్లిని చూచి నవ్వెను.

అన్నెమకు నోట మాటరాలేదు. జనులందరును నిశ్చేష్టులై కూర్చుండిపోయిరి.

సంపంగి బిడ్డను పొదువుకొని కన్నీళ్ళు పైటకొంగుతో ఒత్తుకొనుచున్నది. చెన్నుబోయడు ఏమియు మాట్లాడలేకున్నాడు. మగవాని రెండవ పెండ్లిని గురించి అంత స్పష్టముగా మాట్లాడిన పెద్దమనుషులు అక్కడనే ఉన్నారు. ఇప్పుడు తాను వారి ఎదుట ఏమి మాట్లాడగలడు? ఏమైనను ఆక్షేపించినచో ఆ ఆక్షేపణ చెల్లునా? చెల్లదు. చెన్నుబోయడు ఊరకుండిపోయెను. అన్నెమ గట్టిగా నిట్టూర్చినది. తన అత్త మంగసాని తీసుకొన్న జాగ్రత్తయు, చేసిన భద్రకార్యమును ఒక్క క్షణములో గాలికి కొట్టుకొనిపోయినది. అన్య రక్త సంపర్కము తప్పిపోయినదని మంగసాని సంబరపడిపోయినది కాని అది ఇంత కాలము లోలోపల రగులుచుండునని ఆమె గ్రహింపలేకపోయెను. ఇప్పుడేమి చేయవలెను? వ్యవహారము రచ్చకెక్కినది. కాదు – తామే నెట్టి నెట్టి రచ్చకెక్కించిరి. ఊరకున్నదానిని ఉసికొలిపి నెత్తికి తెచ్చుకొనిరి. ఇక వెనుకంజ వేయుటకు అవకాశమే లేకుండ చేసికొనిరి. అన్నెమ మనసు దృఢము చేసికొని లేచి జయశ్రీ తల్లిదండ్రుల దగ్గరికిపోయి "అన్నా ఇంక ఆలోచింపవలసిన అవసరము లేదు. మీ కుమార్తె జయశ్రీని మా కుమారుడు వీరనబోయనికి ఇచ్చి వివాహము చేయవలసినదిగా కోరుచున్నాము. ఇదిగో తాంబూలము" అని ప్రక్కనే వెదురు బుట్టలోని తమలపాకులను, చిన్న తాటాకు బుట్టలోని వక్కలను, గంపలోని పండ్లను, పూలను తీసి ఒక వెండి పళ్ళెరములో పెట్టుకొని తన కూతురుని, అల్లుని పిలిచి పళ్ళెరమును వారిచేతికిచ్చి జయశ్రీ తల్లిదండ్రుల చేతిలో పెట్టించెను.

ఆమె చొరవకు, సమయస్ఫూర్తికి అందరును నివ్వెఱపోయిరి. ఆమెలోని ఆ ప్రతిభను గుర్తించియే వీరనబోయడు తన నాయనమ్మ మంగసాని మరణించినప్పటి నుండియు ప్రతి విషయమునకును ఆమెనే సంప్రదించుచు వచ్చెను. కన్నతల్లి కంటే సవతితల్లినే మిన్నగా చూచెను. అది గుర్తించియే బోయకొట్టముల వారందరును పూర్వము మంగసాని యెడల చూపుచుండిన గౌరవ మర్యాదలను అన్నెమ ఎడల చూపసాగిరి.

జయపాలుడు తటాలున లేచి చేతికి అందుబాటులోనే ఉన్న ఆకులు, వక్కలు పండ్లు, పువ్వులు ఒక పళ్ళెరములో పెట్టి తల్లిదండ్రుల చేతికిచ్చి వీరన అక్కబావలకు ఇమ్మని సైగ

చేసి వాటిని తీసికొనుడని వారికిని సైగ చేసెను. కుమారుడే ఆ విధముగా ముందుకు వచ్చుట చూచి ధనపాలుడును అతని భార్యయు మారుమాటాడక తాంబూలపు పళ్ళెరమును వారికి అందిచ్చిరి.

జనుల కేకలతో కరతాళ ధ్వనులతో, నవ్వులతో, ఈలలతో ఆ ప్రాంగణము మారుమ్రోగి పోయెను. మొగిలి పూలవాసన వలె ఈ వార్త క్షణములో కట్టెపు దుర్గమంతయు వ్యాపించి పోయెను.

బ్రాహ్మణులను పిలిపించిరి. ముహూర్తము నిర్ణయించమనిరి. బ్రాహ్మణులు క్షణకాలము ఆలోచించి "అదియు ఇదియు ఏల? రేపు విగ్రహ ప్రతిష్ఠ జరిగిన తరువాత ఎల్లుండి కార్తికేయుని కల్యాణోత్సవము చేయుదుము కదా. అప్పుడే వీరి కల్యాణమును జరిపింతము" అనిరి.

వివాహము వైభవముగా సంబరముగా జరిగిపోయెను.

సంపంగియు, ఆమె తలిదండ్రులును పెండ్లి వేడుకలలో అంటియు అంటనట్లు పాల్గొనిరి.

కట్టెపు దుర్గమున కార్తికేయుని విగ్రహ ప్రతిష్ఠ జరిగిన తరువాత బేత కొట్టమున శివాల యము నందు శివలింగ ప్రతిష్ఠయు జరుగవలసియున్నది. మరల శుక్ల పక్షము వరకు వేచి యుండవలసిన దాయెను. అనగా దాదాపు నెల దినములు. ఈ నెల దినములలో పదునొకండు బోయకొట్టముల వారును క్రొత్త దంపతులను విందులకు ఆహ్వానించిరి. నవదంపతులును, జయశ్రీ తల్లిదండ్రులును, జయపాలుడును, సంపంగియు, ఆమె రెండేండ్ల కుమారుడును, వీరనతల్లియు కలిసి దినమునకొక్క బోయకొట్టమునకు పోయి అక్కడ పెద్ద దొర యింటిలో నిలిచి విందులు గుడిచి వారిచ్చు వస్త్ర తాంబూలములను స్వీకరించుచు రాత్రికి తిరిగి వచ్చుచుండిరి.

సంపంగియు జయశ్రీయు ఇప్పుడిప్పుడే చేరువగుచున్నారు. రెండేండ్ల బిడ్డడు కసవన జయశ్రీకి మాలిమి యగుచున్నాడు.

పెద్ద కుటుంబములలో ఆడు వారందరును పిల్లలందరిని ఉమ్మడిగా చూచుకొనవలసినదే. వారి వారి బిడ్డలను వారే చూచుకొనుట చెల్లదు. ఇంటిలోని పిల్లల బాగోగులు ఆ యింటి ఆడువారి అందరి బాధ్యత.

ధనపాలుని కుటుంబమునకు బోయకొట్టముల వారి ఆదరమును, ఆత్మీయతయు అన్నియు బాగుగానే యున్నవి కాని వారి అనాగరికత వీరికి బొత్తిగా నచ్చలేదు. గట్టిగా మాట్లాడుట, మోటు హాస్యములు, వరుసలు కలుపుకొని చనువుగా మాట్లాడుట ఏమియు నచ్చలేదు. జయశ్రీకి కూడ నచ్చలేదు. ఇది యేమి చనువు? తన భర్త పంద్రెండు బోయ కొట్టములకు రాజు. తానురాణి. ఈ బోయ జనులు దీనిని గుర్తించుట లేదే.

ధనపాలుని కుటుంబమువారు నాగరికులనియు, వేంగి చక్రవర్తుల కొలువులో రాజోద్యోగులనియు, ప్రస్తుతము తమ నాయకునికి బంధువులైనారనియు బోయదొరలు

వారిని విశేషముగా గౌరవించసాగిరి. దానితో వారి సహజమైన స్వాతిశయము – కట్టెపు దుర్గమున వీరనబోయని నగరు ముందు తలవంచుకొని యుండిన స్వాతిశయము – ఈ బోయ కొట్టములలో అప్పుడప్పుడు తలయెత్తుచుండినది.

తాను జీవితాంతము బ్రతుకవలసినది ఈ బోయదొరల మధ్యనే అని జయశ్రీకి తెలియును. కావున వారితో కలిసి పోవుటకు శక్తి కొలది ప్రయత్నించుచున్నది. కాని వారి వంటలు, భోజన పదార్థములు ఆమెకు సరిపడలేదు. క్రొత్త దంపతులకు కూడా వారు ఆరుగులు, జొన్నలు, కొఱ్ఱలు, సజ్జలతో విందులు పెట్టుచున్నారు. ఏ ఒకరిద్దరో బియ్యమును వాడుచున్నారు. అదియును లావు బియ్యము. ఊట నేలలలో పండిన తోకల వడ్లు బుడ్డవడ్లు ఇవియే వారికి లభించు బియ్యము. సన్న జాతి వడ్లు వారికి పండదు. అవసరమైనచో కొనవలసినదే. అవసరము లేదు కనుక కొనరు. పండిన దానితో సరిపుచ్చుకొందురు. అది ఆమెకు కష్టముగా నున్నది. ఆమె కష్టమును గమనించిన కొందరు ముందుగానే వంగవోలు నుండి సన్నబియ్యమును కొని తెచ్చి పెట్టుకొని క్రొత్త దంపతులకు విందు పెట్టసాగిరి.

ఇంతలో మంగి యువరాజు వేంగి సామ్రాజ్య పర్యటనకు బయలుదేరినాడనియు, కొన్ని దినములలోనే ఈ ప్రాంతమునకు రానున్నాడనియు వర్తమానము వచ్చినది.

పాపము! అతనికి మంగి యువరాజు అను పేరే స్థిరపడిపోయినది. జయసింహ వల్లభుని కాలముననను అతడు యువరాజే. విష్ణువర్ధనుని కాలముననను అతడు యువరాజే. పేరునకు అతడు యువరాజే కాని అతనికేమియు పనిలేదు. రాజకార్యములన్నియు మహారాజే చూచుకొనుచున్నాడు. నిరంతర యుద్ధములలో తలమునకలుగా నున్నాడు. కావున మంగి యువరాజు రాజ్య సరిహద్దులను పటిష్టముగావించు పనిలో పడినాడు. కేవలము రెండు వేల ఆశ్విక దళముతో రాజ్యమంతటను సుడిగాలి పర్యటన చేపట్టినాడు. యుద్ధ యాత్ర కాదు. తమ సరిహద్దు పట్టణములను, కీలకమైన ప్రదేశములను కట్టుదిట్టము చేసి సామంతులను హెచ్చరించి దుర్గాధిపతులకు తగు సూచనలిచ్చి వారిని వేంగీ సామ్రాజ్యమునకు విధేయులుగా నుండునట్లు చూచుటకే ఈ పర్యటనము. సరిహద్దులను దాటిపోవు ఆలోచన యువరాజుకు లేదు. అందువలననే స్వల్ప సైన్యముతో బయలుదేరెను.

యువరాజు పయనించు మార్గములో ముందుగా కొందరు ఆశ్వికులు పోయి సామంతులకో, లేక దుర్గాధిపతులకో యువరాజు గారి రాకను తెలియజేయుచు పోవు చుందురు. ఆ సామంతులు లేక దుర్గాధిపతులు ఈ దళమునకు భోజనము మున్నగు వసతులు చూడవలె. యువరాజు చెప్పు సూచనలు పాటించవలె. తమ సైన్యములను, దుర్గములను యువరాజు ఆదేశించు విధముగా పటిష్టము గావించుకొనవలె. పనిలోపనిగా కానుకలను సమర్పించుకొనవలె.

మంగి యువరాజు బోయకొట్టములకు వచ్చుచున్నాడను వార్త వచ్చినప్పటి నుండియు ధనపాలునకును, జయపాలునకును నడుముపై బట్ట నిలుచుట లేదు. వేంగి సామ్రాజ్యపు

కొలువులో అతి చిన్న ఉద్యోగులైన తాము ఇక్కడ మంగి యువరాజుకు దగ్గరగా, ముఖ్య సన్నిహితులుగా తిరుగుటకు అవకాశము కలుగుచున్నది. ఈ ప్రాంతమున యువరాజు గారికి సన్నిహితులైన స్వజనులు తాము తప్ప ఎవరున్నారు? ఈ పర్యటనతో ఈ బోయ కొట్టముల యందును, ఈ బోయ దొరల యందును తమ ప్రాభవము వెలిగిపోగలదు.

ధనపాలుడును, జయపాలుడును తాము తొందరపడిపోవుచు, బోయకొట్టముల వారిని తొందర పెట్టుచున్నారు. తమ అభిరుచులకు అనుగుణముగా, నాగరిక పద్ధతులలో కట్టెపు దుర్గమును సింగారించిరి. ఉదయముననే లేచి గుఱ్ఱములపై బోయకొట్టములన్నియు తిరిగి అక్కడి వారికి తగు సూచనలిచ్చుచుండిరి. కట్టెపు దుర్గము ప్రక్కనే ఉన్న వనమును శుభ్రము చేసి సైనికుల విడిదికి సౌకర్యము లేర్పాటు చేసిరి. యువరాజు కొఱకును, అతని సన్నిహితుల కొఱకును సన్న బియ్యము కందుకూరు నుండి తెప్పించిరి. సైనికుల కొఱకు సంచులు కొలది మోటు బియ్యమును సేకరించి పెట్టిరి.

చాళుక్య ఆశ్విక దళము వంగవోలును దాటినది.

మంగి యువరాజునకు మంత్రి కొమరశర్మ బోయకొట్టముల చరిత్ర వివరించుచుండెను. కొమరశర్మ పూర్వ విష్ణుకుండినుల మంత్రియైన సోమేశ్వర భట్టారకుని మనుమడు.

“ఇక్కడి నుండి తూర్పున సముద్ర తీరము వరకు బోయల రాజ్యము. వీరి రాజ్యమునకు ఉత్తరమున గుండ్లకమ్మ నదియు దక్షిణమున ముస్సి అను పెద్ద వాగును సరిహద్దులు. పడమర దీనికి నిర్దిష్టమగు సరిహద్దు లేదు. కాని బోయలు ఈ దండు బాటనే పడమటి సరిహద్దుగా భావించుకొనుచున్నారు.

“ఈ బోయవారు మొదట త్రిపురాంతక ప్రాంతముననుండిన వారు. సత్యాశ్రయ సార్వభౌముల వారి దండయాత్ర సందర్భముగా విపరీతముగా నష్టపోయి వీరు అక్కడ బ్రతుక లేక పల్లవుల అనుమతితో ఇక్కడికి వలస వచ్చిరి. ఇక్కడ పండ్రెండు పల్లెలు కట్టుకొనిరి. వీటికి పండ్రెండు బోయకొట్టములు అని ఉమ్మడి పేరు. కొట్టము అనగా పల్లవుల భాషలో పరిపాలనా విభాగము అని అర్థము. ఈ పండ్రెండింటిలో కట్టెపు దుర్గము ప్రధానమైనది. అనగా రాజధాని వంటిది. ఒక్కొక్క కొట్టమునకు ఒక్కొక్క పెద్ద దొరయున్నను ఈ కట్టెపు దుర్గము యొక్క పెద్ద దొరయే కొట్టములకన్నింటిని నాయకుడు. అనగా ఇతడు రాజు, తక్కిన వారు సామంతులన్నమాట.

“ఇప్పుడీ పల్లెలు బాగా విస్తరించిపోయినవి. నానా జాతుల వారు, నానా వృత్తుల వారు వచ్చి చేరిపోయినారు. వ్యవసాయము విస్తరించినది. చెరువులు కట్టుకొన్నారు. గుండ్లకమ్మ నుండి ముస్సి వాగు నుండి కాలువలు త్రవ్వుకొన్నారు. అందరును సంపన్నులైనారు. నేల సారవంతమైనది. చుట్టును ఉన్న చిట్టడవిని కొట్టి అరువు చేసికొన్నచో చేసికోగలిగినంత భూమిని సాగు చేసుకోవచ్చును.

“జయసింహ వల్లభమహారాజు గారు ఈ ప్రాంతమును పల్లవుల స్వాధీనము నుండి విడిపించి వేంగి రాజ్యములో కలిపినారు. మొన్ననే మన కొలువులోని సువిధాని ధనపాలుడు

తన కుమార్తెను ఈ బోయకొట్టముల ప్రధాన నాయకునకిచ్చి పెండ్లి గావించినాడు.”

“ఆఁ” అన్నాడు మంగి యువరాజు ఆశ్చర్యముగా.

“అవును ప్రభూ. ధనపాలుని కుటుంబము ఇప్పుడు ఈ బోయకొట్టములోనే ఉన్నారు.”

మంగి యువరాజు కట్టెపు దుర్గమును సమీపించు వేళకు మంగళవాద్యములు ముందు నడువగా బ్రాహ్మణులు పూర్ణకుంభముతో అనుసరింపగా, వారి వెనక వీరనబోయడును, ధనపాలుడును, జయపాలుడును, పదునొకండు బోయకొట్టముల పెద్ద దొరలును కలిసికట్టుగా మంగి యువరాజుకు ఎదురేగిరి. వారి వెనుక వేయి మందికి పైగా నానా వర్ణముల వారును నానా వృత్తుల వారును జయజయధ్వానములు చేయుచు ఎదురు పోయిరి.

మంగి యువరాజు గారును, మంత్రియు, మహా దళపతియు, సైనికులును గుఱ్ఱములు దిగిరి.

ఒక ప్రక్క బండ్ల కొలది కొబ్బరి బొండములును, మరియొక ప్రక్క పెద్ద పెద్ద గుండిగలలో సొంఠియు, కొంచెముగా పచ్చ కర్పూరమును కలిపిన పానకమును సిద్ధముగా ఉన్నవి. సైనికులు ఎవరికి వారే కొబ్బరి బొండములను కొట్టి త్రాగిరి. కోరలతో పానకము ముంచుకొని త్రాగిరి. ఈ స్వాగతాడంబరమును చూచి చాళుక్య ఆశ్వికులు ఆశ్చర్యపడిపోయిరి.

ధనపాలుడును జయపాలుడును మంగి యువరాజుకును మంత్రికిని మహా దళపతికిని, బోయ ప్రముఖులను పరిచయము గావించిరి.

మహా దళపతి జయపాలుని పై అధికారి. ఐదువేల మంది సైనికులకు నాయకుడు. జయపాలుడు కేవలము అయిదు నూర్ల సైనికులకు నాయకుడు.

కట్టెపు దుర్గము ప్రక్కన శుభ్రము చేయబడిన వనములో గొల్లెనలు లేచినవి. యువరాజు గారును, ప్రధానులును గొల్లెనలలో సేదదీరిరి. సైనికులు చెట్ల క్రింద విశ్రమించిరి.

రెండు గడియలలో భోజనము సిద్ధమయ్యెను.

భోజనానంతరము మంగి యువరాజును, మహాదళపతియు అయిదు నూర్ల ఆశ్వికులును బోయసీమను పరిశీలించుటకు బయలుదేరిరి. వీరనబోయడును, జయపాలుడును, యేబది మంది బోయ వీరులును ముందు భాగమున దారి చూపుచు కదలిరి. బోయ సీమ నాలుగు వైపుల పరిశీలించి చూచి తిరిగి వచ్చుసరికి ప్రొద్దుపోవు సమయమైనది. శుక్లపక్ష అష్టమి వెన్నెలలో మంగి యువరాజు కొలువుదీరెను. అతని కుడిచేతిలో త్రిభువనాంకుశ ముమ్మొన వాలు మెరయుచుండెను. యువరాజు బలవంతము చేయగా వీరనబోయడు కొంత ఎడముగా కొంత వెనుకగా తన ఆసనము వేయించుకొని కూర్చుండెను.

మంగి యువరాజు ప్రసంగించెను.

“బోయసీమ సస్యశ్యామలముగా నున్నది. సుభిక్షముగా నున్నది. మాకు చాల సంతోషము గానున్నది. మీ రాజు వీరనబోయడు సమర్థుడు. రాజ్యమును చక్కగా పాలించుచున్నాడు. పంద్రెండు బోయకొట్టముల వారును మీ రాజునకు, మీ రాజవంశమునకు విధేయులై ఉండవలె”.

ఈ రాజు, రాజ్యము అను మాటలు బోయలకు వింతగానున్నవి. బోయలెవరును

వీరనబోయని గాని అతని తాతను గానీ రాజుగా, ప్రభువుగా భావింపలేదు. తమ నాయకుడుగా భావించిరి. తమలో నొకడుగానే భావించిరి. రాజు అనుమాటతో అతడు తమనుండి ఎంతో దూరము వెళ్ళిపోవుచున్నట్లు అనిపించుచున్నది. అది వారికి నచ్చలేదు.

మంగి యువరాజు ప్రసంగము కొనసాగించెను.

"దక్షిణా పథమంతయు యుద్ధములతో అల్లకల్లోలమై పోయినది. విపరీతముగా జన నష్టము, వస్తు నష్టము జరిగిపోయినది. ఇక యుద్ధములు ఉండరాదని మేము భావించు చున్నాము. ఎవరి రాజ్య సరిహద్దులతో వారు తృప్తి పడి ఎల్లలు అతిక్రమింపక ఉండుట మేలని భావించుచున్నాము. దీనిని గురించి ఇతర రాజులతో మంతనములు జరుపుచున్నాము.

"మనము తెలుగు వారము. మన తెలుగు వేంగీరాజ్యము ప్రస్తుతము కందుకూరు వరకు వ్యాపించి యున్నది. అంతవరకు మనము సరిహద్దును పటిష్టము చేసికొన్న చాలును. మీరు వేంగి రాజ్యమునకు దక్షిణ సరిహద్దులోనున్నారు. కావున మీరు బలోపేతులై ఉండ వలె. కట్టెపు దుర్గపు కోటగోడ ఎంత మాత్రము గట్టిగాలేదు. కోట గోడ కనీసము రెండు బారల వెడల్పైనను ఉండవలె. పైన బురుజులుండవలె. కొత్తళములుండవలె.

"మీ పిల్లలను విద్యావంతులను చేసికోవలె. చదువు చెప్పెడి ఒజ్జలను పిలిపించుకోవలె. వారికి మంచి వర్తనములు ఏర్పాటు చేయవలె. ప్రతి కొట్టములోనూ చిన్నదో, పెద్దదో ఒక దేవాలయముండవలె.

"బోయ దొరలు విలు విద్యలో ప్రవీణులని విన్నాను. ఒక బోయదొరలేకాక సమస్త జాతుల వారును యుద్ధ విద్యలు నేర్చుకొనవలె.

"మీ వద్ద ఎన్ని గుఱ్ఱములున్నవి?" అని వీరనబోయని వైపు తిరిగి అడిగెను.

"చిత్తము. ఇన్నూరు గుఱ్ఱములున్నవి".

"అది చాలదు. మీకు కనీసము అయిదు నూర్ల గుఱ్ఱపు దళముండవలె. త్వరగా గుఱ్ఱములను కొని గుఱ్ఱపు దళమును పెంచండి"

"చిత్తము"

యువరాజు మరల ప్రజల వైపు తిరిగి మాట్లాడెను.

"రాజ్యపాలనము వట్టి మాటలతో జరుగు పనికాదు. ధనము కావలె. రాజు బొక్కసము నందు ధనముండవలె. ప్రజలు సక్రమముగా పన్నులు, సుంకములు చెల్లించవలె. పన్నులు చెల్లింపని వారిపై దండన తీవ్రముగా నుండును. ఇక మీరు సెలవు తీసికొనవచ్చును."

"ప్రజలందరును దండములు పెట్టుచు వెళ్ళిపోయిరి. మంగి యువరాజు వీరనబోయని తోనూ మరి కొందరు బోయ ప్రముఖులతోనూ బ్రాహ్మణులతోనూ ఆంతరంగిక సమావేశము ఏర్పాటు చేసెను.

"నీవు నీ రాజ్యమున పన్నులు సక్రమముగా రాబట్టి మాకు కట్టవలసిన కప్పము కట్టి తక్కినది నీ బొక్కసములో చేర్చుకో. ఏయే కొట్టముల నుండి ఎంతెంత ఆదాయము వచ్చు చున్నది. ఏయే ఇతర మార్గముల నుండి సుంకములు, పన్నులు వచ్చుచున్నవి. సక్రమముగా

లెక్కలు వ్రాయించుకోవలె. అందుకు ఇద్దరు బ్రాహ్మణులను నియమించుకో. నీ రాజ్యములోనికి మరికొందరు బ్రాహ్మణులను రప్పించుకో. నీ సముద్ర తీరమున దిగు ఓడల సరుకులపై సుంకము రాబట్టుము. ఆ ధనముతో గుఱ్ఱములను కొనవచ్చును. యువకులందరును గుఱ్ఱపు స్వారీ నేర్చుకోవలె. ఆయుధాభ్యాసము సాగించవలె. అవసరమైనప్పుడు బోయరాజ్యము నుండి ఐదునూర్ల గుఱ్ఱపు దళము మాతో వచ్చి చేరవలె"

తరువాత బ్రాహ్మణుల వైపు తిరిగి మాట్లాడెను.

"మీరందరును ప్రజలకు ధర్మబోధ చేయవలె. ప్రజల నైతిక ప్రవర్తనకు బ్రాహ్మణులే బాధ్యులు. ప్రజలలో నైతిక ప్రవర్తన లోపించినప్పుడు సమాజ భద్రతయు లోపించును. అది ప్రభువులకు తలనొప్పిగా మారును. మీ ధర్మ ప్రచారము వలన రాజుల తలనొప్పి తీరును. ప్రభువుల దండ నీతి కంటె మీ ధర్మ ప్రచారమే ప్రజలను సన్మార్గమున నడిపించును. ఇది బ్రాహ్మణుల కర్తవ్యము.

"నా విష్ణుః పృథివీ పతిః– రాజనగా ఎవరు? సాక్షాత్తు దేవుడే. రాజసేవయే దైవ సేవ. ఈ విషయమును మీరు ప్రజలకు నూరిపోయవలె. మీ వాక్కు ప్రజలకు బ్రహ్మ వాక్కుగా ఉండవలె. అందుకు మీరు సదాచార సంపన్నులై వైదిక కర్మ నిష్ఠాగరిష్ఠులై ఉండవలె. రాజులు మిమ్ములను భూసురులు అని గౌరవించుచుండుట ఎందుకు? మీకు అగ్రహారములు మాన్యములు ఇచ్చుచుండుట ఎందుకు? మీ మాటల వలన ప్రజలు రాజుకు విధేయులై ఉండవలెననియే కదా. మరికొందరు బ్రాహ్మణులను పిలిపించుకొనుడు. ధర్మబోధ గావింపుడు భగవద్భక్తిని ప్రబోధింపుడు"

మంగి యువరాజు తన ప్రసంగమును ముగించి తన గుడారములోనికి వెళ్ళిపోయెను.

ఉదయగిరి నుండి తోలుబొమ్మలాట ఆడించు ఆటగాండ్రు అప్పుడు నాలుగు దినముల నుండియు కట్టెపు దుర్గమున ఆటలు ప్రదర్శించుచుండిరి.

ఆ రాత్రి వారు యువరాజు గారి గుడారము వద్ద విశాలమైన మైదానములో ఒక వేదికయు దానికి ముందు వైపున తెల్లని తెరయు, తక్కిన మూడు వైపుల మందపు తెరలును ఏర్పాటు చేసికొనిరి. భోజనములైన తరువాత "లంకా దహనము" ఆట ప్రారంభించిరి. యువరాజు గారును, ఆయన ప్రధానులును, వీరనబోయని కుటుంబము వారును ప్రత్యేక స్థానములలో ఆసీనులు కాగా సామాన్య జనులు వేదిక ముందర కూర్చుండిరి.

తోలుబొమ్మలాటకు ఉదయగిరియే జన్మస్థానమని వారు చెప్పుకొందురు. చర్మమును శుద్ధి చేసి మనుష్యుల రూపములలోనూ, జంతువుల రూపములలోనూ కత్తరించి పలుచని వెదురుబద్దలకు చేర్చి కుట్టుదురు. బొమ్మలకు వెనుకవైపు ప్రకాశవంతమైన దీపములుంచుదురు. బొమ్మల నీడ ముందున్న తెరపై పడును. సూత్రధారులు బొమ్మలకు దారములు కట్టి తమ నీడ తెరపై పడకుండా నిలిచి బొమ్మలను ఆడింతురు. సందర్భోచితముగా పాటలు పాడుదురు. గ్రామ్యభాషలో సంభాషణలు చెప్పుదురు.

మధ్య మధ్య కేతిగాడు, బంగారక్క అను హాస్య పాత్రలు ప్రవేశించును. అవియు బొమ్మలే.

వారి నటనకు, సంభాషణలకు ప్రేక్షకులు కడుపుబ్బ నవ్వుదురు. వారి నటనయు, సంభాషణలు పచ్చి బూతులమయముగా నుండును.

ఆట రసరమ్యముగా నున్నది. సీతమ్మ చెట్టు క్రింద విలపించుచున్నది. పది తలల రావణుడు వచ్చి దుర్భాషలాడి వెడలిపోయెను. హనుమంతుడు చెట్టుపై నుండి క్రిందికి దుమికెను. ఉంగరమునిచ్చెను. రాక్షసులతో పోరాడెను. రావణుని సభలో మాట్లాడెను. అతని తోకకు నిప్పు పెట్టిరి. ఆ తోకతో అతడు లంకను దహించెను. సీతను దర్శించి అభిజ్ఞానమును గ్రహించి వెడలిపోయెను. ఆటగాండ్రు లంక కాలిపోవుటను మిక్కిలి నైపుణ్యముగా ప్రదర్శించిరి. ఆట ముగియునప్పటికి తొలి కోడి కూసెను.

ఆటగాండ్రకు మంగి యువరాజు గారి నుండి భూరి పారితోషికము, వస్త్రములు లభించినవి. ప్రేక్షకులును తమ శక్తి కొలది వస్త్రములను, డబ్బును ఇచ్చి సంతోషముగా వెడలిపోయిరి.

మరునాడు చాళుక్య సైన్యము కందుకూరునకు బయలుదేరి వెళ్ళిపోయెను.

బోయకొట్టములలో మంగి యువరాజు చేసిన పర్యటన చుట్టుప్రక్కల చాల దూరము తన ప్రభావమును చూపినది.

పండ్రెండు బోయకొట్టములు కలిగిన ఒక బోయ రాజ్యమున్నదనియు అది సస్య శ్యామలముగా సుసంపన్నమై యున్నదనియు, దాని రాజు వీరనబోయడు కడు సమర్థుడనియు, పరాక్రమవంతుడనియు, విలువిద్యలో అసమానుడనియు వేంగి సామ్రాజ్యపు దక్షిణ భాగమంతయు మారుమ్రోగి పోయినది. ఆ బోయదొరలు వేంగి రాజుల ప్రత్యేక అభిమానము చూఱగొన్నారనియు అక్కడి సముద్ర తీరమున దిగు నౌకలపై సుంకము రాబట్టుకొను అధికారము కూడా పొందినారనియు ప్రచారమైపోయెను.

ఇది విని ఆ ప్రాంతమునకు వచ్చి స్థిరపడ దలచిన వారి సంఖ్యయు అధికమైపోయెను.

అట్లు వచ్చిన వారిని వీరనబోయడు వారి పూర్వోత్తరములను చక్కగా విచారించి వారి గుణములను పరిశీలించి వారి కిష్టమైన ఏదో ఒక కొట్టము వద్ద స్థిర పడుటకు అనుమతి నిచ్చుచుండెను.

బేత కొట్టమున శివాలయమున విగ్రహ ప్రతిష్ఠ వైభవముగా జరిగినది. అది చూచి మరికొన్ని కొట్టముల వారును ఏదో ఒక దేవాలయము కట్టుకొనవలెనని ఉత్సాహపడిరి. మంచన శర్మ అందుకు కావలసిన ఏర్పాట్లు చేయసాగెను.

జయశ్రీ తల్లిదండ్రులు వీరనబోయని తల్లి యొద్దకు పోయిరి.

"ఇక్కడ పెండ్లి హఠాత్తుగా జరిగిపోవుటచే మా పిల్ల పెండ్లి మావారెవరికిని తెలియు అవకాశమే లేకపోయినది. పెండ్లి జరిగి నెల దాటిపోయినది. ఇంకను ఆలస్యము చేసిన యెడల మా బంధువులలో మేము నిష్ఠురపడుదుము. మా వారి కందరికిని మా కుమార్తెను

అల్లుని చూపవలెను కదా. మా వారికిని బిడ్డపై ఏవో అపేక్షలుండును కదా. అవి తీర్చుకొను అవకాశము వారికి ఇవ్వవలెను కదా. కూతురిని అల్లుని పిలుచుకొని పోయి కొన్ని దినము లుంచుకొని పంపుదుము. మీరు కాదనక ఇరువురిని పంపవలె.”

ఆమె చెల్లెలివైపు చూచెను.

“ఇందులో కాదను మాట ఏమున్నది? తప్పక పిలుచుకొని పోవలసినదే. కాని ఇక్కడి పరిస్థితులు చూచుచున్నారు కదా. పన్నెండు కొట్టములకు ఇతడే దిక్కు. ఇతడు లేని యెడల ఎక్కడి వ్యవహారములక్కడ నిలిచిపోవును. చిక్కులేర్పడును. ప్రజలు ఇబ్బంది పడుదురు. మన వేడుకలు మనకు నూరుండవచ్చును. ప్రజల క్షేమమును కూడా చూడవలె కదా. కాబట్టి ఇరువురిని సాధ్యమైనంత తొందరగా తిరిగి పంపివేయుడు” అన్నెమ మాటలు మెత్తగా ఉన్నను దృఢముగా నున్నవి.

ఆ మాట అన్నదే చాలు అన్నట్లు వారు ప్రయాణమైరి.

వీరనకు పినతల్లి ఏకాంతమున ఎన్నియో బుద్ధులు చెప్పెను.

“వారి నాగరికత వేరు, మన నాగరికత వేరు. వారి అలవాట్లు వేరు, మన అలవాట్లు వేరు. పడరాని ముడి ఎట్లో పడిపోయినది. వారి నాగరికతకు అలవాట్లకు మురిసిపోయి నీవు వాటిని అలవాటు చేసికొన్న యెడల ఇక్కడి మనవారికి దూరమైపోదువు. మనవారు నిన్ను పరాయి వానినిగా భావింతురు. మన వారికి మనము దూరమైన తరువాత ఎంత గొప్పగా బ్రతికిన ఏమి ప్రయోజనము? జాగ్రత్త. పోయిన పది దినములకు తిరుగు ప్రయాణమును గురించి హెచ్చరించుము. తరువాత రెండవ దినమున ఎకాఎకి బయలుదేరుము. మొగమోటములు వద్దు. మొగమోటముల వెంట నిష్ఠురములు పుట్టుకొని వచ్చును. నిష్ఠురముల వెనక కలతలు పుట్టును. కనుక మొగమోటమును మొగ్గలోనే త్రుంచివేయవలెను. అంత్యనిష్ఠురము కంటే ఆది నిష్ఠురము మేలు. గుర్తుండునా?”

వీరన నవ్వుచు “ఊహుఁ, నీవు చెప్పునవి ఏవియు ఎప్పుడును గుర్తుండవు” అనెను.

వీరనతోబాటు పదిమంది బోయ యువకులు ప్రయాణమైరి. జయశ్రీ వెంట వీరనకు దగ్గర బంధువులైన ఇద్దరు బోయ ముత్తైదువలు బయలుదేరిరి. బండిబయలుదేరు సమయమునకు నేనును వత్తునని సంపంగి కుమారుడు ఏడువసాగెను. ధనపాలుడు బల వంతము చేయగా ఒక ఘడియలో సంపంగియు ప్రయాణమై కొడుకుతో కూడ బండి ఎక్కెను. మగవారు గుఱ్ఱములపైనను, ఆడువారు గూడుబండ్లలోనూ ప్రయాణమైరి.

ఆడువారికి అలసట కలుగ కుండా అక్కడక్కడ ఆగుచు. రాత్రులయందు సౌకర్యవంతమైన విడిది పట్టులలో నిలుచుచు ఏడవ దినము ప్రొద్దుపోవు వేళకు అందరును వినుకొండ చేరుకొనిరి. జయపాలుడును మరి ఇద్దరు బోయ యువకులును ముందుగానే గుఱ్ఱములపై వేగముగా పోయి వీరి రాకను ఇంటిలోని వారికి, సమీప బంధువులకును ఎరిగించి నూతన వధూవరులను ఇంటిలోనికి ఆహ్వానించుటకు తగిన ఏర్పాట్లు చేయించిరి. బంధువులు ఆ

ఇంటిని అలంకరించిరి. బండ్లు ఇంటి ముందు ఆగగానే ముత్తైదువలు హారతులతో వధూ వరులను స్వాగతించిరి.

ధనపాలుని కూతురు జయశ్రీ ఒక బోయదొరను పెండ్లాడి మగనితోబాటు వచ్చినదను వార్త సుడిగాలి వలె వినుకొండలో వ్యాపించెను. అతడు సాధారణ బోయదొరకాడట. ఒక బోయ రాజ్యమునకు ప్రభువట. అతనికొక కోట కలదట. దానిని కట్టెం దుర్గము అందురట. పండ్రెండు బోయకొట్టముల వారు అతని మాటను శిరసావహింతురట. అతడు రెండు దేవాలయములను కట్టించినాడట. సాక్షాత్తు మంగి యువరాజు అతనిని తనతో సమానముగా తన సమీపమున ఆసనము వేయించి కూర్చుండ బెట్టుకొనెనట. ఈ కథలన్నియు వినుకొండలో చిలువలు పలువలుగా అల్లుకొన్నవి.

ఇంతకు ముందు ఈ యువకుడు మన ఊరికి నాలుగైదు పర్యాయములు వచ్చి యుండిన వాడే కదా. ఎవడో సామాన్య బోయదొర అనుకొంటిమి. ఇంతటి వాడని తెలియకపోయెను.

జయచంద్రుని ఇల్లు తీర్థమైపోయెను. వచ్చువారును, చూచువారును, పలుకరించు వారును, జయశ్రీని అభినందించువారును – తెరపియే లేకపోయెను.

రెండవ దినమున ఆ యూరి యువకులు కొందరు వచ్చి వీరనబోయని పరిచయము చేసికొనిరి. వారందరును శస్త్ర విద్యలలో ప్రవీణులు. యుద్ధ సమయములందు సైన్యములో చేరి యుద్ధములకు పోయెడువారు.

వారు చదువను, వ్రాయను నేర్చిన విద్యావంతులు. వీరనబోయడు చదువు లేనివాడు. కాని వారు ఆ భేదమును పట్టించుకొనలేదు. ప్రముఖులని పేరు పొందిన వారిలో విద్యా గంధములేనివారెందరు లేరు! కనుక వారు వీరనబోయనితో చక్కగా కలిసి పోయిరి.

అత్తవారింట వీరనకు బ్రహ్మాండముగా అల్లుని మర్యాదలు జరుగుచున్నవి. పరిమళ ద్రవ్యములతో స్నానములు, నూతన వస్త్రములు, పూటపూటకు పిండి వంటలతో వివిధములైన పక్షుల మాంసముతో, చేపలతో, సన్న బియ్యపు అన్నముతో భోజనము. మధ్య మధ్య ఫలహారములు, కొబ్బరిబొండములు– చెప్పనలవి కాని మర్యాద – ఇట్లే కొన్ని దినములు జరిగినచో తన ఆరోగ్యము చెడుట తప్పదు. అప్పటికిని ప్రతి దినము ఉదయము సాయంత్రము ఆ ఊరి యువకులతో కలిసి నాలుగైదు ఘడియలు గుఱ్ఱపు స్వారి చేయుచున్నాడు. రెండు మూడు ఘడియలు విశాలమైన దేవాలయపు కోనేటిలో ఈదుచున్నాడు. తోడి యువకులు త్వరగా అలసిపోవుదురు. "అప్పుడే అలసటా?" అని వారిని రెచ్చగొట్టును.

"నీకేమయ్యా అత్తగారింట బాగుగా పెట్టుచున్నారు. లెస్సగా తినుచున్నావు. ఎంత సేపైనను ఈదగలవు. మాకట్లు జరుగునా?" అని వారు అందురు.

"మీరును రండు. నాతో బాటు తినవచ్చును" అని వీరన అనును.

"ఇది కట్టెపు దుర్గపు సంస్థానము కాదు ఎందరు వచ్చినను పెట్టుటకు – పాపము – ధనపాలుడు సామాన్య కుటుంబీకుడు. రాజు గారిచ్చు జీతముపై ఆధారపడి బ్రతుకుచున్న వాడు" అని ఒక యువకుడు జాలి ప్రకటించును.

"అంత జాలి పడవలసిన పని లేదు. ఏదో ఒక వ్యయము పేరు చెప్పి దానికి ఇబ్బడి ముబ్బడిగా రాజుగారి బొక్కసము నుండి డబ్బు కొట్టి వేయుచున్నాడు" అని మరియొకడు అనును.

"గట్టిగా అనకుము. అతని నోటి కూడు పడగొట్టవలెనని కసిగా ఉన్నదా ఏమి?" అని మరియొకడు నవ్వును.

నాలుగైదు దినములలో వీరనబోయని విషయము వినుకొండ నగరాధ్యక్షుని చెవిని బడినది. అతడు వినుకొండలో చాళుక్యరాజ ప్రతినిధి. నగరాధ్యక్షుడు వీరన వర్తమాన మంతయు క్షుణ్ణముగా విచారించి తెలిసికొని తగిన వ్యక్తులతో వీరనబోయనికి ఆహ్వాన మంపెను.

మరునాడు నగర పాలకుడు నిర్దేశించిన సమయమునకు – అనగా పగలు నాలుగవ జాముస వీరనయు, ధనపాలుడును, జయపాలుడును, బోయవీరులు పది మందియు నగరాధ్యక్షుని భవనమునకు పోయిరి. విశాలమైన పడసాల యందు చక్కని చెక్కడపు పనితనమును, బూరగ దూది నింపిన పట్టు దిండ్లును గల ఒక ఆసనముపైన నగరాధ్యక్షుడు కూర్చొని యుండెను. ఒకవైపున పొడుగాటి బల్లలు అమర్చబడి యున్నవి. అవి పట్టణము నందలి ప్రముఖులు వచ్చినప్పుడు కూర్చుండుటకు.

వీరనబోయని బోయ రాజ్యమునకు ప్రభువనుచున్నారు. మంగి యువరాజు ఇతనిని తన ప్రక్కనే కూర్చుండబెట్టుకొనెననుచున్నారు. ఈ వార్త మహారాజు కొలువులో విశేషముగా చెప్పుకొనిరి. కాబట్టి ఇతనిని సాధారణులను చూచినట్లు చూడరాదు అనుకొని నగరాధ్యక్షుడు తన ఆసనము వంటి మరియొక ఆసనము తెప్పించి యుండెను.

పడసాల ప్రవేశింపగానే అందరును నగరాధ్యక్షునికి నమస్కరించిరి. నగరాధ్యక్షుడు చిరునవ్వు మొగముతో లేచి వీరనకు ఆసనమును తక్కిన వారికి బల్లలను చూపెను. ధనపాలుడును. జయపాలుడును బల్లపై కూర్చొనిరి. బోయ యువకులు కూర్చొన లేదు. వీరన కూర్చుండిన ఆసనము వెనుక నిలబడిరి.

"మీ బోయకొట్టములెట్లున్నవి. వర్షములు పడినవా. పంటలు పెట్టినారా?"

"చాళుక్య చక్రవర్తుల పాలనలో మాకేమికొఱత? అంతయు సుభిక్షముగానే ఉన్నది."

"బోయదొరలు చక్కని విలుకాండ్రని వింటిని"

"అవును. జయసింహ వల్లభ మహారాజుల వారు స్వయముగా పరీక్షించి ఈ మాటయే సెలవిచ్చినారు"

"అవునవును, వినియున్నాను. మీ బోయకొట్టములలో ఎందరు విలుకాండ్రుందురు?"

"బోయ యువకులందరునూ విలుకాండ్రే. మేటి విలుకాండ్రుగా ఎన్నదగిన వారు ఇన్నూరుకు మించి తేలవచ్చును."

నగరాధ్యక్షుడు అవాక్కయ్యెను. తన అధీనమున నున్న సైన్యములో నూరు, నూట యేబది కంటే మించి లేరు.

"ఈ యువకులను విలుకాండ్రేనా?"

వీరనబోయడు తల ఊపెను.

"ఏ తీరువారు? సాధారణ విలుకాండ్రా, మేటి విలుకాండ్రా?"

దానికేమి సమాధానము చెప్పవలెనో వీరనకు తోచలేదు. క్షణము ఊరకుండి "గట్టివారే" అనెను.

నగరాధ్యక్షుడు నవ్వుచు. 'అన్యథా భావింపరు కదా. నాకది యొక వేడుక. రేపు విలు విద్యా ప్రదర్శనము ఏర్పాటు కావింతము. మా ధానుష్కులును కొందరు వత్తురు. ఇది కేవలము వేడుక కొఱకే. పందెము కాదు."

"దానికింత చెప్పవలెనా. అట్లే చేయుదము."

"రేపు ఇదే వేళకు దేవాలయము వెనుక మైదానములో చేరుదము."

కొంతసేపు వీరనతోనూ, ధనపాలునితోనూ, జయపాలునితోనూ వారి కుటుంబ విషయములు మాట్లాడి నగరాధ్యక్షుడు లేచి నిలబడెను.

అందరును లేచి మరియొక మారు అతనికి నమస్కరించిరి.

మరునాడు మధ్యాహ్నమే నగరాధ్యక్షుడు మరియొకసారి వీరనబోయనికి ఆహ్వానము పంపెను.

సాయంత్రము జాము ప్రొద్దుండగానే దేవాలయము వెనుక ప్రాకారములోపలి విశాలమైన మైదానమున జనులు చేరిపోయిరి. విలు విద్యా ప్రదర్శనము ఉండునని తెలిసిన వారందరును బిలబిలమని వచ్చిరి.

వీరనబోయడును, అతని అనుచరులు పది మందియు, ధనపాలుని కుటుంబము వారును వచ్చిరి. నగర పాలకుడును అతని కుటుంబములోని వారును వచ్చిరి. ప్రదర్శనలో పాల్గొనుటకు వినుకొండలో ఎన్నుకొనబడిన విలుకాండ్రు ఇరువది మంది తమతమ విండ్లతోనూ అమ్ములతోనూ వచ్చిరి. బోయవీరుల కొఱకు ఒక బండిపైన పదునైదు విండ్లును, ఇరువది ఐదు అమ్ములును తెచ్చి నిలిపిరి.

ప్రాకారము గోడకు రెండు మూడడుగుల దూరమున వరుసగా పది వెదురు చువ్వలు పాతి వానిపైన సమాన పరిమాణము గల నిమ్మకాయలు పెట్టిరి. అచ్చటికి డెబ్బది అడుగుల దూరమున విలుకాండ్రు నిలుచుకొనుటకు ఒక గీత గీచిరి. ఆ గీత వెనుక పది అడుగుల దూరమున, ముందునాటి వలెనే రెండు ఆసనములపై నగరాధ్యక్షుడును, వీరనయు కూర్చుండగా, తక్కిన వారు వారి వారి స్థాయిలను బట్టి బల్లలపై కూర్చుండిరి.

వీరన భార్యలు ఇరువురును నగరాధ్యక్షుని కుటుంబ స్త్రీల ప్రక్కన చేరిపోయిరి. చూడవచ్చిన ఇతరులందరును వారి వెనుక నిలబడిరి. వెదురుచువ్వలపై నిలబెట్టిన నిమ్మ కాయలను గ్రుచ్చుకొని పోవునట్టు బాణములు వేయవలె. ఇది పరీక్ష.

మొదటిసారి ముగ్గురు బోయ యువకులును ఏడుగురు వినుకొండ యువకులును వరుసలో నిలబడి బాణములు ప్రయోగించిరి. అన్నియు లక్ష్యములను ఛేదించినవి. రెండవ

సారియు అట్లే ముప్వురు బోయ యువకులు, ఏడుగురు వినుకొండ వారును నిలిచి బాణములు వేసిరి. వినుకొండ వారివి ఇరువురివి గురి తప్పినవి. మూడవసారి నలువురు బోయ వీరులను ఆరుగురు వినుకొండ వారును బాణములు వేసిరి. ఈసారి ఒక బోయ యువకుని బాణమును ఇద్దరు వినుకొండ వారి బాణములును గురి తప్పినది.

"ఏమి?" వీరనబోయని మెల్లని మందలింపు

"చీమ" బోయ యువకుని కాలి విదిలింపు.

గొల్లుమని జనుల నవ్వుల ముంపు

ఆ యువకుడు వెంటనే మరి యొక బాణమును సంధించి నిమ్మపండును చీల్చివేసెను. వీరనబోయడు చేయి చాపెను. బోయ యువకులు నాలుగు గట్టి విండ్లను వీరన ముందుకు తెచ్చిరి. వీరన బాగుగా పరిశీలించి ఒక విల్లును, ఒక బాణమును తీసికొని కూర్చున్న చోటి నుండియే – అనగా ఇతర విలుకాం(డ కంటే పది అడుగుల ఎక్కువ దూరము నుండియే కూర్చున్నయట్లే యుండి బాణమును బాగుగా గురి చూచి వదలెను. బాణము నిమ్మకాయను (గుచ్చుకొని పోయి (ప్రాకారపు గోడకు తగిలి (క్రింద పడిపోయెను. ఇతర విలుకాం(డ్రు అతి (ప్రయత్నమున చేసిన పనిని వీరన బోయడు లీలా (ప్రాయముగా నెరవేర్చెను.

ఈలలతోనూ, కరతాళ ధ్వనులతోనూ, బలే, బలే అను (ప్రశంసలతోనూ దేవాలయ (ప్రాంగణమంతయు మారు(మోగిపోయెను. నగరాధ్యక్షుడు లేచి వీరనబోయని ఎదుటికి వచ్చి అప్పటికే లేచి నిలబడి యున్న వీరనబోయని రెండు చేతులు పట్టుకొని ఊపుచు మెచ్చుకొనెను. పొగడెను.

అంతటితో తృప్తి పొందక తన మెడలోని బంగారు తీగతో కూర్చిన ముత్యాల హారమును వీరనబోయని కంఠ సీమలో అలంకరించెను. "ఇది మన శాశ్వతమై(త్రికి చిహ్నము స్వీకరిం పవలె" అనెను. వీరనబోయడు క్షణకాలము నివ్వెరబోయెను. మరుక్షణమే తన మెడలోనున్న దంతపు పులిగోరు కలిగిన బంగారు పతకమును తీసి నగరాధ్యక్షుని కంఠసీమలో అలం కరించెను. నగరాధ్యక్షుడు మం(త్రముగ్ధుడయ్యెను.

నగరాధ్యక్షుడు బోయవీరులకును, వినుకొండ విలుకాం(డ్రకును కోటకొమ్మంచుల పంచెలు బహూకరించెను. సెలవు తీసుకొను నప్పుడు అందరు ఆశ్చర్యపడునట్లు నగరాధ్యక్షుడు వీరన బోయనికి చేతులెత్తి నమస్కరించెను. వీరనబోయడును అట్లే నమస్కరించి సెలవు తీసికొనెను.

ఆనాడు జయశ్రీ సంతోషమునకు పట్టపగ్గములు లేకుండెను. పుట్టినింటిలో తన (ప్రతిష్ఠ దేవాలయ ధ్వజమంత ఎత్తు పెరిగిపోయెను.

వినుకొండలో వీరనబోయడు వారము దినములు గడపిన తరువాత ధనపాలునితో "ఇక మేము బయలుదేరవలె." అన్నాడు.

"అటులనే – అటులనే రెండు దినములలో (ప్రయాణమునకు ఏర్పాట్లు చేసెదను". అని ధనపాలుడు కొడుకును పిలిచి ఏర్పాట్లు చేయమని చెప్పెను. ఇంటిలో సందడి

ఎక్కువైపోయెను. జయశ్రీ ఏవేవో వస్తువులు కావలెనని చెప్పుటయు, జయపాలుడు వాటికై పరుగులు వారుటయు కనబడుచునే యున్నది.

పదవ దినము వీరనబోయని పరివారమంతయు బయలుదేరిరి. జయపాలుడు తోబుట్టువును మెట్టినింట దిగబెట్టి వచ్చుటకై రెండు గూడు బండ్ల సామగ్రితో బయలుదేరెను. ఆ రెండు బండ్లలో ఏమున్నవో వీరనబోయనికి కూడ తెలియదు. తనకెందుకులే అనుకొన్నాడు.

కట్టెపు దుర్గము చేరగానే బండ్లలోని సామగ్రిని దించిరి.

పందిరి పట్టె మంచములు – నిలువుటద్దములు, చెక్కడపు పనితనమును, గట్టి బీగములను గల బోషాణములు, కంచు, ఇత్తడి పాత్రలు, పళ్ళెరములు, నగరములలో వాడుకలో నున్న కొన్ని వింత వస్తువులు, పరికరములు దిగినవి. వీటినన్నింటిని తగిన తావులలో అమర్చుటకే ఒక దినమంతయు పట్టెను. ఏయే వస్తువును యెక్కడ పెట్టవలెనో నిర్ణయించుటకే సమయము చాలలేదు. అన్ని విషయములను జయపాలుడును, జయశ్రీయు చర్చించుకొని నిర్ణయించుకొని ఆ ప్రకారమే చేసికొనుచుండిరి. వీరనబోయని గానీ అన్నెమను గానీ అడుగుట లేదు. వీరున్న చోటికి అన్నెమ వచ్చుట తటస్థించినపుడు "అత్తా, ఇదిగో ఈ మంచము ఈ గదిలో పెట్టుచున్నాము. దీనిని నేను వాడుకొందును. ఇదిగో ఈ మంచము ఈ గదిలో పెట్టుచున్నాము. ఇది అక్క వాడుకొనును. ఇదిగో ఈ నిలువుటద్దము నా గదిలో ఉండును. ఈ అద్దము పడసాలలో నుండును." అని చెప్పుటయే గాని ఆమె సమాధానము కొఱకు ఎదురు చూచుట లేదు. ఈ స్వల్ప విషయములలో కలుగజేసికొనుట బాగుండదని అన్నెమయు, వీరనబోయడును కల్పించుకొనలేదు.

ఈ వస్తువులతోబాటు క్రొత్తగా కొన్ని పరిమళ ద్రవ్యములును వచ్చినవి. కొన్ని స్నానము చేయునప్పుడు వాడవలసినవి. కొన్ని స్నానము చేసిన తరువాత వాడవలసినవి.

వీరన వినుకొండలో నుండినప్పుడు అల్లునకు క్రొత్త బట్టలు పెట్టు నెపమున ధనపాలుడు మూడు పొడవు అంగీలు కుట్టించి యుండెను. వీరన వాటిని ఇప్పుడు వెలికి తీసి రెండు దినములు ఆ అంగీలను ధరించి తిరిగెను. ప్రతి దినమును గుఱ్ఱము నెక్కి ఏవైనా రెండు బోయ కొట్టములను చూచి వచ్చుట వాడుక. అట్లు అతడు నిడు చట్టలలో బోయకొట్టములు తిరుగునప్పుడు అక్కడి యువకులను నిడు చట్టలు బాగుగా ఆకర్షించినవి.

సాధారణముగా బోయ మగవారు పై చట్టలు వేసికొనరు. అంగ వస్త్రములు మాత్రమే పైన వేసికొందరు. కొందరు సంపన్నులైన యువకులు మాత్రము అర చట్టలను కుట్టించు కొనుచుండిరి. వీరనబోయని నిడు చట్టలను చూచిన తరువాత చాల మంది బోయ యువకులు కందుకూరుకును, వంగవోలుకును పోయి నిడు చట్టలకు కావలసిన రంగురంగుల బట్టలు కొని ఇద్దరు కుట్రపు వాండ్రను తమతో పాటు పిలచుకొని వచ్చి పొడవు అంగీలు కుట్టించు కొనిరి. మూడు నాలుగు నెలలలో బోయకొట్టములలో సగము మంది నిడు చట్టలను ధరించు వారైరి. నలుగురు కుట్రపు వారు బోయకొట్టములలో కాపురమే చేరిపోయిరి.

ఇదంతయు వీరనతల్లికిని, పినతల్లికిని బొత్తిగా నచ్చలేదు. బోయదొరలు బోయదొరలు

గానే ఉండవలె. ఇటువంటి నాగరిక వేషములకు అలవాటు పడిన యెడల బోయలు తమదైన నైసర్గిక స్వభావస్వరూపములను, శక్తియుక్తులను కోల్పోవుదురు. సుఖములకు, సింగారములకు మరుగుదురు. ఇది బోయ జాతికే సేగి తెచ్చును.

కాని ఏమి చేయగలరు? ఏమి చెప్పగలరు? ఎవరికి చెప్పగలరు? ఇది పేగులలోని తీట, ఇట్టి ఉడుపులు ధరించుట తన తల్లులకు ఇష్టము లేదని వారి చిడిముడి పాటును చూచియే వీరనబోయడు గ్రహించెను. పండుగ పబ్బములకు తప్ప తక్కిన సమయములలో ఆ ఉడుపులు ధరించుట మానివేసెను. అది చూచి తక్కిన యువకులును విశేష సందర్భములలో తప్ప తక్కిన సాధారణ దినములలో ఆ ఉడుపులను ధరించుట మానుకొనిరి. యథా రాజా తథా ప్రజా.

ఇది జయశ్రీకి కంటగింపయ్యెను. బోయకొట్టములను దర్శింపబోయినప్పుడైనను ఆ ఉడుపులను ధరింపుమని జయశ్రీ పోరుచుండెను. వీరన బదులు మాట్లాడక తన మునుపటి ఉడుపులతోనే పోవుచుండెను. ఆమె చెప్పుచునే యుండును. అతడు పెడచెవిని పెట్టుచునే యుండును.

నెల్లూరు ప్రాంతము నుండి పద్మసాలీలు నలుగురు కట్టెపు దుర్గమునకు వచ్చి వీరన బోయని దర్శించుకొనిరి.

"దొరవారి సెలవైనచో మేము ఇక్కడ నిలిచి మగ్గములు వేసికొందుము. ఈ ప్రాంతమున ప్రజలకు చీరలు, పంచెలు, దుప్పట్లు మొదలైనవన్నియు మేమే నేసి ఇవ్వగలము. మీరు మాటి మాటికీ కందుకూరుకు గానీ అడ్డెక్కికి గానీ పోనవసరముండదు."

"పూర్వ మెక్కడ ఉంటిరి."

"నెల్లూరు సమీపమున వెంకటగిరి అను ఊరిలో మా పద్మసాలీలులు చాల మంది ఉన్నారు. మేము అక్కడి నుండి వచ్చినాము."

"అక్కడ మీ వారితో కలిసి ఉండక ఇంత దూరము రావలెనను కోరిక ఎందుకు కలిగినది."

"చిత్తము. ఉన్న విషయము విన్నవింతుము. మా సరుకంతయు ఓడ వర్తకులు కొని విదేశములలో అమ్ముకొందురు. మాకును ఓడ వర్తకులకును నేరుగా సంబంధము లేదు. నడుమ తరుగు బేరగాళ్ళు ఏర్పడినారు. వారు మా సరుకును చాలా చవుకగా కొని ఓడ వర్తకులకు అధిక ధరలకు అమ్ముచున్నారు. మేము ఓడవర్తకులతో నేరుగా సంబంధము లేర్పాటు చేసికొనుటకు ప్రయత్నించితిమి. వీరు పడనీయలేదు. ఈ తరుగు బేరగాళ్ళకు నెల్లూరు ప్రభువుల అండ ఉన్నది. మా శ్రమ అంతయు తరుగుబేరగాళ్ళ పరమైపోవుచున్నది."

"ఇక్కడ ఏమి చేయదలచినారు? మీరు విదేశములకు పంపు నాణ్యమైన సరుకును ఇక్కడి వారు కొనలేరు. అట్టి గుడ్డలు ఇక్కడి వారికి అలవాటును లేదు."

"ఇక్కడ సముద్ర తీరములో కనుపట్టు రేవు ఉన్నది. అప్పుడప్పుడు ఓడలు వచ్చి సరుకు దించి క్రొత్త సరుకులను ఎక్కించుకొని పోవుచున్నవి. సాతు వర్తకులు ఆ సరుకులను తీసికొని

పోవు చున్నారు. మేము ఓడ వర్తకులతోగానీ, సాతు వర్తకులతో గానీ నేరుగా సంబంధము లేర్పాటు చేసికొని నాణ్యమైన మా సరుకును వారికి అమ్ముకొందుము."

"మీ నలుగురు నేయు గుడ్డలతో ఓడ వ్యాపారము, సాతు వ్యాపారము చేయుదురా?"

"లేదులేదు. మేమిక్కడ ఉండిన యెడల వెంకటగిరి నుండి మా వారు వారి సరుకును మా వద్దకు చేర్చుదురు. మేము మా సరుకుతో వాటిని చేర్చి ఓడవారికి అమ్ముదుము."

"అప్పుడు మీరు తరుగు బేరగాళ్ళు కారో?"

"తమరట్లు సెలవిచ్చినచో మేమేమి చెప్పగలము. మేము మా వారికి ద్రోహము చేయుదుమా? అక్కడి తరుగుబేరగాళ్ళు మా వారు కాదు. కావున వారు దయా దాక్షిణ్యములు లేకుండా ద్రోహము చేయుచున్నారు. మాలో మేము ద్రోహము చేసికొందుమా?"

"ధనము దగ్గర ఎక్కడి బాంధవ్యములు?"

పద్మసాలీలు ఏమియు మాట్లాడలేక ఊరకుండిరి.

"వీరనబోయడు కొంతసేపు ఆలోచించి ఇట్లనెను.

"పోనీ ఒక పని చేయుడు. ఓడ వర్తకులకు కావలసినంత సరుకును నేసి ఇవ్వగలంత మంది నేతగాండ్రు ఇక్కడికే వచ్చి నిలువుడు. ఉభయతారకముగా నుండును."

పద్మసాలీలు ఆలోచనలో పడిరి. కొంత తడువునకు ఇట్లనిరి.

"తమరు సెలవిచ్చినదియు మంచి ఆలోచనయే. కానీ దానికొక ఆటంకమున్నది. అంత మంది నేతగాండ్రు ఇక్కడికి వచ్చి నిలువ వలెనన్న ఇక్కడ అంత ప్రత్తి ఉత్పత్తి కావలె."

"అదెంత పని. మీకు కావలసినంత ప్రత్తిని పండించి ఇచ్చెదము. అయితే మీరు మమ్ములను మోసము చేసి ప్రత్తిని చవుక ధరకు కాజేయకూడదు. న్యాయమైన ధరను చెల్లించవలె."

"తరుగు బేరగాళ్ళ బెడద తప్పిన యెడల ప్రత్తికి న్యాయమైన ధర ఇచ్చుటకు మాకెట్టి కష్టమును ఉండదు."

"అయితే మీ వద్ద నున్న మేలు జాతి ప్రత్తి విత్తనాలను పంపుడు. పంట చేతికి వచ్చు సమయమునకు వచ్చి మమ్ములను కలిసికొనుడు."

విత్తనములు పంపెదమని చెప్పి పద్మసాలీలు వెడలిపోయిరి.

ఈ సంగతి విని ప్రత్తిని విస్తారముగా పండించుటకు పడమటి వైపున నున్న బోయ కొట్టముల రైతులు ఒప్పుకొనిరి. ప్రత్తి పంటకు అది అనువైన ప్రదేశము.

ఒక సంవత్సరములో సముద్ర తీరమున రేవు పట్టణమునకు సమీపమున నున్న కోన బోయని కొట్టములోనూ బద్దెబోయని కొట్టములోనూ పదేసి మగ్గములు వెలసినవి. ప్రత్తిని శుభ్రము చేయటకును, ప్రత్తిని ఏకులుగా చేయుటకును స్థానికముగా ఇతర జాతుల వారిని నియమించుకొనిరి. రాట్నముతో నూలు తీయుట మొదలుకొని వస్త్రములు నేయు వరకు పద్మసాలీల పని. నూలుకు రంగు వేయుటకును, వస్త్రములపై కలంకారీ పనులు చేయుటకును శ్రీకాళహస్తి నుండి పనివారిని పిలిపించిరి. రంగుల కొఱకై కలబంద, గోరింట, కరక, గంగిరావి, మొదలైన జాతుల చెట్లను వనములుగా పెంచిరి.

వీరు నేయు వస్త్రములేకాక వెంకటగిరి ప్రాంతము నుండి తరుగు బేర గాండ్ర కనుగప్పి చీరలు, పంచెలు కుప్పలు తెప్పలుగా ఈ కొట్టములకు వచ్చి పడుచుండెను. ఈ సరుకంతయూ కనుపఱ్ఱు వద్ద ఓడలకు ఎక్కుచుండెను. తరుగు బేరగాండ్రు నేతగాండ్రను బెదరింప నెంచుకొనిరి. కాని ఇది బోయ రాజ్యమని తెలిసి తోక ముడుచుకొని పోయిరి.

వీరనబోయడు కనుపఱ్ఱు రేవును బాగుగా అభివృద్ధి చేసెను. సముద్ర తీరమున చాలా ఎత్తైన బురుజును కట్టి దానిపై పగలు రంగు రంగులు పెద్ద పెద్ద పతాకములు ఎగుర వేయుటకును, రాత్రులయందు పెద్ద నెగడు వేయుటకును మనుష్యులను నియమించెను. రేవులలో ఎగుమతి దిగుమతుల లెక్కలను, సుంకముల లెక్కలను వ్రాయుటకు గణకులను నియమించి వారిపై పర్యవేక్షణకు హరశర్మను నియమించెను. హరశర్మ మంచన శర్మ కుమారుడు. తెనాలిలో చదివి వచ్చిన వాడు.

ఒకనాడు ఓడ వర్తకులు వీరనబోయని దర్శనమునకై కట్టెపు దుర్గమునకు వచ్చిరి.

“మీ బోయకొట్టములలో నేయబడిన పంచెలకును, తెల్లని వస్త్రములకును వంగ, కళింగ, మగధ దేశములలోనూ సముద్రమున కావలనున్న సింహళములోనూ మిక్కిలి ఆదరణ కలదు. ఇక్కడి రంగు బట్టలను సువర్ణ, యవ, మలయ ద్వీపముల వారు విస్తారముగా ఇష్ట పడుచున్నారు. మరికొంత సన్నని నూలుతో మరికొంత పలుచని వస్త్రములు నేసిన యెడల మరికొంత ఎక్కువ ధరలకు అమ్మవచ్చును”.

“పద్మసాలీలను పిలిపించెదను. మీ అవసరములను మీరే వారికి తెలియజేయుడు.”

“మరియొక మాట. వంగ, కళింగ, మగధ దేశస్థులకు తీపి వంటకములపై మక్కువ యెక్కువ. వారు నిత్యాహారములో తీపి పదార్థములను ఎక్కువగా సేవింతురు. మీ ప్రాంతమున బెల్లము రంగులోనూ, రుచిలోనూ ప్రశస్తముగా నున్నది. ఉత్పత్తి అధికము చేసినచో మేము ఎంత సరుకైనను కొనగలము.”

“మా రైతులతో మాట్లాడి మీ కోరిక తప్పక నెరవేర్చెదను. మా రైతులు సంపన్నులగుట కంటే మాకు కావలసినదేమున్నది.”

ఓడ వర్తకుల ప్రోత్సాహముతో బోయకొట్టములలో ప్రత్తి, చెఱకు పంట విస్తారమయ్యెను. ప్రజలకందరికి చేతి కొలది పనులు దొరకెను. చిట్టడవులను నరికి సాగుభూమిని విస్తరింప జేసిరి.

ఇది విని ఇతర ప్రాంతముల నుండి జనులు మెల్లమెల్లగా బోయకొట్టములకు వచ్చి స్థిరపడసాగిరి. బోయకొట్టముల ప్రక్కన చిన్నచిన్న పల్లెలు వెలసినవి. అయినను ఆ పల్లెలు ఆ బోయకొట్టముల పెద్ద దొర అధీనముననే యుండెను.

“వీరన్నా, మంగి యువరాజుగారు చెప్పినది గుర్తున్నదా” జయపాలుడు ఒక నాడు వీరన బోయని వద్ద కూర్చొని మాట్లాడసాగెను.

"ఏ విషయము?"

"కట్టెపు దుర్గమును విస్తరింప వలెననియు, బలిష్ఠము చేయవలెననియు గట్టిగా చెప్పిన విషయము మరచితివా. ఆ పని చేయవలెను కదా."

"వారికేమి? వారింకనూ ఏవేవో చెప్పుదురు. మన సాధక బాధకములు మనము చూచుకొనవలెను కదా".

"ఇందులో సాధక బాధకములేమున్నవి."

"చాల ఉన్నవి. మేము సామాన్య ప్రజలుగా ఉండుటయే క్షేమము. రైతులుగా ఉండుటయే మంచిది. దుర్గములు, కోటలు మనకు మంచివి కావు."

"అది నీ చేయి దాటి పోయినది. మంగి యువరాజు గారు ఈ ప్రాంతమునకు బోయ రాజ్యమని పేరు పెట్టినారు. ఈ రాజ్యమునకు నిన్ను రాజుగా ప్రకటించినారు. ఇక నీకు తప్పదు. రాజనిన తరువాత కోట ఉండవలె. కొంత సైన్యముండవలె."

"అదియే ప్రమాదకరమని నా తలంపు. కోట లేని పట్టణమునకంటే కోట ఉన్న పట్టణమునకు ప్రమాదమెక్కువ."

"అదేమి అట్లనుచున్నావు. పట్టణమునకు కోటగోడ లేనిచో రక్షణ ఉండునా, దోపిడీ మూకలు, దివీటీ దొంగలు వచ్చి పడరా?"

"కోట గోడలు లేని పట్టణములపై దోపిడీ మూకలు, దివిటీ దొంగలు వచ్చి పడినచో జరుగు నష్టముకంటె కోట గోడలున్న పట్టణములపై పొరుగు రాజులు పడి కలిగించు కష్టమే ఎక్కువ. కోటలు రాజులను యుద్ధమునకు ఆహ్వానించును. రాజులకు కోటలను ఆక్రమించుట యందే ఉత్సాహము. కోటలోని జనులను చంపుటయందే ఆనందము. కోటలే రాజుల లక్ష్యములు. కోటను స్వాధీనము చేసికొన్నచో దాని చుట్టుప్రక్కల నున్న రాజ్య మంతయు స్వాధీనము చేసికొన్నట్లే భావింతురు. కోటలు లేని సాధారణమైన గ్రామములపైకి, పట్టణములపైకి రాజులు రారు."

"అదేమో నాకు తెలియదు. మంగి యువరాజు గారు నన్ను ఇప్పటికే మూడు సార్లు అడిగినాడు– "కట్టెపు కోటను పటిష్ఠముగావించినారా?" అని. ఇదిగో అదిగో అని సర్ది చెప్పుచున్నాను. ఈసారి నన్ను అడుగడు. ప్రత్యేకముగా ఒక అధికృతునే పంపును. మంగి యువరాజు గారు మిక్కిలి పట్టుదలగా ఉన్నారు."

వీరనబోయడు ఏమియు మాట్లాడలేదు.

"నీకేల? నీవు ఊరక చూచుచుండుము. సమస్తము నేను తీర్చిపెట్టెదను."

ఇది వీరనను ప్రక్కకు పెట్టు ప్రయత్నము. వీరనబోయనికి ఇంటిలో ఒక నిస్సహాయత అలముకొనుచున్నది. ఈ వినుకొండ వారి వలన ఇంటిలో తన పట్టు జారిపోవునట్లున్నది. జయపాలుడు ప్రతి విషయమునకు చాళుక్య రాజును బూచిగా చూపి చెలాయించు కొనుచున్నాడు.

"ఈ బోయకొట్టములకేదో మూడినది". అని వీరనబోయడు విసుగుగా పలికి లేచి వెడలిపోయెను.

జయపాలుడు కోటకు తూర్పు, ఉత్తరముల నున్న గోడను కొట్టివేసి విస్తారమైన ప్రదేశమును కలుపుకొని తక్కిన వైపుల గోడలను పొడిగించి కొత్త గోడను కట్టించెను. కోటగోడ అంతటను రెండు బారల వెడల్పు, పదునైదు అడుగులు ఎత్తు ఉండునట్లు నిర్మించెను. దేవాలయమునకు తెచ్చిన రాతిలో మిగిలిన రాళ్ళను గోడకు ఉపయోగించెను. కోట చుట్టును అగడ్తవలె త్రవ్వి ఆ మట్టితోనే గోడలు కట్టించెను. మందమైన తలుపులు వేయించెను. కోటలో పడిన వర్షపు నీరు వెలుపలికి పోవుటకు నాలుగువైపుల ఒకటిన్నర మూర ఎత్తును, మూడు మూరల వెడల్పును గల నాలుగు తూపరాణులు పెట్టించెను. కోట గవని వద్ద పది మంది వీరభటులు కావలి యుండునట్లు వంతులు ఏర్పాటు చేసెను. రెండంతస్థుల నగరును మూడంతస్థులుగా నిర్మించెను. భూ గృహమును నిర్మించి అందులో కోశాగారమును ఏర్పాటు చేసెను. ఇరువైపుల ఉన్న పూరి ఇండ్ల వారికి వేరే నివేశనములు చూపి, ఆ పూరి యిండ్లను పడగొట్టించి నగరుతో కలిపి కొత్త భవనములు కట్టించెను.

ఆ నగరు భవనము చుట్టును చిన్న అడవరి కట్టించెను. దాని ద్వారమున కూడ నలుగురు భటులను వంతులు చొప్పున ఉండునట్లు ఏర్పాటు చేసెను.

“ఎవరైనను రాజుగారి దర్శనము కొఱకు వచ్చిన యెడల వారి ఊరు, పేరు, పుట్టు పూర్వోత్తరాలు తెలుసుకొని లోపలికి ఒకరు వెళ్ళి రాజుకు తెలియజేసి అనుజ్ఞ పొందిన తరువాత లోపలికి పంపవలెను”. అని భటులకు ఆజ్ఞలిచ్చెను.

ఇది తెలిసిన వీరనబోయడు మండిపడి భటులను పంపివైచి ఎవరైనను, ఎప్పుడైనను తన వద్దకు రావచ్చునని అందరికిని తెలియజేసెను. అడవరికి ఏర్పాటు చేసిన తలుపులు పెరికి వేయించి ముందు వైపు అడవరి గోడను కొట్టివేయించెను. తక్కిన మూడు వైపుల గోడనుండనిచ్చెను.

మంగి యువరాజు వీరనను “రాజు” అని ప్రకటించినను, జయపాలుడు పదింబదిగా వీరనను రాజు, రాజు అని ప్రచారము చేయుచున్నను, వీరనబోయడు రాజరికమును స్వీకరించుటలేదు. రాజలాంఛనములను అంగీకరించుట లేదు. ఇదియే జయపాలుని చింత.

వీరనబోయని భార్యలలో సంపంగికి కసవన తరువాత ఇద్దరు కుమార్తెలు కలిగిరి. జయశ్రీకి పది సంవత్సరములలో నలుగురు కుమారులు కలిగిరి. నలుగురిలో పెద్దవాడు పుట్టినప్పుడు వీరనబోయని పినతల్లి వానికి పులిరాజు అని పేరు పెట్టెను. జయశ్రీకి ఆ పేరు నచ్చలేదు. అదేమి పేరు? అచ్చవు తెలుగు పేరు. పేరు ఘనముగా ఉండవలెను. జయశ్రీయు, ఆమె పుట్టింటి వారును కలిసి వానికి పృద్వీవ్యాఘ్రరాజు అని పేరు పెట్టి ఆ పేరుతోనే పిలువసాగిరి.

చాళుక్యరాజులు తెలుగు భాషకు చేయూతనిచ్చి ముందుకు తీసికొని వచ్చుచుండగా ప్రజలలో విద్యావంతులైన వారు ఇంకను సంస్కృతమును వదలలేక పట్టుకొని వ్రేలాడుచున్నారు. చాళుక్యరాజులు, రాజోద్యోగులు, ప్రముఖులు క్రమముగా శైవమతమునకు ఆకర్షితులగు

చుండగా సామాన్య ప్రజలను, స్త్రీలును ఇంకను జైన మతమునే అభిమానించుచు, జైన సంప్రదాయములను పాటించుచు, జైన సన్యాసులకు సత్రములు, మఠములు, జినాలయములు కట్టించుచుండిరి.

కసవని విద్యాభ్యాసము ఏ విశేషమును లేకుండా జరిగిపోయెను. కాని పృధ్వీవ్యాఘ్రు రాజు అక్షరాభ్యాసము ఘనముగా నిర్వహింపబడినది. మంచెనశర్మ కుమారుడు హరశర్మ అక్షరాభ్యాసము చేయించెను. బియ్యముపై అక్షరములు వ్రాయుటకు కంసాలి ఇంటి నుండి వ్రేలెడు పొడవు బంగారు కడ్డీని తెప్పించిరి.

హరశర్మ "ఓం నమశ్శివాయ" అని వ్రాయింపబోగా జయశ్రీ అడ్డుకొనెను.

"ఈ సంప్రదాయము ఇప్పుడిప్పుడు వచ్చినది. అనేక తరములుగా తెలుగు సీమలో జైన సిద్ధుల పేరు మీద 'ఓం సిద్ధం నమః' అని వ్రాయించుటయే అలవాటులో నున్నది. ఆ పద్ధతి నెందుకు మార్చవలె" అని వాదించెను.

హరశర్మ "అమ్మా. ఈ వివాదమునకు స్వస్తిపలుకుట కొఱకే ఇప్పుడు ఈ క్రొత్త పద్ధతి వాడుకలోనికి వచ్చినది. ఇప్పుడు ఎక్కడ చూచినను "ఓం నమశ్శివాయ సిద్ధంనమః" అని వ్రాయించుచున్నారు. ఇది ఉభయతారకముగా నుండుటచే తెలుగు సీమ అంతయు ఈ పద్ధతియే అవలింబింపబడుచున్నది. మనమును అట్లే చేయుదము", అని పిల్లవాని చేత బియ్యముపై "ఓం నమశ్శివాయ సిద్ధం నమః" అని వ్రాయించెను. వీరనబోయని పిల్లలకేకాక కట్టెపు దుర్గములోని పిల్లలందరికి ఆ హరశర్మయే చదువు చెప్పసాగెను.

ఒక నాడు వీరనబోయని యొద్దకు ఒక నడిప్రాయపు పెద్ద మనిషి వచ్చి నమస్కరించెను. వీరన అతనిని ఆదరముతో పలుకరించెను.

"ఏ వూరు మీది?"

"మాది త్రిపురాంతకము ప్రాంతము."

త్రిపురాంతకము పేరు వినగానే వీరనకు ప్రాణములు లేచివచ్చినట్లయ్యెను. తన పూర్వీకుల స్థానము త్రిపురాంతకమేకదా.

"అక్కడ ఏమి పని చేసెడివారు?"

"విండ్లు, అమ్ములు, కుంతముల కొయ్యలు చేసెడివారము. మీ బోయదొరలు ఆ ప్రాంతము వదలి వచ్చిన తరువాత మా పని మందగించినది. మీ తాతగారు మాతాతగారి యొద్ద కొన్ని నూర్ల విండ్లను, కొన్ని వేల అమ్ములను చేయించుకొనెడివారట. మా తాత చెప్పుచుండగా వింటిమి"

"ప్రస్తుతము మీరు ఎక్కడికైనను తీర్థ యాత్ర వెడలినారా?"

"లేదు. ఇక్కడికే వచ్చితిని. మా తాత బ్రతికి యుండగా అనేక పర్యాయములు మీ బోయదొరలను గురించి చెప్పుచుండెడివాడు, 'ఇక్కడ ఉండిన బోయదొరలు బహు దొడ్డవారు. మనకెంతో ఆత్మీయులుగా ఉండిన వారు. ఇక్కడ నిలువ లేక గుండ్లకమ్మ వెంబడి దిగువకు

వలస వెళ్ళి పోయినారు. వంగవోలు ప్రాంతమున ఉన్నట్లు విన్నాను. నీవునూ అక్కడికి వెళ్ళి వారి దాపున చేరుకో. అక్కడ నీకు మంచి ఆదరణయు, భద్రతయు దొరుకును' అనెడివాడు. అందువలన మిమ్ములను వెదకుచు వచ్చితిని."

"అక్కడ మీకును ఏవైనా ఇబ్బందులు కలిగినవా?"

"ఇబ్బందులనగా పెద్ద ఇబ్బందులేవియు లేవు. కాని చాళుక్యరాజోద్యోగులు మమ్ములను సరిగా చూచుట లేదు. చేయించుకొన్న పనికి తగిన డబ్బు ఇచ్చుట లేదు. గట్టిగా అడిగినచో బెదరించుచున్నారు. దాదాపు వెట్టి చాకిరి చేయుచున్నామనియే చెప్పవలె. ఆ మిడిమేలపు దొరల దగ్గర అవమానములు పడుచు బ్రతుకుట కంటె దూరముగా ఉండుట మంచిది అనిపించినది. అక్కడ చేయు పని ఏదో ఇక్కడ చేసికొని గౌరవముగా బ్రతుక వచ్చునని వచ్చినాను."

"నీ పేరు?"

"భానోజు."

భానోజును రెండు దినములు విశ్రాంతి తీసికొననిచ్చి వాని వెంట నలుగురు మనుష్యులను తోడుగా సమీప మందలి అడవులలో కొయ్యలు, వెదుళ్ళు వెదకి రమ్మని పంపెను. వారు రెండు మూడు దినములు ఆ ప్రాంతమంతయు పరిశీలించి వచ్చిరి.

"విండ్లకు, బాణములకు, కుంతములకు గట్టి వెదరు గడలు, చేవగల చండ్ర, ఊడగ, చిగర. వెలమ మొదలైన కొయ్యలు కావలెను. ఎఱ్ఱచందనపు కొయ్యలు, జిబ్బిడి కొయ్యలు ఇంకను శ్రేష్టమైనవి. ఎఱ్ఱచందనము, జిబ్బిడి ఇక్కడ లేవు. తక్కినవి ఇక్కడను కనబడుచున్నవి. కాని ఇవి నల్లమల అడవులలో దొరకు చెట్లు వలె గట్టివికావు. ఇక్కడి నేల మెత్తన, నీటి ఆధారము ఎక్కువ. చెట్లు ఏపుగా పెరుగును. కానీ గట్టితనము తక్కువ. నల్లమల అడవులలో నేల గట్టిది. వర్షము తక్కువ. కావున చెట్లలో గట్టిదనమును చేవయు ఎక్కువ. మీరు సరే అనినచో అక్కడి నుండి వెదుళ్ళను, కొయ్యలును తెత్తును."

"అక్కడి నుండియా? ఇంత దూరమా?"

"దూరమైనను ఎక్కువ ప్రయోజనకరము. ఆయుధములు గట్టిగా ఉన్నప్పుడే వీరుని శక్తి ఉపయుక్తమగును. ఆయుధము బలహీనమైనచో వీరుడు ఎంత శక్తికలవాడైనను బల హీనుడే. ఆయుధములలో ఆరితేరిన మీకు తెలియనిదా?"

వీరనబోయడు ఆలోచించుచుండగా వీరనబోయని పినతాత అప్పన బోయడు అక్కడికి వచ్చెను. అతడు తొలి వీరనబోయని నలువురు తమ్ములలో కడగొట్టువాడు. తొంబది ఏండ్ల వాడు. అతడు వచ్చి క్రొత్తవానిని గురించి విని పలుకరించెను.

"మీ తాత పేరేమి?"

"సుంకోజు."

"ఏమి? సుంకోజు మనుమడివా నీవు? మీ తాత ఉన్నాడా?"

"లేదు. పోయి చాల కాలమైనది"

"అవునులే. నాకంటే పెద్దవాడు. ఇంకను 'ఉన్నాడా' అని అడుగుటయే పొరబాటు. నీపేరేమి?"

"భానోజు."

"ఇప్పుడును మీరు విండ్లు చేయుచున్నారా? ఆ పని మానుకొన్నారా?"

"ఏల మానుకొందుము? ఇప్పటికిని శ్రేష్ఠమైన విండ్లును, కోలలును చేయుటలో మాదే పైచేయి. వేంగి సైన్యములోని మేటి విలుకాండ్రు – వారి వద్ద ఎందరు నిపుణులున్నను – గట్టి విండ్లను, కోలలను మా వద్దనే చేయించుకొని పోవుచున్నారు. తగిన కొయ్యను ఎన్ను కొనుట మాకు తెలిసినట్లు మరెవరికిని తెలియదు."

వీరన కల్పించుకొనెను. "ఈ ప్రాంతపు కొయ్యలకంటే నల్లమల అడవి కొయ్యలు శ్రేష్ఠములని ఇతడు చెప్పుచున్నాడు. అక్కడి నుండి తెప్పించుట కష్టము కదా అని ఆలోచించు చున్నాను."

"కష్టమైనను, నష్టమైనను, అక్కడి నుండి తెప్పించుటయే మంచిది." అన్నాడు అప్పన బోయడు.

"సరే–భోనోజు, ఈ పని నీకే అప్పజెప్పుచున్నాను. కొయ్యలు కొట్టి తెచ్చుటకు రాజోద్యోగుల అనుమతి తీసుకో. బోయకొట్టములకు అని చెప్పిన చాలును. చాళుక్య రాజోద్యోగులు తప్పక అనుమతినిత్తురు. లావైన బోలు వెదుర్లు, సన్నని గట్టి వెదుర్లు, పైపై బెరడులు తెలుపులు చెక్కివేసిన చేవకొయ్యలు, ఎన్ని బండ్లు తేగలవో అన్నియు తేవచ్చును. ఈ పనిలో ఆరితేరిన మీ వారిని ఒకరిద్దరిని అక్కడ నుండియే నీ వెంట పిలుచుకొని రమ్ము. వారు కుటుంబములతో వచ్చి ఇక్కడనే స్థిరపడినను మంచిదే. వారికిని ఇక్కడ చేతినిండా పని ఉండును. ఇక్కడ వారి సౌకర్యములకు గాని, భద్రతకు గాని ఎట్టి లోటును ఉండదు." అన్నాడు వీరన.

"ఎంత మాట, ఎంత మాట. మనమందరము ఒక చోటి వారము. మనది తరతరముల అనుబంధము. మా వారు ఒప్పుకొన్నచో సరాసరి కుటుంబములతోనే వత్తుము. కొయ్యలను రెండు నెలలు ఎండనిచ్చి గుండ్లకమ్మనది నిండుగా ప్రవహించునప్పుడు పడవలకు అంటగట్టి తెచ్చుట సులభము."

"అక్కడ కమ్మరులు పోలన్న, పోతన్న అను ఇరువురు అన్నదమ్ములుండిరి. వారు గానీ వారి కొడుకులు గాని ఉన్నారా?" అన్నాడు అప్పనబోయడు.

"వారు ఏనాడో పోయిరి. వారి కుటుంబము ఇప్పుడు పది కుటుంబములైనవి. వారి పనికొంచెము కష్టముగానే ఉన్నది. 'మంది ఎక్కువైనచో మజ్జిగ పలుచన' అన్నట్లు వారికి పనులు చాలుట లేదు. అయినప్పటికిని వారు కుంతములు, బాణముల అలుగులు, ఖడ్గములు కొంకి వాలులు మొదలైన వివిధములైన ఆయధములు చేయుటలో ప్రవీణులైనారు. ఎక్కడెక్కడి నుండియో జనులు వచ్చి కావలసిన ఆయుధములు చేయించుకొని పోవుచున్నారు."

"వారిలో ఎవరైన మేలైన పనివారిని ఒకరిద్దరిని ఇక్కడికి రప్పింపగలవేమో చూడు."

"తప్పక. అక్కడ పని తక్కువగా ఉన్నదని చెప్పితిని కదా. కావున తప్పక వచ్చెదరు" వీరనబోయడు భానోజుకు పెద్ద మొత్తము సంచకరముగా ఇచ్చి పంపెను.

వీరనబోయని తల్లులు ముసలివారై పోయిరి. జయశ్రీకి తన కుమారులు బోయ కొట్టములలో ఇతర బోయబాలురతో కలిసి చదువుకొనుట నచ్చలేదు. తన కుమారులు సామాన్య బోయదొరలు కారు. వీరు బోయ రాజ్యమునకు ప్రభువు కుమారులు. ఏనాటికైనను తన కుమారుడు పృధ్వీవ్యాఘ్రురాజే ఈ కొట్టములకు రాజుకాగలడు. జయపాలుడును తానును తలచినచో ఈ కసవనను ప్రక్కనబెట్టి పృధ్వీవ్యాఘ్రురాజును ప్రభువుగా నిలబెట్టుట యెంత పని.

అందువలన ఆమె తన బిడ్డలను ఎక్కువ కాలము వినుకొండలో నుంచి చదివించెను. వారి విద్యాభ్యాసమంతయు దాదాపు అచ్చటనే జరుగుచున్నది. ఆయుధ విద్యలు కూడా అక్కడనే జరుగుచున్నవి. ఆయుధ విద్యలకంటే ఆటోపములు ఎక్కువగా అలవడినవి. ఆరు నెలలకొకసారి కట్టెపు దుర్గమునకు వచ్చి రెండు మూడు నెలలు కాలము గడిపి మరల వినుకొండకు పోవుచుండిరి. ఉన్న రెండుమూడు నెలలు వారి ఆటోపమునకు పట్ట పగ్గము లుండెడివి కావు. తండ్రియు, అన్నయు ఉండగానే పులిరాజు తానే రాజైనట్లు ప్రవర్తించు చుండెను. అతని వేషమును, భాషయు వేంగీనగర నాగరికతను బాగుగా ఒంటబట్టించుకొన్నవి. ఆ వేషభాషలకు ఆకర్షితులై వాని నారాధించుచు వాని వెంట తిరుగు యువకులు కొందరు సిద్ధమైరి. అందరును గుఱ్ఱములెక్కి బోయకొట్టములను పర్యవేక్షింప నేగుదురు. అక్కడి నాయకులకు ఏవేవో సూచనలిత్తురు. అవి సూచనలు కావు. ఆజ్ఞలు.

పాపము కసవన మెత్తని వాడు. పులిరాజుబోయని ఆటోపమును అణచు శక్తిలేనివాడు కాదు కానీ, కుటుంబమున ఛిద్రము లేర్పడునని భయపడుచున్నాడు. బోయకొట్టములలోని పెద్దలు కసవన బోయని పక్షమే కాని కొందరు యువకులు పులిరాజుబోయని పక్షమున తిరుగుచున్నారు. తాను వానిపై కఠినమైన చర్య తీసికొన్నచో వాడు తిరుగబడవచ్చును. వాడు దేనికైనను వెనుదీయడు. అప్పుడు బోయకొట్టములలో చీలికలు వచ్చును. బోయ కొట్టములను చీల్చుటకైనను పులిరాజు వెనుదీయడు. కాబట్టి కసవనబోయడు కుటుంబ గౌరవమును కాపాడుటకును, బోయకొట్టముల ఐక్యతను నిలుపుటకును పూనుకొన్నాడు. ఇప్పటికిని బోయకొట్టముల నాయకుడు తన తండ్రి వీరనబోయడే కదా. తానేల కల్పించు కొనవలె.

దానికి తోడు వినుకొండలో జయపాలునికి నలుగురు కుమారులును ఒక కుమార్తెయు కలిగిరి. జయపాలునికి పదోన్నతి లభించినది. ఇప్పుడతడు మరికొంత పెద్ద సైన్యమునకు దళపతి. వినుకొండ రాజప్రతినిధికి కుడిభుజము. జయపాలుని కుమారులు అప్పుడప్పుడు కట్టెపు దుర్గమునకు వత్తురు. జయపాలుని కుమారులును పులిరాజు తమ్ములును కలిసినచో ఇక చెప్పవలసిన పనిలేదు. వారి ఆటోపములు, అధికారము, ధార్ష్ట్యము మిన్నుముట్టు చుండెను.

వీరి ఈ ఆటోపమును అణచవలెనని వీరనబోయడు రెండుమూడు సార్లు మందలించి చూచెను. ఫలితము లేకపోయెను. గట్టిగా అదలించి చూచెను. అయినను ప్రయోజనము కనిపింపలేదు. వారికి జయశ్రీ వెన్నుదన్ను కలదు. జయశ్రీకి పుట్టింటి వారి అండదండలు పుష్కలముగా నున్నవి. కొడుకులను అదలించుటకంటే పెద్ద శిక్ష ఏమి వేయగలడు? వీరి మాటలు ఎవరును పాటింపవలదు అని బోయకొట్టములలో చాటించవలెనా? అట్లు చేసినచో తన కుటుంబము నవ్వులపాలు కాదా?

వీరికి ఈ అతిశయ ప్రవర్తన ఎట్లు అలవడినది? రక్తముతో వచ్చినది. తనవంశ రక్తము అన్యజాతి రక్తముతో కలుషితమైపోయినది. ఏమి చేయగలడు? స్వయంకృతాపరాధము.

జైనులు, బౌద్ధులు జాతి, కుల, మత భేదములు లేవనియు, మానవులందరును ఒకటే అనియు చెప్పుచున్నారు కానీ అంతయు దబ్బఱ. జాతి గుణములున్నవి. లేనిచో తన బిడ్డలలో సంపంగి కొడుకు ఒక విధముగానూ, జయశ్రీ కొడుకులు ఒక విధముగానూ ఉండుటకు కారణమేమి?

వీరనబోయడు కసవన బోయనికి బద్దెబోయని కొట్టము పెద్ద దొర కుమార్తె అక్కమను తెచ్చి పెండ్లి చేసెను. పెండ్లికి బోయకొట్టముల పెద్ద దొరలందరును వచ్చిరి. అందరును కసవన బోయనితో ఆప్యాయముగా మాట్లాడిరి. పులిరాజును పలుకరించి వెడలిపోయిరి.

కసవన బోయని పెండ్లి పులిరాజును ఆలోచింప జేసినది.

వీరనబోయడు "తన తరువాత బోయకొట్టములకు కసవన బోయడే నాయకుడు" అను సంకేతమును బోయ పెద్దదొరలకు అందించినాడు. వారు ఆ సంకేతమును అందు కొన్నట్లు కసవన బోయనితో ప్రవర్తించుచున్నారు. కనుక తాను ఇప్పుడే తొందరపడరాదు. ముందుగా బలమును చేకూర్చుకొనవలె. ఈ బోయకొట్టముల పెద్ద దొరలందరును మూర్ఖులు. సంప్రదాయము నతిక్రమింపరు. నాయకుని తరువాత నాయకుని పెద్ద కుమారుడే నాయకుడు అను పిచ్చి సిద్ధాంతమునకు కట్టుబడి యుందురు. శక్తి సామర్థ్యములను లెక్కింపరు. కావున కొంత కాలము కసవనతో సఖ్యముగా ఉండక తప్పదు. కట్టెపు దుర్గమును బేతకొట్టమును వీరికి ప్రతిదినము కనబడునవి. తక్కిన పది కొట్టములును కొంత దూరముననున్నవి. మొదట వానిలో తన అధికారమును స్థాపించుకొనవలె. తన అధికారమును కాదు. తన అన్నగారైన కసవన బోయని అధికారమును తాను అక్కడ నిర్వహించుచున్నట్లు నటింపవలె. వారిని తనవైపు త్రిప్పుకొనవలె.

ఆరు నెలల తరువాత భానోజు ఎనిమిది పడవలలో కొయ్యలను, వెదుళ్ళను వేసికొని గుండ్లకమ్మ మార్గమున కట్టెపు దుర్గమును చేరుకొనెను. వాని వెంట వాని తమ్ముడును, మరి యిద్దరు పనివారును వచ్చిరి. వీరితోబాటు ఇరువురు కమ్మరులును వచ్చిరి. అందరును కుటుంబములతో వచ్చినారు.

ఆయుధముల నిర్మాణము కట్టెపు దుర్గమునందే జరుగవలెను. ఇప్పుడు దుర్గము లోపల

కావలసినంత తావు ఉన్నది. ఒక వైపున వీరి కాపురమునకు ఇండ్లును, పనిచేయుటకు పాకలును ఏర్పాటు చేయబడినవి.

వడ్రంగులు విండ్లు, కోలలు, బరిసెలు చేయుచుండగా కమ్మరులు అలుగులు, ఖడ్గములు ఇతర ఇనుప వస్తువులు చేయసాగిరి.

గోదావరి ఎగువ ప్రాంతముల నుండి మంచి ఇనుము పెద్దపెద్ద పడవలలో అంతర్వేది వరకు వచ్చుచున్నవి. అక్కడి నుండి ఓడలలో ఇటు దక్షిణ దేశమునకును, అటు ఉత్తర దేశమునకును ఎగుమతి అగుచున్నవి. ఓడలు కనుపఱ్ఱు రేవున ఆగినపుడు భానోజు, బోయదొరలను పిలుచుకొని పోయి కావలసిన ఇనుము కొని తెచ్చుచున్నాడు.

వీరి రాకతో పంద్రెండు బోయకొట్టములలోనూ సందడి ఎక్కువయ్యెను. బోయ యువకులే కాక ఇతర జాతుల యువకులును వివిధములైన ఆయుధములను కొనుచుండిరి. బోయ యువకులతో కలిసి ఆయుధ సాధనయు చేయసాగిరి.

ఇదే అదనుగా తీసికొని పులిరాజు వారితో చేరి వారికి తమ బోయలలోని నిపుణులచేతనే శిక్షణ నిప్పించుచు చాపక్రింద నీరు వలె వారిలో తన నాయకత్వమును స్థాపించుకొనసాగెను.

పులిరాజును, అతని తమ్ములును, జయపాలుని కొడుకులు నలుగురును, మరికొందరు బోయ యువకులును గుఱ్ఱము లెక్కి బోయకొట్టములను పర్యవేక్షించుటకు బయలుదేరిరి. ఒక్కొక్క కొట్టమునే చూచుచు చివరి కొట్టము కోన కొట్టమును చేరుసరికి మధ్యాహ్నము దాటిపోయెను. దారిలో ఒక్కొక్క కొట్టము వద్ద ఒకరిద్దరు యువకులు గుఱ్ఱములెక్కి వీరితో కలిసికొనిరి.

వీరనబోయని కుమారులును, చాళుక్య సైన్య దళపతి కుమారులును తమ కొట్టమును చూడవచ్చినారని కోనకొట్టపు పెద్దదొర మాచన దొర సంబరపడిపోయెను. వెంటనే వచ్చిన వారికందరికిని కొబ్బరిబొండములు కొట్టి యిచ్చి. కోళ్ళు కోసి, రెండు గడియలలో భోజనము సిద్ధము చేయించెను.

మాచన దొర భార్యయు, కుమార్తెయు వడ్డించుటకు పూనుకొనిరి. మాచన కుమార్తె పులిరాజునకును, అతని తమ్ములకును, వినుకొండ వారికిని వడ్డించుచుండగా మాచన భార్య తక్కిన బోయ యువకులకు వడ్డించుచుండెను. పులిరాజు దృష్టిని ఆకర్షించుటకై మాచన కుమార్తె పులిరాజుకు మాటి మాటికి కొసరి కొసరి వడ్డింప సాగెను. పులిరాజు చెణుకులు విసరసాగెను.

భోజనములు పూర్తి అగు సరికి మాచన కుమార్తె రూపము పులిరాజు హృదయములో నాటుకొన్నది.

భుక్తాయాసము తీర్చుకొన్న పిదప పులిరాజు మాచన దొర నడిగెను.

"ఇక్కడి నుండి సముద్రమెంత దూరమున్నది."

"గుఱ్ఱములపై రెండు ఘడియల ప్రయాణము."

"పోవుదము రండు."

మాచన బోయని కొడుకు వారితో కలిసెను. అందరును సముద్రము దగ్గరకు పోయిరి. అక్కడ ఉప్పరివారి గుడిసెలు దాదాపు పది వరకు కొంత కొంత దూరములో ఉన్నవి. ప్రతి గుడిసె ముందర ఉప్పు కొటారులున్నవి. చదునైన కయ్యలలో సముద్రపు నీటిని పారించి ఎండబెట్టి ఉప్పు తీయుచున్నారు. గుడిసెల వద్ద ఉప్పు రాసులున్నవి. గుడిసెల వెనుక పచ్చికలో ముందరి కాళ్ళకు బందెములు వేయబడిన యేబది అరువది గాడిదలు మేయుచున్నవి.

అంతమంది ఆశ్వికులు వచ్చుట చూడగానే ఉప్పరివారు గడగడ వడకుచు పరుగున వచ్చి దండములు పెట్టుచు నిలబడిరి.

"మీరిక్కడ ఉప్పు తీసి అమ్ముకొనుచున్నారు. ఇది బోయదొరల రాజ్యమని తెలియదా. ప్రభువుల అనుమతి తీసుకున్నారా?"

ఉప్పరివారు మొగములు మొగములు చూచుకొని లేదన్నట్లు చేతులు త్రిప్పిరి.

"రాజుగారి అనుమతి తీసుకొనవలె. పన్ను కట్టవలె."

"చిత్తము, చిత్తము ఇంతవరకు మమ్ములను ఎవరును పన్ను అడగలేదు."

"ఇంతవరకు అడుగలేదని తప్పించుకొందురా. ఇప్పటి నుండి ఉన్నది. పన్నులు కట్టవలె."

ఎవరును మాట్లాడలేదు.

"ఒక కొటారునకు ఒక గోనె సంచి ఉప్పు సుంకముగా విధించుచున్నాము."

"దేవరా కనికరించండి. వర్షాకాలంలోనూ, చలికాలంలోనూ ఉప్పు వెళ్ళదు. ఎండ కాలములో కూడ నమ్మకము లేదు. ఎప్పుడు వాన వచ్చునో తెలియదు. మాకు నికరముగా ఉప్పు లభించునది మాఘ, పాల్గున మాసములలోనే. కనికరించండి. అసలు పన్నులే కట్టి ఎరుగని ఉప్పుపైన ఒక్కసారిగా ఇంత సుంకము విధించినట్లయిన మేము చచ్చినట్లే."

"ఈ రామాయణమంతయు మాకును తెలియును. కావుననే ఇంత స్వల్పమైన సుంకమును విధించినాము. ఇదిగో ఈయన కోన కొట్టము పెద్దదొర. మీరు ప్రతి సంక్రాంతికి ఈయనను దర్శించుకొని సుంకము చెల్లించుకోవలె. తెలిసినదా!"

మాచనబోయని కుమారునికి ఏనుగెక్కినంత సంబరమైనది.

ఈ విషయము ఆనోట ఈనోట పడి వీరనబోయనికి తెలిసిపోయెను. వెంటనే అతడు పులిరాజును పిలిపించెను.

"ఉప్పరి వారిపై ఉప్పు పన్ను విధించినావట."

"అవును. కొంచెమే."

"నిన్నెవరు విధించమన్నారు."

పులిరాజు బదులు చెప్పలేదు.

"ఎవరు విధించమన్నారు. ఏల విధించితివి?"

"నేనే....."

"ఎందుకు?"

"మన బొక్కసమునకు పైకము కావలెను కదా?"

"ఇప్పుడు పైకముతో ఏమి పని?"

"మనము గుఱ్ఱములు కొనవలసియున్నది."

"ఉప్పు సంచులతోనా?"

"చిన్న చిన్న వాగులే సముద్రమగుచున్నది."

"మన ఇంటిలో అందరికిని గుఱ్ఱములు ఉన్నవి కదా?"

"మనకు అనగా మన యింటికి కాదు. మన రాజ్యమునకు"

వీరనబోయడు రాజ్యమను మాట విని ఉలికిపడి నిటారుగా కూర్చుండెను.

"రాజ్యమా? మన రాజ్యమా?"

"అవును. మన రాజ్యమే. ఏమి? మనది రాజ్యము కాదా. మనకు కొంత సైన్యము ఉండవలదా?"

"పులిరాజా! కలలు కనవద్దు. నెత్తికి తెచ్చుకోవద్దు. మనము రాజులము కాము. కేవలము బోయదొరలము మాత్రమే."

అంతలో జయశ్రీ అక్కడకు వచ్చినది.

"ఏమి? బోయదొరలు రాజులు కాకూడదా? గుఱ్ఱములు కొనకూడదా? సైన్యమును పెట్టుకొనకూడదా?"

"ఓహో! ఇందులో చాళుక్య తంత్రాంగమున్నదన్నమాట. ఇదిగో చూడు. నీవు నన్ను బోయదొరగానే పెండ్లాడినావు. బోయదొర యింటి కోడలివైనావు. అట్లే ఉండుము. ఉట్టికి ఎగురవద్దు."

"మీరును నేనును ఉన్నట్లే మన బిడ్డలును ఉండిపోవలెనా? మంగి యువరాజు గారు మనకు ఆ అధికారమునిచ్చినను మీరు పడనిచ్చుట లేదు."

"మీకు పిచ్చిపట్టినట్లున్నది. విషయము అర్థమగుట లేదు. మనము కేవలము బోయ దొరలముగా ఉన్నంత వరకు మనపైకి అటు చాళుక్యరాజులుగానీ, ఇటు పల్లవ రాజులు గానీ రారు. మనము క్షేమముగా ఉందుము. మనము ఇక్కడ చేరినది పల్లవరాజుల చలువ వలన. జయసింహ వల్లభుడు ఈ దారిలో కందుకూరు వరకు దండెత్తినప్పుడు మనలనెందుకు ఊరక హెచ్చరించి వదలెనో ఎరుగుదురా? మనము కేవలము బోయదొరలుగా బ్రతుకు చున్నాము కనుక. మంగి యువరాజు వచ్చి 'ఈ సీమ అంతయు మీ ఆధీనమే' అని చెప్పినప్పటికిని నేనెందుకు అధికారమును ప్రకటింపలేదో తెలియునా? మనము కేవలము బోయదొరలముగానే బ్రతుకవలెను కనుక. మనము అధికారమును ప్రకటించుకొని యుండిన యెడల ఈపాటికి పల్లవులు మనలను నామరూపములు లేకుండా చేసి యుందురు. ఇప్పటికే మనము ఈ కోట గోడను పెద్దదిగా కట్టుకొని తలమీదికి తెచ్చుకొన్నాము."

"పల్లవుల వలన మనకేమియు భయము లేదు. మా అన్నయు, అన్నకుమారుడును పెద్ద సైన్యములకు దళపతులు. క్షణములో చాళుక్య మహారాజు గారి అనుమతి తీసుకొని మనకు అండగా నిలబడగలరు."

"అవునవును. మట్టి గుఱ్ఱమును నమ్ముకొని ఏటిలోనికి దిగినట్లే ఉండును. ఈ అల్పమైన బోయకొట్టముల కొఱకై చాళుక్య ప్రభువులు పల్లవులతో యుద్ధమునకు దిగరు."

"మీవన్నియు అర్థము లేని ఆందోళనలు. మీరు చేయలేని పనిని కుమారుడు చేయు చున్నాడు. సంతోషింపక అడ్డము చెప్పుదురా?"

"అవునవును. మా తాతయు, మా తండ్రియు, నేనును చేయలేని తలవంపుల పనిని పులిరాజు. అదేమి పేరు – పృథ్వీవ్యాఘ్ర మహారాజు చేయుచున్నాడు. దానిలో నీవు నేయి పోయుచున్నావు. ఇకయేమున్నది? మండుటయే."

"మరి ఇప్పుడేమి చేయమందురు" అన్నాడు పులిరాజు అసహనముతో.

"ఉప్పు పన్ను లేదని చెప్పి పంపుము. గుఱ్ఱములు కొను ఆలోచనను విరమించుకొనుము."

"నేను కొట్టములలో తల యెత్తుకొని తిరుగవలదా?"

"మరినేను? ఉప్పుపైన సుంకము విధించినాడని అందరు నవ్వుకొనగా తలవంచు కొందునా?"

జయశ్రీ కల్పించుకొనెను.

"ఇందులో తలవంచుకొనవలసిన పనిలేదు. ఎక్కడైనను రాజులు, సామంతరాజులు, దొరలు పన్నులు విధించుట సహజమే. మనమొకరమే చేయుట లేదు. ఇందులో విపరీతము గానీ, అతిశయము గానీ ఏమున్నది?"

"మరీ ఇంత హీనముగానా?"

తల్లియు కొడుకును ఏమియు మాట్లాడక వెడలిపోయిరి.

తానిప్పుడు ఉప్పు పన్ను వలదని చెప్పి పంపినచో గృహచ్ఛిద్రము బయటపడును. ఊరకున్నచో అరాచకమగును. ఏమి చేయవలె?

కాగల కార్యము గంధర్వులే తీర్చిరి.

ఉప్పరివారు అప్పటికి కొటారులలో ఉన్న ఉప్పును ఊడ్చుకొని గాడిదలపై వేసికొని గుడిసెలు వదలి ఎక్కడికో వెడలిపోయిరి.

పులిరాజు కోన కొట్టమునకు పోయి ఉప్పరి వారిపై ఉప్పు పన్ను విధించి వచ్చినప్పటి నుండియు అతడు అప్పుడప్పుడు కోనకొట్టమును గురించియు, మాచన బోయని ఆతిథ్యమును గురించియు, మాచన కుమార్తె గుణగణములను గురించియు నాలుగైదు సార్లు ప్రస్తావించుట విని జయశ్రీ మనస్సు కీడు శంకించినది.

వీడు ఆ మాచన బోయని కుమార్తె వలపులో పడిపోయెనా ఏమి? తాను తన అన్న కుమార్తె మల్లికను వానికి కట్టబెట్టి వానిని ఈ బోయ సంస్కృతి నుండి బయటికి లాగవలెనను

తలంపుతో నున్నది. వీడు మాచన కుమార్తెను పెండ్లాడిన యెడల తన ప్రయత్నములన్నియు నీరుగారి పోవును. ఇక తొంరపడవలె. ఇప్పటికే ఆలస్యమైనది.

జయపాలునికి వర్తమానము పంపినది. జయపాలుడు కొందరు బంధువులతోడను, భార్యాబిడ్డలను తోడను వచ్చి దిగెను. మల్లికను చూడగానే పులిరాజు మొగము ఇంత వెడల్పున వికసించినది. వారు వచ్చిన ఉద్దేశమును అర్థమైపోయినది. వీరి వలపును అటువైపున జయపాలుడును, ఇటు వైపున జయశ్రీయు పెంచి ప్రోది చేసినదే. క్రొత్తగా జరిగినదేమియు లేదు.

మంతనములు సాగెను. ఈ వివాహమును కాదనుటకు వీరనబోయనికి కారణమేమియు కనబడలేదు. తాను చేసిన పనియే తన కుమారుడును చేయుచున్నాడు. కానీ తాను జయశ్రీని వివాహమాడినపుడు ఆమె పుట్టింటి వారు తన కుటుంబముపైనను, తమ బోయకొట్టముల పైనను ఇంతటి ప్రభావము చూపగలరని ఊహించలేకపోయినాడు. ఒక జయశ్రీతోనే తన కుటుంబములో ఇన్ని పెనుమార్పులు సంభవించినవి. ఆమెకు తోడు ఆమె పుట్టింటి మనిషి మరియొకతె కూడ వచ్చి చేరుచున్నది. జయశ్రీకి అన్న ఒక్కడే. ఇప్పుడు వచ్చుచున్న కోడలికి అన్నలు నలుగురు. ఇప్పుడే వారి అటోపమునకు పట్టపగ్గములు లేవు. ఇక మీదట ఎట్లుండునో.

కానీ తానిప్పుడు నిస్సహాయుడు. ఈ వివాహము వద్దని గట్టిగా చెప్పుటకు నోరు పెగలనివాడు. ఆనాడు చేసుకొన్న తొందరపాటు చర్య ఇట్లు బెడిసి కొట్టుచున్నది.

పెండ్లి కట్టెపు దుర్గములోనే జరిగిపోయెను. పెండ్లికి బోయకొట్టముల నుండి పెద్ద దొరలు తప్ప ఇతరులెవరును రాలేదు. కట్టెపు దుర్గములోని వారు మాత్రము మొగమోటము కొలది చుట్టపు చూపుగా వచ్చిరి. ఉత్సాహముగా వేడుకలలో పాల్గొనలేదు.

బోయ పెద్ద దొరలు పెండ్లి పందిటిలోనే పంచాయతీ పెట్టుకొనిరి.

"నీవు మొదట సంపంగిని వివాహము చేసికొని తరువాత జయశ్రీని పెండ్లాడినావు. కావున ఎవరును ఆక్షేపణ చెప్పలేదు. నీ వంశములో బోయరక్తము ఉన్నదని సంతోషించినాము. కసవన పూర్తిగా మనవాడు. పులిరాజులో కొంత అన్యరక్తమున్నది. అయినను అతనిని మనవాడుగానే పరిగణించుచున్నాము. ఇప్పుడు పులిరాజు మన జాతి వెలుపల పెండ్లి చేసికొనుచున్నాడు. ఇతని సంతానము మన బోయ జాతికి దూరమైపోవును. దీనిని గురించి ఆలోచింపుము."

"నేనేమి చెప్పగలను, ఏమి చేయగలను?"

జయశ్రీ ఇదంతయు వినుచున్నది. అర్థము చేసికొనుచున్నది. పెద్దదొరలందరును కలిసి పులిరాజును వేరుగా చూచుచున్నారు. ఇట్లే కొనసాగిన యెడల బోయకొట్టములలో పులిరాజు ఒక సామాన్యుడైపోవును. వీనికి వెంటనే బోయదొరలతో అనుబంధము ఏర్పరచవలె. 'వీడు మనవాడే', అను భావన వీరిలో కొందరిలోనైనను కలుగవలె.

"అన్నన్నా. ఎంతమాట. పులిరాజు మీకు దూరమైపోవునా. వాని శరీరములో

ప్రవహించుచున్నది బోయదొరల రక్తము. వెలుపల పెండ్లి చేసికొన్నంత మాత్రమున ఇతడు మీకు దూరమై పోవునా? ఏదో పుట్టినింటిపై మమకారముతో నా మేనకోడలిని నేను తెచ్చు కొంటిని కానీ ఇతనిని మీ నుండి దూరము చేయుటకు కాదు. ఇప్పుడేమి మించి పోయినది. మీ వానిని మీ వాడుగా ఉంచుకొనుడు. కాదను వారెవరు?"

ఎవరును మాట్లాడలేదు. ఆమె ఉద్దేశ్యమేమో అర్థము కాలేదు.

"ఒక విషయము నా చెవికి వచ్చినది. అది మన చేతిలోని పనియే కదా అని ఆలస్యము చేసితిని. ఇప్పుడు సమయము వచ్చినది కనుక చెప్పుచున్నాను. కోన కొట్టము పెద్దదొర మాచనగారి కుమార్తెను పులిరాజు మొన్న ఎప్పుడో చూచినాడట. చాలా యిష్టపడుచున్నాడు. మీరందరును ఇప్పుడు ఇక్కడ చేరినారు. మాచన గారును ఇక్కడనే ఉన్నారు. మీరందరును కలిసి మాట్లాడి ఒక నిర్ణయమునకు రండు. మీరు పెద్దవారు. మీకు తెలియనిదేమున్నది. మీరు తలచుకొన్నచో జరుగనిది ఏమున్నది"

మాచనబోయని సంతోషమునకు మేరలేకపోయెను. నోటి దగ్గరి కబళము చేజారి పోయినదని దిగులు పడుచుండిన వానికి ఆ కబళము మరల నోటి వద్దకే వచ్చినది.

జయశ్రీ వ్యూహము ఫలించినది.

కొంత తర్జన భర్జనలు జరిగిన తరువాత మాచన బోయని కుమార్తె నాగమ్మను పులిరాజు కిచ్చి వివాహము చేయుటకు అందరును నిశ్చయించుకొనిరి. వారము దినములలో శుభ ముహూర్తమున ఆ వివాహం కూడ జరిగిపోయెను.

ఈ పెండ్లికి బోయకొట్టములోని బోయదొరలును, బోయసానులు అందరును విచ్చేసిరి.

కసవన బోయని భార్య అక్కమ. తన రెండేండ్ల కుమారుని చంకలో వైచుకొని బొంగరము వలె తిరుగుచు సమస్త కార్యములు నిర్వహించెను. పెండ్లి కూతురు నాగమ్మ అక్కమకు పెద తల్లి మనుమరాలే.

బోయకొట్టములు విస్తరించుటచేత వర్తకుల కన్ను బోయకొట్టములపై పడినది. వారు బోయకొట్టములలో ఆరు చోట్ల వారపు సంతలు ఏర్పాటు చేసిరి. కొట్టములలోని రైతులు ఉత్పత్తి చేసిన ధాన్యము, బెల్లము, నూనెలు, చింతపండు, కూరగాయలు మొదలైనవి కొనుట కును, గ్రామీణులు ఉత్పత్తి చేయలేని వస్తువులను వారికి విక్రయించుటకును ఈ సంతలు వర్తకులకు చక్కని సౌకర్యమైన వేదికలయ్యెను. ఇవికాక పశువులు, మేకలు, గొఱ్ఱెలు మొదలైన జీవాలను కూడా సంతలో క్రయవిక్రయములు చేయుచుండిరి. రెండు నెలలలో ఈ సంతలు బలిసిపోయెను. వాటిలో కట్టెపు దుర్గము సంత పెద్దదై పోయెను.

కట్టెపుదుర్గ నిర్వహణ వ్యయము పెరిగిపోయినది. ఇప్పుడు సంత నిర్వహణమును చూడవలసియున్నది. కనుక వీరనబోయడు సంత విక్రయములపై సుంకము విధించెను.

తలమోపులకు సుంకము లేదు. ఎడ్లపైనను, గుఱ్ఱములపైనను, గాడిదలపైనను తెచ్చు పెరికెసంచులపై రెండు చిన్నెములు – బండ్లపై తెచ్చు సరుకులకు పది చిన్నెములు, సుంకము

విధించెను. ఆదాయ వ్యయములను వ్రాసి పెట్టుటకు హరశర్మ పర్యవేక్షణలో నలుగురు బ్రాహ్మణులను నియమించెను.

పులిరాజు తల్లితో సంప్రదించెను.

"నాన్నగారు విధించినది ఒక సుంకమా? ఈ సంతలవలన వర్తకులకు ఎంత శ్రమ తగ్గినది! ఎంత ప్రయాణవ్యయము తగ్గినది! ఇందుకు తగిన సుంకమును మనము రాబట్టవలదా?"

"ఏమి చేయదలచితివి."

"సుంకమును పెంచెదను."

"వర్తకులు మీ తండ్రిగారితో చెప్పుకొందురేమో?"

"అట్లు జరుగకుండా నీవు చూడవలె. నాన్నగారి దర్శనమునకు ఎవరైనను వచ్చినప్పుడు 'పెద్ద దొరగారు ఎవరిని చూడరు. మీరు చిన్నదొరగారు పులిరాజు గారిని చూచి ఏదైన చెప్పవలసినది ఉన్నచో అక్కడనే చెప్పుకొనుడు' అని పంపివేయవలె"

ఆ మాటలకు తల్లిచేత సరే అనిపించి పులిరాజు సుంకములు పెంచివేసెను.

తలమోపులకు ఒక చిన్నెము. పెరికె సంచులకు ఐదు చిన్నెములు. బండ్లకు ఇరువది చిన్నెములు సుంకముగా విధించెను. ఇది పెద్దదొరగారు పెంచిన సుంకమే అని ప్రచారము గావించెను. లెక్కలు వ్రాయుటకు హరశర్మను వయస్సు మీరినదను సాకుతో మానిపించి హరశర్మ కుమారుడు నీలకంఠశర్మను నియమించెను. నీలకంఠశర్మ పులిరాజునకు సహాధ్యాయి. నమ్మినబంటువంటి మిత్రుడు.

అంతలో విష్ణువర్ధన మహారాజు పట్టము కట్టుకున్నాడనియు, తమ్ముడైన కొక్కిలితో యుద్ధములు చేయుచున్నాడనియు వార్తలు వచ్చినవి.

"ఈ విష్ణువర్ధనుడు ఎవరు? ఇంతకు పూర్వము ఇద్దరు విష్ణు వర్ధనులను గురించి వినియున్నాము. వీరికి మరి ఏ పేర్లును దొరకలేదా?" పులిరాజు హరశర్మను అడిగెను.

"వేంగిలో చాళుక్యరాజ్యమును మొదట స్థాపించిన చాళుక్యరాజు విష్ణువర్ధనుడు. ఆ పేరనిన వేంగి రాజులకు మిక్కిలి మక్కువ. అందువలన ఆ వంశపు రాజులు అందరును ఆ పేరుపెట్టుకొందురు. పుట్టినపుడు వారికి ఏ పేరు పెట్టి యుండినను పట్టాభిషేకము చేసికొనిన వెంటనే కొందరు తమ మొదటి పేరు వదలి విష్ణువర్ధనుడను పేరు పెట్టుకొందురు. ఇప్పటి వరకు వేంగి రాజులలో విష్ణువర్ధనుడను పేరు పెట్టుకొన్న వారిలో ఇతడు మూడవవాడు. అంతేకాదు. మొదట విష్ణుకుండిన రాజులను జయించి వేంగి చాళుక్యరాజ్యమును స్థాపించిన సత్యాశ్రయ మహారాజు నామము కూడా వీరికి మిక్కిలి ప్రియమైనదే. ఆ పేరును కూడా వీరు బిరుద నామముగా ధరింతురు."

క్రొత్త రాజు పట్టాభిషిక్తుడైనప్పుడు సామంత రాజులందరును అతనిని దర్శింపబోవలె. ఆ సంప్రదాయ ప్రకారము వేంగికి పోవుటకు వీరనబోయనికి శక్తిలేదు. వయస్సు పైబడుటచేత

కొంతయు, పులిరాజు ఆగడముల వలన కొంతయు వీరనబోయడు అనారోగ్యము పాలైనాడు. కసవన బోయని పిలిచి వేంగి నగరమునకు పోయి రమ్మని చెప్పుచుండగా పులిరాజు "నాకు వినుకొండలో పనియున్నది. పనిలో పనిగా అట్లే వేంగి వెళ్ళివచ్చెదను" అని సమాధానము కైనను ఎదురు చూడకుండా బయలుదేరెను.

మంగి యువరాజు చాళుక్యరాజ్యమంతయు పర్యటించి సరిహద్దులను పటిష్టముగావించి వచ్చినప్పటి నుండియు వేంగికి నానా ప్రాంతముల నుండి సామంతులు, గడిదుర్గముల వారు చాళుక్య చక్రవర్తికి కానుకలు కప్పములు సమర్పించుటకు వచ్చుచుండిరి. వారి ప్రాంతముల పేర్లుగాని, వారి ఊర్ల పేర్లు గాని వేంగి యందు చాల మంది విని యుండలేదు. అట్టి వారిని తొలిసారి చూచిన వారికి వేంగి రాజ్యము దిగంతముల వరకు వ్యాపించినదను భావము కలుగజూచ్చెను. ఈ భావముతోనే ప్రజలు చాళుక్యరాజులను సర్వలోకాశ్రయ, సమస్త భువనాశ్రయ, అనుబిరుదములతో పిలువజొచ్చిరి. చక్రవర్తుల ఆజ్ఞప్తితోనూ, రాజపురుషుల ఆజ్ఞప్తులతోనూ, సామంతుల ఆజ్ఞప్తులతోనూ లిఖింపబడు శాసనములలో ఈ బిరుదములను లిఖింపదొడగిరి.

పులిరాజ బోయనికి విష్ణువర్ధనుని ఏకాంత దర్శనమునకు అవకాశము లభించెను. తన అనుచరుల చేత పట్టించుకొని పోయిన కానుకలను పులిరాజు బోయడు స్వహస్తములతో విష్ణువర్ధన మహారాజుపాదములకడ ఉంచి నమస్కరించెను.

"పులి... పృధ్వీవ్యాఘ్ర రాజా – రా – కూర్చో" అని మంత్రి పులిరాజుకు ఒక ఆసనమును చూపెను. పులిరాజునకు ఏనుగు నెక్కినంత సంతోషమైపోయెను.

విష్ణువర్ధనుడు మాట్లాడెను.

"పృధ్వీవ్యాఘ్రరాజా నీ తెలివితేటలను గురించియు, కార్యదక్షతను గురించియు వినియు న్నాము. బోయదొరలు తరతరములుగా మాకు అత్యంత విశ్వాసపాత్రులైన ప్రజలు. మీ కొట్టములు మా సామ్రాజ్య దక్షిణ సరిహద్దున ఒక అభేద్యమైన కోటగోడ యని యెంచుకొని యున్నాము. నీవు జాగరరూకుడవై మెలగవలెనని ఆదేశించుచున్నాము."

"చిత్తము. దేవరవారి ఆజ్ఞ", పులిరాజు ఆసనముపైనుండి లేచి నమస్కరించి కూర్చుండెను.

సేనాధిపతి మాట్లాడెను. ఈ సేనాధిపతి వీరనబోయని ఆదరించిన సేనాధిపతి మనుమడు.

"నీవు నీ బోయకొట్టములలోని యువకులకు విలువిద్యలో విశేషమైన శిక్షణ ఇచ్చు చున్నావని విన్నాను. అట్లే నీవు కోటను పటిష్ఠము చేసికొనుము. సైన్యమును కూర్చుకొనుము. సైన్యములో అన్ని జాతుల వారును ఉండవలె. సైన్యమును బాగుగా పోషింపుము. అట్లుండిన యెడల బోయకొట్టములవైపు కన్నెత్తి చూచువారుండరు. చాళుక్య చక్రవర్తులను భయభక్తులతో కొలుచుచు బుద్ధిమంతుడవై మెలగవలె. ఆరు నెలలకొకసారి వచ్చి చక్రవర్తుల దర్శనము చేసికొని పోవలె."

పులిరాజు మరల ఆసనముపై నుండి లేచి "చిత్తము – చిత్తము" అని కూర్చుండెను.

మంత్రి మాట్లాడెను.

"వంగవోలుకు కందుకూరుకు మధ్యనున్న దండుబాటకు తూర్పుగా, గుండ్లకమ్మ, ముస్సినదుల మధ్య సముద్రతీరము వరకు గల భూమిని మీరు మీ యిష్టము చొప్పున పాలించుకొనవచ్చును. నీవు నీ సైన్యమును పోషించు నిమిత్తము నీవు చెల్లింపవలసిన కప్పము కొంత తగ్గించుచున్నాము. కనుక సైన్యమును లెస్సగా పోషించుకొనుము."

వీరి మాటలతో పులిరాజునకు బంధింపబడిన మదపుటేనుగునకు సంకెళ్ళు త్రెంపినట్ల యినది. బోనులో చిక్కి యుండిన సింహమును విడిపించినట్లయినది. ముఖ్యమైన విషయ మేమనగా పంద్రెండు బోయకొట్టములకు తనను ప్రభువుగా చాళుక్య ప్రభుత్వము గుర్తించినట్ల యినది. ఇక తన తండ్రిమాటగానీ, కసవన మాటగానీ ఇక్కడ చెల్లదు. తనకు కావలసినది అదియే. తన కోరిక నెరవేరినది.

పులిరాజు మహారాజుగారి ఏకాంత దర్శనము చేసికొని వచ్చిన విషయము రాజోద్యో గులకు తెలిసిపోయెను. మహారాజుగారి ఏకాంత దర్శనము సామాన్యులకు లభింపదు. విశిష్ట వ్యక్తులకే లభించును. కావున ఈ పులిరాజు విశిష్ట వ్యక్తియే అయి యుండవలెను. అని వారందరును పులిరాజును విశేష రీతిలో గౌరవింపసాగిరి.

అప్పుడే అక్కడ ఒక విచిత్రమైన వ్యక్తి పులిరాజును కలిసికొనెను.

"మీరెక్కడ బస చేయుచున్నారు?"

"సత్రము నందు"

"అయ్యయ్యో, మీ వంటి వారు సత్రమునందా? ఎంత చిన్నతనము! వేంగికి వచ్చు మీ బోటి ప్రముఖ వ్యక్తులెవరును సత్రములలోనూ, పూట కూళ్ళ ఇండ్ల యందును బస చేయరు. మీ బోటివారు బస చేయుటకు చాల గృహములు కలవు. అందరును అట్టి గృహములయందే బస చేయుదురు. దక్షారామము నుండి వచ్చు రాజప్రతినిధి అదిగో ఆ గృహమునందే బస చేయును. పలనాటి సామంతరాజు ఆ వెనుక వీధిలో ఒక గృహమున బస చేయును. హేలా పురపు దుర్గాధ్యక్షుడు అదిగో ఆ యింట విడియును. అట్లు సామంతులకు, దుర్గాధ్యక్షులకు వేంగిలో ఒక్కొక్క విడిది గృహముండుట గౌరవప్రదము, ప్రతిష్ఠాకరము. అతడు విడిది చేయు గృహమును బట్టి అతని స్థాయి వెల్లడియగును. మీకేల? మీరు నాతో రండు. నేను మీ కొక గృహము చూపెదను. వారిని మీరు మీ అంతస్తుకు తగిన విధముగా పోషింపవలె. అంతే"

ఇట్లు చెప్పుచు ఆ వ్యక్తి పులిరాజును బైలసాని ఇంటికి పిలుచుకొని పోయెను. బైలసాని కూతురు చక్కని చుక్క. నాట్యగత్తె. గాయకురాలు. పులిరాజునకు అక్కడ అన్ని సపర్యలు జరిగినవి. చక్కని భోజనము, మధువు, వినోదము, క్షణక్షణమును "ఏమి కావలె? ఇది కావలెనా? అది కావలెనా?" అని అడుగువారు. ఓ – ఇంద్రభోగమే. బైలసాని చాల తెలివికలది. తమ ఇంటికి వాడుకగా వచ్చు విటులకందరికి కొన్ని దినములు రావలదని చెప్పి పంపినది. ఒక నాడు పులిరాజు రాజప్రాసాదము నుండి వెలుపలికి వచ్చుచుండగా

ప్రాకారములోపల ఒక మూల యందు ఒక మంటపములో ఇసుక గడియారమును చూచి అక్కడికి వెళ్ళి చూచెను. అక్కడ ఒక బ్రాహ్మణ యువకుడు కూర్చుండి ఏదియో చదువుకొను చుండెను.

"అయ్యా ఇది ఏమి?"

"ఇది గడియారము."

"దీనిని కొంత వివరించి చెప్పెదరా."

"ఇదిగో ఈ పై గిన్నెలో సన్నని ఇసుక యున్నది. ఇది మెల్లగా, క్రమముగా అక్కడ ఉన్న రంధ్రము ద్వారా క్రింది గిన్నెలోనికి జారును. పై గిన్నెలోని ఇసుక అంతయు క్రింది గిన్నెలోనికి జారిపోగా ఈ రెండు గిన్నెలను బిగించిన ఈ చట్రమును వెంటనే తలక్రిందులుగా త్రిప్పి పెట్టవలెను. అప్పుడు మరల పైగిన్నె నుండి ఇసుక క్రింది గిన్నెలోనికి జారును."

"దీని ప్రయోజనమేమి?"

"పై గిన్నె నుండి ఇసుక క్రింది గిన్నెలోనికి జారుటకు సరిగా ఒక జాము పట్టును అనగా ఏడున్నర గడియల కాలము పట్టును. దీనిని బట్టి ప్రొద్దెంత అయినదో తెలిసికొన వచ్చును."

"ఇట్టి గడియారములు ఎక్కడ లభించును?"

"పెద్ద దేవాలయము ప్రక్క ఇంటిలోనున్న చంద్రశేఖర భట్టారకుల వారు ఇట్టివి అనేకము నిర్మించి విక్రయించుచున్నారు. అవసరమైనచో కొనవచ్చును. సూర్యోదయ సమయమున నిండు గిన్నె పైనుండునట్లు పెట్టవలె. గమనించుకొనుచు ఉండవలె"

పులిరాజు ఒక గడియారమును కొని పెట్టుకొనెను.

పులిరాజు బైలసాని ఇంటిలో రెండు దినములుండి. తిరుగు ప్రయాణము కట్టునప్పటికి తిత్తులలోని బంగారు నాణెములు చాల మట్టుకు కరిగిపోయెను. అయిననేమి? నగరమున తన ప్రతిష్ట పెరిగినది.

రాజ్యము నలుమూలల నుండి రాజధానికి క్రమము తప్పకుండా వచ్చు ప్రముఖులకు ఇది పరిపాటియే. ఎవరును దీనిని వింతగా చూడరు. చివరకు ఆ ప్రముఖుల ఇండ్లలోని వారు కూడ దీనిని విపరీతముగా లెక్కింపరు. మగవారికేమి. వారు మహారాజులు. ఏమైనను చేయవచ్చును. తప్పులేదు.

# 5

## పులిరాజు

పులిరాజు కట్టెపు దుర్గమునకు తిరిగి వచ్చునప్పటికి వీరనబోయడు మరణశయ్యపై నుండెను. మానసికమైన చింతయు, శారీరకమైన రుగ్మతయు అతనిని పడద్రోసినవి.

పులిరాజు తండ్రిని చూడబోయెను. వీరనబోయడు కుమారుని తన దగ్గర కూర్చుండ బెట్టుకొని మెల్లగా ఇట్లు బోధింపసాగెను.

“నాయనా. మనము నిలువ నీడలేక అల్లాడుచుండిన సమయమున పల్లవరాజులు మనకు ఈ ప్రాంతమున నిలువ నీడ కల్పించినారు. మనకు ఒక స్థితి కల్పించినారు. వారి దయవలన మనము ఇంతగా విస్తరించితిమి. మనము వారికి ద్రోహము చేయరాదు. వారికి విరోధముగా, వారికి కోపము కలిగించుపని చేయరాదు. మరియొక ముఖ్య విషయము. నీకు ఇదివరకే చెప్పియున్నాను. మనవారు సాధన చేయు విలువిద్య కానీ, ఇతర ఆయుధ విద్యలు కానీ మన ఆత్మరక్షణ వరకే. యుద్ధములు చేయుటకు కాదు. మనము సామాన్య ప్రజలమై యున్నంత వరకు మన రక్షణను గురించి మనము ఆలోచింపవలసిన పని యుండదు. పల్లవులు చాళుక్యులపైకి పోవునప్పుడు గానీ, చాళుక్యులు పల్లవులపైకి పోవునప్పుడు గానీ మన కొట్టముల ప్రక్కనే సాగి పోవుదురు గానీ మన జోలికి రారు. మనకొక కోటయు, సైన్యమును ఉండిన యెడల పల్లవులు అటుపోవునపుడు కానీ, చాళుక్యులు ఇటు పోవునపుడు కానీ మొదట మన కోటపై పడుదురు. విధ్వంసము సృష్టింతురు. మన సైనికులను మట్టుపెట్టుదురు. మన సైనికులనగా ఎవరు? మన వారే కదా? మనము రక్షణ కొరకుగా కట్టుకొన్న కోట నిజమునకు అపాయకరముగా మారును. మనము మనకున్న సైన్యముతో ఎవరితో పోరాడగలము? పల్లవులు ఒక వేళ చాళుక్యులపైకి దండెత్తినచో పల్లవులకు మనలనే మొదట కబళముగా అర్పింపవలెనని చాళుక్యరాజుల వ్యూహము. అది నీవు అర్థము చేసికొనవలె. మనము సామన్య జనులవలె ఉండవలె. రాజ్యము, కోట, సైన్యము అను ఆలోచనలు మానుకొనుము. రెండు రాజ్యముల వారును మనలను తమ వారుగానే భావించునట్లు నడచుకొనవలె. పల్లవులు మన కొట్టములను ఆక్రమించినప్పుడు చాళుక్యులు వచ్చి పల్లవులతో పోరాడుదురు. మనతో కాదు. అట్లే చాళుక్యులు మన ప్రాంతమును ఆక్రమించినప్పుడు పల్లవులు వచ్చి చాళుక్యులతో పోరాడుదురు. మనతో కాదు. మనము సురక్షితముగా ఉందుము. ఇది గుర్తుంచుకొనుము. అన్న పెద్దరికమును త్రోసిపుచ్చవద్దు. ”

అన్నమాట ఎత్తగానే పులిరాజు మొగము త్రిప్పుకొనెను. ఏమియు మాట్లాడలేదు. వాని కన్నుల ముందు చాళుక్య చక్రవర్తి విష్ణువర్ధన మహారాజు తనకొక ఆసనము నిచ్చి ఏకాంతమున

మాట్లాడిన దృశ్యమే కన్నుల యెదుట పటము వ్రేలాడగట్టినట్లు కనబడుచున్నది. అన్న వాని కనులకు గడ్డిపోచవలె కనబడుచున్నాడు.

పులిరాజు మౌనముగా ఉండుట చూచి వీరనబోయడు నిట్టూర్చి మిన్నకుండెను.

వీరనబోయడు మరణించెను. పంౘ్రెండు బోయకొట్టముల వారును శోకసముద్రమున మునిగిపోయిరి. అన్నెమ్మ మరణమునకు ఎట్లు చింతాక్రాంతులైరో ఇప్పుడును అట్లే శోకించిరి.

పులిరాజునకును, అతని తమ్ములకును, అనుచరులకును అడ్డుతొలగి పోయెను. కసవనబోయని దర్శింప బోవుచున్న బోయదొరలను పిలిచి "అన్నను ఎందుకు విసిగించెదరు. నేనున్నాను కదా. మీకేమి కావలయునో నాతో చెప్పుడు. అన్నను ప్రశాంతముగా ఉడనిండు" అని వారిని తన వైపు మరలించుకొనసాగెను. కొన్నాళ్ళు గడచిన తరువాత "అన్నకేమి తెలియును. ఎప్పుడైనను కట్టెపు దుర్గమును దాటి ఎరుగునా. లోక మెట్లు నడచుచున్నదో అతనికేమి తెలియును? వేంగిలో ఇట్లు జరుగుచున్నది. చక్రవర్తి ఇట్లు చెప్పినాడు. వినుకొండలో ఇట్లు జరుగుచున్నది. వ్యవహారములు నిర్వహించువారికి ఇవి అన్నియు తెలిసి యుండవలెను." అని చెప్పదొడగెను. వాని తమ్ములును, అనుచరులును వాని మాటలకు తాళము వేయుచు బోయకొట్టముల నిర్వహణ భారము పులిరాజుదే అను భావమును జనులలో పాదుకొల్పసాగిరి. వారితో ఘర్షణ పడుట ఇష్టము లేక కసవన బోయడు ఇంటికిని, దేవాలయములకును పరిమితుడై పోయెను. పులిరాజు అధికారము చెల్లసాగెను.

"బోయలకొక రాజ్యము కావలె. రెండు రాజ్యముల మధ్య సరిహద్దులలో పడియుండు పల్లెల వలె అనామకులై అటు ఇటు ఊగిసలాడరాదు. పల్లవులకు ప్రక్కలో బల్లెము కావలె. అటు కందుకూరు నుండి ఇటు వంగవోలు వరకు తమదే అధికారము కావలె. మెల్లమెల్లగా విష్ణువర్ధన మహారాజును మెప్పించి ప్రసన్నుని చేసికొని అద్దంకిని, వినుకొండను కూడా తన ఆధీనమునకు తెచ్చుకొనవలె. వినుకొండలో జయపాలుడును, అతని పెద్దకుమారుడును చిన్నదళపతులే. అంతకు పైకి ఎదగలేకపోయిరి. జయపాలుని తక్కిన కుమారులు అప్రయోజకులు. తండ్రియు అన్నయు సంపాదించిన దానితో ఆటోపముగా తిరుగుచున్నారు. వారు ఎక్కువ కాలము కట్టెపు దుర్గములోనే గడుపుచున్నారు. తాను మహారాజు దృష్టిని ఆకర్షించినచో వినుకొండ వరకు తన అధికారమును సాధించుట ఎంతసేపు."

పులిరాజు ఆలోచనలిట్లున్నవి.

బోయకొట్టములలో అతని పేరు పులిరాజుబోయడు. కాని బయట జనపదములలోనూ, పట్టణములలోనూ అతని పేరు పృధ్వీవ్యాఘ్ర రాజుగా ప్రచారమైనది.

తండ్రి మరణానంతరము పులిరాజు కట్టెపు కోటను మరింత పటిష్ఠముగావించెను. కోట ముందు భాగమున నున్న గోడను తొలగించి మరింత విశాలమైన ప్రదేశమును ఆక్రమించి విస్తరించి కోటగోడను నిర్మించెను. కోటగోడపైన మరికొన్ని బురుజులను, మరికొన్ని కొత్తళములను కట్టించెను. ధానుష్కులు చాటున నిలబడి బాణములు వేయుటకు కోట కొమ్మలు కట్టించెను. కట్టెపు దుర్గము రూపమే మారిపోయెను. ఇన్నాళ్ళును కట్టెపు దుర్గము

నామమాత్రపు దుర్గము. ఇప్పుడు నిజమైన గట్టిదుర్గము. పులిరాజు వేంగి నుండి తెచ్చిన గడియారమును తన నగరు ముందు ఒక మంటపములో ఎత్తైన తిన్నెపై పెట్టి దాని పర్యవేక్షణకు ఒక బ్రాహ్మణ యువకుని నియమించెను. జాము జామునకు పెద్ద గంటను మ్రోగించునట్లు ఏర్పాటు గావించెను.

పులిరాజునకు ఆదాయము చాలలేదు. వ్యయము ఎక్కువైపోవుచున్నది. బోయ రాజ్యమునకు ఒక కోశాగార ముండవలె. కోశాగారమున బోషాణముల నిండ ధనరాసు లుండవలె. అందుకొరకై పులిరాజు సంతలపై సుంకములు పెంచెను. ఇంతవరకు ప్రజలు పెంచుకొనెడి జీవాలపై ఇరువది జీవాల మందకు ఒక పోతు జీవము పన్నుగా విధించు చుండిరి. ఇప్పుడు ముప్పది జీవాల మందకు రెండు పోతు జీవాల పన్ను విధించెను. మగ్గములపైనను, కల్లుగీయువారిపైనను పన్ను విధించెను. తమ భూభాగము గుండా పయనించు సాతులను నిలవేసి కొంత పన్ను రాబట్టసాగెను.

ఇక బొక్కసము నిండక ఎట్లుండును?

కళింగ వంగ దేశముల నుండి దక్షిణముగా చోళ, పాండ్య, సింహళములకు సముద్ర మార్గమున నిరంతరము ఓడలు తిరుగుచుండును. అందులో ప్రయాణికులు పోవుదురు. వర్తకుల సరుకులును పోవుచుండును. వారు బోయకొట్టముల పరిధిలోని తీరమున మంచినీటి కొఱకో, ఆహార పదార్థముల కొఱకో దిగిన యెడల ఆ ఓడలపై పన్నువేసి రాబట్టుచుండెను. అందుకొఱకు కొందరు ఉద్యోగులను అక్కడ నియమించెను.

ఇది కొన్ని సంవత్సరములు సాగినను పల్లవ రాజులు పట్టించుకొనలేదు. పల్లవులు ఒకవైపు చోళులతోనూ, మరియొకవైపు రాష్ట్ర కూటులతోనూ పోరాడుటకే సరిపోవుచున్నది. బోయలవైపు దృష్టి సారించు తీరిక లేదు.

కళింగము నుండి ఒక ఓడలో గుఱ్ఱపు వర్తకులు నూరు గుఱ్ఱములనెక్కించుకొని వచ్చుచు గుండ్లకమ్మ నదీ ముఖద్వారమున ఓడను నిలిపిరి. ఓడలో మంచినీరు అయిపోయినది. పచ్చి మేతయు కొఱవడినది. వాటి కొరకు ఓడను నిలిపిరి.

ఓడల నుండి గుఱ్ఱములను దింపుకొని అందరును కనుపఱ్ఱు వద్ద విడిసిరి. పదేసి గుఱ్ఱములను బంతికట్టి మేతకు వదలిరి. ఓడలోని కొయ్యతొట్లకు, నీటి తిత్తులకు త్రాగునీరు నింపుకొనిరి. స్థానికులైన కూలీల చేత నదీతీరము వెంబడి ఏపుగా పెరిగిన పచ్చి గడ్డి మోపులు మోపులుగా కోయించిరి. ఉలవలు, శెనగలు, పిండి కొట్టిన చిరుధాన్యములు, కొన్ని గోనె సంచులకు కొనిరి.

గుఱ్ఱపు వర్తకులు కనుపఱ్ఱులో దిగిన విషయము రెండు ఘడియలలో పులిరాజునకు తెలిసెను. వెంటనే పులిరాజు నూరు మంది సాయుధులైన అనుచరులను వెంటబెట్టుకొని గుఱ్ఱములపై శరవేగముతో వచ్చి వారిని చుట్టుముట్టెను.

"ఈ గుఱ్ఱము లెక్కడికి?"

"కంచికి. మామల్లపురము వద్ద ఓడలు నిలిపి గుఱ్ఱములను కంచికి కొనిపోయెదము"

"ఎన్ని?"

"నూరు"

"అక్కడ ఎవరికి అమ్ముదురు?"

"వీటిని పల్లవ చక్రవర్తి నందివర్మ మహారాజు గారు విలిచినారు. వీటిని వారికి అప్పగించవలె."

"మా సీమలో అడుగుపెట్టిన వానిని మేము కొనక అవతలికి పోనిత్తుమా? వీటిని మాకే అమ్మవలె."

"తప్పు తప్పు. వారి దగ్గర ముందుగా సంచకరము తీసికొన్నాము. ఇవి వారివే. వారికి అప్పగించవలె. మీకు అవసరమైనచో మరియొక ప్రయాణములో మీకెన్ని కావలెనో అన్ని తెచ్చి యివ్వగలము."

"పైకము మేమును ఇత్తుమనుచున్నాము కదా. ఇప్పుడివి మాకే అమ్మివేయుడు. పల్లవ మహారాజుకు మరియొక ప్రయాణములో తెచ్చి ఇవ్వవచ్చును."

"వర్తకులకును ఒక నీతి, నియమము ఉన్నది. ముందుగా పైకము ఇచ్చిన వారికి ముందుగా సరకు అందివ్వవలె."

"ఈ సీమను పాలించు దొరలకును ఒక నీతి ఉన్నది. మా సీమలో అడుగుపెట్టిన వస్తువు మాకు అవసరమైనప్పుడు అవతలికి దాటిపోనివ్వము. వెల యెంతయో చెప్పుడు."

"చెప్పితిమి కదా. ఈసారి ఈ సరుకు కంచికి చేర్చెదము. రెండుమూడు నెలలలో మీకు కావలసినన్ని తెచ్చి యివ్వగలము. సంచకరము కూడ అవసరము లేదు."

"మీరు ఓడలు ఎక్కలేరు?"

వర్తకులు ఉలికిపడిరి. ఈ బోయదొరలకెంత ధైర్యము? ఎంత గర్వము? పల్లవ రాజుల వస్తువులనే ఆశించుచున్నారు.

"మీరు కొరివితో తలగోకికొనుచున్నారు."

"మా సంగతి మేము చూచుకొందుము. మీ సంగతి మీరు చూచుకొనుడు."

వర్తకులు తమలో తాము మాట్లాడుకొనిరి.

"ఒక్కొక్కటి నూట యేబది నిష్కములు."

"సరియే. ఆ లెక్కననే మేము వీటిని విలుచుకొనుచున్నాము. కానీ మరియొక మాట. మా సీమలో పరదేశ వర్తకులు వచ్చి క్రయవిక్రయములు చేసినచో నూరు నిష్కముల వ్యాపారమునకు పది నిష్కములు సుంకము చెల్లించవలె. ఆ లెక్కన నూరు గుఱ్ఱములకు సుంకము పోనూ మీకు ఇయ్యవలసినది పదుమూడు వేల ఐదునూర్లు నిష్కములు."

"ఇది చాల అన్యాయము. ఇక్కడ మీ అధికారము చెల్లుచున్నదని ఇంత అన్యాయముగా ప్రవర్తింపరాదు."

"ఏమి? తమ రాజ్యములలో జరుగు క్రయవిక్రయములకు రాజరికము వారు పన్నులు విధింపరా? అది అన్యాయమెట్లగును."

"ఇది యే రాజ్యము? చాళుక్య రాజ్యము కాదా. మేము చాళుక్య రాజ్యమునకు సుంకములు కట్టుచున్నాము కదా!"

"ఇది బోయ రాజ్యము. పంద్రెండు కొట్టముల బోయరాజ్యము. మా సీమలో సుంకము రాబట్టుకొను అధికారము మాకున్నది."

వర్తకులు ఏమియు మాట్లాడక పైకము తీసికొనిరి.

"ఇక్కడి నుండి మీరు ఎక్కడికి పోవుదురు?"

"మామల్లపురమునకే పోవలె. ఓడలో ప్రయాణికులున్నారు. ఇతరమైన మరికొన్ని సరుకు లున్నవి. కావున మేము మామల్లపురమునకు పోవలసినదే."

వర్తకులు గుఱ్ఱములను వదలి. తక్కిన సరుకును ఓడలోనికి చేర్చి దక్షిణముగా సాగిరి.

బోయదొరలు గడ్డిమోపులను పెరిక సంచుల వలె గుఱ్ఱముల కిరువైపులా దిగవైచి కట్టెపు దుర్గమునకు తోలుకొని పోయిరి. ఈ నూరు గుఱ్ఱములతోనూ, అప్పుడప్పుడు కందుకూరులో కొని తెచ్చుకొనుచున్న గుఱ్ఱములతోనూ బోయకొట్టముల ఆశ్విక దళము రెట్టింపయ్యెను. పులిరాజు అహంకారమును రెట్టింపయ్యెను. బోయ యువకులే గాక ఇతర జాతుల యువకులును గుఱ్ఱములు కొనుచున్నారు. ఆయుధ విద్యలు అభ్యాసము చేయు చున్నారు. గుఱ్ఱములపై స్వారి చేయుచు కుంతములు విసరుట, బాణములు ప్రయోగించుట నేర్చుకొనుచున్నారు.

పులిరాజునకు మల్లిక యందు ఇరువురు కుమారులు, ఇరువురు కుమార్తెలును, నాగసాని యందు ముప్వురు కుమారులును కలిగిరి. అందరికిని అక్షరాభ్యాసము మాత్రము హరశర్మయే చేయించెను. నీలకంఠశర్మ విద్యలు నేర్పసాగెను. కసవన బోయని కుమారుడు కొంత వరకు చదువుకొని ఆయుధ విద్యలను అభ్యసింప సాగెను. అతడు పులిరాజు కొడుకులకంటే అయిదారు సంవత్సరములు పెద్దవాడు. అయినను ఆకు మాటు పిందెవలె ఒదిగి యున్నాడు. పులిరాజు బోయని కుమారులు చిన్నవయస్సులోనే రాజరికపు అధికారము తమకు సంక్రమించినట్లు ప్రవర్తింపసాగిరి. ప్రజల చేత తమ తండ్రిని "దేవరవారు, ప్రభువులవారు" అని సంబోధించునట్లుగా చేసికొనిరి.

జయశ్రీకి కూడా జనులందరును తన కుమారుని రాజుగారు అనియు, ప్రభువు గారు అనియు పిలువవలెనని కోరిక యున్నది. పుట్టినింటి నుండి తన కోడలు మల్లికతో బాటు వచ్చిన సేవకురాండ్ర చేత ఆ మాటలు పలికించినది.

"రాజు గారు వచ్చుచున్నారు."

"ప్రభువుల వారు పిలుచుచున్నారు."

"రాజుగారు దీనిని తెమ్మన్నారు."

"ప్రభువుల వారు ఎక్కడికి వెళ్ళినారు?"

మొదలైన మాటలతో ప్రారంభమైనది. ఊరిలోని వారెవరైనను నగరు వద్దకు వచ్చి

"దొర ఉన్నారా?" అని అడిగినప్పుడు "ఎవరు? రాజుగారా?" అనుటయు, "ఇవి దొరగారికి ఇవ్వవలెనని తెచ్చినాను." అన్నపుడు "ప్రభువుల వారికా?" అనియు చెప్పి క్రమముగా ప్రజలకు ఆ మాటలు అలవాటు చేయసాగిరి. వారెంత చేసినను ఊరిలోని ఇతర జాతుల వారును ఇతర వృత్తుల వారును ఆ మాటలకు అలవాటు పడిరే కాని బోయలు మాత్రము ఆ మాటలను అలవాటు చేసికొనలేదు.

పులిరాజు కొడుకులు ఎక్కి వచ్చిరి. ఇతర బోయ యువకులలో చిన్న తనము రాకూడదని పులిరాజు వారికి పట్టుపట్టి విలువిద్యనూ, కుంతములు విసరుటనూ, కత్తిసామునూ నేర్పించెను. ఇప్పుడు వారు తమ తండ్రికి చేదోడు వాదోడుగా ఉన్నారు. వారిలో నాగసాని పెద్ద కొడుకు లిద్దరు మసూచి సోకి మరణించిరి. మూడవ వాడు అందరికంటెను చాల చిన్నవాడు, మసూచి సోకియు ఎట్లో బ్రతికిపోయెను.

ఒక పెను సాతు ఆ మార్గమున ఉత్తరము నుండి దక్షిణమునకు పోవుచున్నదని పులిరాజుకు వార్త వచ్చెను. ఏబది బండ్ల సరుకులు, అయిదు బండ్లలో వర్తకులు, వారి పరి వారము, నూరు మంది ఆశ్విక భటులు, ఆ సాతును అండగా చేసికొని ప్రయాణము చేయు యాత్రికుల గుంపు. మొత్తము చాల పెద్ద సాతు. దీనిని అడ్డగించి సుంకము రాబట్టినచో కనీసము వేయి సువర్ణ నిష్కములు రాబట్టవచ్చును. నూరు మంది ఆశ్వికభటులు తమకొక లెక్కలోని వారు కారు. తమ బోయ యువకులు ఏబది మంది ధనుర్బాణములు పట్టి నిలిచినచో ఆశ్విక భటుల ఆట కట్టు. ఆ ఆశ్విక భటులు కత్తులు కటార్లతో వచ్చు దోపిడీ దొంగలను తమ కుంతాలతో ఎదుర్కొనగలరు గానీ విలుకాండ్రైన బోయలను ఏమియు చేయలేరు.

వెంటనే పులిరాజు తన కుమారులను, బావమరదులను, ముఖ్య అనుచరులను వారికి తోడుగా అరువది మంది విలుకాండ్రను సిద్ధపరచి సాతును అడ్డగింప బంపెను. వారు హుటాహుటిగా పోయి సాతును అడ్డగించిరి. ఈ గుంపును చూచి సాతు వెంట వచ్చిన భటులు పోరుకు సిద్ధపడిరి. వారును విల్లమ్ములు ధరించి యున్నారు.

సాతు యజమాని పెద్ద శ్రేష్ఠి తన బండి ఆపించి వీరిని పరిశీలించి చూచెను. వీరు దోపిడీ దొంగలు కారు. ఈ ప్రాంతమున బోయ కొట్టములున్నవనియు, వారు ఈ మధ్య కొంత విజృంభించుచున్నారనియు, ఆ దారిన వెళ్ళు వ్యాపారుల వద్ద సుంకము రాబట్టుచు న్నారనియు కొంతకొంత వినియున్నాడు.

"అయ్యా ఎవరు మీరు? ఎందుకు మమ్ములను అడ్డగించినారు?"

"మేము బోయరాజ్యమువారము. ఈ దారిని పోవు వర్తకులు మాకు సుంకము చెల్లింపవలె."

"మీ ప్రభువెవరు?"

"పులి... కాదు... పృథ్వీవ్యాఘ్రరాజు."

"మీరు చాళుక్య సామంతులా, పల్లవుల సామంతులా."

బోయలు కొంతసేపు తటపటాయించిరి.

"మేము ఎవరికిని సామంతులము కాము. మాది బోయరాజ్యము."

పెద్ద శ్రేష్ఠి శాంతముగా మాట్లాడెను.

"అయ్యలారా! మేము చిన్న వర్తకులము కాము. పెనుసాతు వారము. దక్షిణ దేశమున నున్న సమస్త రాజ్యాధిపతులకు పన్నులు కట్టి ఎక్కడనైనను తిరుగుటకు అనుమతి పత్రికలు పొందియున్నాము. ఇవిగో తామ్ర పత్రములు. ఇది వేంగి ప్రభువులిచ్చినది. ఇది పల్లవ ప్రభువులిచ్చినది. ఇది రాష్ట్ర కూట ప్రభువులిచ్చినది. ఇది పాండ్య ప్రభువులిచ్చినది. మీరు చాళుక్య సామంతులైనచో దీనిని చూడుడు. పల్లవుల సామంతులైనచో దీనిని చూడుడు."

"వాటితో మాకు పనిలేదు. మా సీమలో పయనించు సాతులు మాకు పన్ను కట్టవలసినదే. మేమును అనుమతి పత్రికలిచ్చుచున్నాము."

వర్తకులు ఒకరి మొగము ఒకరు చూచుకొనిరి.

"అయ్యా, మీరు తొందరపడుచున్నారు. ఇది చిన్న వ్యవహారము కాదు. పెద్ద సామ్రాజ్య ములతో వ్యవహారము కొనితెచ్చుకొనుచున్నారు."

"ఏమీ? ఒక రాజ్యము వారు వారి సీమలో ప్రయాణము చేయువర్తకుల వద్ద సుంకము గ్రహించుట తప్పా? మేము దోపిడీ దొంగలము కాము. రాజ సంబంధీకులము. ఇదిగో మేమిచ్చుచున్న తామ్ర పత్రము. దీనిని మీ చెంత నుంచుకొని సంవత్సర కాలము మా సీమలో ఎన్నిసార్లైనను ప్రయాణము చేయవచ్చును."

"మీరు విధించు సుంకమెంత?"

"ఒక సరుకు బండికి ఇరువది నిష్కములు. మీవి ఏబది సరుకు బండ్లు. మీరు వేయి నిష్కములు చెల్లింపవలె."

పెద్దశ్రేష్ఠి కొంత సేపు ఆలోచించెను. బోయలు చాల మొరటు వారని వినియున్నాడు. వారితో తగవు వలన నష్టమే కానీ లాభము లేదు. వీరిని సర్వసన్నద్ధులైన సైనికులు వచ్చి శిక్షించవలెనే కాని తమ యొద్దనున్న ఆశ్విక భటులు చాలరు. వీరి విషయమును పల్లవ చక్రవర్తి నందివర్మయే చక్కజేయగలడు. తామేల చేయిచేసికోవలె.

"ఇదిగో కడసారి చెప్పుచున్నాను. సమ్రాట్టులు అనుమతి పత్రము ప్రసాదించిన తరువాత దానిని సామంతులు శిరసావహించవలె. ఇట్లు అడ్డగించుట మంచిదికాదు. దీని పరిణా మములు మీరు ఎరుగరు. తరువాత పశ్చాత్తాప పడుదురు."

బోయ యువకులకు ఓపిక నశించెను.

"పన్ను చెల్లించెదరా? బండ్లు విప్పమందురా?"

శ్రుతిమించి రాగాన పడుచున్నది. యువకుల దూకుడు చూచి శ్రేష్ఠి వేయి నిష్కముల సంచిని వారికి అందించి వారిచ్చిన తామ్ర పత్రమును తీసికొనెను. బండ్లు సాగినవి. బోయ యువకులు విజయగర్వముతో కట్టెపు దుర్గము చేరి పైకమును పులిరాజున కందించిరి. పులిరాజు ఆ పైకమును కోశాగారమున బోషాణములలో భద్రపరచెను.

అవమాన భారముతోనూ, కోపముతోనూ ఉడికిపోవుచున్న వర్తకులు నేరుగా కంచికి చేరుకొనిరి. పల్లవరాజు నందివర్మ దర్శనము కొఱకు రాజప్రాసాదములోనికి వర్తమానము పంపి అనుమతి రాగానే లోనికి వెళ్ళిరి. లోపల రాజుతోబాటు మంత్రియు సేనాధిపతియు ఉండిరి.

నందివర్మ అశ్వమేధ యాగ దీక్షలో ఉన్నాడు. యాగాశ్వమును వదలి ఆరు నెలలైనది. అది ఉత్తరముఖముగా పయనించుచున్నది. అది పల్లవరాజు వదలిన యాగాశ్వమని తెలిసిన తరువాత దానిని పట్టుటకు ఎవడు సాహసించును? ఆ ధైర్యముతో నందివర్మ అశ్వము వెంట కొద్దిపాటి సైన్యమునే పంపి యున్నాడు.

నందివర్మ వర్తకులను ఉచితాసనములపై కూర్చుండ నియమించి కుశల ప్రశ్నలు వేసెను.

"అనాది నుండియు మాబోటి పెను సాతుల వారము అనేక సామ్రాజ్యములలో వర్తకము చేసికొనుచున్నాము. వర్తకులు ఏ రాజ్యములో పుట్టిన వారైనను వృత్తి రీత్యా వారు అన్ని రాజ్యములకు చెందిన వారే. అన్ని రాజ్యములకు పన్నులు చెల్లించుచున్నాము. మేము ఏ రాజ్య భూభాగమందు సంచరించునప్పుడు ఆ రాజ్యాధి నేతలు మాకు భద్రత కల్పించుచున్నారు. కాని ఇప్పుడు మాకు భద్రత కరువైనది. బహిరంగ దోపిడీకి గురియైనాము."

"దోపిడియా? మీపైననా? మీ చెంత దాదాపు నూరు మంది వీరభటులున్నారు కదా! వారిని మించిన వారా ఆ దోపిడీ దొంగలు. అట్టి వారిని గురించి మేమెప్పుడును విని యుండలేదే."

"వారు దోపిడి దొంగలు కాదు. ఒక రాజ్యపు సైనికులు. వారి రాజ్యము పేరిట సుంకము విధించి విల్లమ్ములు చూపి బెదరించి దౌర్జన్యముగా సుంకమును గుంజుకొన్నారు."

"రాజ్య సైనికులా? ఏ రాజ్య సైనికులు?"

"బోయ రాజ్యపు సైనికులట. వారి సీమలో పయనించు వర్తకులు వారికి సుంకము చెల్లింపవలెనట. మేము అటు వైపున చాళుక్య రాజ్యమునకును, ఇటువైపున దేవరవారికిని సుంకములు చెల్లించి మీరు అనుమతి ప్రసాదించిన తామ్ర పత్రములను చూపినను ప్రయో జనము లేకపోయెను. వారు ప్రత్యేకముగా తామ్ర పత్రమును లిఖించి యిచ్చి సుంకమును రాబట్టినారు. ఇదిగో వారిచ్చిన తామ్ర పత్రము," అని శ్రేష్ఠి తామ్ర శాసనమును రాజు ముందుంచెను.

నందివర్మ దానిని అందుకొని చదువుకొనెను. అందులో స్పష్టముగా "పండ్రెండు బోయకొట్టముల ప్రభువు శ్రీ పృథ్వీ వ్యాఘ్రరాజు" అని లిఖింపబడినది. నందివర్మ కొంత తడవు నిశ్శబ్దముగా నుండెను. అతని తలలోని ఆలోచనల అలలు అతని నొసటిపై తాండ వించుచుండెను.

"వేయి నిష్కముల సుంకమును గురించి మేము చింతించుట లేదు. సమ్రాట్టులు వ్రాసి ఇచ్చిన పత్రములను అల్పులైన స్థానిక ప్రభువులు అతిక్రమించిన యెడల ఇక మాబోటి వర్తకుల గతియేమి? ఇక మేము సమ్రాట్టుల అనుగ్రహము సంపాదించి ఏమి ప్రయోజనము.

కట్టుగలవారెల్లరును పెత్తనము వహింపరా?" శ్రేష్ఠులు చెప్పుచున్న మాటలను నందివర్మ ప్రశాంతముగా విన్నాడు.

"ఈ బోయదొరల విషయము వేగుల వలన కొంత కొంత వినియున్నాము. కొంత కాలమునకు మునుపు కళింగ దేశము నుండి గుఱ్ఱపు వర్తకులు ఓడలో గుఱ్ఱములను తెచ్చుచు బోయకొట్టముల వద్ద మంచినీటికి, పచ్చిగడ్డికిని నిలువగా ఈ బోయదొరలు అడ్డుపడి మనకు రావలసిన నూరు గుఱ్ఱములను కొన్నారట. కొనుటయే కాదు ఆ అమ్మకముపై సుంకమును విధించినారట. ఆ వర్తకులు వచ్చి గోలగోలగా విన్నవించుకొనిరి.

"ఈ పులిరాజు తండ్రి వీరనబోయడు వినుకొండలో పెండ్లి చేసుకొన్నప్పటి నుండియు కథ కొంత అడ్డము తిరిగినది. అది ఈ పులిరాజు – ఆ – వాడు పేరు మార్చుకొన్నాడు. పృథ్వీవ్యాఘ్రరాజు. ఆఁ వాడు ఈ మధ్య కొంత తోక త్రిప్పుచున్నాడు. వాని మామయు బావమరుదులును చాళుక్య సైన్యమున దళవాయిలు కాబోలును. అది వాని మిడిసిపాటునకు మూలము.

"తమరి ఉపేక్షయే బోయలను ఇంతకు తెచ్చినది."

"మీకు తెలియనిదేమున్నది. మేమిక్కడ బలవంతులైన శత్రువులతో తలపడి పోరాడుటలో తలమునకలైయున్నాము.

"నాలుగైదు తరములకు ముందు ఈ బోయలు విష్ణుకుండిన రాజ్యమున నుండిన వారు, వేంగిపై సత్యాశ్రయుడు దండెత్తినప్పుడు వీరు నిలువ నీడ కోల్పోయిరి. చాళుక్యులు వేంగిని స్వాధీనము చేసికొనిరి కాని వేంగి రాజ్యప్రజలైన బోయలను తరిమివేసిరి. వేరు దిక్కులేక వారు మా ముత్తాతగారిని శరణువేడి గుండ్లకమ్మ ముస్సివాగుల మధ్య పల్లెలు కట్టుకొని నివసించుటకు అనుమతి పొందిరి. మనకు విధేయులుగానే ఉండిరి. మూడు తరముల వరకు వారి కొట్టముల ప్రతినిధి ఒకడు వచ్చి పల్లవ ప్రభువుల దర్శనము చేసికొని పోవుచుండెను. చాళుక్య జయసింహ వల్లభుడు పెద్ద సైన్యముతో వచ్చి అణ్ణెక్కిలో మా ప్రతినిధిని చంపి, కందుకూరులో మా ప్రతినిధిని తరిమివైచి కందుకూరు వరకు తమ రాజ్యమును విస్తరించుకొనెను. పంద్రెండు బోయకొట్టములు వారి వశమైపోయెను. అయినను బోయలు మనయెడల విశ్వాసముతోనే ఉండిరి. పైకి మాత్రము చాళుక్యుల యెడల భయభక్తులు ప్రదర్శించుచుండిరి. ఊరక చెప్పరాదు గానీ బోయలు విశ్వాసమునకు ప్రాణమిచ్చువారు. వారి వంటి ధానుష్కులు మన దక్షిణా పథములోనే లేరు. అది యెరిగియే మంగి యువరాజు మరలవచ్చి బోయలను బుజ్జగించి, బెదరించి తన అధికారమును స్థాపించుకొన్నాడు. చాళుక్యరాజ్యపు దక్షిణ సరిహద్దున కట్టెపు దుర్గమును ఒక బలమైన గడి దుర్గముగా తీర్చిదిద్దవలెనను కొన్నాడు. అందుకొఱకే చాళుక్యులు పులిరాజును ప్రోత్సహించి నారు. క్రొత్త బిచ్చగాడు ప్రొద్దెరుగడన్నట్లు పులిరాజుకు అహంకారము, అధికార దాహము తలకెక్కి ఇట్టి పనులు చేయుచున్నాడు."

"వానిని అట్లే ఉపేక్షింతురా? బోయకొట్టములు ఒక రాజ్యముగా వెలగ వలసినదేనా?"

“ఎంత మాట. ఇప్పుడు మా పరిస్థితులు మారినవి. శత్రువులను అణచివేసినాము. ప్రస్తుతము యాగ దీక్షలో ఉన్నాము. యాగము ముగియగానే చేజారిపోవుచున్న బోయ కొట్టములను..”

“చేజారిపోవుచున్న కాదు పూర్తిగా చేజారిపోయినది. తామ్ర పత్రమును చూచితిరి కదా.”

“అస్తు. అస్తు, ఆ బోయకొట్టములనే కాదు, చాళుక్యరాజులకును కొంత వేడి చూపవలె. దండు వెడలక తప్పదు. మీరు కొన్ని దినములు విశ్రాంతి తీసికొనుడు”

అంతలో మంత్రి వెలుపలికి పోయి మరల లోనికి వచ్చి “వాని పాపము పండినది. వాడు మన యాగాశ్వమును పట్టి బంధించినాడట. వార్తాహరులు వచ్చి చెప్పుచున్నారు,” అనెను.

అక్కడున్న వారందరును “ఆఁ! అంతపనిచేసినాడా? అంత ధైర్యమా?” అని తలకొక మాటగా పలికిరి.

నందివర్మ సేనాధిపతివైపు తిరిగి “ఉదయచంద్రా ఇక ఆలస్యమెందుకు? వెంటనే కావలసినంత సైన్యముతో బయలుదేరు. వానిని ప్రాణాలతో పట్టి తేవలె. పనిలో పనిగా వినుకొండ వరకు వెళ్ళి ఆ చాళుక్యులకు మన వేడి చూపిరావలె,” అనెను.

సేనాధిపతి ఉదయ చంద్రుడు ఉత్సాహముతో ఉప్పొంగుచు “ఆలస్యమేమున్నది? మూడు దినములలో మన సైన్యము బయలుదేరును” అని సెలవు తీసికొని వెడలిపోయెను.

పదివేల కాల్బలముతోనూ, వేయి మంది ఆశ్విక దళముతోనూ, పది ఏనుగులతోనూ పల్లవ సేనాధిపతి ఉదయచంద్రుడు ఉత్తర దిశగా దండు వెడలినాడని బోయలకు వర్తమాన మందినది. పులిరాజు చాళుక్యుల సహాయము కొఱకు బావ మరదిని, తమ్ముని వేంగికి తరిమినాడు.

ఆ సమయమున వేంగిలో సింహాసనము కొఱకు రాజ కుటుంబములో అన్నదమ్ముల మధ్య పోరు జరుగుచుండెను. అన్నయైన విష్ణువర్ధనుని కాదని తమ్ముడైన కొక్కిలి సింహాసన మును ఆక్రమించెను. విష్ణువర్ధనుడు తన శ్రేయోభిలాషుల సహాయముతో కొక్కిలితో తలపడెను. కొక్కిలి వేంగిలో నిలువలేక యలమంచిలికి పారిపోయి అక్కడ రాజ్యమును స్థాపించుకొనెను. విష్ణువర్ధనుడు కొక్కిలిని యలమంచిలి నుండియు పారద్రోలుటకు సన్నాహములు చేయు చుండెను. ఈ పోరాటము సంవత్సరముల పర్యంతము కొనసాగినది. వేంగిరాజ్యము అల్లకల్లోలముగా నున్నది.

ఇట్టి పరిస్థితులలో బోయలకు సహాయము ఎట్లు లభించును? పులిరాజు బావ మరదియు, తమ్ముడును నిరాశలో వినుకొండకు తిరిగి వచ్చి అక్కడ తాము సేకరించుకోగలిగినంత సైన్యమును సేకరించుకొనసాగిరి.

అంతలోనే జరుగవలసిన ఘోరమంతయు జరిగిపోయెను.

చాళుక్య సైన్యము తనకు అండగా వచ్చునను ఆశతో పులిరాజు యుద్ధమునకు

సన్నద్ధుడయ్యెను. అన్ని బోయకొట్టముల నుండి మున్నూరు మంది విలుకాండ్రను కట్టెపు దుర్గమునకు పిలిపించుకొనెను. కుంతములు, ఖడ్గములు పట్టగలవారిని ఐదునూర్ల మందిని కూడ దుర్గములో చేర్చుకొనెను. ఇన్నూరు మంది ఆశ్వికులను దుర్గమునకు కొంత దూరమున నిలిపెను. కొంతకాలము వరకు అవసరమైన ఆహార పదార్థములను కోటలో చేర్చుకొనెను. ఇటు దండెత్తి వచ్చుచున్న పల్లవ సైన్యము కొఱకును, అటు తనకు సహాయముగా రావలసిన చాళుక్య సైన్యము కొఱకును ఎదురు చూడసాగెను.

పల్లవ సైన్యము మొదట పదునొకండు బోయకొట్టములను ముట్టడించినది. అక్కడ ఎవరున్నారు? యుద్ధము చేయగల వారందరు కట్టెపు దుర్గముననేయున్నారు. పల్లవ సైనికులు బోయకొట్టములలో నిలిచిపోయిన బోయల నందరిని బంధించి నడిపించుకొనుచు వచ్చి కట్టెపు దుర్గమును ముట్టడించిరి.

బోయ ధానుష్కులు కోట కొమ్మల చాటు నుండి బాణములు వేయసాగిరి. పల్లవ సైనికుల వద్ద వెదురు దబ్బలతో అల్లబడి ముందు బాగమున చర్మము కూర్చి కట్టిన డాళ్ళు ఉన్నవి. వాటిని అడ్డముగా పెట్టుకొని పల్లవధానుష్కులు కోట పైనున్న వారిపై బాణములు వేయుచుండిరి.

కోటక్రింద పల్లవసైన్యము సమ్మర్దముగా నుండుటచేత బోయ ధానుష్కులు ప్రయోగించు బాణములన్నియు ఎవరికో ఒకరికి తగిలి హతమార్చుటయో, గాయపరచుటయో జరుగు చుండెను. పల్లవులు ప్రయోగించు బాణములు చాల మట్టుకు గురితప్పి కోటలోపల పడిపోవు చుండెను. కోటలోని స్త్రీలు ఆ బాణములను ఏరుకొని వచ్చి కోటపైనున్న ధానుష్కులకు అందించుచుండిరి.

ఇంతలో కోటకు వెలుపల దూరముగా పొంచి యుండిన ఇన్నూరు మంది బోయల ఆశ్విక దళము వచ్చి పల్లవులను వెనుక నుండి తాకిరి. పోరు తీవ్రమయ్యెను. కసవన బోయడును, అతని కుమారుడును ఆశ్విక దళమును ముందుండి నడిపించుచుండిరి. పల్లవ ఆశ్వికులు వేయి మందియు వారిని ఎదిరించిరి. వేయి మంది పల్లవ ఆశ్వికులను ఇన్నూరు మంది బోయ ఆశ్వికులు ఎదిరించి తీవ్రముగానే పోరాడిరి. ఇరు పక్షముల యందును జన నష్టము ఎక్కువగానే జరిగెను. కసవన బోయడు తీవ్ర గాయములతో క్రిందపడిపోయెను. అతని కుమారుడు ఒక పల్లవ ఆశ్వికుని ఈటెపోటుకు కూలిపోయెను. మిగిలిన బోయ ఆశ్వికులు చాల మంది గాయములపాలై చెల్లాచెదరైపోయిరి.

ఏనుగులు కోట తలుపులను పగుల మోదుచున్నవి. వాటి ప్రక్కనే ప్లలవ సైనికులు కోట తలుపులను గొడ్డళ్ళతో చీల్చు ప్రయత్నములు చేయుచున్నారు. కోటపైనున్న వారు ఏనుగుల మీదను, గొడ్డళ్ళతో కోట తలుపులు చీల్చుచున్న వారిపైనను గుండ్లు దొర్లించుటకు ప్రయత్నములు చేయుచుండగా క్రిందనున్న పల్లవ ధానుష్కులు వారిని తలసూపనీయక బాణ వర్షము కురిపించుచున్నారు. బోయ ధానుష్కులు బురుజుల చాటు నుండియు, కోటకొమ్మల చాటు నుండియు బాణ వర్షము కరిపించుచున్నారు.

పల్లవ సైనికులు బోయకొట్టముల నుండి బంధించి తెచ్చిన బోయలనందరిని తమ ముందు నిలుపుకొని యుద్ధము సాగించిరి.

బోయ విలుకాండ్రకు కాలు చేతులు ఆడలేదు. తాము వేయు బాణములు తమ వారికే తగులునట్లున్నవి. ఏమి చేయవలె?

బోయలకు పులిరాజు చర్యలు మొదటి నుండియు నచ్చలేదు. ఇష్టము లేకపోయినను జాతి గౌరవము కొఱకును, పులిరాజు ఆజ్ఞను మీరలేకను యుద్ధము చేయుచున్నారు. ఇప్పుడు శత్రువులలో ముందు వరుసలో తమ తాతలు, తండ్రులు, పెద్దవారు, పిల్లలు నిలబడి యున్నారు. ఇక బాణము లెట్లు వేయగలరు.

బోయల విజృంభణము తగ్గినది. పల్లవులది పైచేయి అగుచున్నది.

ఇదంతయు కోటపై ఒక బురుజు నుండి చూచుచున్న పులిరాజు ఆశలు వదలుకొన్నాడు. కొన్ని దినములకు ముందే జయశ్రీ తన కోడలితో వినుకొండకు వెళ్ళిపోయినది.

కట్టెపు దుర్గములో వర్షపు నీరు, మురికినీరు కోటలోపలి నుండి వెలుపలికి పోవుటకు నాలుగు పెద్ద తూపరాణులు ఉన్నవి. ఒక్కొక్కటి ఒకటిన్నర మూర ఎత్తు మూడు మూరల వెడల్పు కలవి.

పులిరాజు తన ఆంతరంగికులను పిలిచెను.

“ఇదిగో మీరు ఉత్తరమువైపున ఉన్న తూపరాణిలో దూరి బయటికి వెళ్ళుడు. అక్కడ శత్రు సైనికులెవరును లేరు. ఒకరిద్దరున్నను వారు కోటపై నుండి ఎవరైన బాణములు వేయుదురేమో అని ఎగజూచుచుందురు. మీరు తూపరాణి నుండి బయటపడిన వెంటనే ఆ భటులనే పడకొట్టి వారి గుఱ్ఱములెక్కి వంగవోలు వైపు పారిపొండు. వారు మీ కోసము వెదకుచుండగా నేనును అదే విధముగా తప్పించుకొని వచ్చి మిమ్ములను కలిసికొందును.”

వారు మిక్కిలి సంతోషముతో తూపరాణిలో దూరి వెలుపలికి పోయి అక్కడ ఏమరు పాటుననున్న ఆశ్వికులను పడగొట్టి గుఱ్ఱములెక్కి పారిపోసాగిరి. తక్కిన పల్లవ ఆశ్వికులు అది చూచి “అదిగో, అదిగో పారిపోవుచున్నారు, పట్టుడు పట్టుడు” అని వారిని వెంబడించిరి. పారిపోవు వారిపై కొందరు బాణములు, కుంతములు ప్రయోగించిరి. పారిపోవుచున్న వారిలో ఒకడు బాణము దెబ్బకు గురియై క్రింద పడి మరణించెను. తక్కిన వారు అందక పారిపోయిరి.

ఈ సందడిలో పులిరాజు కూడా తూపరాణి గుండా వెలుపలికి వచ్చి అక్కడ ఈ గందరగోళమును చూచుచున్న ఒక పల్లవ ఆశ్వికుని పడగొట్టి, ఆ గుఱ్ఱమునెక్కి ఉత్తర దిశగా పారిపోజొచ్చెను. పల్లవ సైనికులు తేరుకుని అటువైపు పరుగెత్తిరి. పులిరాజు ఉత్తర దిక్కుగా కొంత దూరము పోయి తూర్పు దిక్కుగా అమ్మనబ్రోలు వరకు వెళ్ళి సముద్రతీరము వెంబడి తెనాలివైపు పారిపోయెను. పల్లవ ఆశ్వికులు ఉత్తర దిశగా కొంత దూరము వెదకి తిరిగి వచ్చిరి.

అంతలో ఏనుగులు కట్టెపు దుర్గపు తలుపులు పగులగొట్టినవి. పల్లవ సైనికులు పొలోమని లోపలికి ప్రవేశించిరి. ఒక గడియ సేపు లోపల దొమ్మి యుద్ధము జరిగెను. పల్లవులది పైచేయి అయ్యెను.

పులిరాజు బావ మరదియు, తమ్ముడును గుఱ్ఱములెక్కి పారిపోజూచిరి. పల్లవ ఆశ్వికులు వారిని పట్టుకొని బంధించిరి. పల్లవ సైనికులు బోయవీరులను దొరికిన వారిని దొరికినట్లు బంధించిరి.

యుద్ధము ముగిసెను.

ఉదయ చంద్రుడు యుద్ధ రంగమున కలయదిరిగి చూడగా తన సైన్యములోను చచ్చిన వారి సంఖ్య తక్కువగా లేదు. ఇంత చిన్న బోయకొట్టముల వారితో యుద్ధములో ఇందరు పల్లవ సైనికులు చనిపోవుట చూచి ఉదయ చంద్రునికి కడుపులో మంటరేగెను. ఒడలంతయు కోపముతో కంపింపసాగెను.

కట్టెపు దుర్గమున ఒక విశాలమైన ప్రాంగణమునందు ఉదయ చంద్రుడు కొలువుతీరెను. కోటలో చిక్కిన వారిని, బోయకొట్టముల నుండి పట్టుకొని వచ్చిన వారిని దాదాపు వేయి మందిని చేతులు వెనుకకు విరిచికట్టి నిలబెట్టిరి. వారి వెనుక పల్లవ సైనికులు కుంతములను పట్టుకొని తమ సేనాధిపతి సైగ చేసినదే తడవుగా అందరిని పొడిచి చంపుటకు సిద్ధముగా నిలబడియున్నారు. ఇంత చిన్న యుద్ధములో తమ సోదర సైనికులను ఇంత మందిని పోగొట్టుకొన్నందులకు వారికి ఆవేదనగానే యున్నది. ఒకింత వెనుకగా స్త్రీలును, పిల్లలును గ్రుక్కిళ్ళు మ్రింగుచు ఏడ్చుచు నిలుచున్నారు.

ఉదయ చంద్రుడు మాట్లాడసాగెను. కాదు. పిడుగులు కురిపింపసాగెను.

"మీరు ద్రోహులు. పాలుత్రాగిన రొమ్మునే గ్రుద్దెడి వారు. తిన్న ఇంటి వాసములు లెక్కపెట్టెడివారు. మిమ్ములను ఏమి చేసినను పాపము లేదు."

జనులందరును తలలు వంచుకొని నిశ్శబ్దముగా వినుచున్నారు.

"త్రిపురాంతక సమీపమున బ్రతుకుచుండిన మిమ్ములను చాళుక్యులు చుట్టుముట్టి మీలో సగము మందిని చంపి, మీ ఆస్తిపాస్తులను సర్వమును దోచుకొని పోగా, మీకు నిలువ నీడ లేకపోగా, ఈ పులిరాజు ముత్తాతయో ఎవరో పల్లవ రాజును ఆశ్రయించి ఈ ప్రదేశమున నిలుచుటకు అనుమతి పొందినాడు. మీకు చోటిచ్చినది పల్లవులు, బ్రతుకు తెరువు చూపినది పల్లవులు, కోటలు నిర్మించుకొని బలవంతులై యుండుడని దారి చూపినది పల్లవులు, చివరకు మీరు ఆ చాళుక్యులతోనే– మిమ్ములను బాధలు పెట్టి తరిమి వేసిన చాళుక్యులతోనే – సంబంధములు పెంచుకొని మాకు దూరమైనారు. చాళుక్యులను నమ్మి చెలరేగినారు. బ్రతుకలేక వలస వచ్చి పల్లెలు కట్టుకొని మీరు మీ పల్లెలను ఒక రాజ్యముగా ప్రకటించు కొన్నారు. మీది రాజ్యమా? బోయరాజ్యమా? అంతటితో ఊరకుంటిరా? ఓడ వర్తకులను బెదరించి మాకు రావలసిన గుఱ్ఱములను సంగ్రహించినారు. ఉప్పుపై సుంకము వేయ బూనినారు. అన్నిటినీ 'పోనీ పాపము' అని ఉపేక్షించితిమి. మా ఉపేక్షయే మిమ్ములనిట్లు పెరుగనిచ్చినది. చివరకు మీరు మా సీమకు వచ్చుచుండిన పెను సాతునే అడ్డగించి సుంకము అడిగినారు. మీదొక రాజ్యమా. దానికొక రాజా? వాని పేరుతో తామ్ర పత్రములు వ్రాయునంతటి వారా మీరు? ఇంతకంటే మించిన స్వామి ద్రోహముండునా? చివరకు

ఇప్పుడు పల్లవ సార్వభౌముల యాగాశ్వమునే బంధించినారు. ఎంత సాహసము? ఇంతకంటే కృతఘ్నత మరియొకటున్నదా?”

ఉదయ చంద్రుడు కొంత విరామమిచ్చి మరల అడిగెను.

“మా నుండి మీరు ఇంత దూరము ఎట్లు తొలగి పోగలిగితిరి. తొలగిపోవుటకు మీకు మనసెట్లొప్పెను.”

చెన్నుబోయని మనుమడు బోయలందరివైపు చూచెను. అందరును “అంతయు చెప్పివేయుము.” అన్నట్లు తలలూపిరి. దగ్గరున్న వారు వినబడియు వినబడనట్లు “ఇంకను దాచుట ఎందుకు? జరిగిన దంతయు దేవర వారికి విన్నవించు”, అని ఎగద్రోసిరి. బోయ లందరి పరిస్థితియు బహు దైన్యముగా నున్నది. ఉదయము నుండియు వెనుకకు విరిచి కట్టిన చేతులు విరిగిపోవునేమో అన్నట్లున్నవి. అందరిని పల్లవ సైనికులు ఎప్పుడు బలిగొందురో తెలియకున్నది. ఉదయచంద్రుని మాటలలో పొంగివచ్చుచున్న కోపమును బట్టి చూడగా ఈ దినము బందీలుగా ఉన్న వేయి మందికి చావు తథ్యమని తేలిపోవుచున్నది. యుద్ధమున పోరాడుచు కత్తివేటులతోనూ, ఈటె పోట్లతోనూ చచ్చుట వేరు. బందీలుగా చిక్కి నిరాయుధులై, కాలు సేతులు బంధింపబడి, ఈటెలతో పొడువబడి చచ్చుట వేరు. పోరాడునప్పుడు తగిలిన గాయములు వీరోద్రేకములో లెక్కకు రావు. నిరాయుధులై బంధింప బడి ఈటె పోట్లకు గురియగుట అత్యంత భయంకరము. బాధాకరము. ఇది వీరమరణము కాదు. హీనమైన పంది చావు.

చెన్నుబోయని మనుమడు తటాలున మోకాళ్ళపై కూర్చుండి సగము ఏడుపును సగము మాటలునుగా చెప్పదొడగెను.

“దేవరా! తమ పాదాలకు దండాలు. తమరికి సమస్తము తెలియును. ఈ బోయ కొట్టములలోనూ, కట్టెపు దుర్గములోనూ జరిగిన విషయములు సమస్తము తమరికి వేగులవలన ఆనాటికానాడు అందుచునే ఉండును. కాబట్టి నేను అబద్ధములు చెప్పి మిమ్ములను నమ్మింపజూచుట బుద్ధిలేనితనమే అగును. మీరు నా తల తీసినను సరియే. అంతయు పూసగుచ్చినట్లు చెప్పెదను.”

చెన్ను బోయని మనుమడు ఇట్లు మాటలాడుచుండగానే చేతులు విరిచి కట్టివేయబడిన నలుగురు బోయ ముసలివారు స్పృహ తప్పి దప్పు దప్పుమని పడిపోయిరి.

బోయ యువకుని వినయ వాక్యములకు ఇంచుక ప్రసన్నుడైన ఉదయచంద్రుడు ముసలివారి కట్లు విప్పమని తన సైనికులను ఆజ్ఞాపించెను. కట్లు విప్పిన ముసలివారందరును నిలువలేక చతికిలబడిపోయిరి.

బోయ యువకుడు మరల ప్రారంభించెను.

“దేవరవారు నా తల తీసినను సరియే కాని నేను చెప్పునదంతయు దయతో చిత్తగించవలె. ఈ పులిరాజు తండ్రి వీరనబోయని కాలము వరకూ, మేము పల్లవరాజుల పాదములనే నమ్ముకొని విధేయులమై బ్రతికినాము.

"వీరనబోయడు ఎట్లో ఆ వినుకొండ పడతి ఆకర్షణలో పడి ఆమెను పెండ్లాడుటతో సమస్తము మారిపోయినది. ఆమె తండ్రియు, అన్నయు చాళుక్యరాజుల కొలువులో పనిచేయు దళపతులు. ఆ వినుకొండ పడతి కొడుకే ఈ పులిరాజు. వాని రక్తములో వినుకొండ వారి రక్తమే నిండుకొని యున్నది. వారి అండదండలతోనే వీడు చాళుక్యరాజుల భృత్యుడైనాడు.

అంత వరకును పండ్రెండు బోయకొట్టముల వారందరును అంతరములు లేకుండా ఒకరినొకరు అన్నా, మామా అని ఆత్మీయముగా పలుకరించుకొనుచుంటిమి. ఈ పులిరాజును, వినుకొండ బావమరదియు, వినుకొండ పడతి కొడుకులును మా బోయదొరల చేత పులిరాజును "ప్రభువా, దేవరా," అని పిలుచునట్లు శాసించిరి. ఇది బోయరాజ్యమని ప్రకటించిరి. కట్టెపు దుర్గము బోయ రాజ్యమునకు ముఖ్యపట్టణమని ప్రకటించిరి. మన రాజ్యమునకు సైన్యము కావలెననిరి. సైన్యమునకు గుఱ్ఱములు కావలెననిరి. కనుపఱ్ఱు వద్ద ఓడ వర్తకులను అడ్డగించి దేవరవారికి రావలసిన గుఱ్ఱములను సంగ్రహించిరి. పెను సాతుపై బడి సుంకము గుంజుకొనిరి. మా బోయ యువకులు వారి మాటను కాదనలేక వారి వెంట వెళ్ళిరే కాని దుర్మార్గపు బుద్ధితో పోలేదు."

"పెను సాతును అడ్డగించుటకు పోయిన వీరులెవరు?"

వెంటనే దాదాపు యేబది మంది బందీలైన యువకులు మోకాళ్ళపై వాలిపోయి "దేవరా, మేమేమియు చేయలేదు. వారి మాట కాదనలేక వెళ్ళి దూరముగా నిలబడితిమి. అంతకు మించి మేమేమియు చేయలేదు. అక్కడ మేము నోరైనను ఎత్తలేదు" అనిరి.

ఇక వారికి మరణము తప్పదేమో అని దూరమున నిలబడిన స్త్రీలందరును గోడుగోడున రోదింపసాగిరి.

"మరి యాగాశ్వమును బంధించిన దెవరు?"

ఉదయచంద్రుని కోపమును తమపై నుండి మరలించుటకు ఇదియే అదనని ఒక బోయ పెద్ద గట్టిగా అరచి చెప్పెను–

"వారే. ఆ పులిరాజు తమ్ములును, బావ మరదులును, కొడుకులే యాగాశ్వమును బంధించిరి. మేము వద్దు మొఱ్ఱో అని నెత్తి నోరుకొట్టుకొని చెప్పినను వినక యాగాశ్వమును పట్టి బంధించిరి."

"అవును అవును" అని మరికొందరు అరిచిరి.

"ఏరీ వారు," అని ఉదయచంద్రుడు గద్దించెను.

"వారిలో పులిరాజు సోదరులలో ఒకడును, కుమారులలో ఒకడును ఉదయపు యుద్ధములో మరణించినారు. పులిరాజు బావమరదులలో ఒకడును. కొడుకులలో ఒకడును నాలుగు దినములకు మునుపే వినుకొండకు వెళ్ళిరి. ఒక బావమరదియు, ఒక తమ్ముడును ఇక్కడనే ఉన్నారు."

"ఏరీ," అని ఉదయచంద్రుడు మరల గద్దించెను.

పల్లవ దళపతి తన వద్ద బందీలుగా ఉన్న ఆ "బావమరదిని, తమ్ముని" ఉదయచంద్రుని ముందరికి ద్రొబ్బి "వీరు పారిపోవుచుండగా పట్టుకొంటిమి"– అని విన్నవించెను.

"పారిపోవుచున్నారా – ఓరీ ద్రోహులారా? మీ రాజ్యము, మీ కట్టెపు కోట, మీ జాతి జనులు అపాయములో ఉండగా విడిచి పారిపోవుదురా. ఇదేనా మీ బంటుతనము. మీరు మాకే కాదు మీ జాతికే ద్రోహము చేసినారు. బోయదొరల జాతిలో చెడబుట్టినారు." అని ఉదయచంద్రుడు బోయలనుద్దేశించి మరల ఇట్లు చెప్పెను.

"మీకు తెలియని విషయము ఒకటి జరిగినది. వీరు మీ బొక్కసములోని ధనమంతయు బంగారు, నిష్కములు, ఆభరణములు, సమస్తము పులిరాజు భార్య వెంట వినుకొండకు ఎప్పుడో తరలించినారు. ఇప్పుడు మీ ఖర్మకు మిమ్ములను వదలి పారిపోవుటకు ప్రయత్నించి నారు. మీ బొక్కసము శూన్యముగా నున్నది."

"మేము పారిపోలేదు. చాళుక్య సేన అణ్డెక్కిని దాటి వచ్చుచున్నది. మేము వారితో కలియుటకు వెళ్ళుచుంటిమి. ఈ దినమో, రేపో చాళుక్య సేనలు రాగలవు. తరువాత మా గతి మీకు పట్టును." వాక్యము పూర్తికాక పూర్వమే పల్లవ భటులు కుంతపు కఱ్ఱతో వారి ముఖములపై రెండు దెబ్బలు వాయించిరి.

ఉదయచంద్రుని కోపము నసాళమున కంటెను.

"వీరిరువురిని కొఱత వేయండి."

కొఱత వేయుట అనుమాట బోయలు విన్నదే కానీ చూచినది లేదు. అతి ఘోరమైన నేరములు చేసిన వారినే కొఱత వేయుదురట.

పల్లవ భటులు మూడు మూరల గునపములు రెండు తెచ్చిరి. మొనలు పైకి ఉండునట్లు ఒక మూరెడు భూమిలో పాతి గట్టించిరి. రెండు మూరలు భూమిపైన నిలిచియున్నవి. వాటిని చూచునప్పటికే అక్కడి వారి ప్రాణములు గుబేలుమన్నవి.

భటులు వారినిరువురిని కాళ్ళు మడిచి కట్టిరి. నలుగురేసి మనుష్యులు వారిని పట్టుకుని వచ్చి గునపము మొన వారి గుద స్థానములో దూరునట్లు దిగవేసిరి. వారు ముందుకు వంగకుండునట్లు ఇరువురు భటులు వారి జుట్టు పట్టి వెనకకు లాగిపట్టిరి. గునపములు గుదస్థానము నుండి ఎక్కి ప్రేవులు, పొట్ట గుండె గొంతు వరకు ఒక్క క్షణములో ఎక్కిపోయెను. మడిచి కట్టిన కాళ్ళు నేల మీద ఆనుటచే అక్కడితో నిలిచెను. లేని యెడల తలను తూటు పొడుచుకొని బయటకు వచ్చెడిదేమో! ఇదంతయు ఒక్క క్షణములో జరిగిపోయెను.

వారి గొంతుకల నుండి వికృతమైన, భీకరమైన ఆర్తనాదము రెండుమూడు సార్లు వెలువడినది. శరీరము గిజగిజ లాడినది. గొంతు నుండి వెలువడిన అరుపు వలన నోరు వికృతముగా తెరచుకొని ఉండిపోయినది. శరీరములోని ప్రతి అవయవము కొంత సేపు గిలిగిలమని కంపింపసాగినది. గుదప్రాంతము నుండి రక్తము ప్రవహించి చుట్టును మన్ను ఎఱ్ఱగా మారిపోయినది. మలమూత్రములును వెలువడినవి. ఇట్లు నాలుగైదు నిమిషములు విలవిలలాడిన తరువాత వారి శరీరములు నిశ్చలములైనవి. గొంతులో గురగుర ధ్వనులు కొంత సేపు వినబడి తరువాత అవియు నిలిచినవి. ప్రాణములు పోయినవి.

చూచువారిలో హాహాకారములు, ఆర్తనాదములు మిన్నుముట్టినవి. కొందరు మూర్ఛ

పోయిరి. కొందరు ఆ దృశ్యమును చూడలేక ముఖములు చేతులతో కప్పుకొని చతికిల పడిపోయిరి.

అంతవరకు మోకరిల్లి యుండిన యేబది మంది బోయ యువకుల మొగములలో కత్తి వ్రేటునకు రక్తపు చుక్కలేనట్లు పాలిపోయెను. కాళ్ళు చేతులు చల్లబడెను. తమకందరికి ఇదే శిక్షయేమో అనుభావన సోకగానే కొందరు సగము చచ్చిరి.

ఈ యేబది మందిని ఏమి చేయవలె? బోయదొరల దృష్టిలో ఈ దురాగతములన్నింటికి ఆ వినుకొండతో సంబంధము గలవారే కారణముగా కనబడుచున్నారు. అచ్చపు బోయ యువకులు వారి బలవంతముతో వచ్చిన వారే గాని స్వయముగా దౌర్జన్య బుద్ధితో వచ్చిన వారు కారు. వీరిని క్షమించి వదలినచో బోయదొరలందరును సంతోషముతో మరల దాసోహ మందురు. కృతజ్ఞతతో పల్లవరాజులకు విశ్వాసపాత్రులై ఉందురు. వీరు పల్లవరాజ్య సైన్యములో ఉండవలసిన వారు.

"వీరిని ఒక్కొక్కరిని చబుకులతో పడేసి దెబ్బలు కొట్టవలసినది" ఉదయ చంద్రుడు ఆజ్ఞాపించెను.

పల్లవ భటులు యేబది మంది చబుకులు పట్టుకొని వచ్చిరి. సన్నని చర్మపు వారుతో జడగా అల్లబడిన బారెడు పొడవు కొరడాలు. ఒక్కొక్క దెబ్బకు వారి శరీరము చిట్లి రక్తము చిమ్ముచుండెను. నొప్పితో వారు వేయు కేకలును, చూచువారు చేయు ఆర్తనాదములును ఆకాశము నిండిపోయెను.

పక్షులు బెదరిపోయెను, పశువులు కొట్టములలో త్రాళ్ళు తెంపుకొని పారిపోయెను. కుక్కలు దూరముగా పరిగెత్తిపోయి అక్కడి నుండి మొరగసాగెను. కోట బయట యుద్ధములో గాయములపాలై అరకొర ప్రాణములలో గోర్చుచున్న వారి ప్రాణములు ఈ భయంకర ఆర్తనాదములకు అవిసి లేచిపోయెను.

అరచి అరచి కొందరు అయిదారు దెబ్బలకే సొమ్మసిల్లి పడిపోయిరి. కొందరు పడినట్లు నటించిరి.

"వీరి కట్లను విడిపించుకొని తీసుకొని పొండి. రేపు ఉదయము అందరు ఇక్కడనే సమావేశము కావలె." ఉదయచంద్రుడు సభ చాలించెను. పల్లవ భటులు కొఱ్ఱులపై నున్న శవములను లాగి ప్రక్కన పడవేసి గునపములను శుభ్రము చేసి తీసికొని వెళ్ళిరి.

ఆ రాత్రి యంతయు బోయకొట్టముల వారు కోట చుట్టును, లోపలను కలయ దిరిగి, వెదకి వెదకి చనిపోయిన తమ వారి శవములను ఒక చోట చేర్చుకొనిరి. గాయపడిన వారిని బేత కొట్టమునకు చేర్చి అక్కడ చికిత్స చేయించసాగిరి.

కసవన బోయడు తీవ్రముగా గాయపడినాడు. అతని కడుపులోనూ, మెడమీదను, భుజములపైనను బలమైన గాయములైనవి. అతనిని మంచముపై పెట్టుకొని బేత కొట్టము చేర్చిరి. కసవన బోయని కుమారుని శవము కోటగోడ ప్రక్కన కనబడినది. అతని గొంతులో ఒక బాణము, రొమ్ములో ఒక బాణము లోతుగా దిగబడియుండినది. శవములనన్నిటిని కట్టెపు దుర్గము బయట నున్న వనములో ఒక చోట ఖననము గావించిరి.

పల్లవ సైనికులును యుద్ధ రంగమంతయు వెదకి తమ వారి శవములను బండ్లపైవేసి కొనిపోయి మరికొంత దూరమున ఖననము చేసిరి. గాయపడిన వారిని కట్టెపు దుర్గము లోపల నగరులో ఉంచి చికిత్స చేయింపసాగిరి.

కుక్కలు రణరంగమంతయు తిరిగి నెలపై పేరిన రక్తమును నాకు చుండినవి. బెదరి పోయిన పశువులు క్రమక్రమముగా ఒక్కొక్కటే తమ తావులకు వచ్చి నిలబడుచుండినవి.

ఇతర బోయకొట్టములలోని వారు కొందరు కొఱ్ఱలతోనూ, సజ్జలతోనూ అంబలి కాచు కొని వచ్చి బేతకొట్టములోనూ, కట్టెపు దుర్గములోనూ ఏడ్చుకొనుచున్న వారికి బలవంతముగా త్రావించిరి. కావలసిన సపర్యలు చేయుచుండిరి. అందరిని చంపక వదలుటయే పల్లవుల దాక్షిణ్యమని కొనియాడసాగిరి. చబుకుల దెబ్బలు తినిన వారు కొఱత వేయబడిన వారిని తలచుకొని ఉదయచంద్రుని దయారసమును పేర్కొని పేర్కొని దండములు పెట్టసాగిరి.

ఉదయము అయిదు గడియలకే పల్లవ సైనికులు గుఱ్ఱములపై పండ్రెండు బోయ కొట్టములలోనూ తిరిగి అందరిని కట్టెపు దుర్గమునకు తరిమిరి. పశువుల మందను తోలుకొని వచ్చినట్లు తోలుకొని వచ్చిరి. అన్ని జాతుల వారును, అన్ని వృత్తుల వారును పరుగు పరుగున వచ్చిరి.

మధ్యాహ్న సమయమునకు కట్టెపు దుర్గము ప్రక్కనున్న వనములో జన సమూహము నిండి పోయెను. బేత కొట్టము నుండి గాయపడి చికిత్స పొందుచున్న వారు కూడ వచ్చిరి.

ఉదయచంద్రుడు మాట్లాడెను.

“మీరు చేసిన ద్రోహమునకు మేము విధించిన శిక్ష చాలా స్వల్పమైనది. తాను పెట్టిన చెట్టును తానే నరుకరాదను ధర్మమును బట్టి మీకు ఆశ్రయమిచ్చి రక్షించిన మేమే మిమ్ములను నాశనము చేయరాదని దయజూచినాము.”

జనులందరు ఒక్క పెట్టున చేతులెత్తి నమస్కరించిరి.

బోయకొట్టముల వారు ఇంకను తమకు అపాయము తప్పలేదనియే తలంచుచున్నారు. ఉదయము తమను తోలుకొని వచ్చిన పల్లవ ఆశ్వికుల ఆటోపము అట్లుండెను. ఏ క్షణమున ఎట్టి ఆజ్ఞ వెలువడునో, ఏ విధమైన ఉపద్రవము ముంచుకొని వచ్చునో అని తల్లడిల్లుచున్నారు. ఇప్పుడు ఉదయచంద్రుడు కొంత చల్లగా మాట్లాడుట విని బ్రతుకుజీవుడా అనుకొన్నారు. అందరికి పునర్జన్మ మెత్తినట్లున్నది.

“ఇకనైనను మీరు విశ్వాసపాత్రులై ఉండవలె. బ్రతికిన మాతో బ్రతుకవలె. చచ్చిన మాతో చావవలె. మీరు మా ప్రజలు.”

చెన్నుబోయని మనుమడు నిన్నటి తెగువతో కొంత ధైర్యము తెచ్చుకొని మాట్లాడెను.

“వారు మమ్ములను అట్లుండనిచ్చుట లేదు దేవరా. నిన్న వెళ్ళిపోయిన పులిబోయడు రేపో మాపో మరల వచ్చును. మేము దిక్కులేనివారమైనాము. ”

“వాడు ఇక రాడు. వచ్చిన యెడల వానిని పట్టి కొఱత వేయు అధికారమును మీకు మేము ఇచ్చుచున్నాము. మీరు దిక్కులేని వారు కారు. మీది వీరజాతి. మీరు బొమ్మకట్టిన విలుకాండ్రు. మీకు పటిష్టమైన కోట యున్నది. పులిరాజు వెనుక ఉండిన చాళుక్య

ఉద్యోగుల అండదండలు చూచి మీరు భయపడినారు. కానీ మీరు సాహసించి యుండినచో వాడును, వాని బావ మరుదులును ఎంత? మీరు సాహసింపకపోతిరి. చెడితిరి.”

నిజమే. బోయలది వీరజాతియే. ఇప్పుడు కూడ వారు పల్లవులకు అంత సులభముగా ఓడిపోవు వారు కారు. బోయలకు మొదటి నుండియు పల్లవులపై ఒకింత విశ్వాసము ఉండుట వలనను, పులిరాజు ఔద్ధత్యమునకు రోసి యుండుట చేతను, పల్లవులు ముసలిబోయ వారిని మానవ కవచములుగా ముందు వరుసలో నిలుపుకొని నందువలనను, ఏమియు చేయలేక లొంగిపోయిరికాని అలతుల లొంగెడి వారు కారు. అందుకు ఆ యుద్ధములో చచ్చిన పల్లవల సైనికుల సంఖ్యయే సాక్షి.

“ఇప్పుడు మీ నాయకుని వంశము వారు ఎవరున్నారు?”

పులిరాజు రెండవ భార్య నాగసాని మనస్సులో ఆశ పొడమినది. ఈ బోయకొట్టములకు ఉత్తర వారసుని నియమించుటకే పల్లవ సేనాని ఇట్లు అడుగుచున్నాడని భావించినది. పదునైదేండ్ల తనకుమారుని దగ్గరకు పిలిచి తన ముందర నిలబెట్టుకొన్నది. కాని ముందుకు రాలేదు. ఏమో పులిరాజు బోయని కొడుకనగానే వీనిని కూడ చంపివేయునేమో అతని మనస్సులో ఏమున్నదో. వేచి చూడవలె.

“భయపడవద్దు. వానిని ఏమియు చేయము. మీకొక నాయకుడు పెద్ద దొర కావలెను కదా. అది వంశ పరంపరగా వచ్చుటయే మేలు. ఆ వంశముపై నున్న గౌరవముతో అందరును అంగీకరింతురు. కనుక ఆ వంశములోనే చిన్న వాడో, చితకవాడో ఒకడు కావలెను.”

బోయలందరును ఊపిరి పీల్చుకొనిరి.

నాగసాని తన కుమారుని ముందరికి తీసుకొని వచ్చెను.

“పులిరాజు బోయని కొడుకు. తక్కిన వారందరును యుద్ధములో చనిపోయిరి.”

“ఛీ. ఛీ. వాని వాసనయే పనికిరాదు” ఉదయ చంద్రుడు ఛీత్కరించెను.

“వీడు వినుకొండ పడతి కుమారుడు కాడు. రెండవ భార్య మా బోయ పడతికి పుట్టిన వాడు.”

“ఏ పడతి యైననేమి? ఆ పులిరాజు రక్తమే కలుషితమైనది. వాని నారునే దూరముగా ఉంచవలె.”

ఇక అక్కడ ఉండిన యెడల ఏ పిడుగు నెత్తిన పడునో అని నాగసాని భయపడి పిల్ల వానిని పిలుచుకొని దూరముగా వెడలిపోయెను.

“వేరెవరును వారసులు లేరా?”

“ఇదిగో వీడున్నాడు. వీడు పులిరాజు అన్న మనుమడు” అని ఏడేండ్ల ఒక పిల్లవానిని ముందుకు తెచ్చిరి. వాని వెనుక మరి ఇద్దరు పిల్లలు నిలబడి బిక్కుబిక్కుమని చూచుచుండిరి.

“అన్న... అన్న అనగా?”

“పులిరాజు తండ్రి వీరనబోయని పెద్ద భార్య – బోయ పడతి సంపంగి – కుమారుడు కసవనబోయడు.”

"మరి వాడు పెద్దదొర కావలసియుండెను కదా. పులిరాజు ఎట్లు పెద్ద దొర అయినాడు?"

"ఏమి చేయమందురు, పులిరాజును, వాని మేనమామయు, బావమరుదులును దౌర్జన్యముగా అధికారమును దక్కించుకొన్నారు. వారికి చాళుక్యరాజుల ప్రాపు ఉన్నదని గర్వము. ఎవరి మాటయు, చివరకు తండ్రి వీరన బోయనంతటి వాని మాటయు చెల్లనీయక దొరతనము నెఱపినాడు."

"కసవన బోయడు వీని తాత. కుటుంబ గౌరవము కొఱకు, బోయ రాజ్యము యొక్క క్షేమము కొఱకు మిన్నకుండిపోయినాడు. వేరెవరైనా అయినచో యుద్ధములే జరిగెడివి."

"వీని తండ్రి?"

"నిన్నటి యుద్ధములో ...."

"వీని తాత? ఉన్నాడా?"

"నిన్నటి యుద్ధములో తీవ్రముగా గాయపడి బేతకొట్టమున పడియున్నాడు. కదలలేడు."

"భేష్. అదీ బోయజాతి లక్షణము. తనకు రావలసిన వారసత్వము పోయినను జాతి కొఱకు పోరాడిన వీరెక్కడ? బాగున్న కాలములో అధికారము చెలాయించి, కష్టకాలములో పారిపోయిన వాడెక్కడ? ఆ పులిరాజు దొరకిన యెడల నడివీధిలో కొఱత వేయింపక మానను. వానిని ప్రాణములతో పట్టి ఇచ్చిన వారికి వేయి సువర్ణ నిష్కములు బహుమతిగా ప్రకటించుచున్నాను."

నాగసాని తన కుమారుని తీసుకొని గబగబ నగరులోపలి గదులలోనికి పారిపోయెను.

ఉదయచంద్రుడు ఆలోచించెను. వీని తాత తీవ్రముగా గాయపడినాడు. చచ్చునో బ్రతుకునో తెలియదు. వానిని నాయకునిగా నియమించుట దండుగ. ఈ బాలుని నియమించుటయే లెస్స. వీని తాత బ్రతికిన యెడల అతడు ఈ బాలునికి రక్షకుడుగా ఉండును. చచ్చిన యెడల ఈ బాలుని తల్లివైపు వారు రక్షకులుగా ఉందురు. వంశ పారంపర్యాధికారము సురక్షితముగా నుండును.

ఉదయచంద్రుడు ఆ బాలుని దగ్గరకు పిలిచెను. వాడు తల్లివైపు చూచెను. తల్లి వానిని ఉదయచంద్రుని వైపు మెల్లగా నెట్టెను.

"నీపేరేమి?"

"వీరభద్రుడు – వీరభద్రబోయడు"

"ఈ వీరభద్ర బోయని మీ పండ్రెండు బోయకొట్టములకు పెద్ద దొరగా నియమించుచున్నాను. వీడు ప్రయోజకుడగు వరకు వీని తాత వీనికి సంరక్షకుడుగా నుండును. ఇది మా ఆజ్ఞ. మేము ఇక్కడి నుండి వెడలిపోయిన తరువాత ఎవరును కిరికిరులు చేయరాదు."

"చిత్తము. చిత్తము," అని అందరును తలలూపి దండములు పెట్టిరి.

"ఇక ఈ చాళుక్యుల కథ ఏమో, వారి మిడిసి పాటేమో తేల్చుకొనుటకు మేము రేపే వినుకొండ వరకు దండు వెడలుచున్నాము. మీ విలుకాండ్రు మాతో రావలె"

"చిత్తము చిత్తము. అందరును గాయములపాలై పడియున్నారు."

"ఎవరెవరి గాయము లెట్టివో మావారు పరిశీలించి ఎన్నుకొందురు."

బోయలపై మరల పిడుగు పడినట్లాయెను. పూర్వము చాళుక్య జయసింహ వల్లభుడు కూడా ఇట్లే కందుకూరుకు తమవిలుకాండ్రను పట్టుకొనిపోయెను. తాము ఇటు చాళుక్యుల చేతిలోనూ, అటు పల్లవుల చేతిలోనూ కీలుబొమ్మలుగా ఆడవలసినదేనా?

మరునాడే పల్లవ సైన్యము అణ్దెక్కి వైపు కదలినది. బోయ విలుకాండ్రను నూటయేబది మందిని ఏరుకొని కలుపుకొనిరి.

అణ్దెక్కి నుండి బోయకొట్టముల వారికి సహాయము చేయుటకై పులిరాజు బావమరది కొంత సైన్యమును సమకూర్చుకొని బయలుదేరుచుండగా కట్టెపు దుర్గము నుండి పారిపోయి వచ్చిన బోయ యువకుడు ఎదురు వచ్చినాడు. కట్టెపు దుర్గము పల్లవుల స్వాధీనమైన విషయమును. పులిరాజు పారిపోయిన విషయమును చెప్పినాడు. అంతటితో పులిరాజు బావమరది తన సైన్యమును అణ్దెక్కిలోనే నిలిపివేసెను.

అణ్దెక్కి ముట్టడి మూడు దినములు సాగినది. పల్లవ సైన్యము పెద్దది. వారి ముందు అణ్దెక్కి సేనలు నిలువలేకపోయినవి. అణ్దెక్కి పల్లవుల వశమాయెను. యుద్ధములో పులిరాజు బావమరదియు తమ్ముడును మరణించిరి.

ఉదయచంద్రుడు అణ్దెక్కి దుర్గములో కొన్ని కట్టుదిట్టములు చేసి, అక్కడి నుండి వినుకొండపైకి దండు వెడలెను. వినుకొండ ముట్టడి పది దినములు సాగెను.

వేంగి చక్రవర్తి విష్ణువర్ధనుడు తన తమ్ముడైన కొక్కిలిరాజుతో యలమంచిలి వద్ద ఘోరముగా పోరుచున్నాడు. అతడు వినుకొండను ఆదుకొను ప్రయత్నమే చేయలేదు. వినుకొండ పల్లవుల స్వాధీనమైపోయెను. వినుకొండలోని చాళుక్య సైనికులు గుంటూరు వైపు పారిపోయిరి.

ఉదయచంద్రుడు వినుకొండ కోటను పూర్తిగా తన స్వాధీనము చేసికొనెను. తన ప్రతినిధిని అక్కడ నిలిపి తాను వెంటబెట్టుకొని పోయిన సైన్యములో సగము వాని స్వాధీనమున నిలిపెను. వినుకొండ పరిధికి చెందిన గ్రామములలో పన్నులు రాబట్టుటకు ఉద్యోగులను నియమించెను. సైన్య పోషణకై అక్కడి తన ప్రతినిధికి ఆదాయము అధికమగునట్లు ఏర్పాట్లు గావించి వెనుదిరిగెను.

ఉదయచంద్రునికి వేంగిరాజ్యముపై దండెత్తు ఉద్దేశ్యము లేదు. వినుకొండకు ఉత్తరముననున్న దేశము వేంగి రాజ్యమే అని ఉదయచంద్రుని తీర్మానము.

అదే విధముగా నెల్లూరుకు దక్షిణముగా నున్న దేశమే పల్లవుల రాజ్యమని చాళుక్యుల తీర్మానము.

ఇట్లు వినుకొండ నుండి నెల్లూరు వరకు గల భూభాగము కొఱకై పల్లవ చాళుక్యుల మధ్య జరుగు యుద్ధములలో ఆ ప్రాంతపు జనులు నలిగి చచ్చుచున్నారు. ఈ ప్రాంతముపై రెండు సామ్రాజ్యముల వారికి అధికారము మాత్రము కావలెను. ఆ ప్రాంతపు యోగ క్షేమములు అవసరము లేదు. పన్నులు మాత్రము కావలెను. పరిపాలనపై శ్రద్ధ లేదు.

ఉదయచంద్రుడు తిరుగు ప్రయాణమున కట్టెపు దుర్గమున కసవన బోయని పలుకరించి పోయెను.

కసవన బోయడు గాయముల నుండి కోలుకొన్నాడు. పండ్రెండు బోయకొట్టములకు నాయకుడుగా తన మనుమడు వీరభద్రుడు నియమింపబడినాడని తెలుసుకొన్నాడు. తన తమ్ముడు పులిరాజు, వాని తమ్ములు, వాని బావమరుదులు అందరును హతులు, పలాయితులు అయిన విషయము తెలిసికొన్నాడు.

ఇప్పుడు క్రొత్త బాధ్యతలు తన భుజములపై బడినవి.

తెనాలిలో తలదాచుకొని యున్న పులిరాజుబోయనికి బోయకొట్టముల సంగతులన్నియు తెలిసినవి. ఇక తాను బోయకొట్టముల వైపు పోయినచో తన వారే తనను వధింతురు. ఇక వేంగియే తనకు సురక్షితమైన స్థానము. పులిరాజు వేంగికి పోయి మంత్రితో తన స్థితిని విన్నవించుకొనెను. మంత్రి అతనిని ఒక చిన్న దళమునకు దళపతిగా నియమించి విష్ణువర్ధన మహారాజు యుద్ధము చేయుచున్న యుద్ధరంగమునకు పంపివేసెను.

# 6

# కసవనబోయడు

తన కుమారునికి కట్టెపు దుర్గపు నాయకత్వము వెంద్రుక వాసిలో తప్పిపోవుటయు, ఇంతవరకు అనామకుడుగ నుండిన కసవన బోయని మనుమడు వీరభద్రునికి అధికారము దక్కుటయు నాగసానికి కడుపున అగ్గిపోసినట్లయ్యెను.

తన భర్త పులిరాజు దొరతనము నెరపు దినములలో చెప్పుకింద తేళ్ళవలె పడియుండిన బోయలందరికిని ఇప్పుడు కొమ్ములు మొలిచినవి. అసలు ఈ బోయకొట్టములకు దొరలను నియమించుటకు పల్లవులెవరు? వారికేమి అధికారము కలదు? జయించిన వారైనచో కప్పములు కొనవచ్చును. కావలెనన్నచో బోయ దొరలను త్రోసి రాజని వారి రాజప్రతినిధిని నియమించుకొనవచ్చును. ఇదియే నీతి. బోయదొరయే ప్రభువుగా ఉండవలెనన్నయెడల ఆ బోయదొరను బోయలే నిర్ణయించుకొనవలె. బోయలు తన కుమారునే ముందు చూపిరి. వానిని కాదని మరియొకనిని నిర్ణయించుటకు ఉదయచంద్రునకేమి అధికారము?

రేపొక వేళ పులిరాజు తిరిగి వచ్చిన యెడల ఈ కసవన బోయని అధికారమునకు లొంగియుండవలెనా? అత్యంత ఆటోపముతో, ఎదుటి వారు తేరిపార చూడలేని విధముగా బోయకొట్టముల నేలిన వాడు పులిరాజు. అట్టి వాని కుమారుడు – తన కుమారుడు – ఇప్పుడు అనదవలె, సామాన్య బోయని వలె ఆ చిన్న వాని ముందు అణగి మణగి ఉండ వలెనా? ఇంతవరకును సామాన్య బోయల వలె తమ చెప్పుచేతలలో మెలగుచుండిన వారు ఇప్పుడు దొరతనము వెలగబెట్టవలెనా?

నాగసాని మనస్సు ఉడికిపోవుచున్నది. న్యాయమునకు దొరతనము కసవనబోయనిదే అని కానీ, పులిరాజు దౌర్జన్యముగా అధికారము హస్తగతము చేసికొన్నాడని కానీ ఆమె మనస్సుకు తట్టనేలేదు.

కసవన బోయని ప్రక్కన వీరభద్రుడు ఆసనముపై కూర్చున్నప్పుడు ఆమె కండ్లలో నిప్పులు రాలుచుండెను.

పిల్లవానికి గానీ, వాని తాతకు గానీ నాగసాని కడుపులో రేగుచుండిన ద్వేషాగ్ని పొడయైనను కనబడదయ్యెను. నాగసానిని వీరభద్రుడును, వాని తమ్ములును పెద్దమ్మా అని పిలుచుట అలవాటు. వారు యథాప్రకారము "పెద్దమ్మా" అని ఆమె యొద్దకు పోవుచు వచ్చుచు ఉందురు.

వీరభద్రునికి ఆరు దాటి ఏడవ సంవత్సరము జరుగుచున్నది. వాని తమ్ముడు నన్ని

బోయనికి ఐదేండ్లు. వాని తమ్ముడు పొన్నిబోయనికి మూడేండ్లు.

కసవనబోయడు ఎప్పుడును వీరభద్రబోయని వెంటబెట్టుకొనియే తిరుగుచుండును. ప్రతి దినము ఉదయము వానిని గుఱ్ఱముపై ఎక్కించుకొని రెండుమూడు బోయకొట్టములను తిరిగి వచ్చుచుండెను. బోయకొట్టముల వారందరును వానిని చిన్నదొర అని పిలుచుచుండిరి.

కసవన బోయడు బొక్కసమును పరిశీలించెను. బోషాణములన్నియు ఎండిపోయి పాడుబడిన బావుల వలె బావురుమనుచుండెను. బొక్కసమునకు పైకము సమకూర్చుకొనవలె. చితికిపోయిన సంసారమును చక్కజేసికొనవలె. పులిరాజు దొరతనమున వదలివేసిన స్వంత వ్యవసాయమును మరల ప్రారంభించవలె. ఈప్రయత్నములలో కసవన బోయడు తలమునకలై పోయెను. బోయకొట్టముల వ్యవహారములు కూడ చక్కదిద్ద వలసి వచ్చెను. ప్రతిదినమును కొందరు బోయ పెద్దలు సంప్రదింపులకై అతని యొద్దకు రాసాగిరి.

ఒకనాడు ఉదయము అయిదు ఘడియల ప్రొద్దున ఇంటి ముందు ఆడుకొనుచున్న వీరభద్రుని నాగసాని పిలిచినది.

"ఏమి పెద్దమ్మా," అని వీరభద్రుడు లోపలికేగెను.

"ఈ దినము మన యింటిలో పోలేరమ్మకు పొంగలి పెట్టినాము. చక్కెర పొంగలి. ఇదిగో ప్రసాదము. కన్నుల కద్దుకొని తిను," అని ఒక అరటి ఆకు దొప్పలో నిండుగా చక్కెర పొంగలి పెట్టి ఇచ్చినది. పొంగలిపైన నేయి మిసమిస లాడుచున్నది. తీపి వాసన అంత దూరమునకు వచ్చుచున్నది. వీరభద్రుడు కొంత నోటిలో వేసుకొన్నాడు. పానకములో సొంఠి కలిపినట్లు కొంత చేదుగా నున్నను రుచిగా నున్నది.

"అన్నకో పెద్దమ్మా?"

"అన్నకును, తక్కిన వారికిని అదిగో అక్కడ తీసిపెట్టినాను ఇది నీకే తిను."

మూడు వ్రేళ్ళతో తీసికో గలిగినంత తోడుకొని మూడు సార్లు తిన్నాడు.

"అక్కడ నన్ని, పొన్ని ఆడుకొనుచున్నారు. వారికిని ఇచ్చెదను." అని వాడు అటువైపు నడువసాగినాడు.

"వద్దురా. అది నీకే. వారికి ఇక్కడ పెట్టి యున్నాను. ఇది వారికి ఇవ్వవద్దు. అది నీకే" అన్నది నాగసాని ఆందోళనగా.

వాడు వినకుండా పోవుచునే యుండెను. ఆమె వెంబడించుచునే యుండెను.

"వద్దురా. అది నీకే. వారికి ఇవ్వవద్దు. వారికి ఇక్కడికే రమ్మను. నేను ఇచ్చెదను."

వాడు నిలువలేదు. దారిలో మరి మూడు సార్లు మూడు వ్రేళ్ళతో వచ్చినంత తీసికొని తిన్నాడు. ఇంక కొంచెమే మిగిలినది.

"నన్నీ, పొన్నీ. పెద్దమ్మ చెక్కర పొంగలి చేసినది. ఇదిగో ఎంత బాగున్నదో! తిని చూడుడు. మీకు కూడ పెట్టునట వెళ్ళండి," అని మిగిలిన పొంగలిని ఊడ్చి చెరి కొంత వారి చేతులలో పెట్టినాడు. వారు తిన్నారు.

అది చూచి నాగసాని మ్రాన్పడి పోయినది. కాలు సేతులు ఆడలేదు. గుండెదడ హెచ్చినది.

ఒడలంతయు చెమటలు పట్టినది. తడబడుచు, తలకొట్టుకొనుచు ఇంటిలోనికి వెళ్ళిపోయినది.

అర ఘడియ గడువగానే వీరభద్రుడు "అమ్మా కడుపు నొప్పి కడుపు నొప్పి", అని కడుపు చేతపట్టుకొని ఏడువ సాగినాడు. వాని తమ్ములును కడుపు నొప్పి అనుచు కడుపులు చేతపట్టుకొని వాంతి చేసికొనిరి.

ఈ హఠాత్పరిణామమునకు నివ్వెరపడి వారి తల్లియు, తాత కసవన బోయడును, ప్రక్క ఇండ్ల బోయలును వీధిన పోవు వారును వచ్చి గుమిగూడిరి.

వీరభద్రునికి క్షణక్షణము కడుపునొప్పి అధికము కాజొచ్చెను. నొప్పితో మెలికలు తిరిగి పోవుచున్నాడు. నేలపై బడి పొర్లుచున్నాడు. రెండు చేతులతో కడుపును పట్టి పిసుకుకొను చున్నాడు. నేలపై నిలుచుట లేదు. వానిని పట్టుటకు సాధ్యము కాలేదు. వాని బాధను చూడలేకున్నారు.

వైద్యులు వచ్చిరి.

"ఏమైనా తింటిరా?"

"చక్కెర పొంగలి. పెద్దమ్మ ఇచ్చినది."

వైద్యులు అరటి దొప్పను పరిశీలించిరి. అందులో నేయి ఓడుచున్నది. దొప్పల అడుగునను, అంచులలోనూ కొంత పొంగలి యున్నది.

వైద్యులు పిల్లల చేత ఏవో పసరులు త్రావించిరి. ముువ్వురును వాంతి చేసికొనిరి. చిన్న పిల్లల ఏడుపుకొంత తగ్గినది. వీరభద్రుడు మాత్రము కడుపునొప్పితో తల్లడిల్లిపోవుచున్నాడు. నేలపై బడి రెండు చేతులతో నేలను గ్రుద్దుచున్నాడు. కాళ్ళు చేతులు విలవిల తన్నుకొను చున్నాడు. బిగ్గరగా కేకలు పెట్టుచున్నాడు. గుండెలు పగులునట్లు అరచుచున్నాడు.

వైద్యులు దొప్పలోని పదార్థమును పరీక్షించిరి. ఒక గిన్నెడు పాలలో ఆ పదార్థమును కొంత వేసిరి. వెంటనే ఆ పాలు విరిగిపోయెను. ఏదో ఒక చూర్ణమును ఆ పదార్థముపై చల్లరి. అది బుసబుస పొంగినది.

"అమ్మో! ఇది భయంకరమైన విషము. ఈ ఇద్దరు పిల్లల కొంచెము కొంచెము తిన్నారు. అందువలన గండము గడచినది. పిల్లవాడు ఎక్కువగా తిన్నాడు. గట్టెక్కుట కష్టము. ఈ విషము కడుపులోని ప్రేవులను త్రెంపుకొనుచు పోవును. యమ యాతన కలిగించును. ఈ విషము యొక్క చేదు రుచిని తగ్గించుటకే ఇంత విపరీతముగా నేయియు, చక్కెరయు కలిపి నారు. ఇంత దారుణమునకు ఎవరు ఒడిగట్టిరో.

కసవన బోయడు "నాగసాని ఎక్కడ?" అని అరచెను.

అంతవరకు అల్లంత దూరమున నిలబడి చూచుచుండిన నాగసాని తడబడుచు బెదురు చూపులు చూచుచు, నాలుకతో పెదవులు తడుపుకొనుచు ముందుకు వచ్చినది.

"పొంగలిలో ఏమి కలిపినావు?"

"పొంగలిలో ఏమైనా ఎందుకు కలిపెదను? ఇది పోలేరమ్మకు పెట్టిన నైవేద్యము వీనికి కొంచెము ఇచ్చినాను. మిగిలినది ఇంకను ఇంటిలో కుండలోనే ఉన్నది."

కుండను తెచ్చిరి. అరటి దొప్పలో ఉన్నంత తెట్టెలు తెట్టెలుగా నేయి కుండలో లేదు. అంతటి తీపి వాసనయు లేదు. కుండలోనుండి కొంత తోడుకున్న జాడయు లేదు.

"ఏమిరా నాయనా. మీరు తిన్న పొంగలి పెద్దమ్మ ఇచ్చినదా. వేరెవరైనా ఇచ్చినారా?"

"పెద్దమ్మే ఇచ్చినది. నాకే అని చెప్పినది. తమ్ముళ్ళకు ఇచ్చుటకు వచ్చుచుండగా నీవే తిను, ఎవరికీ ఇవ్వవద్దు" అని వెంట పడినది. నొప్పితో మధ్యమధ్య కేకలు వేయుచు వీరభద్రుడు చెప్పలేక చెప్పెను.

వైద్యులు మందుల మీద మందులు త్రావించుచునే యున్నారు. ఇద్దరు పిల్లలును కొంత తేరుకొన్నారు. వీరభద్రుని పరిస్థితి విషమించినది. స్పృహ తప్పిపోయినది. గొంతులో గురగురలు తప్ప గట్టి కేకలు నిలిచినవి. గిలగిల కొట్టుకొనుట క్రమముగా తగ్గి ఆగిపోయినది. కన్నులు మూతలుపడినవి.

ప్రాణములు పోయినవి.

అందరును గొల్లుమనిరి. వైద్యులు వీనిని వదలి చిన్న పిల్లవాంద్రకిద్దరికిని ఏవేవో మందులిచ్చి వారిపై శ్రద్ధ చూపసాగిరి. పిల్లలు కోలుకొనుచుండిరి.

"నేను ఎనుములకు కుడితి కలుపుచు చూచుచునే ఉంటిని. చిన్న దొర దొప్పను చేత పట్టుకొని వచ్చుచుండెను. వెనుకనే 'అది నీకేరా. ఎవరికీ ఇవ్వవద్దురా. వారికి ఇంటిలో ఇంకను ఉన్నదిరా. అది నీకొక్కనికేరా,' అని నాగసాని చిన్నదొర వెంట గబగబ వచ్చు చుండినది. చిన్న దొర ఆమెకు అందకుండా వచ్చి తమ్ముళ్ళకు కొంచెము కొంచెము ఊడ్చి పెట్టి దొప్పను అక్కడ పారవేసినాడు. 'నీకేరా నీకేరా,' అను మాటకు అర్థము ఇప్పుడు తెలియుచున్నది. ఇది చిన్న దొరకొఱకు ప్రత్యేకముగా చేసినది. ఔరా ఎంతకు తెగించినది." అన్నది ఎదురింటిలో పనిచేయు పరిచారిక.

జనులలో గుసగుసలు బయలుదేరినవి. గుసగుసలు మాటలైనవి. మాటలు శాపనార్థము లైనవి. శాపనార్థములు సూటిగా తిట్లైనవి. తిట్లు మూతిపై పోట్లైనవి. అందరిలోనూ కోపమొకవైపు, దుఃఖమొకవైపు.

"ఎందుకు చేసినావీ పని?" అన్నాడు కసవనబోయడు.

"నేనేమి చేసితిని. చక్కెర పొంగలి ప్రసాదము ఇచ్చినాను."

"నీవు ప్రసాదము కొఱకు చేసిన పొంగలి కుండలో అట్లే యున్నది. ఒక గరిటెడైనను తీసిన జాడ లేదు. ఇది నీవు పిల్లవాని కొఱకే వేరుగా చేసిన పొంగలి. ఇది వీనిని చంపుట కొఱకే చేసినావని బట్టబయలైనది. ఎందుకు చేసినావీపని?"

నాగసానికి ఒక తెగింపు ఆవేశించినది. ఇక దాచి ప్రయోజనము లేదు.

"అవును. విషపు పొంగలే. వీని కొఱకే చేసి ఇచ్చినాను. నా కుమారునికి దక్క వలసిన అధికారము వీడు గ్రద్ద వలె తన్నుకొని పోయినాడు. అందుకే. వీనిని చంపవలెననియే వీనికి విషము కలిపిన పొంగలి ఇచ్చితిని."

అందరును నిశ్చేష్టులైరి. ఈమె ఇంత తెగించి మాట్లాడునని ఎవరును ఊహించలేదు.

"ఓసీ రాక్షసీ – పిశాచీ, నీ కడుపు మాడా. నీది బిడ్డలను కన్న కడుపు కాదా?" అను తిట్లు మారుమ్రోగినవి.

"నా మగడు దొరతనము చేసిన దినములలో మీరందరూ కుక్కల వలె ఆయన చుట్టును తిరిగినారు. చెప్పులు నెత్తిన పెట్టుకొని మోసినారు. ఆ ఒక్కడు ఇప్పుడు లేకపోగా మీరందరును మగవారైనారు. నా బిడ్డకు అన్యాయము చేసినారు. న్యాయముగా నా కొడుకే ఈ పంద్రెండు బోయకొట్టములకు ప్రభువు. ఈ వీరభద్రుని అడ్డు తొలగిన యెడల నా కొడుకే బోయ కొట్టములకు ప్రభువు. అందుకే ఈ పని చేసినాను. మీరు చేసిన ద్రోహమునకు ఇది ఎదురు ద్రోహము. యమధర్మరాజు నాకు ఏ శిక్షయైనను వేయనీ నేను సంతోషముగా అనుభ వింతును."

"యమ ధర్మరాజు కాదు నీకు శిక్ష వేయునది. మేమే ఇప్పుడే ఇక్కడే."

ఇద్దరు ముగ్గురు పెద్దలు ఏక కంఠముతో పలుకుచు పైకి లేచిరి.

"అవునవును. ఇప్పుడే శిక్షించవలె" ఈసారి ఆడ గొంతుకలు లేచినవి.

"పసి బిడ్డ ఎంత యాతన అనుభవించినాడు! పగవారికైనను ఆ యాతన వద్దుస్వామీ ఈ రాక్షసిని ఏమి చేసినను పాపము లేదు"

"నీ కొడుకునకు అధికారము కావలెనని అడిగి యుండినచో లక్షణముగా ఇచ్చియుందును కదా. అందుకొఱకు అన్నెము పున్నెము ఎరుగని పిల్లవానికి విషము పెట్టెదవా?" అన్నాడు. కసవనబోయడు.

"ఎవరిని మెప్పించుటకీ నయవంచన మాటలు? అధికారము ఇచ్చునట! అధికారము, ఏదీ; అంతటి న్యాయస్థుడవయినచో ఇప్పుడిమ్ము. పల్లవులు పెట్టి పోయిన ప్రభువు పోయినాడు కదా. మీరందరూ అంతనీతిమంతులైతే ఇప్పుడు నా కొడుకును ప్రభువును చేయండి"

ఆ మాటతో పది పదునైదు మంది స్త్రీలు పురుషులు లేచిరి.

"ఎంతకు తెగించినావే రాక్షసీ. నీది మనస్సా బండరాయా? పసిబిడ్డ ఇక్కడ చచ్చిపడి యుండగా ఇప్పుడే నీకు కొడుకుకు రాజ్యమిమ్మనుచున్నావా? నిన్ను ముక్కలు ముక్కలుగా కోసి కాకులకు గ్రద్దలు వేసినను పాపములేదు."

"ఈ రాక్షసిని వదలకూడదు. శిక్షించవలసినదే."

"అమ్మో అమ్మో. దీనిదీ ఒక ఆడ జన్మా. కడుపులో ఎంత విషం? దీనిని ఊరకే వదలకూడదు. ఇది బ్రతికి యుండినచో ఏదో ఒకనాడు ఆ బిడ్డలను కూడా చంపివేయును. దాని మొగము చూడుడు ఎంతక్రూరముగా నున్నదో."

"ఏమి చేయవలె?" అన్నాడు కసవనబోయుడు.

"ఉరితీయవలె. కొఱత వేయవలె" తలకొక మాట చెప్పసాగిరి.

గుంపులో వెనుకనుండి ఒక వృద్ధురాలు "ఇటువంటి వారిని పుట్టెడు సున్నపు రాళ్ళలో విడగబోయవలె." అన్నది.

"అవును అవును. సున్నపురాళ్ళలో విడగబోయవలె"

ఇక ఆ మాట కసవన బోయని నోట రావలసినదే తడవు.

"సరే. కానివ్వండి." అని కసవన బోయడు మనుమని శరీరమును చేతులపై ఎత్తుకొని నగరు లోపలికి వెళ్ళెను. మరొక ఇద్దరు బోయలు సోలిపోయిన మరి ఇద్దరు పిల్లలను లోనికెత్తుకొని పోయిరి. లోపల మరల ఏడుపులు మొదలైనవి. లోపలి ఏడుపులు వినిన కొలదియు బయటి జనుల కోపాగ్ని మరింత రగిలిపోజొచ్చెను.

కామాటి పనివారు ఇటుకలు మన్ను కలిపి క్షణములో ఒక తొట్టి కట్టిరి. నాలుగు గంపల సున్నపురాళ్లు, కొన్ని బిందెల నీరు తెచ్చిపెట్టుకొనిరి.

నాగసాని గొంతుచించుకొని అందరిని తిట్టుచునే యుండెను. నలుగురు మగవారు ఆమె కాలు చేతులు కట్టి తొట్టిలో పడవైచిరి. ఆమెపైన సున్నపు రాళ్ళు కుమ్మరించిరి. నలుగురు నాలుగు ప్రక్కల నిలబడి గబగబ తొట్టి నిండుగా నీరు పోసి బండను మూసివేసిరి.

రెండు నిమిషములు కుతకుత శబ్దములును ఘోరమైన అరుపులును వినబడినవి. తరువాత నిశ్శబ్దము.

కొంత సమయము గడచిన తరువాత కాటికాపరులు వచ్చి తొట్టిని వాల్చి శవమును కట్టెలతో కదలించిరి. ఆ శరీరములోని ముప్పాతిక భాగము కండలు, మాంసము దులదులమని రాలిపోగా అస్థిపంజరము కనబడుచుండెను. కాటికాపరులు అంతయు ఊడ్చుకొని గంపలలో వేసుకొని పోయి దూరముగా శ్మశానములో పూడ్చి పెట్టిరి.

నాగసాని మరణవార్త తెలిసి సాయంత్రము వేళకు కోన కొట్టము నుండి మాచన బోయడును వాని భార్యయు రోదించుచు వచ్చిరి. ఇక్కడ అందరును నాగసానిని నిందించు వారే గానీ సానుభూతి చూపువారు కనబడలేదు. వారికిని ఛీత్కారములే ఎదురయ్యెను. వారు నాగసాని కుమారుని తమతో తీసుకొని పోవుదుమనిరి. వీడు తల్లి చావుకు పగతీర్చు కొనుటకై తక్కిన ఇరువురిపై ఏమి అఘాయిత్యము చేయునో అని శంకించి కసవన బోయడు వానిని వారితో పంపివేసెను.

మనుమని మరణముతో కసవన బోయడు మిక్కిలి క్రుంగిపోయెను. అసలే వయస్సు మీరిన వాడు. మొదటి నుండియు పులిరాజు దుష్ప్రవర్తనను అతి కష్టము మీద భరించుచు నిర్లిప్తతను అలవాటు చేసికొన్న వాడు, నిన్న యుద్ధములో కొడుకును పోగొట్టుకొన్న వాడు. నేడు మనుమని హృదయ విదారకమైన మరణమును చూచుచు తల్లడిల్లిన వాడు. ఒక స్త్రీని – ఎంత క్రూరకర్మురాలైనను ఒక స్త్రీని – అతి ఘోరముగా సున్నపురాళ్ళలో విడగబోయించిన వాడు. ఇవన్నియు తన నెత్తిననే పడవలయునా? ఇవన్నియు కన్నులారా చూచుటకేనా తాను యుద్ధమున చావక బ్రతికినది. ఈ ఘోరములన్నియు తన ఎదుటనే జరుగవలెనా? అని లోలోన కుమిలిపోయెను. ఇదంతయు ఎవరి వలన జరిగినది. ఎవరి వలనను జరుగదు. పై నుండి ఎవరో జరిపించుచున్నారు. జరుగవలసిన దానిని ఎవరును తప్పింపలేరు. మనము జరుగ వలెనని ఆశించినవి ఏవియు జరుగవు. మనము జరుగరాదని తపించునవి జరిగే పోవును. "దీనికి నేనే కర్తను. ఇది నా వలననే జరిగినది. ఇది నేనే చేయవలసి యున్నది"

అను మాటలన్నియు వట్టివి. పై నుండి ఎవడో ఆడించినట్లు ఈ ప్రపంచము ఆడుచున్నది.

ఈ విధమైన నిర్వేదముతో కసవనబోయడు నిర్లిప్తుడైపోయెను. ప్రతి దినము బోయ కొట్టములను సందర్శించి వచ్చు అలవాటు పోయినది. ప్రతి దినము విలు విద్యా సాధనము నిలిచిపోయెను. బోయకొట్టముల ఆదాయ వ్యయముల పరిశీలన ఆగిపోయెను. వ్యవహారముల విచారణ కొండెక్కెను. అతనితో మాట్లాడవచ్చిన వారు అతని నుండి ఎట్టి ప్రతిస్పందనయు రాకపోవుటచే ఊరక వెడలిపోవుచుండిరి. అతడే నెమ్మదిగా కొంత కాలమునకు కోలు కొనునులెమ్మని అందరును వేచి చూడసాగిరి.

మూడు నెలలు, ఆరు నెలలు, సంవత్సరము గడిచెను. కసవన బోయనిలో ఎట్టి మార్పును కనబడలేదు.

ఒకనాడు కసవన బోయని కోడలు – వీరభద్రుని తల్లి – వచ్చి కసవనబోయని వద్ద నిలబడినది.

"ఏమమ్మా", అని కసవన బోయడు తలఎత్తి ఆమెవైపు చూచెను. ఆమె వితంతు వేషము అతనిని మరింత కలచివేసినది.

"మామా, మీరిట్లు వైరాగ్యమును పట్టినచో మేమేమైపోవలె. బోయకొట్టము లేమైపోవలె. మన వంశమేమైపోవలె"

"అమ్మా మన చేతిలో ఏమున్నది? ఎప్పుడెప్పుడు ఏదేది ఎట్లు జరుగవలెనో అప్పుడప్పుడు అది అట్లే జరిగిపోవును. మనము చేయునది ఏమియులేదు."

"మొదటి నుండియు మీరిట్లు చేతులు ముడుచుకొని కూర్చుండుట వలననే మన వంశమునకును, మనబోయ కొట్టములకు ఇట్టి దురవస్థ వచ్చినది. ఇంకను అట్లే మాట్లాడెదరా. పోయిన వారు పోగా ఉన్నవారినైనను చూడవలదా? వారిని పెంచి ప్రయోజకులను చేయవలదా. మన వంశమును నిలబెట్టవలదా? మీరు ఈ వైరాగ్యమును వదలి నడుము కట్టుకొనకున్న ఈ బోయకొట్టములకు దిక్కెవ్వరు?"

"అంతటికిని భగవంతుడే దిక్కు. నా కొడుకును పెంచితిని? వాడేమి చేసిపోయెను? నా మనుమని పెంచితిని. వాడేమి చేసిపోయెను? మనము చేయునదేమియు లేదు. చేయవలసినదేదియో ఆ భగవంతుడే చూచుకొనును."

కోడలు అంతవరకు తన వెనుక నిలబడి బిక్కుబిక్కుమని తాతవైపు చూచుచుండిన ఇరువురు బిడ్డలను చెరియొక చేయిపట్టుకొని కసవనబోయని ఒడిలో పడునట్లు ముందరికి ద్రొబ్బి–

"ఇదిగో వీరిని భగవంతునే చూడమందురో, మీరే చూచుకొందురో మీ యిష్టము నాదేమున్నది. అన్నియు అయిపోయినవి. అంతయు నీ కొడుకుతోనే పోయినది. ఎవరెట్లు పోయిన నాదేమి పోవును. పోవుటకు ఇంకను నాకేమున్నది. అంతయు ఆనాడే – ఆనాడే పోయినది. మీ మనుమలు – మీ ఇష్టము నాదేమున్నది." అని గిరుక్కున తిరిగి గడప వరకు నడచి అక్కడే చతికిలబడి ఏడువసాగినది. తల్లి ఏడ్చుట చూచి పిల్లలును ఏడ్చుచు పోయి తల్లిని పట్టుకొనిరి.

బిడ్డల ఏడ్పు చూచి ఆమె ఏడ్పును ఆపుకొన్నది. తాను ఏడ్చిన బిడ్డలు దిగులు పడుదురు. పిల్లలను కౌగిలించుకొని నిశ్శబ్దముగా ఏడువసాగెను.

అందరును అట్లే కొంత సేపు ఉండిపోయిరి.

కసవన బోయడు మెల్లగా – "లే–లేచి లోపలికి పోయి మొగము కడుగుకో. పిల్లలకు మొగములు కడిగి తలలు దువ్వి మంచి ఉడుపులు తొడిగి నా వద్దకు పంపు", అనెను. మువ్వురును లేచి లోపలికి వెళ్ళిరి.

కసవనబోయడు బయటికి వచ్చి తొట్టిలోనున్న నీటితో కాళ్ళు చేతులు ముఖము కడుగు కొనెను. పంచెను విదిలించి చక్కగా కాసె పోసి కట్టుకొనెను. నిడుచట్టను తొడుగుకొనెను. తలపాగాను చుట్టుకొనెను. అంగవస్త్రమును భుజముపై వైచుకొనెను. అంతలో పిల్లలిద్దరును తాత దగ్గరికి వచ్చిరి. ఒకనికి ఆరేండ్లు మరియొకనికి నాలుగేండ్లు.

కసవన బోయడు ఇరువురిని వెంటబెట్టుకొని వీధిలో అడుగుపెట్టగానే వీధిలోపోవు వారు కన్నుల పండువైన దృశ్యమేదో కనబడినట్లు ఆగి చూడసాగిరి. కొందరు అప్రయత్నముగా నమస్కరించిరి. గురుశుక్రుల మధ్య వెలుగుచున్న చంద్రుని వలె కసవన బోయడు చూపఱులకు కన్నుల విందు చేయుచున్నాడు.

చాల కాలము తరువాత వీధిలోనికి వచ్చిన తమ నాయకుని చూచి కొందరు బోయలును అతనితో కలిసి నడువసాగిరి.

అందరును బ్రాహ్మణవాడలో హరశర్మ ఇంటి ముందు ఆగిరి.

హరశర్మ ఇంటి గడపకు ఇరుప్రక్కలనున్న విశాలమైన అరుగులపైన దాదాపు ఇరువది మంది వేరు వేరు ప్రాయపు విద్యార్థులు కూర్చొని చదువుకొనుచున్నారు. కొందరి ముందు పలకలు బలపములు ఉన్నవి. మరికొందరి ముందు తాటాకు పుస్తకములున్నవి. ఒక వైపు వృద్ధుడైన హరశర్మ ఊరక చూచుచు కూర్చొని యున్నాడు. మరియొక వైపు హరశర్మ కుమారుడు నీలకంఠ శర్మయు మనుమడు శంకరశర్మయు పిల్లలకు బోధించుచున్నారు. చిన్నపిల్లలు పలకలపై బలపములతో వ్రాత నేర్చుకొనుచున్నారు. పెద్దపిల్లలు తాళపత్ర గ్రంథములలో కావ్యములు చదువుచున్నారు. మరికొందరు తాళపత్ర గ్రంథములను ముందుంచుకొని అందు నుండి తమ వద్దనున్న అలేఖములలోనికి ఎత్తి వ్రాసికొనుచున్నారు. వ్రాయుచు ఇంచుక గట్టిగానే చదువుచున్నారు.

బోయదొరను, పిల్లలను చూడగానే హరశర్మ "రండి, రండి. ఎండనబడి వచ్చినారు. పాపము పిల్లలను కూడ వెంటబెట్టుకొని వచ్చినారే. రండి. కూర్చొనండి." అని పిలిచి విద్యార్థుల చేత ఒక చాపను పరిపించెను. నీలకంఠశర్మ చేతి సైగతో ఒక విద్యార్థి ఇంటిలోనికి వెళ్ళెను.

కసవనబోయడు హరశర్మకు చేతులెత్తి నమస్కరించెను. పిల్లల చేత హరశర్మ పాదములంటి నమస్కరింపజేసెను. హరశర్మ వారిని వేదమంత్రములతో ఆశీర్వదించెను. అందరును కూర్చుండిరి. అంతలో లోపలి నుండి ఒక విద్యార్థి మూడు కోరలలో చిక్కని మజ్జిగ తెచ్చి

మువ్వురికి ఇచ్చెను. మువ్వురును త్రాగిరి. వెంట వచ్చిన బోయలు అరుగుల మీద సర్దుకొని కూర్చుండిరి.

"పిల్లలను చదివించవలెనని మీ యొద్దకు పిలుచుకొని వచ్చినాను."

"ఓహో. మంచి సంకల్పమే. అక్షరాభ్యాస మెప్పుడు చేయింతురు?"

"మీరెప్పుడన్న అప్పుడే. ఇప్పటికే ఆలస్యమైనది."

"పిల్లలు స్నానము చేసి వచ్చినారా?"

"అన్నియు అయినవి."

హరశర్మ రెండు నిమిషములాలోచించి మనస్సులోనే ఏవో గుణించుకొనెను.

"సత్కార్యమునకు అన్నియు తమంతట తామే సమకూడును అనగా ఇదియే. చూచితిరా. ఇది వైశాఖ శుద్ధ దశమి బుధవారము చిత్రా నక్షత్రము. ఇంక రెండు ఘడియలలో కటకలగ్నము పెట్టబోవుచున్నది. ఇంత మంచి ముహూర్తమునకు మీకీ సంకల్పము కలిగి ఇక్కడికి వచ్చుట నిజముగా విశిష్టమైన సన్నివేశము. తదేవలగ్నం, తరుణం తదేవ, తారాబలం చంద్రబలం తదేవ. ఈ లగ్నమునకే అక్షరాభ్యాసము చేయింతమా? మీరు సిద్ధమే కదా?"

"చెప్పితిని కదా. మీరెప్పుడన్న అప్పుడే. మీదే ఆలస్యము"

హరశర్మ కుమారుని వైపు తిరిగి "ఏమి నీలకంఠా" అనెను. నీలకంఠ శర్మ "అభ్యంతర మేమి? అట్లే చేయుదము. పెద్ద దొరగారూ మీరు వెంటనే పలకయు, బలపమును తెప్పింపుడు, అక్షరాభ్యాసమునకు పూజాద్రవ్యములు, పళ్ళెరము నిండుగా బియ్యము, బంగారు కడ్డీ, ఇక్కడున్న పిల్లలకు పప్పులు బెల్లము తెప్పింపుడు. మీ కుటుంబములో రాదగిన వారిని రప్పింపుడు. ముఖ్యముగా వీరి తల్లి ఉండవలెను. కటకలగ్నము పెట్టగానే అక్షరాభ్యాసము చేయింతము" అనెను.

కసవన బోయని వెంట వచ్చి అరుగులపై సర్దుకొని కూర్చుండి యుండిన బోయలు ఇద్దరు ముగ్గురు లేచి గబగబ నగరువైపు వెళ్ళిరి.

వారు తిరిగి వచ్చు లోపల నీలకంఠ శర్మ తన యింటి పరిచారకులతో అరుగులు కడి గించి, తుడిపించి ముగ్గులు వేయించెను. దీపపు సెమ్మెయు, దేవతా విగ్రహమును, పీటలను తెప్పించి పెట్టెను. శంకరశర్మ ఆ పిల్లలనిద్దరిని బావి దగ్గరకు పిలుచుకొని పోయి కాళ్ళు చేతులు ముఖము కడిగించి నొసట విబూది అలంకరించి తీసుకొని వచ్చెను.

నగరు నుండి కసవన బోయని భార్య పూజా ద్రవ్యములను, క్రొత్త పలకలును, బల పములును ఒక గంపలో పెట్టుకొని బయలుదేరెను. మరియొక గంపలో పప్పులు బెల్లమును, మరియొక గంపలో అయ్యవారికి ఇవ్వవలసిన సంబారములును తీసికొని మరి ఇద్దరు ముత్తైదువలును బయలుదేరిరి. వారి వెంట పిల్లవాండ్ర తల్లియు మరి పది మంది స్త్రీలును వచ్చిరి. విషయము తెలిసిన మరి పది మంది మగవారును వచ్చిరి. హరశర్మ ఇంటి ముంగిట జన సమూహము పెద్దదైపోయెను. కొందరు పోయి ఇరుగుపొరుగుల ఇండ్లకడ నుండు మంచములను తెచ్చి అయ్యవారి ఇంటి ముంగిట వేసికొని కూర్చుండిరి. కొంతమంది నిలబడిరి.

ఒక కంసాలి ఒక బంగారు బలపమును తెచ్చెను.

హరశర్మ పూజాది కార్యక్రమములు సాంగోపాంగముగా ముగించి పిల్లల చేతికి గంధపు గిన్నె, అక్షతలు, పూలు ఇచ్చి "అమ్మ పాదములకు గంధము పూసి, అక్షంతలు చల్లి, పూలు చల్లి నమస్కరించుకొని రండు." అని పంపెను.

ముత్తైదువుల వెనుక ఒదిగి నిలబడి చూచుచుండిన ఆ పిల్లవాండ్రతల్లి రెండడుగులు వెనకకు వేసి పిల్లలకు తన అత్తమామలను చూపెను. పిల్లలు ఏమియు తోచక నిలబడిరి.

"అమ్మా. నీ సందేహము నా కర్థమైనది. ఏమైనను, ఎట్టి పరిస్థితిలో ఉన్నను తల్లి తల్లియే. ప్రపంచములో ప్రథమ పూజనీయురాలు తల్లియే 'మాతృదేవోభవ' అనుచున్నది వేదము. తల్లి తరువాతనే మరెవరైనను. ఇతర వితంతువులకు అన్వయించు శాస్త్రము లేవియు తల్లికి పిల్లల ఎడల అన్వయింపవు."

పిల్లలు తల్లి దగ్గరకు పోయి ఆమె పాదములకు గంధము పూసి, అక్షతలు పెట్టి, పువ్వులు పెట్టి నమస్కరించిరి. ఆ తల్లి కన్నుల నీరు నింపుకొని వారిని ఆశీర్వదించెను. ఆమె హృదయము వీరభద్రుని కొఱకు ఆక్రోశించుచుండెను.

తల్లికి నమస్కరించిన తరువాత పిల్లలు తాతకును, నాయనమ్మకును, అయ్యవారికిని నమస్కరించి పీటల మీద కూర్చుండిరి.

హరశర్మ మొదట పెద్దవాని చేతను, తరువాత చిన్నవాని చేతను బియ్యముపైన బంగారు కడ్డీతో ఓం నమశ్శివాయ సిద్ధం నమః అని మూడుసార్లు వ్రాయించి పలికించెను. అక్కడ చేరిన వారందరును కరతాళ ధ్వనులు చేసిరి.

తరువాత నీలకంఠశర్మ ఆ అక్షరములనే పలకపై బలపముతో వ్రాయించి వారిచేత దిద్దించెను.

ఒక ఘడియలో ఈ కార్యక్రమము ముగిసెను. పప్పులు బెల్లము మొదట అక్కడున్న పిల్లలకును, తరువాత పెద్దలకును పంచిరి.

కసవన బోయడు ఒక పళ్ళెరములో జతపంచెలును, తాంబూలమును, రెండు బంగారు నాణెములును పెట్టి అయ్యవారికి సమర్పించెను. అయ్యవారికి ఇవ్వవలసిన సంబారముల గంప అయ్యవారి ఇంటిలోనికి వెళ్ళిపోయెను.

కసవనబోయని మనుమలు నన్నిబోయడు, పొన్నిబోయడు ఒక క్రమజీవన సరళిలో పడిరి. ఉదయము కాల్యకృత్యములు, స్నానము, భోజనము ముగియగానే కసవన బోయడు వారిని తన గుఱ్ఱముపై కూర్చుండబెట్టుకొని రెండు మూడు బోయ కొట్టములు దర్శింపబోవును. అయ్యవారు అనధ్యయనము ప్రకటించిన దినమున ముప్వురును బోయకొట్టముల మధ్యనున్న పంట పొలములు, వాగులు, వంకలు చెఱువులు తిరిగి వత్తురు. మధ్యాహ్నము వరకు అయ్యవారి వద్ద చదువు. హరశర్మ వృద్ధుడైపోయినాడు. నీలకంఠ శర్మకు బోయకొట్టముల

ఆదాయ వ్యయముల లెక్కలు పర్యవేక్షించుటకే సమయము చాలదు. తొలినాడు పెద్ద వాడని హరశర్మతోనే అక్షరాభ్యాసము చేయించెను. మరునాటి నుండియు హరశర్మ మనుమడు శంకరశర్మయే పిల్లలకిరువురికిని విద్యాభ్యాసము కొనసాగించెను. శంకరశర్మ యువకుడు. తెనాలిలో విద్యలు నేర్చుకొని వచ్చిన వాడు. వేదములు కూడా కొంత వరకు అధ్యయనము చేసినవాడు.

నన్నిదొరయు, పొన్నిదొరయు మధ్యాహ్నము వరకు విద్యాభ్యాసము గావింతురు. తరువాత ఒక జాము సేపు విశ్రాంతి. ఆ సమయములో ఆ దినము చదివిన దానిని పునశ్చరణ చేసి కొందురు. తరువాత సాయంత్రము ఒక జాము సేపు విలువిద్యలో పరిశ్రమ; సాము జరుగుచుండెను. రాత్రి భోజనానంతరము కొంతసేపు పురాణ శ్రవణము. ఇది వారి దినచర్య. ఈ పురాణ శ్రవణమునకు ఊరివారును, దగ్గరి బోయకొట్టముల వారును చాలమంది చేరుచుందురు. ప్రక్క బోయకొట్టముల నుండి వచ్చిన వృద్ధులు రాత్రుల యందు అక్కడే నిలచిపోవుచుందురు. వారికి భోజనము, పడక నగరులో జరిగిపోవుచుండెను.

రెండుమూడు సంవత్సరములలో పంద్రెండు బోయకొట్టముల పరిధిలోని చెట్టు, గుట్ట, వాగు, వంక, పొలములు, బీళ్ళు అన్నియు నన్నికిని పొన్నికిని పరిచయమైపోయెను. సముద్రతీరము వరకు వారికి తెలియని తావు లేకపోయెను.

నన్ని దొరయు, పొన్ని దొరయు పెరిగి పెద్దవారగుచున్నారు. గుఱ్ఱపు స్వారి అభ్యసించి నారు. కత్తిసాము, కఱ్ఱసాము, కుంతములు విసురుట, మల్ల యుద్ధము మొదలగు అన్ని విద్యల యందును ప్రవీణులైనారు. కసవనబోయడు ఈ విద్యల యందు పేరు మోసినవారిని ఇతర ప్రదేశముల నుండియు పిలిపించి బోయకొట్టములలోని యువకులందరికిని నేర్పింప సాగెను. కులభేదము గానీ, వృత్తి భేదము గానీ లేకుండా అందరును వారివారి వృత్తులు చేసికొనుచు ఈ విద్యలు నేర్చుకొనవలసినదే.

నన్నిదొర ఎల్లప్పుడును ఆలోచనా పరుడు. ఒక పదవిలో ఉండువాడు కేవలము అధికార బలముతో ఆ పదవిలో ఉండలేడు. ఆ పదవికి తగిన అర్హత వ్యక్తిగతముగా సాధించుకొనవలె. తాను బోయకొట్టములకు భావి నాయకుడు. తాత నిర్ణయించినాడని కానీ, పల్లవులు నిర్ణయించినారని కానీ ఆ పదవిలో ఉండుట సిగ్గుచేటు. అందుకు తగిన వ్యక్తిగత అర్హత సంపాదించుకోవలె. నాయకుడు ఎప్పటికిని తక్కిన వారి కంటే మేటిగా నుండవలె. విద్యలోనూ, శక్తిలోనూ, ప్రవర్తనలోనూ, బుద్ధిలోనూ. ఒక్కదానిలో తగ్గినను చులకనయే. సొంత ఆలోచనచేత అతడు ధర్మదృష్టి, ఋజు ప్రవర్తన, సత్యవాక్కు, సహనము అలవరచుకోవలె. మహాభారతము నందు ధర్మరాజు పిన్నవయస్కుడైనను ఎవరును అతనిని దుర్యోధనాదులతో సమానముగా చూడలేదు. భీష్మవిదురాదులతో సమానముగా చూచినారు. అదియే నాయకుని లక్షణము.

ఇట్టి ఆలోచనల వలన, ప్రవర్తన వలన నన్నిబోయడు పదునెనిమిదేండ్లకే స్థితప్రజ్ఞుడనియు, కార్యదక్షుడనియు, ఆలోచనాపరుడనియు పేరును, గౌరవమును సంపాదించుకొనెను.

పండ్రెండు బోయకొట్టముల వారికి ఇష్టుడైపోయెను. ఏ కార్యమునకైనను "నన్ని దొరను సంప్రదింతము", అను ప్రశస్తిని సంపాదించుకొనెను. కఠోర పరిశ్రమతో ఆయుధ విద్యలలో మేటి యయ్యెను.

పెద్దన్నయగు వీరభద్ర బోయని దారుణ మరణమును, అతని మరణ యాతనను చూచిన నాటి నుండియు పసివాడైన పొన్ని దొరను అమితమైన భయము ఆవహించెను. ఆ భయముతో అతడు ఎల్లప్పుడు నన్నిదొర వెన్ను కఱుచుకొనియే తిరుగుచుండెను. తాత ఎప్పుడో కాని కనబడడు. తాత చుట్టును ఎల్లప్పుడును పది మంది బోయదొరలు పరివేష్టించి యుందురు. కనుక పొన్నిదొరకు తన అన్నయే రక్షకుడు, భయత్రాత, మార్గనిర్దేశకుడు, ఏడుగడ, సమస్తము అన్నయే.

ఆ అన్న ఎటువంటి వాడు, ఎంతటి వాడు? ఏడాదికేడాదికి ఎంతో ఉన్నతముగా పెరిగిపోవుచున్నాడు. తమ్ముని తన రెక్కల క్రింద పొదువుకొని సంరక్షించుకొనుచున్నాడు. క్రమముగా పొన్నిదొరకు అన్నయే సర్వస్వమైపోయెను. అన్నమాట వేదవాక్కు, అన్న ఆదర్శమూర్తి. అన్న ఆజ్ఞను ఏనాడును ప్రశ్నించుట లేదు. అన్న బోయకొట్టముల వ్యవహారములలో మునిగినప్పుడు అతడు హరభట్టు వద్ద కానీ, అతని కుమారుని వద్ద గానీ మనుమని వద్ద గానీ శాస్త్రములు నేర్చుకొనుచుండెను.

వైశాఖ మాసము పెట్టినది. వ్యవసాయపు పనులు లేవు. అప్పుడే గ్రామములలో నాటకములాడుదురు. ఒకనాడు ఉదయగిరి నుండి ఆటవారు వచ్చి కసవనబోయని దర్శనము చేసికొనిరి.

"మేము నాటకము లాడెడి వారము. దేవరవారి ఉత్తర్వు అయిన యెడల ఈ నగరు ఎదుట దినమునకొక నాటకము వేయుదుము."

"ఏయే నాటకములు నేర్చియున్నారు?"

"హరిశ్చంద్ర నాటకము, భక్తమార్కండేయ, రేణుకాదేవి కథ, గరుడ గర్వభంగము, సిరియాళుని కథ, ఇంకను నాలుగైదు నాటకములు నేర్చినాము."

"మీ గుంపులో ఎందరున్నారు. ఎన్ని కుటుంబములు?"

"మా గుంపులో మొత్తము ఇరవై మంది ఉన్నాము. మూడు కుటుంబములు, అందరమునూ బంధువులమే."

"ప్రస్తుతము ఎక్కడ దిగియున్నారు?"

"అదిగో, కోట బయట వనములో పోలేరమ్మ దేవాలయము వద్ద దిగి యున్నాము."

"ఈ రాత్రికే నాటకము వేయుదురా?"

"తమ ఉత్తర్వు అయినట్లయితే ఈ రాత్రికే నాటకము వేయగలము."

"ఏ నాటకము?"

"దేవరచిత్తము."

"హరిశ్చంద్ర."

"మహాప్రసాదము, సుఖోజయం?"

వెంటనే పదిమంది ఆటగాండ్రు ఊరంతయు తిరిగి రాత్రికి నగరు ముందర నాటకము జరుగునని చెప్పుచు బిచ్చమెత్తసాగిరి. పోలేరమ్మ దేవాలయము దగ్గరనున్న వారు కొందరు చిట్టడవులపై బడి ఉడుములు, బావురుపిల్లులు, కుందేళ్ళు పట్టుకొని వచ్చిరి. సాయంత్రమునకు కల్లు ముంతలును వచ్చినవి. బిచ్చమెత్తి తెచ్చిన ధాన్యముతో అన్నము, వేటాడి తెచ్చిన జీవ ములతో కూరలు, పుష్టిగా తిని త్రాగిరి. వీరు ప్రొద్దుగ్రుంకక ముందే భుజింతురు. రాత్రి తొలిజాము ముగియనుండగా ఆట ప్రారంభింతురు. ఆట ప్రారంభించు వేళకు కల్లు మైకము దిగి యుండవలె. లేనిచో నాటకము రసాభాసమగును.

నగరు ముందర వీధికి అభిముఖముగా పూర్వము పులిరాజు కొలువు తీరుటకు కట్టించి యుండిన వేదికపైన మూడువైపుల తెరలు కట్టిరి. నగరు ముందున్న పెద్ద అరుగులపైన పెద్ద దొరగారి కుటుంబీకులును, బ్రాహ్మణ కుటుంబీకులును కూర్చుండిరి. సామాన్య జనులు నేలపైన, చాపలు, బొంతలు, గోనె సంచులు పరచుకొని కూర్చుండిరి.

నాటకము ప్రారంభమయ్యెను. ఎవరో సంపన్నులు దానము చేసిన విలువైన ఉడుపులతో అందరును ధగధగ మెరిసిపోవుచున్నారు. ఆడువారు మరింత అందముగా అలంకరించు కొన్నారు. నాటకములోని ఆకర్షణ అంతయు ఆడువారే. వారు బాగా పాడగలరు, అభినయించ గలరు. రాత్రులందురు ఆటలతో సంపాదన. పగటి పూట విటుల వలన సంపాదన. ఆటగాండ్ర జీవితములు వారి ఆడువారి వలననే గడచుచున్నవి. మగవారు ఊరిలోని విలాస పురుషులతో పరిచయములేర్పరచుకొని సరస సల్లాపములాడుచు "మావైపు దయచేయరాదో," అని పిలుచుచుందురు.

చంద్రమతి వేషధారిణి కంఠస్వరము బహు శ్రావ్యముగా నున్నది. అభినయము దివ్య ముగా నున్నది. లోహితాస్యుని శవమును ముందుంచుకొని ఆమె శోకమునభినయించుచు ఒక పద్యము పాడెను. ప్రేక్షకుల హృదయములు కరిగిపోయెను. కన్నులు తుడుచుకొనని వారులేరు. కొందరు ఆడువారు వెక్కిళ్ళు కూడ పెట్టిరి. రంగస్థలముపై చిల్లర నాణెములు రాలినవి.

మరునాడు యథాప్రకారము మగవారు ఊరిలో భిక్షమునకు బయలుదేరిరి. ఆటగాండ్ర నాయకుడు బ్రాహ్మణవీధికి వెళ్ళెను. వాడు ఇంచుక డొక్క శుద్ధి కలవాడు.

ఈ ఆటగాండ్రు అందరును, అన్ని నాటకములలోనూ అన్ని వేషములు వేయగలిగి యుందురు. కొందరు స్థూల కాయులు మాత్రము దుష్టపాత్రలకు, రాక్షస పాత్రలకూ పరిమితమై యుందురు. అందరికిని అన్ని నాటకములును కంఠస్థములే.

బ్రాహ్మణవీధిలో హరశర్మ ఇంటి అరుగు మీద అయిదారుగురు బ్రాహ్మణులు ఇష్టాగోష్ఠిలో నున్నారు. వారిలో ఒక బ్రాహ్మణుడు గుంటూరి నుండి చుట్టపు చూపుగా వచ్చినవాడు.

హరశర్మ ఆటగాండ్ర నాయకుని చూడగానే, "రాత్రి చంద్రమతి పాడినదే. అదేమీ? పూర్వము మీరు పాడుచుండిన పాటకాదే. ఈ కొత్తది ఎక్కడ నేర్చుకున్నారు?" అని అడిగెను

ఆ నాయకుని ముఖము ఇంత వెడల్పైనది. ఇది వారు క్రొత్తగా తమ నాటకములో ప్రవేశపెట్టినది. దానిని ఎవరైనను గుర్తించి అడుగుదురేమో అని ఎదురుచూచుచున్నాడు. ఇప్పుడు ఈ అయ్యవారు గుర్తించినారు. తన ప్రతిభను ప్రదర్శించు అవకాశము దొరికినది.

"స్వామీ, దీనిని నేను తెనాలిలో నేర్చుకొని మా యింటి దానికి నేర్పినాను. ఇది పాట కాదు. దీనిని సీస పద్యము అందురట. మొదట నాలుగు పొడవైన వాక్యములు పాడవలె. వాటి నడకయే వేరు. రాగముగా పాడిన యెడల అంత సొంపుగా నుండును. దానికి తోకవలె చిన్న వాక్యములు నాలుగు పాడవలె. వీటి నడక వేరు. మద్దెల వాడు కొంత సేపు ఒక దరువు వాయించి చివర ముక్తాయింపు వాయించినట్లుండును."

"దీనిని పద్యమనుచున్నావు. అందులో వాక్యములు అనరాదు. పాదములు అనవలె"

"అవునవును. ఆ మాటయే అన్నారు. నేను మరచితిని."

"ఎవరన్నారు?"

"తెనాలిలో ఈ పద్యమును వ్రాసియిచ్చిన అయ్యవారు. 'స్వామీ, మా నాటకమునకు ఒక మంచి నుడువు వ్రాసియివ్వరాదా,' అని ఒక అయ్యవారిని అడిగితిని. ఆయన ఒక అరగడియ ఆలోచించి ఈ సీస పద్యమును వ్రాసి యిచ్చి దీనిని పాడు విధానముకూడా చెప్పినాడు. ఆయన చెప్పిన విధానము కంటే మా ఆడది పాడు విధానము చాలా బాగున్నది. రాత్రి ఆట చూచిన వారందరూ ఏడ్చినారు."

"ఏదీ దానిని మరియొకసారి చదువు."

ఆటగాడు అందుకొనెను.

> "కరుణతో జూడరే కడుపార బిడ్డల గని పెంచి పోషించు కాంత లార.
> దయతోడ జూడరే దాన దయా ధర్మ పరతంత్ర పుణ్యులౌ పౌరులార
> ధర్మంబు సేయరే తల్లుల కడుపులు చల్లగా వర్ధిల్లు పిల్లలార
> జాలి దలంపరే సర్వశాస్త్ర రహస్య విజ్ఞాన ఖనులైన పెద్దలార
> కన్నబిడ్డను కోల్పోతి – కాటి సుంక
> మొసగి దహనంబు సేయగా నోపనైతి
> పెట్టనేర్చిన చేతులు – ఇవి పెట్టనేర్చిన చేతులు – పట్టిమిమ్ము
> వేడుకొనుచుంటి ఒక రూక వేయరారె."

నాయకుడు విషాద భరితమైన రాగముతో స్త్రీ వలెనే అభినయము చేయుచు పాడగా అక్కడున్న వారందరును పరవశించి పోయిరి.

అక్కడున్న బ్రాహ్మణులు వానికి చెరి ఒక చిన్నెము ఇచ్చి పంపివేసిరి.

"ఇప్పుడు తెలుగులో పద్యములు వ్రాయుచున్నారన్నమాట– వింతగానున్నదే– తెలుగునకు వ్యాకరణమున్నదా? ఛందస్సు ఉన్నదా? పద్యములు వ్రాయగల వారున్నారా? ఉన్నను ఆ పద్యములతో ఏమి వ్రాయుదురు? ఎవరు చదువుదురు? చదువవలసినవంతయు సంస్కృ

తములో ఉన్నవి కదా. ఇక తెలుగులో వీరు క్రొత్తగా ఏమి వ్రాయుదురు?" హరశర్మ కొంత ఈసడింపుగా మాట్లాడెను.

గుంటూరు చుట్టము అందుకొనెను.

"అట్లనవద్దు. తెలుగులోనూ కవిత్వము ఆరంభమగుచున్నది. తెలుగు కవులును పుట్టుకొని వచ్చుచున్నారు. వారు వ్రాయుటకును ఏవేవో ఇతివృత్తములు లభించుచున్నవి."

"అసలు తెలుగులో కవిత్వము వ్రాయవలెనను ఉద్దేశ్యము ఎట్లు పుట్టినది. ఎవరి వలన పుట్టినది? సలక్షణమైన సంస్కృత భాషలో సమస్తము లభించుచుండగా మధ్య ఈ తెలుగు గోల ఏమి?"

"ఏమీ? సంస్కృతము ఉన్నచో తెలుగు అవసరము లేదా? మనము సంస్కృతము మాట్లాడుట లేదే. తెలుగు మాట్లాడుచున్నామే. మాట్లాడుటకు తెలుగును, చదువుటకు మాత్రము సంస్కృతమా? "

"ఇది ఎవరు చెప్పిన మాట. నీవు చెప్పుచున్న మాటయా?"

"ఎవరు చెప్పిననేమి. ఇదిసత్యము. మన ముత్తాతలకాలమున సత్యాశ్రయ చాళుక్యుడు మన తెలుగునేలను జయించినప్పుడు ఒక పండిత పరిషత్తు ఏర్పాటు చేసినాడట. "మనము తెలుగువారమై యుండి తెలుగులో కవిత్వము చెప్ప లేకుండుట సిగ్గుచేటు కదా," అన్నాడట. అప్పుడు మొదలైనది ఈ తెలుగు కవిత్వపు ప్రయత్నము."

"ఏదీ మరి. ఎంత వరకు సాధించిరి. ఇంతవరకు తెలుగులో కవిత్వములు చెప్పి కావ్యములు వ్రాసినట్లు ఎవరును చెప్పుకొనలేదే."

"గోదావరి పుష్కరములను పురస్కరించుకొని దక్షారామములో ప్రతి పుష్కరమునకు పండిత పరిషత్తు జరుగుట ఎంతో కాలముగా జరుగుచున్నది. నేను రెండు పుష్కరములకు దక్షారామము వెళ్ళినాను. మొదటిసారి వెళ్ళినప్పుడు పండితులందరును తెలుగు పదముల సమాసములను గురించియు, సంధులను గురించియు చర్చించినారు. అక్కడ నేనును పాల్గొని కొన్ని ప్రతిపాదనలు చేసితిని."

"రెండు పదములను సమానము చేసినను సంధి చేసినను అది చెవికి ఇంపుగా ఉండవలె. ఇది మొదటి లక్షణము. ఇక ఆ సమాసము వలన గానీ, సంధి వలన గానీ అపార్థములు అన్యార్థములు, దుష్టార్థములు రాకూడదు. ఇది రెండవ లక్షణము. జనుల వ్యవహారములోనే సహజముగా కొన్ని సమాసములు కొన్ని సంధులు ఏర్పడియున్నవి. దానిని మనము వ్యవస్థీకరించుకోవలె," అంటిని. పండితులు ఉదాహరణములు చూపమనిరి.

"సున్నము అను పదమున్నది. దానిపైన తేలునట్టిది 'తేట' అను పదమున్నది. ఈ రెండు పదములను కలిపినప్పుడు పామరులు సైతము సున్నపు తేట అని చెప్పుచున్నారు. అట్లే బెల్లము అను పదమున్నది. నీరు అను పదమున్నది. సామాన్యులు సైతము ఆ రెండు పదములను కలిపి బెల్లపు నీరు అనుచున్నారు. అనగా రెండు పదములను కలుపుటకు 'పు' అను అక్షరమును వాడుచున్నారు. ఇదే పద్ధతిలో ఒక సంస్కృత పదమును ఒక తెలుగు

పదమును కలుప వచ్చును. దక్షిణము, గాలి అను పదములను కలుపుటకు ఇంతకుముందు మనము వాడిన పువర్ణమును వాడి దక్షిణపు గాలి అనవచ్చును. ఇటువంటివే మన జాన పదులలో అనేకములున్నవి. మనము క్రొత్తగా చేయవలసిన దేమియు లేదు. జానపదుల వ్యవహారములను పరిశీలించి అందుండి గ్రహింపవచ్చును." అని చెప్పితిని. చాల మంది ఒప్పుకొనిరి.

"మరి పద్యములో? నేనడుగుచున్నది పద్యములను గురించియే."

"మనవారు అదియు సాధించినారు. నేను రెండవసారి పుష్కరములకు వెళ్ళినపుడు విచిత్రముగా కొందరు తెలుగులో పద్యశతకములను వ్రాసికొని వచ్చినారు. గోదావరి ఎగువ ప్రాంతము నుండి ఒక కవి సరస్వతీ శతకము తెచ్చినాడు. అక్కడ ప్రసిద్ధమైన సరస్వతీ క్షేత్రమున్నదట. ఒక కవి ఒక కావ్యమునే వ్రాసి తెచ్చినాడు. దాని పేరు కార్తికేయ జననము. అన్నియు నూరు, నూట యేబది పద్యముల గ్రంథములే. అన్నియు క్రొత్తగా రూపొందింపబడిన తెలుగు పద్యములే. సీస పద్యములు, తేటగీతులు, ఆటవెలదులు, అక్కరలు. ఒక కవి దక్షారామ భీమేశ్వరస్తుతి అని తరువోజ అను ఛందముతో ఇరువది ఏడు పద్యములు వ్రాసి తెచ్చి చదివినాడు. దానిని నూరు పద్యములుగా చేసి శతకము చేయరాదా అని కొందరు అడిగిరి. దానికతడు 'ఇప్పటికే కష్టమైపోయినది. ఇది చాలా బరువైన ఛందము. ప్రయత్నించితిని కాని వృధాశ్రమ అని వదలివేసితిని. దీనికిని ద్విపదకును భేదము లేదు. తరువోజ వ్రాయుటకంటె ద్విపద వ్రాసికొనుటయే సులభము," అనెను. "కష్టమని వదలివేయవచ్చునా?" అని కొందరనిరి. కొందరు "ఈ తెలుగు ఛందములను సృష్టించు శ్రమ ఏల? సంస్కృతములో మనకు బాగుగా అలవాటైన ఛందములనే గ్రహించి వాటిని యతిప్రాసలు పెట్టి తెలుగు భాషలో పద్యములుగా వ్రాసికొన్న తప్పేమి?" అనిరి. కొంతమంది "అదియు నిజమే. తప్పేమి" అనిరి.

హరశర్మ నిట్టూర్చుచు "అయినచో ఇక మీదట తెలుగులో ఉద్గ్రంథములు వెలువడునన్న మాట. ఇక తెలుగుసీమలో బ్రాహ్మణులు ఇటు సంస్కృత కావ్యములను, అటు క్రొత్తగా వచ్చు తెలుగు గ్రంథములను చదువ వలెనన్నమాట. చచ్చినట్లే." అన్నాడు.

"అంతగా భయపడ వలసిన పనిలేదు. ప్రస్తుతము భరతఖండము నందు అన్ని దేశీయ భాషల వారును తమ తమ భాషలలో కవిత్వములు వ్రాసి సాహిత్యమును సృష్టించుకొన వలెనను ప్రయత్నములో ఉన్నారు. తమిళులు ఎప్పుడో ప్రారంభించినారు. కన్నడిగులు ఆ ప్రయత్నములో ఉన్నారు. ఇక సంస్కృతములో క్రొత్త సాహిత్యము పుట్టుట అరుదే. ఇక అందరును పాండిత్యమును జ్ఞానమును సంపాదించుకొనుటకు సంస్కృతమును పఠింతురు. పాండిత్యమును జ్ఞానమును వెలిబుచ్చుటకు దేశీయ భాషలో వ్రాయుదురు."

గుంటూరు చుట్టము మాటలు విని హరశర్మ "ఏమో. ఏమి కానున్నదో – భరతఖండ మంతయు సంస్కృత భాషా ప్రాబల్యములో నుండుట వలన మన భరతఖండమున ఏ ప్రాంతము వాడు ఏ ప్రాంతమునకు పోయినను కష్టములేకుండా ఉన్నది. ఈ దేశీయ

భాషలు విజృంభించిన యెడల భరతఖండము ఛిన్నాభిన్నమై పోవునేమో” అనెను.

“అట్లని మన దేశీయ భాషలు ఇన్ని భాషలును ఇట్లే – జనుల వ్యవహారము నందే ఉండిపోవలెనా ఏమి? సంస్కృతముతో సమానమైన సాహిత్యమును సృష్టించుకొనుటకు మనకు ఏమి తక్కువైనది?” గుంటూరు చుట్టము ఉద్రేకముతో అనెను.

“సరిసరి. జరుగవలసినది జరుగక మానదు. లెండు లెండు. భోజనమునకు పిలుపు వచ్చినది.” అందరును లేచి లోనికి వెళ్ళిరి.

ప్రతిదినము పొన్నిబోయడు హరశర్మ యొద్ద కాళిదాసు రఘువంశమును చదువుచుండుట గుంటూరు బ్రాహ్మణుడు గమనించెను. ఈ యువకునికి పదునారు, పదునేడు ఏండ్ల వయస్సుండవచ్చును. కుశాగ్ర బుద్ధిగానున్నాడు. ఎందుకో చదువున వెనుకబడిపోయినాడు. పెద్ద పట్టణములలోని యువకులు ఈ ప్రాయమునకు ఎంతయో చదివి యుందురు. బహుశ ఈ బోయకొట్టములలో వీనికి చదువు చెప్పు వారెవరు? కావ్యములు హరశర్మ చెప్పి యుండ కూడదా.

ఆ మాటయే గుంటూరు బ్రాహ్మణుడు హరశర్మను అడిగినాడు.

“వీడు బ్రాహ్మణబాలుడు కాడు చదువే బ్రతుకు అనుకొనుటకు. వీడు ఈ పంద్రెండు బోయకొట్టములకు యువరాజు. బోయదొరలు ఆయుధ విద్యలలో ఆరితేరి యుండవలె. అది వారి జీవితము. చదువులు వారికి రెండవ ప్రాధాన్యము గల విషయము. అందువలన అతడు వెనుకబడియున్నాడు,” అన్నాడు హరశర్మ.

“వీడు కుశాగ్రబుద్ధిగా నున్నాడు. కొన్ని దినములుగా గమనించుచున్నాను కదా. వీనిని కొంతకాలము ఆయుధ విద్యలకు దూరము చేసి కేవలము విద్యల మీదనే నిలిపిన యెడల తొందరగా ఉత్తమ విద్యావంతుడు కాగలడు.” అన్నాడు గుంటూరు బ్రాహ్మణుడు.

“నిజమే, కాని వాడు ఇక్కడున్నంత వరకు ఆయుధ విద్యా పరిశ్రమ వానికి తప్పదు.”

“అయ్యయ్యో. మంచి మేధావిని విద్యకు దూరము చేయుచున్నారు. పోనీ ఒక పని చేయుదము. నేను వీనిని గుంటూరుకు పిలుచుకొని పోయెదను. రెండు సంవత్సరములు చాలును. మహా పండితుడు కాకపోయినను మంచి విద్యావంతుడనిపించుకొనగలడు”

“ఏమో వానికి ఆసక్తి కలదో లేదో?”

“ఈ దినము అడిగి తెలుసుకో.”

ఆ రాత్రి అందరు పురాణ పఠనము వద్ద ఉండగా పొన్నిబోయడు హరశర్మ ఇంటికి వచ్చెను.

“నీవు ఇక్కడ ఉండి చదవిన యెడల నీ చదువు అంతంత మాత్రమే ఉండును. మా బంధువు వెంట గుంటూరు వెళ్ళినట్లయితే అక్కడ మంచి విద్యావంతుడవు కాగలవు. ఏమందువు?”

“మా అన్నను అడగవలె.”

"పోయి అడుగుము."

"నేనడుగలేను. మీరే అడిగి నన్ను గుంటూరు పంపునట్లు ఒప్పించుడు."

నన్నిబోయడు చదువు చాలించి చాలకాలమైనది. వాని తాత వానిని త్వరగా వ్యవహార ములలో దించెను.

మరునాడు హరశర్మ నన్నిబోయని కడుకు ఒక శిష్యుని పంపెను.

"మీకు వీలున్నప్పుడు మీరు గురువు గారిని కలుసుకోవలెనట."

అది త్వరగా రమ్మని మర్యాదాపూర్వకమైన ఆజ్ఞ.

నన్నిబోయడు వెంటనే బయలుదేరి హరశర్మ ఇంటికి వెళ్ళెను.

"నీ తమ్ముని రెండు సంవత్సరములు గుంటూరులో పండితుల వద్ద పెట్టి చదవించ దలిచినాను. ఏమందువు?"

ఏమనుటకును నన్నిబోయనికి వెంటనే తోచలేదు. మౌనముగా నిలబడెను.

"వాడు తెలివైన వాడు. ఏకసంథాగ్రాహి. ఇక్కడ వానికి పెద్ద చదువులు చెప్పవారు లేరు. గుంటూరుకు పంపిన యెడల మంచి విద్యావంతుడై తిరిగి వచ్చును. ఇక్కడ వానితో జరుగవలసిన కార్యము లేవైనా ఉన్నవా?"

"వాడేమనుచున్నాడు?"

"వాడేమనును? పంపినిచో పోవును. ఎద్దునడిగి గంతకట్టుదురా ఏమి? వాడు చదువ వలె. అంతే."

నన్నిబోయడు రెండు నిమిషములాలోచించెను. వీరు వానిని అడిగియే యుందురు. వాడు సమ్మతించి యుండును. లేదా వాడే వీరిని అడిగి తనకు చెప్పమని కోరియుండును. ప్రస్తుతము వానికిక్కడ ఏమియు పనిలేదు. బోయదొరలు కేవలము యుద్ధ నిపుణులు, యుద్ధ ప్రియులు అనుమాటను తొలగించవలె. బోయలు కూడా విద్యావంతులే అను పేరు తెచ్చుకోవలె. అందుకు ఇదియే మంచి అవకాశము. వీడు చదివి వచ్చిన యెడల వీడే మరి కొందరిని విద్యావంతులను చేయగలడు.

"వానికిష్టమైనచో ప్రయాణమునకు సిద్ధము కమ్మని చెప్పుడు."

"మీ తాతగారు?"

"వారికి నేను చెప్పెదను."

గుంటూరు బ్రాహ్మణునికి సంతోషమాయెను.

పొన్నిబోయడు గుంటూరు బ్రాహ్మణుని వెంట వెళ్ళెను. గుంటూరులో ఒక సంవత్సరము కావ్యములు, అలంకార శాస్త్రములు, కౌటిల్యుని అర్థ శాస్త్రము, మొదలైనవి చదివెను. అతని కుశాగ్ర బుద్ధికిని, శ్రద్ధకును అక్కడి పండితులు ముగ్ధులై అతనికి ప్రత్యేక శ్రద్ధతో సమస్తము బోధించిరి. అక్కడి నుండి ధాన్యకటకమునకు పోయి అక్కడ ఒక సంవత్సరముండెను. రామాయణ, భారతములు చదివెను. హాలుని శాలివాహన గాధాసప్తశతిని పట్టు పట్టి చదివెను. తెలుగులో కొన్ని శతకములు, ఇతర గ్రంథములు అప్పుడప్పుడే రచింపబడుచుండినవి.

వానిని కూడ సేకరించి చదివెను. అవి వానికి అంతగా నచ్చలేదు. తెలుగు ఛందస్సు నేర్చు కొనెను. పద్యములు వ్రాయుట అభ్యసించెను. కొంతవరకు విద్వాంసుడే అను పేరు తెచ్చు కొనెను. అక్కడ తాను చదివిన కొన్ని గ్రంథములను వ్రాయసగాండ్ర చేత ప్రతులు వ్రాయించు కొనెను.

అంతలో నన్నిబోయనికి వివాహము తలపెట్టినారని వార్తాహరుడు వచ్చి చెప్పెను. ఆ వార్తతో పొన్నిదొర చదువులకు స్వస్తి చెప్పి కొన్ని గ్రంథములను సేకరించుకొని కట్టెపు దుర్గమునకు వచ్చి చేరెను.

కొండబోయని కొట్టపు పెద్దదొర సూరన బోయడు కసవన బోయనికి తల్లివైపున బంధువు. అతని మనుమరాలు పెమ్మసానితో నన్నిబోయనికి పెండ్లి చేయవలెనని కసవనయు, ఇతర బంధువులును తీర్మానించిరి.

పెండ్లి వైభవముగా జరిగిపోయెను. కసవనబోయనికి తలపైనున్న బరువుదించు కొన్నట్లయ్యెను. నన్నిబోయడు అన్ని విధముల సమర్థుడని పేరుగాంచినాడు. ఏ సమస్యనైనను కూలంకషముగా ఆలోచించి స్థిరమైన నిర్ణయములు తీసుకొనువాడని ప్రశంసలందినాడు. సమస్త వ్యవహారములు చూచుకొనుచున్నాడు. వయస్సులో చిన్నవాడైనను బోయకొట్టముల పెద్దదొరలందరును అతనిని గౌరవించుచున్నారు. అతని మాట వినుచున్నారు. నన్నిదొరయు తాను బోయకొట్టముల నాయకుడనను దర్పమును ప్రదర్శింపక అందరితో మర్యాదగా మెలగుచు, మిక్కిలి నైపుణ్యముతో తన మాటను అందరును శిరసావహించునట్లు చేసికొను చున్నాడు.

విద్యావంతుడు, వివేకి, యుద్ధ విద్యలలో నిపుణుడు అయిన పొన్నిదొర శ్రీరామునికి లక్ష్మణుని వలె, ధర్మరాజునకు అర్జునునివలె కుడిభుజముగా నిలిచి యున్నాడు. ఇక బోయకొట్టములకు వచ్చిన భయమేమియు లేదు. కసవనబోయడు నిశ్చింతగా కాలము గడుపసాగినాడు.

"బేతకొట్టమున ఘోరము జరిగిపోవుచున్నది. కసవనదొరా. నీవు త్వరగా రావలె." అని నీలకంఠశర్మ నగరుముందు ఒక కేకవేసి గుఱ్ఱమును బేతకొట్టము వైపు అదే వేగముతో పరుగుతీయించుచు వెడలిపోయెను.

సరిగా అప్పుడే గడియారపు మండపమున పగటి తొలి జాము గంట గట్టిగా వినబడెను.

నగరు ముందు పదిమంది బోయదొరలతో మాట్లాడుచుండిన కసవనబోయడు తటాలున లేచి లోపలికి పోయి తలపాగా చుట్టుకొని, చేతికత్తిను తీసుకొని గుఱ్ఱముపైనెక్కి బేతకొట్టము వైపు పరుగుతీసెను. బోయదొరలు పది మందియు గుఱ్ఱములపై అతనిని అనుసరించిరి.

వీరు బేతకొట్టము చేరునప్పటికి అక్కడ ఒక బ్రాహ్మణుని ఇంటి ముంగిట అంతయు గోలగోలగానున్నది. ఇంటిలోనూ, ఇంటిముంగిటను ఏడుపులు పెడబొబ్బలుగా నున్నది.

ఒక శవమును ఇంటి గడప ముందర చాపపై పరుండబెట్టినారు. చనిపోయిన వాని తమ్ముడును మరికొందరు బ్రాహ్మణులును నీలకంఠశర్మతో గట్టిగట్టిగా వాదించుచున్నారు.

చనిపోయిన వాని తమ్ముడు ఆవేశముతో అరచుచున్నాడు. ఆ కుటుంబము వారు కొండపి నుండి క్రొత్తగా వచ్చి బేతకొట్టమున నివాసమేర్పరచుకొన్నవారు.

"ఇది మా ఇంటి ఆచారము. మా అమ్మ సహగమనము చేసినది. మా నాయనమ్మయు సహగమనము చేసినది. మాది పతివ్రతల వంశము. ఈనాడు మా వంశమునకు అపఖ్యాతి తెమ్మందువా?"

"ఒరే అప్పనభట్టూ, మీ అమ్మ ఎట్లు చచ్చినదో కండ్లార చూచినవాడను నేనున్నాను. ఆనాడు నేను అక్కడ మా మేనత్తగారి ఇంటికి వచ్చి యుండి ఆ ఘోరమంతయు చూచినాను. మీ అమ్మ పారిపోవుచుండగా నలుగురు వెళ్ళి పట్టుకొని వచ్చిరి. గంజాయి, భంగు, నల్లమందు మ్రింగించిరి. ఒళ్ళు తెలియని మత్తులో చితిమీద పరుండ బెట్టిరి. మంటలకు ఓర్చుకోలేక ఆమె లేచి రాబోగా వెదురుగడలతో అదిమిపట్టిరి. ఆమె కేకలు, ఆర్తనాదములు వినబడకుండ తప్పెటలు, కొమ్ముబూరలు మ్రోగించిరి. తొందరగా కాలవలెనని నెయ్యి, నూనె ఆమెపైన కుమ్మరించిరి. ఆ ఘోరమును చూచి నాకు వారము దినములు జ్వరము వచ్చినది. వద్దురా, ఈ ఘోరము వద్దురా, పండువంటి ముత్తైదువను ఘోష పెట్టకురా" నీలకంఠ శర్మ గద్గద స్వరముతో వేడుకొనుచున్నాడు.

"నీకేమైనా బుద్ధున్నదా. అసలు నీవు బ్రాహ్మణుడవేనా, మొగుడు చచ్చిన తరువాత ఇంకా పండువంటి ముత్తైదువేమిటి? ఈమెను విధవగా మా యింటిలో ఉంచుకొన్నచో నా పరువేమి కావలె. మా వంశ ప్రతిష్ఠ ఏమి కావలె. మా సరి దాయాదులలో నేను తలెత్తుకో గలనా? పో, పో," అప్పనభట్టు నీలకంఠ శర్మను త్రోసివేయుచు "మీరు కానివ్వండి," అని శవము చుట్టును ఉన్న వారిని హెచ్చరించుచున్నాడు. కొందరు శవయాత్రకు కావలసిన ఏర్పాట్లు చేయుచున్నారు. చనిపోయిన వాని భార్యను నడిపించుకొని వచ్చి శవము తలవైపున కూర్చుండబెట్టుచున్నారు.

ఆ సమయమునకే కసవనయు, బోయదొరలును వచ్చిరి. అప్పనభట్టు ఆర్భాటమును చూచిరి.

"ఏమి? ఏమి? ఏమి జరుగుచున్నది? ఏమి యీ గొడవ?" అనుచు కసవనబోయడు వారి వద్దనే గుఱ్ఱము దిగెను.

"చూడండి బోయదొరా. మా అన్న చనిపోయినాడు. మా వదినె సహగమనము చేయుచున్నది. మధ్య ఇతనికేమి? బ్రాహ్మణ పుట్టుక పుట్టి పవిత్రమైన సహగమనమునకు అడ్డు చెప్పవచ్చునా," అన్నాడు అప్పనభట్టు.

"ఆమె సహగమనము చేయుచున్నదా? లేక మీరే ఆమెను కాల్చివేయుచున్నారా" కసవనబోయడు శాంతముగా అడిగెను.

"సహగమనమనగానేమి? భర్తతో బాటు చితిలో భస్మమైపోవుటయే కదా."

"ఎక్కడో ఎవరికో పుట్టి, ఎక్కడో ఎవరి వద్దనో పెరిగి మీ ఇంటికి కోడలుగా వచ్చిన స్త్రీ నడిమంత్రముగా వచ్చిన మగడు చావగానే తానును చావవలెనా? మరి ఒకే తల్లిదండ్రులకు పుట్టి ఒకటిగా పెరిగిన తోడబుట్టిన వారు సహగమనము చేయరాదా?"

"అదేమి మాట? భార్యలు సహగమనము చేయవలెనని శాస్త్రములో ఉన్నది కానీ తోడబుట్టిన వారు సహగమనము చేయవలెనని ఏ శాస్త్రమునందును లేదు. అయినను ఇది బ్రాహ్మణుల వ్యవహారము. ఇందులో మీరు ప్రమేయము కలిగించుకోరాదు. అసలు మీరిక్కడికి రారాదు. ఇక్కడ ఉండరాదు. మైల ఏర్పడును."

కసవన బోయడు ఇక ఓర్వలేకపోయెను.

"అయ్యా, ఈ బ్రాహ్మణ శరీరము శూద్రులు పెట్టిన తిండితో బలిసినది. మీకు దానము లిచ్చుటకు శూద్రులు కావలెను, మాన్యములిచ్చుటకు శూద్రులు కావలెను. సంభావనలిచ్చుటకు శూద్రులు కావలెను. మీ వ్యవహారములు విచారించుటకు శూద్రులు పనికిరారా? భార్యలు మాత్రమే సహగమనము చేయవలెనని మీ బాపన శాస్త్రములు చెప్పుచున్నవా? అట్లయిన తోడబుట్టిన వారు సహగమనము చేయవలెనని మా శూద్ర శాస్త్రములు చెప్పుచున్నవి." అని కసవనబోయడు అప్పనభట్టు చేయి ఒడిసి పట్టుకొని ఇంటి ముంగిట కాలుచున్న కట్టెలపై అదిమి పట్టెను. అప్పనభట్టు గొంతు పగులునట్లు కేకలు వేయుచు గిలగిల తన్నుకొనసాగెను. చూచుచున్నవారు 'అయ్యో అయ్యో' అని కేకలు వేయుచు అటువైపు రాజూచిరి. బోయదొరలు కత్తులు జళిపించిరి. బ్రాహ్మణులు వెనుకకు తగ్గిరి. కసవనబోయడు అప్పన చేతిని ఒక నిండు నిమిషము అట్లే అదిమి పట్టెను. వాని చర్మము కాలి క్రొవ్వు అంటుకొనెను. ఇక బ్రాహ్మణుడు అరచి అరచి చనిపోవునేమో అని కసనవ వానిని వదలి వేసెను. "చూచితివా. మీ వదినె గారి బాధయు ఇట్లే యుండును. తెలిసినదా. ఇదిగో బ్రాహ్మలూ, ఒక మాట చెప్పుచున్నాను. ఈ పంౘ్రెండు బోయకొట్టములలో ఎక్కడగానీ, ఎవరి మనస్సులో గానీ సహగమనమను ఆలోచనయే రాకూడదు. అట్లు ఎవరైనా ఆలోచించిరా, ఆలోచించిన వానిని, దానికి అడ్డు చెప్పక ఊరుకున్న వారిని, ఆ సహగమనమును చూచుచుండిన వారిని చెట్టుకు కట్టవేసి ముండ్లకంపలు కుప్పవోసి తగులబెట్టెదను. నాకు కనికరము లేదు. దానికి వీని చేయియే సాక్షి. ఈ విషయమున నాకు జంకు గొంకు ఏమియు లేదు. ఇందుకు మీరందరును సాక్షులు. బ్రాహ్మణులకొక ధర్మము ఇతరులకొక ధర్మము లేదు. అందరికీ ఒకే ధర్మము.

"మీరు ఏ మహారాజుకైనను మొఱపెట్టుకొనుడు. నాకు లెక్కలేదు. నా బొందిలో ప్రాణమున్నంత వరకు నా నేలపైన ఇటువంటి క్రూరకర్మ జరుగనివ్వను."

బ్రాహ్మణులందరును నిశ్చేష్టులై నిలబడిపోయిరి. కసవన బోయడు తన వెంట వచ్చిన బోయదొరలను శవ దహనము జరుగు వరకు అక్కడనే ఉండవలసినదిగా ఆజ్ఞాపించి నీలకంఠ శర్మతో బాటు వెనుదిరిగెను.

బ్రాహ్మణులు కొందరు అప్పనభట్టు చేతికి చికిత్సలు చేయుచుండగా కొందరు శవమును

మాత్రము దహనక్రియలకు ఎత్తుకొని పోయిరి. స్త్రీలందరును మనస్సులలోనే కసవనబోయనికి వేనవేల నమస్కారములు పెట్టిరి. అప్పనభట్టు మాత్రము మంటతో నొప్పితో కేకలు పెట్టుచుండెను.

"ఏ వర్ణమునందును లేని ఈ క్రూరమైన ఆచారము మీ బ్రాహ్మణులకే ఎట్లు అంటుకొన్నది," దారిలో కసవనబోయడు నీలకంఠశర్మ నడిగెను.

"ఖర్మ, మా ఖర్మ. ఎప్పుడో ఎక్కడో అత్యంత అనురాగపూరితులైన దంపతులలో భర్త మరణింపగా భార్య ఆ దుఃఖమును భరింపలేక నిర్జీవ ప్రాయయై పడియుండును, ఆమెను భర్తతో పాటు దహనము చేసియుందురు. ఆమె మహా పతివ్రత అని కొందరు కీర్తించి యుందురు. అంతే. తమ తమ ఇండ్లలోని ఆడువారందరును పతివ్రతలే అని చాటుకొనుటకు ఈ ఆచారమును ప్రవేశపెట్టినారు. చివరకు అది పరువు ప్రతిష్ఠల విషయమైపోయినది."

"అదేమి పరువు, అదేమి ప్రతిష్ఠ? కన్నతల్లిని బ్రతికి యుండగానే కాల్చివేయుట ప్రతిష్ఠయా? రాజుల భార్యలు అగ్నిలో పడి చచ్చుచున్నారు. ఏల? శత్రురాజుల వలన అవమానముపాలు కాకుండుటకు. వారైననూ ఈ విధముగా చావరే. అంతెత్తు పెద్ద మంట వేసి ఆ ప్రక్కన గోడలపై నుండి దూకుదురు. దూకుచుండగానే ఆ వేడి సెగ గుండెలకెగదట్టి క్షణములో ప్రాణములు పోవును. ఇది అట్లు కాదే. చితిపై పరుండబెట్టి నిప్పు పెట్టుచున్నారు. కట్టెలును, పిడకలును నూనెయు, నేయియు అంటుకొనుట ఎప్పుడు? మండుట ఎప్పుడు? శరీరము కాలుట ఎప్పుడు? ప్రాణము పోవుట యెప్పుడు? ఎంత యాతన, ఎంత హింస, దీనిని మాన్పించు ఉపాయమే లేదా?"

"ఈ పనికి పాలకులు పూనుకోవలె. బ్రాహ్మణుల వ్యవహారములలో జోక్యము చేసికొనుటకు పాలకులు జంకుచున్నారు. జన సామాన్యమునకు అన్వయించు న్యాయము బ్రాహ్మణులకు కూడ అన్వయింపవలె. ఇది బ్రాహ్మణుల వ్యవహారమని మీరు ఈనాడు ఊరకుండిన యెడల ఒక అభాగ్యురాలు దారుణమైన చావు చచ్చియుండెడిది. దానిని తప్పించి మీరు పుణ్యము కట్టుకొన్నారు."

బోయకొట్టములలో జరిగిన ఈ ఉదంతము అటు వినుకొండనుండి ఇటు నెల్లూరు వరకు తెలిసిపోయెను. బ్రాహ్మణులలో కలకలము బయలుదేరెను. కొందరు కసవనబోయని సమర్థించిరి. కొందరు తీవ్రముగా వ్యతిరేకించిరి. ఆయా నగరాధ్యక్షుల యొద్దను, రాజోద్యోగుల వద్దను చేరి ఈ విషయమై తీవ్రముగా చర్చించిరి. బ్రాహ్మణుల వ్యవహారములలో పరిపాలకులు జోక్యము చేసికొనరాదని హెచ్చరించిరి. పాలకవర్గము వారు లోలోపల కసవనబోయని సాహసమును మెచ్చుకొన్నను, బహిరంగముగా బ్రాహ్మణులను వ్యతిరేకించలేకున్నారు. బ్రాహ్మణులు తమ చుట్టును వర్ణాధిక్యమను దుర్భేద్యమైన కోటను నిర్మించుకొనిరి. దానిని చెనకు సాహసము ఎవరికిని లేకపోయెను.

# 7

# నన్ని - పొన్ని

కసవనబోయడు మరణించెను. కొన్ని దినములకే అతని భార్యయు గతించెను. నన్నిబోయడు మొదట కొంత అధైర్యపడినను తొందరగానే కోలుకొనెను. కసవనబోయడు కొన్ని సంవత్సరములుగా బోయకొట్టముల పరిపాలన నన్నిబోయనికే పూర్తిగా అప్పగించి యుండినందువలన నన్నిబోయనికి కసవన మరణము వలన పెద్దగా ఇబ్బంది కలుగలేదు. ఇదివరకే తాను పరిపాలనా వ్యవహారములలో స్వయముగా నిర్ణయములు తీసుకొనుచున్నాడు. ఒకరి సూచనలు, మార్గదర్శకత్వము అవసరము లేదు.

ఒకనాడు పొన్నిదొర అన్న దగ్గరికి వచ్చి నిలబడెను.

"ఏమి?"

"మనకును నాలుగైదు ఏనుగులుండవలె. ఏనుగుల వలన మనము ఎంత పనియైనను చేయవచ్చును. గుంటూరులో చూచినాను. ఏబది మంది యుద్ధ వీరులు చేయగల యుద్ధము ఒక ఏనుగు చేయగలదు. ఏనుగులను చూడగానే గుఱ్ఱములు పారిపోవును. ఏనుగులకు సరియైన శిక్షణ యిచ్చిన యెడల శత్రువుల కాల్బలమును గానీ, ఆశ్వికులను గాని చిందర వందర చేయవచ్చును."

నన్నిబోయడు చాలా సేపు ఆలోచించెను. ఈ సూచన బాగుగానే ఉన్నది.

"అవి మనకెట్లు దొరకును. ఎవరును అమ్మరు కదా?"

"పట్టుకొని రావలె."

"ఎక్కడి నుండి."

"చంద్రగిరి దుర్గమునకు సమీపముగా మహా పర్వత శ్రేణి యున్నదట. కొన్ని ఆమడల విస్తీర్ణమున కొన్ని నూర్ల యోజనముల పర్యంతమున వ్యాపించినదట. శ్రీశైలము వరకు ఎడతెగని పర్వతశ్రేణి. ఘోరారణ్యములు. అక్కడే చంద్రగిరి దగ్గరగా ఏడు కొండల కవతల ఒక దివ్యక్షేత్రము, కొన్ని దివ్య తీర్థములు ఉన్నవట. పల్లవరాజులు, రాణులు తఱచు ఆ క్షేత్రమును దర్శించుచుందురట. ఆ క్షేత్రమునకు తిరువేంగడమని పేరు. ఆ అరణ్యములో ఏనుగులు మందలు మందలుగా నున్నవట. పల్లవరాజులు అక్కడనే తమ సైన్యమునకు కావలసిన ఏనుగులను పట్టుకొని పోవుదురట. మనమును వారి నడిగి నాలుగైదు ఏనుగులను పట్టుకొని వచ్చుట మంచిది. నాలుగైదు చాలును. ఎక్కువైనచో భరించలేము."

"ఈ పని చేసికొని వచ్చు వారెవరు? మనవారిలో ఎవరు ఇంత పనిని చేసికొని రాగలరు?"

“ఇతరుల వలన కాదు. నేనే పోయెదను. శంకరశర్మను, తిమ్మనశ్రేష్ఠిని, పశువైద్యుడు రామోజును మరికొందరిని తోడు పెట్టుకొని పోయి వచ్చెదను.”

“ఎంత కాలము పట్టునో?”

“ఏనుగులను పట్టుటకును, వానిని మచ్చిక చేసికొనుటకును నాలుగైదు నెలలు పట్ట వచ్చును. రాను పోను ప్రయాణమునకు రెండు నెలలు పట్టవచ్చును.”

“సరే శ్రీకాళహస్తి దేవాలయ ధర్మాధికారికిని, చంద్రగిరి దుర్గాధ్యక్షునికిని ఉత్తరములు వ్రాసి ఇత్తును, ప్రయాణమునకు ఏర్పాటు చేసికొనుము.”

నాలుగు దినముల తరువాత దినశుద్ధియు, శుభముహూర్తమును చూచుకొని వేద పండితుడు శంకరశర్మను, వర్తక శ్రేణికి చెందిన తిమ్మన శ్రేష్ఠిని, పశువైద్యుడు రామోజును ఇరువది మంది మేటి ఆశ్విక వీరభటులను వెంటబెట్టుకొని పొన్నిదొర శ్రీకాళహస్తి దిశగా ప్రయాణమయ్యెను.

శంకరశర్మయు, తిమ్మనశ్రేష్ఠియు బండ్లలో పోవుచుండిరి. పొన్ని దొరయు తక్కిన వారును గుఱ్ఱములపై పోవుచుండిరి.

పంద్రెండు బోయకొట్టములను గురించియు బోయదొరల ప్రశస్తిని గురించియు నెల్లూరి వరకూ అందరికిని ఎరుకయే. తిమ్మన శ్రేష్ఠికి నెల్లూరు వరకు వర్తక సంబంధములు కలవు. కావున వీరికి నెల్లూరు వరకు దారి పొడవున విశేష ఆదరము, ఆతిథ్యము లభించినది. నెల్లూరు తరువాత వీరిని గురించి తెలిసిన వారు తక్కువ. కావున వీరు విడిది చేసిన చోట్ల ఆహారమునకు, ఇతర వస్తువులకు ధనము వ్యయమగుచుండెను. సత్రములలో పూటకూళ్ళ ఇండ్లలో విడిది చేయుచుపోయిరి. వ్యయమునకు వెఱచుటలేదు. చైత్రమాసము సమశీతోష్ణ ప్రకృతిలో ప్రయాణము సుఖముగా సాగినది. వేగముగానూ సాగినది.

కొన్ని దినముల ప్రయాణము తరువాత శ్రీకాళహస్తి చేరుకొని ఒక సత్రమున విడిసిరి. మరునాడు ఉదయముననే అందరును సువర్ణముఖిలో స్నానములు చేసి దేవాలయములో వాయులింగేశ్వరుని, జ్ఞానప్రసూనాంబికను దర్శించుకొని ధర్మాధికారిని చూడబోయిరి.

దేవాలయ ప్రాకారము బయటనే ధర్మాధికారి యొక్క ఎత్తైన భవనమున్నది. ధర్మాధికారి విశాలమైన ఇంటి అరుగుపైన తెల్లని పరుపులపై కూర్చుండి వ్రాయసగాండ్రకు ఏదియో చెప్పుచుండెను. వ్రాయసగాండ్రు తాళపత్రములపై వ్రాయుచుండిరి.

బోయభటులను అల్లంత దూరముననే నిలిపి పొన్నిదొరయు, శంకరశర్మయు, తిమ్మన శ్రేష్ఠియు, రామోజును, అరుగును సమీపించిరి.

శంకరశర్మ ధర్మాధికారిని వేదమంత్రములతో ఆశీర్వదించెను.

అది వినగానే ధర్మాధికారి గభీలున లేచి బ్రాహ్మణునికి నమస్కరించి, నలువురిని అరుగుమీదికి ఆహ్వానించెను. తన ఎదురుగా మరియొక పరుపుపై కూర్చుండబెట్టెను.

పొన్నిదొర తన రొండిలో చెక్కుకొని యున్న కమ్మను ధర్మాధికారికి రెండు చేతులతో అందిచ్చెను. ధర్మాధికారియు రెండు చేతులతో దానిని తీసికొని విప్పి చదువుకొనెను.

అది పండ్రెండు బోయకొట్టముల ఏలిక, కట్టెపు దుర్గాధిపతి నన్నిదొర వ్రాసిన లేఖ. వచ్చిన వాడు బోయకొట్టముల యువరాజు పొన్నిదొర.

ఆ లేఖను చదువగానే ధర్మాధికారికి వీరిపైన ఒక ప్రత్యేక గౌరవమును, ఆదరమును కలిగినవి.

బోయదొర పులిరాజు. పృథ్వీవ్యాఘ్ర రాజు – పల్లవులను కాదని చాళుక్యులవైపు చేరుటయు, ఉదయచంద్ర సేనాని పెద్ద సైన్యముతో దండెత్తిపోయి వానిని తరిమివేసి వాని జ్ఞాతిని బోయకొట్టములకు ప్రభువుగా నియమించుటయు, ఉదయచంద్రుడు అణ్డెక్కి వినుకొండలపై ఎత్తిపోయినపుడు బోయదొరలు పల్లవుల పక్షమున వీరోచితముగా పోరాడి విజయమును సాధించినదియు ధర్మాధికారి వినియే యున్నాడు. సాక్షాత్తు కట్టెపు దుర్గాధ్యక్షుని తమ్ముడే ఇప్పుడు కార్యార్థియై వచ్చియున్నాడు.

ధర్మాధికారి వారిని సాదరముగా పలుకరించి వచ్చిన కారణమడిగెను.

"మేము మా దుర్గరక్షణకై కొన్ని ఏనుగు గున్నలు కావలెనని వచ్చినాము. తిరువేంగడపు పర్వతారణ్యములలో ఏనుగుల మందలు కలవని విని యున్నాము. వాటిని పట్టుకొను ఉపాయము తెలిసినవారు, పట్టి ఇచ్చు నేర్పరులు మాకు సాయము చేయవలెను. ఎంత కాలమైనను సరే. ఎంత సెలవైనను సరే. మాకు ఏనుగులు పట్టువారు కావలెను." అన్నాడు పొన్నిదొర.

"ఏనుగులను పట్టువారు ఈ ప్రాంతమున లేరు. కాని మీ అదృష్టము కొలది మీరు సరియైన సమయముననకే వచ్చినారు. పల్లవ చక్రవర్తుల వారి అధికృతులు ప్రస్తుతము చంద్రగిరికి వచ్చియున్నారట. వారు ఏనుగులను పట్టు ఏర్పాట్లు చేయుచున్నట్లు విన్నాను. మీరు వెళ్ళి వారిని దర్శించిన యెడల మీ పని సానుకూలమగును. వారి వెంట పల్లవ చక్రవర్తులవారి రాణివాసమును తిరువేంగడక్షేత్ర దర్శనమునకు వచ్చియున్నారట. రాణివాసము యొక్క కంచుకి – రాణివాసపు గృహ వ్యవహారముల పర్యవేక్షకుడు – నాగన నా మిత్రుడు. అతనికి లేఖ వ్రాసి యిచ్చెదను."

"మా అన్న గారు చంద్రగిరి దుర్గాధిపతికి లేఖ వ్రాసి యిచ్చినారు."

"మరియు మంచిది. ఇరువురును మీ పనిని సానుకూలము చేయుదురు."

మరుసటి దినముననే అందరును బయలుదేరి సాయంత్రమునకు చంద్రగిరి చేరిరి. సత్రమున విడిసిరి.

ఉదయమే స్నానాదికములు ముగించుకొని పొన్నిదొరయు, శంకరశర్మయు, తిమ్మన శ్రేష్ఠియు, రామోజును దుర్గాధిపతి దర్శనమునకు వెళ్ళిరి. భటులును కుంతధారులై వారిని అనుసరించిరి.

పొన్నిదొర సరిగంచు పంచెను ముందు వెనుకల కుచ్చెలు వోసి కట్టెను. నడుముకు ఆకుపచ్చని పట్టు వస్త్రమును బిగజుట్టి ఎడమవైపున చుంగు వ్రేలాడునట్లు ముడివేసెను. తలపైన ముందు భాగమున కుచ్చు విప్పారునట్లు తలపాగా చుట్టెను. మెడలో స్ఫటికమాలయు, పగడపు దండయు, పులిగోరు బంగారు పతకమును ధరించెను.

ఒక ఘడియ ముందుగానే పొన్నిదొర తన భటుల చేత తమ రాకను దుర్గాధ్యక్షునికి విన్నవించి సందర్శనానుమతి పొంది యున్నాడు. కాబట్టి వీరు దుర్గాధ్యక్ష భవనమును సమీపింపగానే దౌవారికులు వారిని లోపలికి గొనిపోయి విశాలమైన పడసాల యందు ఉచితాసనములు చూపిరి. భటులు బయట నిలువగా పొన్నిదొరయు, శంకరశర్మయు, తిమ్మన శ్రేష్ఠియు, పశువైద్యుడు రామోజును లోపల ఆసనములపై కూర్చుండిరి. అయిదు నిమిషములలో దుర్గాధ్యక్షుడును, రాణివాసపు కంచుకియు వచ్చిరి. అందరును నమస్కార, ప్రతి నమస్కారములైన తరువాత సుఖాసీనులైరి.

పొన్నిదొర తన అన్న వ్రాసిన లేఖను దుర్గాధ్యక్షునకును, శ్రీకాళహస్తి ధర్మాధికారి వ్రాసి యిచ్చిన లేఖను కంచుకికిని అందజేసెను. వారు చదువుకొని పొన్నిదొరయెడల మరింత గౌరవమును, ఆదరమును కనపరచిరి.

"మీ కోరిక సమంజసమైనదే. మీకు ఏనుగుల అవసరమెంతైనా కలదు. మొన్న ఉదయచంద్రులు అణ్ణెక్కి పైనను వినుకొండ పైనను దండెత్తినప్పుడు మీ బోయ ధానుష్కులు వీరోచితముగా పోరాడి విజయమును సాధించిపెట్టిన విషయము విని చక్రవర్తుల వారు మిక్కిలి సంతోషించినారు. మీ వారి ధైర్యసాహసములను నిండు కొలవులో ప్రశంసించినారు. మీ అదృష్టము కొలది ప్రభువుల వారి బావమరది జయవర్మ గారును రాణివాసముతో వచ్చియున్నారు."

"రాణి వాసము వారు కంచి నుండి ఇంత దూరము వచ్చినారా? ఇక్కడ వారికేమి పని?"

"ప్రస్తుత మహారాణి గారి అత్తగారి అత్తగారు – సమవాయి మహారాణిగారు ఈ కొండలపై వెలసి యున్న తిరువేంగడ స్వామిని గురించి విని ఒకసారి స్వామి దర్శనమునకు వచ్చినారట. ఇక్కడి పరిస్థితులు అధ్వాన్నముగా ఉండినవి. ఈ క్షేత్రములో చెంచులు, ఏనాదులు నివాసముండిరి. ఈ క్షేత్రమును దర్శింప వచ్చు యాత్రికులు దిగువ తిరుపతిలోని సత్రములో విడిది చేసి ఉదయముననే అర్చకులతో బాటు కొండ ఎక్కి వచ్చెడివారు. అర్చకులు స్వామివారికి అభిషేకాదులు నిర్వర్తించి మధ్యాహ్నము నైవేద్యము సమర్పించి ఆ ప్రసాదమునే ఆరగించి సాయంత్రమునకు దిగువ తిరుపతికి చేరుకొనెడివారు. ఈ పరిస్థితిని చూచి మహారాణి మిగుల కలత చెందినది. అర్చకులు కొండపై కాపురముండునట్లు కట్టడ చేసినది. వారికి ఇండ్లు కట్టించినది. యాత్రికులకు సత్రము కట్టించినది. అంగళ్ళు పెట్టించినది. బ్రహ్మోత్స వములు ఏర్పాటు చేసినది. ఉత్సవ విగ్రహములు చేయించినది. ఉత్సవముల కవసరమైన చాకళ్ళు, మంగళ్ళు, దివిటీల వారు, బోయీలు మొదలైన వారిని నియమించి వారికి ఇండ్లు కట్టించినది. చిన్న మడుగువలె వుండిన పుష్కరిణిని విశాలముగా త్రవ్వించి తాపలు కట్టించినది.

"అప్పటి నుండి పల్లవచక్రవర్తులు, మహారాణులు తరచుగా స్వామివారి సేవకు వచ్చు చున్నారు. అనేక కైంకర్యములు చేయుచున్నారు. ప్రస్తుత మహారాణి గారు అట్లే విచ్చేసి

యున్నారు. మహారాణిగారి అన్నగారు జయవర్మ గారును కుటుంబ సమేతముగా ఇప్పుడు విచ్చేసియున్నారు. మీరు సాయంకాలము వచ్చినచో వారి దర్శనమిప్పింతును."

"తిరువేంగడమునకు మీ ప్రయాణమెప్పుడు?"

"రేపు ఉదయమే ప్రయాణము. మహారాణిగారు కొండపైన కొన్ని దినములు గడుపవలెనని యున్నారు. కాబట్టి తగిన సన్నాహముతో బయలుదేరుదుము."

"సాయంత్రము జయవర్మ గారి దర్శనము ఏర్పాటు చేయుడు. వచ్చెదము."

అందరును సత్రమునకు తిరిగి వచ్చిరి. చంద్రగిరిలోని కమ్మరుల యొద్దకు పోయి ఏనుగులను బంధించుట కొఱకు కావలసిన పొడవైన బలిష్ఠమైన ఇనుప గొలుసులు, అంకుశములు చేయించిరి. అరణ్యములో పయనించుటకును, నివసించుటకును వలసిన వస్తువులను, సంబారములను, గునపములు, పారలు, సుత్తులు, గుడారములు మొదలగు సామగ్రిని సమకూర్చుకొనిరి. అడవులలో దారితెలిసిన కూలీలను మాట్లాడుకొనిరి.

సాయంత్రము అందరును జయవర్మను దర్శింపనేగిరి.

జయవర్మ పూర్వ పల్లవ సేనానియైన ఉదయచంద్రుని కుమారుడు. కాని ఉదయచంద్రుని వలె పరాక్రమవంతుడు కాడు. కడు సౌమ్యుడు. గతించిన పల్లవరాజు నందివర్మ తన కుమారునికి సైనిక బలము పటిష్టముగా నుండవలెనని ఉదయచంద్రుని కుమార్తెను తన కుమారునికి కట్టబెట్టెను. కాని ఉదయచంద్రుని తరువాత జయవర్మ పల్లవరాజులకు పెద్దగా ప్రయోజనకారి కాలేకపోయెను. కావున అతనికి రాజుగారి బావమరది అను కుటుంబ గౌరవము తప్ప పరాక్రమ గౌరవము లేకపోయినది. దానికి తోడు అతడు శ్రీకాళహస్తిలోని ఒక సాధారణ దేవాలయ ధర్మాధికారి కూతురిని వివాహమాడెను. అందుచేత అతనికి రాజకీయమైన బలమునూ బొత్తిగా లేకపోయినది.

కానీ అతని సౌమ్యతను, ఔదార్యమును చూచి జనులందరును అతనిని గౌరవించు చుండిరి. అంతియే కాదు. మహారాణి గారికి ఆ అన్నగారనిన ప్రాణము. అది మరింత గౌరవమునకు హేతువైనది.

జయవర్మ తన తండ్రి ద్వారా బోయకొట్టముల బోయల చరిత్ర వినియుండెను. వారి ఆత్మాభిమానము, పౌరుషము, పరాక్రమము అన్నియు వినియుండెను. మహారాజులకు దగ్గరి సామంతుల కంటె గడిదుర్గసామంతులే ముఖ్యులు కావున జయవర్మ పొన్నిదొరను సాదరముగా పలుకరించెను. వచ్చిన కారణమడిగెను.

"మేము మీ అనుమతితో ఈ పర్వతారణ్యముల నుండి నాలుగైదు ఏనుగు గున్నలను పట్టుకొని పోవలెనని వచ్చినాము."

"మంచిది. దానికేమున్నది. మేము మాటు వేయు ప్రదేశమునకు రెండు ఘడియల దూరమున మీరు మాటు వేసికొనవచ్చును. మీకై మిగిలిన ఏనుగులను మాకు అప్పగింపవలె"

"అంతే. అంతే. మాకు అయిదే ఏనుగులు – పెద్దవి కాదు – గున్నలు చాలును. ఆపై ఎన్ని ఏనుగులు చిక్కినను మీకే అప్పగించెదము."

రాణివాసము వారి ప్రయాణమునకు జరిగిన ఏర్పాట్లను గురించి కంచుకి జయవర్మకు నివేదించెను.

"రాణివాసము ఎక్కు డోలికలును, గుఱ్ఱములును కొండపైకి ఎక్కుటకు వీలుగా కొండపైకి వంకరటింకర బాట తీర్చుట పూర్తి అయినది. ప్రతి దినము అవసరమైన సరుకులు చంద్రగిరి నుండి తెచ్చుటకు నలువురు జంఘాలురను నియమించినాను. మహారాణిగారును, మీ ఇంటి ఆడువారును, మరికొందరు పరిచారికలును డోలికలలో వత్తురు. తక్కిన వారు గుఱ్ఱముల మీదను, కాలి నడకను వత్తురు."

పొన్నిదొర జయవర్మ అనుమతి గైకొని సత్రమునకు మరలెను.

పల్లవుల పరివారము వలె తానును ఇరువురు వంటవారిని ఒక జంఘాలుని పిలిపించు కొనెను. పొన్నిదొర వ్యయమునకు జంకుటలేదు. బోయదొరలు అనామకులు, అనాగరికులు కారు. అని నిరూపించుకొనవలె. అని తీర్మానించుకొన్నట్లు వ్యయము చేయసాగెను.

మరునాడు అందరును కొండపైకి ప్రయాణమైరి. జయవర్మ కుమార్తె డోలిక ఎక్కలేదు. చీరను కాసె పోసి వెనుకకు బిగించి కట్టి, ఉత్తరీయమును వల్లె వాటుగా వేసికొని చెంగులు నడుముచుట్టును బిగించి గుఱ్ఱమెక్కి మార్గదర్శకుల వెంట పోసాగెను. గుఱ్ఱమునకు ఒక ప్రక్క బల్లెమును, మరియొక ప్రక్క విల్లమ్ములును వ్రేలాడుచున్నవి.

పొన్నిదొరయు, భటులును, రామోజును గుఱ్ఱము లెక్కి పోవుచుండిరి. కూలీలు, వంటవాండ్రు, జంఘాలుడు సామాను మోయుచు కాలి బాటలో కొండ ఎక్కసాగిరి.

అదే సమయమునకు మదనపల్లె నుండి వైదుంబ రాజాస్థాన పండితుడొకడు చంద్రగిరికి వచ్చినాడని తెలిసి అతనిని కలిసి కొనుటకై శంకరశర్మ సత్రములోనే నిలిచిపోయెను. వర్తక శ్రేణుల వారితో మాట్లాడవలెనని తిమ్మనశ్రేష్ఠియు నిలిచిపోయెను. గుఱ్ఱములన్నియు క్రొత్తగా తీర్చిన వంకరటింకర మార్గమున అనాయాసముగా కొండ ఎక్కుచున్నవి. రాణివాసపు పల్లకీల వెనుక కొందరు పల్లవ ఆశ్వికులు రక్షణగా వెళ్ళుచున్నారు.

దారి చక్కగా తీర్చి దిద్దబడినది. ఇక మార్గదర్శకులతో పని యేమి? జయవర్మ కుమార్తె తన గుఱ్ఱముముందు పోవుచున్న ఆశ్వికులనొక్కొక్కని దాటుకొని ముందుకు పోసాగెను. ఆమె తల్లిదండ్రులను, మహారాణిగారును "వకుళా. వెళ్ళవద్దు. ముందుకు వెళ్ళవద్దు," అని అరచుచున్నను లెక్కచేయకుండా అందరి కంటె ముందుకు వెళ్ళిపోయెను.

పోను పోనూ అరణ్యము దట్టమైపోవుచున్నది. దారిప్రక్కన దట్టమైన పొదలున్నవి. ఏ పొద వెనుక ఏ మున్నదో – ఏ సమయమున ఏ ఆపద ముంచుకొని వచ్చునో.

పొన్నిదొర అంతవరకు ఆమె పోకడను వేడుకగా చూచుచుండినవాడు వెంటనే తన గుఱ్ఱమును వేగముగా పోనిచ్చెను. ముందున్న బోయ ఆశ్విక భటులు తమ నాయకునికి దారి యిచ్చిరి. పొన్నిదొర పది నిమిషములలో వకుళను దాటి అడ్డముగా నిలిచెను. "ఆడువారికి

ఇంత సాహసము శోభాకరము కాదు. ఇది కంచిలోని సహకార వనమో, సంపంగి వనమో కాదు. మహారణ్యము. ఒంటరిగా ముందు వెళ్ళుట క్షేమము కాదు. మాతో బాటు వచ్చుట మంచిది." అని గుఱ్ఱమును నెమ్మదిగా నడిపించెను.

"ఆహాఁ అటులనా? ఇది అరణ్యమా? నేనింకను ఇది సహకారవనమో, సంపంగి వనమో అనుకొంటినే" అని వకుళ కొంటెగా సమాధానమిచ్చి నవ్వెను.

"ఔరా! ఏమిది? దేవకన్య వరమిచ్చినను ఈ మూర్ఖపు వృక్షములు సహకార వృక్షములు గానో సంపంగి చెట్లుగానో మారకున్నవే. ఏమి వీని అహంకారము?"

పొన్ని దొర మాటలకు వకుళ కలకల నవ్వినది. ఇతడు చమత్కారిగానే ఉన్నాడు. ఇతని పేరు పొన్నియని తన తల్లిదండ్రులు చెప్పుకొనుచుండగా విన్నది.

అంతలో పొన్ని చేసైగను గ్రహించి పొన్ని ఆశ్వికులు కొందరు వారి కంటెను ముందుగానూ, కొందరు వారి వెనుకను రక్షణ వలయముగా ఏర్పడి ముందుకు పోసాగిరి. ఇక వకుళ ముందుకు పోవుటకు మార్గము లేకపోయెను. విధిలేక పొన్నిదొర గుఱ్ఱము ప్రక్కనే తన గుఱ్ఱమును నడుపసాగినది.

పొన్ని దొర వేషము చాలా బాగున్నది. ముఖమున వన్నె కొంత తక్కువ అయినను కళయు తెలివియు కొట్టవచ్చినట్లున్నవి. తీసివేయవలసిన వాడుకాడు. చక్కని వాడే, అను కొన్నది వకుళ.

"రాణిగారు కొంతసేపు విశ్రాంతి కోరుచున్నారు." అనువార్త కంచుకి చెప్పగానే అందరును ఒక మఱ్ఱిచెట్టు క్రింద నిలిచిరి. మఱ్ఱిచెట్టు క్రింద మరియే చెట్టును పెరుగదు. చిన్నిచిన్ని చెట్లను రాజోద్యోగులు రెండు దినముల క్రితమే నరికి చదును చేసినారు.

పల్లకీలలోని వారు క్రిందికి దిగిరి. కాళ్ళ తిమ్మిరి తీరుటకై అటు నిటు నడవసాగిరి. పల్లకిబోయీలు అలసట తీర్చుకొనుటకై కూర్చుండిరి.

"వకుళా – మీ అమ్మ పిలుచుచున్నది" అను జయవర్మ కేక విని వకుళ గుఱ్ఱము పైననే తల్లి దగ్గరకు వచ్చెను.

"ఇదిగో ఇది తిను." అని తల్లి ఒక చిన్న సంచిని ముందుకు చాపగా ఆ సంచిని అందుకొని వకుళ మరల బోయభటుల మధ్యకు వచ్చెను.

పొన్నిదొర, మహారాణిని, వకుళ తల్లిని అప్పుడు చూచెను. మహారాణి ఏబది ఏండ్ల నిండు ముత్తైదువు. పచ్చి పసుపు కొమ్ము రంగు శరీరము. ఉండవలసిన లావుకంటే కొంచెము తక్కువయేమో అనిపించు శరీరపు పొందిక. ముఖమున కనపడు ప్రశాంతత వెనుక పిల్లలు లేరనెడు నిర్వేదపు ఛాయ.

వకుళ తల్లి మహారాణి కంటె చిన్నది. మహారాణి పట్ల విశేష గౌరవము ఆమె ప్రతి కదలికలోనూ కనబడుచున్నది. వయస్సు మీరినను సౌందర్యము ఇంకను తగ్గలేదు. ఈ వకుళ ఆమె నోటి నుండి ఊడిపడినట్లున్నది.

వకుళ సంచిలోని రెండు భక్ష్యములను చేతిలోనికి తీసికొని సంచిని పొన్ని వైపు చాపి 'ఊ' అన్నది. అవి బెల్లపు పాకములో కలిపిన బొరుగుల ఉండలు.

"చూపిన వన్నియు తీసికొనుట ఆశపోతుల లక్షణము. చేతికిచ్చినవి మాత్రమే తీసికొనుట మర్యాద."

వకుళ క్షణకాలము నిరుత్తర అయినది. వెంటనే తేరుకొన్నది.

"చేతితో ఎత్తి ఇచ్చిన యెడల రెండో మూడో వచ్చును. సంచి చాపిన యెడల మీకు కావలసినన్ని తీసికొనవచ్చును కదా"

"కావలసినవన్నియు తీసికొనుటయు మర్యాద కాదు. ఇచ్చిన వారి మర్యాద కొఱకు ఒకటి రెండు మాత్రమే తీసికొందురు"

వకుళకు నవ్వువచ్చెను.

"మరి మీకు ఇప్పుడు ఎన్ని కావలెను?"

"ఇచ్చువారి ఔదార్యమును బట్టి పుచ్చుకొను వారి అదృష్టము. 'ప్రతిగ్రహోదాతృ వశః' అన్నాడు దశరథుడు."

వకుళ కన్నులు మెరసినవి. అబ్బో చదువులు కూడ వెలగబెట్టినట్లున్నాడు. వెంటనే ఆమె తన గుఱ్ఱమును పొన్ని గుఱ్ఱము ప్రక్కకు పోనిచ్చి సంచి మూతిని చుట్టి పట్టుకొని సంచిని పొన్నిబోయని ఒడిలో కుక్కి– "ఇది ఇచ్చువారి ఔదార్యము," అని ప్రక్కకు వచ్చినది.

"ఓహో. కల్పవృక్షము కదలి వచ్చి ఫలములన్నియు ఒక చోటనే రాల్చి వెళ్ళిపోయినదే. కనీసము మా కృతజ్ఞతలనైనను స్వీకరింపక..."

"ఇచ్చిన వన్నియు తినుటయే మాకు మీరు చెల్లించు కృతజ్ఞతలు."

"తిన వచ్చును గానీ. తోడు లేని తిండి దొంగతిండి అందురు. అదియు గాక విందు పెట్టెడు గృహస్థు అతిథితో సహపంక్తి భోజనము చేయవలె. అది సత్సంప్రదాయము."

"ఈ చదువులు ఎవరు నేర్పిరో?"

"మా అన్న నన్ను ఒక సంవత్సరము గుంటూరులోనూ, ఒక సంవత్సరము ధాన్యకటకము లోనూ ఉంచి మహాపండితుల వద్ద చదివించెను."

వకుళ కన్నులు విప్పారినవి. ఓహో అదన్నమాట ఇతని మాటలలోని చమత్కారమునకు, సంస్కారమునకు కారణము.

అందరును మరల బయలుదేరిరి. పొన్ని దొర వకుళను ఒంటరిగా పోనీయలేదు. ముందు వెనకల తన వారిని నడిపించుచు తాము ఇరువురు వారి నడుమనే పోవుచుండిరి.

వకుళ గుఱ్ఱపు స్వారి యందు ఆరితేరినట్లున్నది. ఏటవాలుగా కొండపైకి ఎక్కుటలో ఆమె ఎంత మాత్రము కష్టపడుచున్నట్లు కనబడుట లేదు. ఇంత మాత్రమేనా, లేక ఆయుధ విద్యలు కూడా సాధన చేసినదా. ఆమె ఎవరిని లెక్క పెట్టునట్లు లేదు. తన యిచ్ఛయే తనదిగా నున్నది. కనబడినది కదా. ఒకవైపున తల్లిదండ్రులును మరియొక వైపున మహారాణి గారునూ వారించుచున్ననూ వినక అందరిని దాటుకొని వచ్చినది. మహారాణి అనగా తక్కిన

వారికందరికిని మహారాణియే కాని వకుళకు మేనత్తయే కదా. అందుకే అంత చనువు.

పొన్ని దొర ఆలోచనలు ఇట్లు సాగుచుండెను.

ఉన్నట్లుండి ముందు పోవుచున్న బోయభటులు ఆగిపోయి వెనుక వచ్చువారిని ఆగమన్నట్లు చేతులతో సైగలు చేయసాగిరి.

వారి ముందర పది గజముల దూరమున ఒక కొండచిలువ దారికి అడ్డముగా ఒక వైపు నుండి మరియొక వైపునకు మెల్లగా సాగిపోవుచున్నది. అది వెడలిపోయిన తరువాత ముందుకు వెళ్ళుదమని బోయదొరలు నిలిచిపోయిరి.

అంతలో పొన్నిదొరయు వకుళయు మరికొంత ముందుకు వచ్చిరి. పొన్నిదొర కొండ చిలువను చూచుచు నిలబడెను. వకుళ తటాలున విల్లును అమ్ములు తీసికొని రయ్యి రయ్యిమని నాలుగైదు బాణములు కొండచిలువపై ప్రయోగించినది. బాణములు లోతుగా గ్రుచుకొన్నవేమో చిలువ ఇటువైపు దిరిగి బోయదొరలకు ఎదురుగా నోరు తెరచుకొని రాసాగెను. బోయదొరలు కుంతములు తీసుకొను లోపల పొన్నిదొర తన కుంతమును చిలువ నోటితో దూరునట్లు బలముగా విసిరెను. వెనువెంటనే బోయదొరల కుంతములును దాని శరీరమున లోతుగా గ్రుచ్చుకొన్నవి. చిలువ ఏ వైపు ముఖము త్రిప్పినను నోటిలో కుంతము చెట్లకు తగిలి నెఱు ముట చేత దాని నొప్పి అధికముకాసాగెను. కొందరు బోయదొరలును కొందరు పల్లవ సైనికులును దానిని పొడిచి చంపి దూరముగా లాగిపారవైచిరి.

ఈ గందరగోళమంతయు అణగుటకు ఒక ఘడియకాలము పట్టెను. విషయమంతయు రాణివాసమునకు తెలియజేయబడెను. వారును వచ్చి కొండచిలువను చూచిరి. భటులందరును తమతమ కుంతములను లాగుకొనిరి. కాని పొన్ని దొర విసిరిన కుంతము చిలువ గొంతులో చాలా లోతుగా నాటుకొన్నందున ఎంత ప్రయత్నించినను ఊడి రాలేదు.

వకుళ బాణప్రయోగము నందలి వేగము, లాఘవము చూచి పొన్నిదొర అబ్బురపడెను. కాని ఈ బాణములకు కొండ చిలువ చచ్చునా. ఇది సాహసముకదా.

రాణిగారికి శ్రమ కలుగకుండా మరిరెండు చోట్ల ఒక్కొక్క ఘడియ సేపు ఆగి మధ్యాహ్నాము వేళకు అందరును కొండపై దేవాలయమును చేరుకొనిరి.

దేవాలయము కొండల మధ్య విశాలమైన ప్రదేశమున ఉన్నది. చుట్టును చిన్న ప్రాకార మున్నది. లోపల గర్భగుడియు, దాని ముందొక మండపమును ఉన్నవి. గర్భగుడిలో సర్వాంగ సుందరమైనది, సమవిభక్తాంగమైనది, స్ఫురద్రూపమైనది నిలువెత్తు దివ్యమంగళ విగ్రహ మున్నది.

విశాలమైన వక్షస్థలముపై ఒక పతకమును, ఆ పతకములో ఒక స్త్రీమూర్తియు కనబడు చున్నవి. ఆ విగ్రహము శ్రీనివాసుడనియు, వక్షమునందలి స్త్రీ మూర్తి లక్ష్మీదేవియనియు శ్రుతి పరంపరగా చెప్పుచున్నారని అర్చకులు చెప్పిరి. గర్భగుడిలోపలనే ఒక అరుగుపై రెండు ఉత్సవ విగ్రహములున్నవి. అందొకటి సమవాయి మహారాణి చేయించినది. మరి యొకటి పూర్వము నుండియు ఉండినది. ఆ విగ్రహమును మలయప్ప అని వ్యవహరించు

చున్నారు. దేవాలయమునకు ఈశాన్యమున పుష్కరిణియు కలదు.

మహారాణిగారు గర్భగుడిలోని శ్రీనివాసుని దివ్యమంగళ విగ్రహమును చూచి పరవశు రాలయ్యెను. ఆమె తిరువేంగడమునకు ఎన్నిసార్లు వచ్చినను ఆ విగ్రహము ఆమెకు నిత్య నూతనముగానే కనబడును.

అర్చకులు శ్రీనివాసునికి అర్చనలు చేసిరి. పల్లవరాణి చక్రవర్తి పేరు మీదను, రాణుల పేర్లమీదను, ఆ రాణుల సంతానము పేర్లమీదను అర్చన చేయించగా పొన్నిదొర తన అన్న వదినెల పేర్లమీద అర్చన చేయించెను.

అర్చకులు కొండ దిగువ తిరుపతిలో కాపురముందురు. వారికి కొండపై దేవాలయము వద్దను గృహములన్నవి. అర్చకులు వంతులు చొప్పున దిగువను, పైనను కాపురములుందురు. పర్వదినములలోను, ఉత్సవ దినములలోనూ అర్చకులందరునూ కొండమీదనే ఉందురు.

పల్లవరాజులు తిరువేంగడముపై శ్రద్ధ చూపిన తరువాత యాత్రికుల రాకపోకలు ఎక్కువయ్యెను. కొండపై కొన్ని స్థిర నివాసములేర్పడెను. చెంచులు, ఏనాదులు నివాసము లేర్పాటు చేసికొనిరి.

మహారాణి అర్చకులను, దేవాలయ పరిచారకులను పది దినములు కొండపైననే ఉండవలెనని ఆజ్ఞాపించెను. మరునాటి నుండియు మహారాణి కొండపైనున్న తీర్థములన్నింటిని అవకాశమును బట్టి క్రమముగా దర్శింపవలెనని నిర్ణయించుకొన్నది.

జయవర్మయు, అతని పరివారమును అడవిలో ఒక వాగు దగ్గర దట్టముగా ఫలవృక్షము లున్న చోట ఏనుగులను పట్టుటకు ఏర్పాట్లు చేయజొచ్చిరి. ఎండలు ముదురుచున్నవి. చిన్నచిన్న పడియలు వాగులు ఎండిపోయినవి. పెద్ద వాగులలోనూ, మడుగులలోనూ మాత్రమే నీరున్నది. ఏనుగులు నీటి కొఱకు అక్కడికి రావలసినదే.

పొన్నిదొర వారికి రెండుక్రోసుల దూరమున ఒక మడుగుకు ఏబది అడుగుల దూరమున ఒక ప్రదేశము నెన్నుకొనెను. జయవర్మనడిగి తనకు సాయముగా వారి మనుష్యులలో ఇద్దరిని తీసికొనెను. వారు ఏనుగులను పట్టుటలో సిద్ధహస్తులు.

అక్కడను, ఇక్కడను గట్టి నేలలో పది అడుగుల వెడల్పు, ఇరువది అడుగుల పొడవు, పది అడుగుల లోతు గోతులు త్రవ్విరి. దానిపై పొడవైన సన్నని కొమ్మలు దగ్గర దగ్గరగా కప్పిరి. దానిపై జంబు పరచిరి. దానిపై గడ్డి మొలిచిన మట్టి కరుళ్ళు వేసి కప్పిరి. మధ్య భాగమున చెరకు గడలు, అరటి చెట్లు, రావి కొమ్మలు కొట్టుకొని వచ్చి పాతిపెట్టిరి.

"ఇక మనము మన విడిదికి వెళ్ళిపోవచ్చును. రేపు ఉదయమే వచ్చి చూడవచ్చును." ఏనుగుల నిపుణుడు అందరిని బయలుదేరదీసెను.

"జింకలు, దుప్పులు, ఎలుగుబంట్లు, ఈ కప్పడముపైన అడుగు పెట్టి గోతిలో పడిపోవా?" ఒక బోయ భటుడు సందేహము వెలిబుచ్చెను.

"వాటి త్రొక్కిడికి ఈ కప్పడము కూలదు. అడవి దున్నలకును, ఏనుగులకును మాత్రమే ఈ కప్పడము కూలును. అడవి దున్నలు ఈ ప్రాంతమున లేవు"

"మరి గున్న ఏనుగులెట్లు పడును? అవి అడవి దున్నలకంటే చిన్నవి కదా. అవి తప్పించుకొని పోవునేమో?"

"ఏనుగు గున్నలు తల్లిని వదలి పెట్టు ప్రాయము వచ్చిన యెడల అవి అడవి దున్నలకంటే పెద్దవిగానే ఉండును. కావున అవి పడిపోవును. తల్లిని వదలని గున్నలు తల్లితోబాటు వచ్చి గోతిలో పడిపోవును. కాబట్టి సందేహపడవలసిన పనిలేదు."

అందరును గుడి ఆవరణములో నిర్మించుకొని యుండిన గుడారములు చేరుకొనిరి. గర్భగుడికి దక్షిణమువైపున రాణిగారి గుడారములు మూడు నిలుపబడినవి. ఉత్తరమువైపున బోయదొరల గుడారము ఒకటియే నిలుప బడినది. ఇరు వర్గముల వారును వారి వారి గుడారముల వద్ద వంటలు చేసికొనుచుండిరి.

దేవాలయ ప్రాంగణము నందంతటను కాగడాలు వెలుగుచుండినవి. ప్రాకార ప్రవేశ మార్గము వద్ద రాత్రులలో నెగళ్ళు వేసుకొని భటులు కాపుండిరి.

భోజనానంతరము అందరును అక్కడక్కడ బండలపైనను, ఇసుక కుప్పలపైనను కూర్చుండి మాట్లాడుకొనుచుండిరి.

వకుళ ఆ దినమంతయు మహారాణి గారి వెంట తీర్థములు చూడబోయెను.

"ఈ తీర్థములలో ఏమున్నది? పడియలలో ఊరిన నీళ్ళు, లేదా రాళ్ళపై దొర్లిపడెడు నీళ్ళు. ఎంత దూరము చూచినను తలఎత్తి చూడవలసినంత ఎత్తు పెరిగిన వృక్షములు. తీర్థములు అన్నియు ఒక్కలాగుననే ఉన్నవి. అన్నిటిలోనూ మునుగవలె. అందుకొఱకు క్రోసుల పర్యంతము నడువవలె. నావల్ల కాదమ్మా. రేపటి నుండి మీతో రాను. మునిగిన ప్రతిసారియు బట్టలు మార్చుకొనవలె. ఏనుగుల మాటు వద్ద నెమ్మదిగా కూర్చుందును" అని వకుళ తేల్చిచెప్పివేసెను.

ఆ దినము త్రిప్పటతో అలసిన వకుళ ఒక ఇసుక కుప్పపైన కూర్చొని చంద్రునివైపు తదేక దృష్టితో చూచుచుండెను.

శుక్లపక్ష పంచమీ చంద్రుడు పడమటి వైపు మసక వెన్నెల కాయుచున్నాడు. ఒకప్రక్క కొంచెము విరిగిన గుండ్రని అద్దపు బిళ్ళవలెనున్నాడు. చంద్రుని ఉత్తరపు కొమ్ము కొంచెముపైకి లేచినది. దక్షిణపు కొమ్ముకొంత క్రిందికి దిగినది. ఈ నెల అంతయు ధరలు అధికము, వస్తువుల లభ్యత తక్కువ, అన్నమాట.

అంతలో అడుగుల సవ్వడి వినవచ్చి తలత్రిప్పిచూచినది. పొన్ని దొర పోవుచున్నాడు.

"బోయకొట్టముల యువరాజా!"

సన్నని ఎలుగు మధురముగా వినబడగానే పొన్నిదొర ఆగి వకుళను సమీపించెను.

"ఇది ఏమి కొత్త పిలుపు? ఎవరు చెప్పిరి?"

"ఇందులో క్రొత్త ఏమున్నది? మీరు పంద్రెండు బోయకొట్టముల యువరాజట కదా మా తండ్రియు, చంద్రగిరి దుర్గాధిపతియు, కంచుకియు మాట్లాడుకొనుచుండగా వింటిని."

"మాలో రాజు, యువరాజు అను పేర్లుండవు. పంద్రెండు బోయకొట్టములకు నాయకుడు

మా అన్న. మా అన్నను అందరును పెద్ద దొర అందురు. నన్ను చిన్న దొర అందురు. రాజు, యువరాజు అను పేర్లు మాకు నచ్చవు. అవి మా బోయవారిలో అంతరములు సృష్టించును. మీ ప్రజలు మీ రాజును ఎట్లు చూచుచున్నారు? సర్వాధికారిగానూ, సామాన్య జనుల కతీతుడుగానూ, అందరాని వాడుగానూ చూతురు. మా బోయకొట్టములలో ప్రజలు మా అన్నను తమ వంటివానినిగానే, తమ వానినిగానే చూతురు. కేవలము నాయకుడుగా, మార్గనిర్ణాయకునిగా ఎంచుదురు. ”

“అట్లుండినచో ప్రజలకు ప్రభువుల యెడల భయభక్తులుండునా?”

“ప్రజలకు ప్రభువుల యెడ ఉండవలసినవి భయభక్తులు కావు. ఆత్మీయత, ఆర్ద్రత. ప్రజలు ప్రభువునుచూచి ఇతడు మనవాడు, మనలోనివాడు. మనకు కావలసిన వాడు. పిలిచిన పలికెడు వాడు. మనము ఎదిగినచో సంతోషించువాడు. మనము క్రుంగినచో లేవనెత్తువాడు అను భావము కలుగవలె”

“మరి ఇక్కడ అందరును మిమ్ములను రాజు, యువరాజు అనుచున్నారే. అవెట్లు అలవాటులోనికి వచ్చినవి.”?

“మా పినతాత పులిరాజుబోయని కాలమున ఆ మాటలు వాడుకలోనికి వచ్చినవి. ఆయన చాళుక్య రాజోద్యోగుల సంపర్కము వలన ‘రాజు’ అని పిలిపించుకొనవలెనని మిక్కిలి ఉబలాటపడి తన పేరును కూడ పృథ్వీవ్యాఘ్ర రాజు అని మార్చుకొనెను. బోయకొట్టముల వారందరు ఆయనను రాజు, ప్రభువు అని పిలుచునట్లు చేసికొనెను. మా అన్న మా రాజ్యములో రాజు, యువరాజు అనుమాటలను తొలగించి వేసెను. ఆ మాటలు మా రాజ్యములో తొలగిపోయినవి కాని బయట ఇంకను అట్లే చెప్పుకొనుచున్నారు. ఆనాడు మా పినతాత పులిరాజు అందరిచేతను ‘దేవరా’ అని పిలిపించుకొనెను. ఇప్పుడు మా అన్నను బోయకొట్టములలోని బోయదొరలు అన్నా, మామా, బావా, అని వరుసలు పెట్టి పిలుతురు. ఇతర వర్ణముల వారు దొరా, అని పిలుతురు.”

“మరి మీ అన్నకు సింహాసనము, కొలువు కూటము లేవా?”

“లేవు. ఉండకూడదని మా అన్న దృఢాభిప్రాయము. మా పినతాతకు అవన్నియు ఉండెడివి. మా అన్న అవియన్నియు తీసివేసెను. రాజ్య వ్యవహారములన్నియు మా అన్న ఆధిపత్యమున మా ఇంటి అరుగులపైన బోయపెద్దల సమక్షమున పరిష్కరింపబడును. ఎవరెన్ని మాట్లాడినను చివరి తీర్మానము మా అన్నదే. అందరును ఆ నిర్ణయమును అంగీకరింతురు.”

“నిన్నటి నుండి ఇప్పటివరకు మీ అన్నను గూర్చి కనీసము పదిసార్లు ప్రస్తావించినారు. మీ కంటెను చాలా పెద్దవాడా. మిమ్ములను పెంచి పెద్ద చేసినాడా?”

“అవును. చాలా పెద్దవాడు. ఇరువది మూడు నెలలు పెద్దవాడు. నన్ను పెంచి పెద్దచేసినవాడు.”

వకుళ అవాక్కయినది. కన్నులింత లేసి చేసి చూచినది.

“ఏమి! మీకంటె చాలా పెద్దవాడనుకున్నాను. కనీసము పూర్తి రెండు సంవత్సరములైనను

పెద్దవాడు కాడే. ఇంచుమించు సమవయస్కులే. మా యిండ్లలో అట్టి వయస్సు అన్నదమ్ములు 'ఒరే – ఒరే' అనుకొందురు. కానీ మీరు మీ మాటలలో ఆయనకు చాలా గొప్పదనమును, పెద్దరికమును ఆపాదించి మాట్లాడుచున్నారు."

"ఆపాదించి మాట్లాడుట కాదు ఉన్న వాస్తవమును మాట్లాడుచున్నాను. అది ప్రత్యక్షముగా చూచిననే గానీ మీకు బోధపడదు."

"అయినచో ఆయనను తప్పక చూడవలసినదే."

"తథాస్తు."

"ఏమిటీ తథాస్తు."

"మీరు తప్పక మా అన్నను చూచెదరు అనుచున్నాను."

వకుళ ద్వారా పొన్నిదొర వృత్తాంతము విన్న మహారాణి మరునాడు ఉదయము పొన్నిదొరకు వర్తమానము పంపి తన సముఖమునకు రప్పించుకొనెను.

మహారాణి మంచముపై కూర్చుండి యుండెను. రాణి వాసపు రాజసము, తద్విరుద్ధమైన ప్రసన్నత, ఔదార్యము కలగలిసిన రూపమామెది. ఆమెను చూడగానే ఆమె హృదయము పార లౌకిక చింతనతో నిండినదనియు, ఆమె శరీరమంతయు దైవభక్తితో నిండారినదనియు స్పష్టమైపోవును.

"అమ్మా – నమస్కారము," పొన్ని రెండు చేతులెత్తి నమస్కరించి నిలబడెను.

ఆ పిలుపుతోనే రాణి ముగ్ధురాలైనది. సామాన్య ప్రజలకు మహారాణిని చూచినపుడు ఏర్పడు భయభక్తులు గానీ, నదురు బెదురులు గానీ, జంకు గొంకులు గానీ వానిలో ఆమెకు కనపడలేదు. సాధారణముగా ఇంటిలో తల్లి యెదుటనో, పెదతల్లి ఎదుటనో, పినతల్లి ఎదుటనో నిలబడినంత సహజముగా, చనువుగా నిలబడి యున్నాడు.

అందరును తన యెదుట వంగి వంగి దండములు పెట్టుదురు. అమ్మగారూ, రాణీగారూ మహారాణీగారూ అని ఘనమైన సంబోధనలు చేయుదురు. కానీ ఈ యువకుడు ఎంత స్వచ్ఛముగా, ఆత్మీయునివలె, తన కుటుంబములోని ఒక మనిషి వలె, ఎంత ప్రియముగా "అమ్మా" అని పిలుచుచున్నాడు!

రాణి తన ముందున్న ఆసనముపై కూర్చుండుమని సంజ్ఞ చేసెను. పొన్ని ఆ ఆసనముపై రెండు చేతులు ఒడిలో పెట్టుకొని ఒదిగి కూర్చుండెను.

పరిజనులు ఆశ్చర్యచకితులైరి. ఇది ఎవరికిని లభింపని ఆదరము. భర్తయు, తల్లి దండ్రులును, అత్తమామలును, అన్నయు తప్ప ఇతరులెవరును ఆమె ఎదుట ఆసనముపై కూర్చున్నది లేదు. 'అమ్మా' అని ఏకవచనముతో చనువుగా పిలిచిన వారును లేరు.

"నీవు నీ బోయ రాజ్యమునకు యువరాజువా?"

"కాదమ్మా. మా రాజ్యమున రాజు, యువరాజు ఉండరు. పంద్రెండు బోయకొట్టములకు మా అన్న పెద్దదొర, నేను చిన్నదొరను. అంతే."

"మీరు ఉండునదెక్కడ?"

"కట్టెపు దుర్గమున."

"అదెక్కడ?"

"గుండ్లకమ్మనదికి దక్షిణమున."

"ఏమైనను చదువుకొన్నావా?"

"మా అన్న నన్ను గుంటూరులో ఒక సంవత్సరమును, ధాన్యకటకమున ఒక సంవత్స రమును ఉంచి గొప్ప పండితుల వద్ద చదివించినాడు."

"మరి ఆయుధ విద్యలు?"

"ఏదో అంతంత మాత్రము"

"నిన్ను గురించి వకుళ ఏవేవో చెప్పుచున్నది. ఇదిగో నీకొక పరీక్ష."

"తల్లులు బిడ్డలను కష్టపెట్టరు."

"ఆ పప్పు లేవియు ఇక్కడ ఉడకవు. రేపు సాయంత్రము లోపల నీ సామర్థ్యమునకు ఒక ఋజువును తెచ్చి చూపవలెను."

"తల్లి యెప్పుడును కొడుకు ఉన్నతినే కోరును అనుటకు ఇదియే నిదర్శనము." అని పొన్ని చిన్నగా నవ్వెను. రాణి కొంత బిగ్గరగా నవ్వి "చమత్కారివే. రేపు సాయంత్రము కనబడుము." అని ఆసనము నుండి లేచెను.

పొన్ని చటుక్కున లేచి ఆమె ఆసనము నుండి కదలక ముందే ఆమె పాదములంటి నమస్కరించెను.

నాలుగు దినముల నుండియు పల్లవ పరివారము ఒక వైపునను, పొన్ని దొర పరివారము ఒకవైపునను అడవి యంతయు వెదుకుచున్నారు. ఏనుగుల మందల జాడయే కనబడలేదు.

ఒకనాడు సాయంత్రము అడవి చెంచులు వచ్చి రెండు క్రోసుల దూరమున ఏనుగుల మందలు రెండున్నవని వర్తమానము చెప్పిరి.

మరునాడు ఉదయమే పల్లవ పరివారములో కొందరు ఆ చెంచుల వెంట వెళ్ళిరి. కొందరు మాటు వద్ద నిలిచిరి. అట్లే పొన్నిదొర పరివారమునను కొందరు చెంచుల వెంటను కొందరు మాటు వద్దకును వెళ్ళిరి. పొన్నిదొర మాటు వద్ద నిలిచెను.

వకుళకు దేవాలయము వద్ద ప్రొద్దుపోవుటలేదు. మహారాణి గారు పూజా కార్యక్రమ ములలో మునిగియుందురు. వకుళ తల్లిదండ్రులు మహారాణి వెంట ఉందురు. వకుళకు మొదటి నుండియు దేవాలయము నందలి మూలవిగ్రహము కంటె ఉత్సవమూర్తి మలయప్పపై ఎక్కువ ప్రీతి. మూలవిరాట్టు నిలువెత్తు విగ్రహము. గంభీరమైనది. ఎక్కడికిని కదలదు. మలయప్ప అందమైన మూర్తి. వలసిన చోటికి తరలించుకొని పోవచ్చును. స్నానము – అనగా అభిషేకము – చేయించవచ్చును. వస్త్రములు కట్టబెట్టవచ్చును. అలంకరింపవచ్చును. తాకవచ్చును, పట్టుకొనవచ్చును. చెంత కూర్చొని పాటలు పాడవచ్చును. ఊయలలో పెట్టి జోలపాటలు పాడవచ్చును.

వకుళ ఏడెనిమిదేండ్ల ప్రాయము వచ్చినప్పటి నుండియు సంవత్సరమునకు రెండు సార్లు పల్లవరాణితో బాటు తిరువేంగడమునకు వచ్చుచున్నది. దేవాలయములో ఆమె ఎక్కువ సమయము మలయప్ప వద్దనే గడుపుచుండును.

ఆనాడు మలయప్ప వద్ద పూజా కార్యక్రమములు తొందరగా ముగిసినవి. ఇక ఏమి చేయుటకును తోచలేదు.

వకుళ తల్లిదండ్రులతో చెప్పి గుఱ్ఱమెక్కి పొన్నిదొర పరివారము మాటువేసిన చోటికి బయలుదేరెను. గుఱ్ఱమునకు ఒక వైపున కుంతమును, మరియొక వైపున విల్లును మెడవద్ద అమ్ముల పొదియు వ్రేలాడుచున్నవి.

మాటువేసిన మనుష్యులు తొలినాడే మాటుకు కొంత దూరమున ఒక పెద్ద వృక్షముపై తమర కొమ్మలపై ఒక మంచెను కట్టియుండిరి. మంచెపైకి ఎక్కుటకు త్రాటి నిచ్చెనను వ్రేలాడగట్టి యుండిరి.

పొన్నిదొర మంచెపై నుండెను. వకుళ గుఱ్ఱము దిగి ఆయుధములు తీసికొని మంచె ఎక్కెను. పరిజనులు గుఱ్ఱమును దూరముగా తీసికొనిపోయి తమ గుఱ్ఱములుండు చోట కట్టివేసిరి. ఏనుగులను చూచిన గుఱ్ఱములు బెదరును. ఏనుగులు గుఱ్ఱములను తరుమును.

పొన్ని ఆనాడు అరచట్టయు. మోకాళ్ళ వరకు గోచిపెట్టిన పంచెయు ధరించియుడెను.

"మీ మెడలోనున్న పులిగోరు దంతముదా?" పొన్నిదొర మెడలోని సన్నని బంగారు గొలుసునకు వ్రేలాడుచున్న పులిగోరు పతకమును చూచి వకుళ అడిగెను.

"ఇవి నిజమైన పులిగోళ్ళు. మా అన్న చంపిన పులిది. ఇటువంటిదే మా అన్న మెడలోనూ ఉన్నది."

"అవునవును. పులిని చంపి పులిగోళ్ళను ఇట్లు అలంకరించుకొందురట. మా మేనమామ చెప్పుచుండగా విన్నాను. వారు ఒకసారి ఇటువంటి అడవిలో పులిని చంపుటకు వచ్చిరట. ఆ పులి అడవి ప్రక్కన పల్లెలపై పడుచుండినదట. దానిని మాటువేసి చంపుటకై వెళ్ళిరట. ఒక చోట కుక్కను కట్టివైచి చెట్లపై మాటువేసి యుండిరట. పులి వచ్చెను. కుక్క మొరగసాగెను. పులి కుక్క దగ్గరికి వచ్చెను. వెంటనే మా మామయు, మరి నలుగురును చెట్టుపై నుండి బాణములు వేసిరట. బాణములు దాని మెడ మీదను ప్రక్కల యందును గ్రుచ్చుకొన్నవి. పులి చెట్టుపైకి లఘించుటకై ఒకసారి ఎగిరినది. మా మామ మరియొక బాణమును వేసెను. అది దాని గొంతులో లోతుగా గ్రుచ్చుకొన్నది. పులి కొంత దూరము పారిపోయి అక్కడ పడి చచ్చినది. దాని చర్మమును మా మామ ఉంచుకొని పులిగోళ్ళను ఒక పతకములో పొదిగి రాజు గారికి కానుకగా నిచ్చినాడు. రాజుగారు దానిని తన కుమారుని మెడలో వేసినారు."

"మా అన్న పులిని అట్లు చంపలేదు."

"మరి?"

"మా అన్న గుఱ్ఱముపై అడవి దారిలో వెళ్ళుచుండెను. హఠాత్తుగా పులి ఎదురు పడినది. మా అన్న తటాలున కుంతమును పట్టుకొని పులి నోరు తెరచి ఎగురుటకు ఉంకించు

సమయమున సరిగా దాని నోటిలోనికి విసిరినాడు. అది దాని నోటి నుండి గొంతు వరకు దిగిపోయినది. అది నోటిలోని కుంతముతోనే మా అన్న గుఱ్ఱముపైకి దుమికినది. మా అన్న గుఱ్ఱముపై నుండి క్రిందికి దుమికి మరియొక్క కుంతముతో దాని డొక్కలో శక్తి కొలది పొడిచినాడు. పులి క్రింద పడి లేచుటకు ప్రయత్నించుచుండగా మా అన్న నడుములో దోపుకొని యున్న పిడి బాకుతో పులి గొంతుపై గబగబ మూడు పోట్లు పొడిచినాడు. పులి చచ్చినది. మా అన్న నగరుకు తిరిగి వచ్చి మనుషులను పంపి పులి కళేబరమును తెప్పించెను. పులితోలు ఇప్పటికిని మా అన్న ఆసనముపైన అలంకరించి యున్నారు. పులిగోళ్ళు తీసి రెండు పతకములు చేయించి ఒకటి తాను ధరించి మరియొకటి నా మెడలో వేసినాడు."

ఇదంతయు నిజమేనా. ఒక మనిషి ముఖాముఖిగా పులితో పోరాడెనా. పొన్నిదొర అన్నకు ఇంత ధైర్యము. బలము ఉన్నవా! వకుళకు ఆశ్చర్యముగా నున్నది. అతడు అంతటి వాడు కనుకనే పొన్నిదొర మాటిమాటికి తన అన్నను గురించి ఘనముగా ప్రస్తావించుచున్నాడు.

వకుళ మంచెనుండి క్రిందికి చూచుచు "అదిగో, అదిగో పాము, పెద్ద త్రాచు పాము," అని అరచినది. ఏనుగులకై వేసిన గోతికి ఏబది అడుగుల దూరమున ఒక బారెడు పొడవు త్రాచు పాము ఆగి ఆగి గొయ్యి వైపు ప్రాకుచున్నది.

"అయ్యో, అది గొయ్యి కప్పడములో గాని, గొయ్యిలోపలగాని చేరిన యెడల ఏనుగులకును, మనుష్యులకును అపాయమే. దానిని..." అని పొన్నిదొర చెప్పుచుండగానే వకుళ మెరుపు వేగముతో విల్లందుకొని బాణమును తొడిగి గురిచూచి వదలినది. ఆ బాణము పాము తలలో దూరి నేలలో జేనెడు లోతు గ్రుచ్చుకొన్నది. పాము కొంతసేపు విలవిల మెలికలు తిరిగి ప్రాణములు వదలినది.

వకుళ యొక్క వేగమును, గురిని చూచి ఆశ్చర్యముతోనూ, సంతోషముతోనూ పొన్నిదొర ఆమెను పొదివికొని ఆమె రెండు చేతులను పట్టుకొని తటాటున ముద్దుపెట్టుకొనెను.

"ఇవి చేతులా, మెరుపు తీగలా – స్త్రీని కవులు లతాంగి అనుట తప్పు. అయఃప్రతిమ అనవలయును."

"ఆయఃప్రతిమ చేతులు మెత్తగా ఉండవు. ఇట్లు పట్టుకొని నొక్కుటకు, ముద్దు..." వకుళ తల వంచుకొని మెల్లగా అనెను. పొన్నిదొర తన అసంకల్పిత చర్యకు సిగ్గుపడి చటుక్కున వకుళను వదలి దూరముగా జరిగి "లేదులేదు. నీచేతిలో శక్తి తక్కువే కానీ వేగమును, గురి నిలకడయు అద్భుతముగానున్నవి. ఈ వేగము ఈ గురి నేను మా అన్నలో తప్ప మరియెక్కడను చూడలేదు."

ఇరువురును ఆయుధములను చెట్టుక్రిందికి జారవిడిచి త్రాటినిచ్చెన ద్వారా క్రిందికి దిగిరి. పొన్నిదొర పామును ఒక కఱ్ఱతో అటు ఇటు కదలించి చూచి చచ్చినదని రూఢి చేసికొని దాని తలపై నుండి బాణమును లాగివేసెను. "దీనికి విషము సోకియుండవచ్చును. శుభ్రము చేయవలె," అని బాణమును మరల భూమిలోనికి గ్రుచ్చి పెట్టెను.

"పాము నిగనిగలాడుచున్నది. పైన అందమైన పొడలు, ప్రక్కల యందు పసిమి, అడుగున తెల్లన, దీని చర్మము తీసి నడుము పట్టీయో, తల పట్టీయో చేయించుకొన్న ఎంత బాగుండును!" వకుళ ఆశతో పలికెను.

"పాములకు బ్రతికి యుండగానే చర్మము తీయుదురు. చచ్చిన తరువాత చర్మము ఊడిరాదందురు. మనవారు వచ్చిన తరువాత దీని సంగతి చూతము," అనుచు పొన్నిదొర ఆ పామును చెట్టుతొఱ్ఱలోనికి త్రోసివేసెను.

అంతలో అల్లంత దూరమున ఘుర్ఘుర ధ్వనులు వినబడెను. పొన్నిదొర వెంటనే కుంతమును చేతికి తీసికొని ఆవైపు చూచెను. ఎలుగుబంటి వెనుక కాళ్ళపై నిలిచి తలయు ముందరి కాళ్ళును ఊపుచున్నది. "దూకుదునా, దూకుదునా," అన్నట్లు నాలుగు కాళ్ళపై గంతులు వేయుచున్నది. ఒక్కొక్క అడుగే ముందుకు నడచి వచ్చుచున్నది.

వకుళ బిగ్గరగా కేకవేసి విల్లందుకొని బాణము తొడిగినది.

"వద్దు వద్దు దానికి ఆ విల్లు, ఆ బాణము చాలవు," అని పొన్నిదొర తన విల్లందుకొని ఇనుప నారాచమును తొడిగెను.

కఱ్ఱచువ్వ కొనకు ఇనుప అలుగును చెక్కిన దానిని బాణము అందురు. చువ్వయు, అలుగును ఒకే ఇనుముతో చేసిన దానిని నారాచమందురు.

ఎలుగుబంటి చాల మొరటైన జంతువు. దాని శరీరము మీది దట్టమైన రోమములలో ఆయుధములు దూరుట కష్టము. పొన్నిదొర ఎలుగుబంటితో పోరుటకు సన్నద్ధుడయ్యెను.

అతని శరీరము ఉప్పొంగెను. మొగము గంభ్రించెను. కన్నులు పెద్దవయ్యెను. ఇప్పుడు పొన్నిదొర ఎలుగుబంటి కంటె రౌద్రముగానున్నాడు. అతని కన్నులకు ఎలుగుబంటి తప్ప మరేదియు కనబడుట లేదు. ఎలుగుబంటి వెనుక కాళ్ళపై నిలిచి తల ఊపు చున్న సమయమున బాణమును చెవి వరకు లాగి వదలెను. అది దాని నోటిలో దూరి మెడ వెనక జేనెడు మొన వెలికి వచ్చినది. ఎలుగుబంటి మరియొక గంతు వేయునప్పటికి పొన్నిదొర భీకరముగా పొలికేక వేసి కుంతముతో దాని రొమ్మున ఒక పోటు పొడిచెను. ఆ పోటునకు నిలబడలేక ఎలుగుబంటి వెనుకకు పడిపోయెను. గొంతులోని బాణము వలన దాని భయంకర ఘుర్ఘుర ధ్వనులు బలహీనములై, మూలుగులయ్యెను. చూచుచుండగానే మూలుగులును ఆగిపోయి ఎలుగుబంటి ప్రక్కకు వాలిపోయెను.

ఈ కేకలును, ఘుర్ఘుర ధ్వనులును, విని పొన్నిదొర పరివారమును, ఏనుగుల పట్టు నిపుణులును ఏమో జరిగిపోయినదని ఆయుధములు ధరించి పరువెత్తుకొని వచ్చిరి. చచ్చి పడియున్న ఎలుగుబంటిని, దాని నోటిలో దూరిన ఇనుప నారాచమును, రొమ్మున దిగి యుండిన కుంతమును చూచిరి. అప్పుడప్పుడే శాంతించుచున్న పొన్నిదొర రౌద్ర రూపమును చూచిరి. బోయభటులకు సంతోషమును గర్వమును కలుగగా, ఏనుగులను పట్టు చంద్రగిరి నిపుణులకు ఆశ్చర్యమును, భయమును కలిగెను. ఇంత శక్తి, ఇంత గురి, ఇంత ధైర్యము, వారు ఎక్కడను చూచి యుండలేదు. బోయదొరలనగా అందరును ఇట్లే యుందురేమో.

వారు తలకొక మాటగా పొన్నిదొరను కొనియాడిరి.

వకుళకు ఇంకను వణకు తగ్గలేదు. తొందరపడి తాను తన బాణమును వదిలి యుండిన యెడల ఎలుగుబంటి ఎంతమాత్రము లెక్కకొనెడిది కాదు. ఈవేళకు ఇద్దరినీ చీల్చివేసి యుండును.

పొన్నిదొర చేతిలోని విల్లును తీసికొని చూచినది. ఇది ఏమి విల్లు? ఎంత బరువు. ఎంత వంచినను అది వంగదే? దీని నుండి వెడలిన బాణము వరుసబెట్టి ఇద్దరిని ముగ్గురి నైనను దూసుకొని పోగలదు. సందేహము లేదు.

ఏనుగు నిపుణులు ఎలుగుబంటిని చూచి చాల సంతోషించిరి.

"యువరాజా. ఇది మనకు చిక్కి చచ్చుట మనకొక వరమైనది. స్వాభావికముగా ఎలుగుబంట్లను చూచిన ఏనుగులకు రోషమెక్కువ. అవి ఎలుగుబంట్లను తరిమి చంపును. మనము ఈ ఎలుగుబంటిని గోతికవతల నిలబెట్టుదము. ఏనుగులు నీటికై వచ్చినపుడు అవి ఎలుగుబంటిని చూచును. ఎలుగుబంటిని చూచి అవి ఈ దారిలోనే దానిపైకి పోవును. అన్నియు గోతిలో పడును."

"మీరేమైనా చేయుడు. కానీ మొదట వెంటనే దానిని బాణము, కుంతములతో సహా మహారాణి గారికి చూపవలె"

బోయభటులు ఎలుగుబంటి శరీరమును కోలగొగ్గెర కట్టి పొడవైన కఱ్ఱకు కూర్చుకొని ఇరువైపులా కొందరు కొందరు మోసుకొని పోయి దేవాలయ ప్రాంగణము చేరిరి.

ఒకడు వకుళ చంపిన త్రాచుపామును కూడ పట్టుకొని పోయెను. వకుళ సుడిగాలి వలె గుడారములో దూరి రాణికిని తలిదండ్రులకును ఈ విషయమును చెప్పి వారిని వెలుపలికి పిలచుకొని వచ్చెను. ఎలుగుబంటినోటిలోని బాణమును, రొమ్ములోని కుంతమును చూచి జయవర్మ ఆశ్చర్యచకితుడయ్యెను. అతని భార్యయు, మహారాణియు కన్నులింతలు చేసికొని చూడసాగిరి. భటులు ఎలుగుబంటి రొమ్ములో దూరిన కుంతమును లాగి వేసిరి కాని నోటిలో దూరి మెడలో పొడుచుకొని వచ్చిన బాణము ఊడిరాలేదు. అలుగు అడ్డముగా నున్నది. అది ఇనుప బాణము కనుక దానిని వజ్రపు రంపముతో కోసి ఊడదీసిరి. ఇంతసేపు వకుళ పొన్నిదొర వీరకృత్యమును వర్ణించుచునేయుండెను.

రాణి పొన్నిదొరను దగ్గరకు పిలిచి చెంపపై మెల్లగా తట్టి "గట్టివాడవే. ఏమో అనుకున్నాను, మాట చెల్లించుకున్నావు" అని ప్రశంసించెను.

"తల్లి ఆజ్ఞను కుమారుడు నెరవేర్చవలదా? ఇప్పటికే ఆలస్యము చేసినాను." పొన్ని దొర మరింత వినయముతో పలికెను.

"ఈ ఎలుగుబంటి చర్మమును జాగ్రత్తగా తీసి ప్రత్తిని గానీ, నారను కానీ నింపి ఎలుగుబంటి రూపముతో ఒక బొరెపు బొమ్మ చేయుడు. అది ఎప్పుడును నా అంతఃపురము ముందుండవలె," రాణి ఆజ్ఞాపించెను.

"ఆ పని రేపు చేయుదుము. ఈ రాత్రి దీనిని ఏనుగుల మాటు వద్ద పెట్టవలె. ఈ

రాత్రికి మనవారు ఏనుగుల మందను మన మాటు వద్దకు తోలుకొని వత్తురట. అవి దీనిని తరుమ వచ్చి గోతిలో పడును. రేపు ఉదయమే దీని చర్మము ఒలిపించు పనిని చూతుము"

మరల అందరును ఆ ఎలుగుబంటిని మోసుకొని మాటు వద్దకు వెళ్ళిరి. వారు అటు వెళ్ళగానే అందరును వకుళ చంపిన పామును చూచి ఆమె విలువిద్య యొక్క నైపుణ్యమును మెచ్చుకొనిరి.

వకుళకు తాను పామును అంత నైపుణ్యముగా చంపుటకంటే, ఎలుగుబంటితో జరిగిన పోరాటమున తాను పొన్నిదొరను అంటి పెట్టుకొని ఉండుటయే మిన్నగా అనిపించుచున్నది. అతని రౌద్ర రూపము కన్నుల యెదుట కనబడుచునే యున్నది. అతని గర్జనలు వినబడుచునే ఉన్నవి.

పాముల వాడు వచ్చి పాము చర్మము ఇప్పుడు ఊడిరాదని చెప్పి ఒక చిన్నెమును దాని నోటిలో పెట్టి చిదుగులు పేర్చి కాల్చివేసెను.

తప్పెటలు, కొమ్ముబూరలు, కాహళులు పట్టుకొని వెళ్ళిన వారు త్వరలోనే ఏనుగుల గుంపును కనుగొనిరి. నాలుగు పెద్ద ఏనుగులు రెండు గున్న ఏనుగులు మందగా కనబడినవి. అందరును కూడి వాద్యములను మ్రోగించుచు, బూరలు ఊదుచూ, దివిటీలను ఊపుచు, కొన్ని దివిటీలను వానిపైకి విసరివేయుచు, అరచుచు, అదలించుచు ఏనుగులను మాటు వైపునకు తోలసాగిరి. ఏనుగులు వారిపైకి దాడి చేసినవి. భటులు పుంఖాను పుంఖములుగా బాణములు వేసిరి. బాణముల దెబ్బకు నొచ్చి ఏనుగులు తొండములతో బాణములను విదిలించుకొనుచు వాగువైపునకు పరుగు తీసినవి. కొంత దూరము పోగానే ఏనుగులకు కొంత దూరమున ఎలుగుబంటి నిలబడి యుండుట కనబడెను. ఇంకేమున్నది. తొండములెత్తి ఘీంకరించుచు ఎలుగుబంటిపై దాడి చేయుటకు అన్నియు ఒకే గుంపుగా ముందుకు సాగినవి. అంతే. ఆరు ఏనుగులును గోతిపైని కప్పడము మీద అడుగులు పెట్టి ఆ కప్పడము కూలిపోగా అన్నియు గోతిలో పడిపోయినవి. గోతి నుండి పైకి వచ్చుటకు అవి చేసిన ప్రయత్నములు ఫలించలేదు. దంతములతో దరులను కూరాడినవి. తొండములతో మట్టిని పట్టి లాగినవి. మట్టి పెళ్ళలు రాళ్ళు రాలినవి కాని ఎక్కి వచ్చుటకు దారి ఏర్పడలేదు. అటుఇటు తిరుగుటకు కూడా అవకాశము లేదు. గోతిలో పడినప్పుడు తగిలిన గాయములును, బాణములు గ్రుచ్చుకొన్న గాయములును వానిని ఒక చోట నిలువ నిచ్చుట లేదు. ఆ చాలియు చాలని గోతిలోనే అవి అటు ఇటు తిరుగుచు, ఘీంకరించుచు అల్లకల్లోలము చేయుచున్నవి.

తెల్లవారువేళకు ఈ వార్త దేవాలయముకు చేరినది. గోతిలోని ఏనుగులను చూచుటకు అందరును గుంపులుగుంపులుగా వచ్చి చేరిరి.

పశువైద్యుడు రామోజు వచ్చి చూచెను. గోతిలోనున్న ఏనుగుల కన్నిటికిని గాయములైనవి. కొన్ని గాయములు గోతిలో పడినప్పుడు దరులు ఒరిసికొనుటచే ఏర్పడినవి. కొన్ని గాయములు బాణములచే ఏర్పడినవి. రెండు ఏనుగులకు గ్రుచ్చుకొన్న బాణములలో కొన్ని రాలిపోక

ఇంకను తగులుకొనియే యున్నవి. కమ్మరులు తమ యొద్దనున్న పొడవైన కొలిమి పట్టు కట్టెలకు పొడవైన కోలలు అంటగట్టి గట్టుపై కూర్చొని నేర్పుగా బాణములను లాగివేసిరి. గాయములు అట్లే యుండినచో కొన్ని దినములలో చీము పట్టి వ్రణములగును.

రామోజును అతని శిష్యులును అడవిలో వెదకి వెదకి రెండు గోనె సంచుల నిండుగా కొన్ని ఆకులు, వేళ్ళు, మూలికలు తెచ్చిరి. బొక్కెనల నిండుగా ఔషధ ద్రవములు కలిపి పెట్టుకొనిరి. ఆరు మంది భటులు గొయ్యి చుట్టును గట్టుపై కూర్చుండి ఒక్కొక్కరు ఒక్కొక్క ఏనుగుపైన దృష్టి నిలిపి పొడవైన అబకలతో ఔషధ ద్రవమును తీసి ఏనుగుల గాయములపై పోయుచుండిరి. ఒక వెదురు గడకు ఒక కొన యందు గుడ్డ పీలికలను కుచ్చుగా కట్టి మందునీటిలో ముంచి గాయములపై పూయుచుండిరి.

చంద్రగిరి నుండి వచ్చిన గజ శిక్షకులు “వీటికి రెండు దినములు తిండి పెట్టరాదు. సాయంత్రము వరకు నీరు కూడ ఇయ్యరాదు అవి అలసిపోవలె. సోలిపోవలె. అప్పుడు గాని అవి మనకు లొంగవు. అప్పుడు ఒక్కొక్క మావటివాడు ఒక్కొక్క ఏనుగును ఎన్నుకొని దానికి తానే మేతయు, నీరును అందివ్వవలె. ఆ ఏనుగు ఆ మావటివానిని తన రక్షకునిగా భావించి ఆ నెనరుతో వానికి లొంగును.” అని బోయభటుల నుండి కొందరిని మావటి వాండ్రుగా నిర్దేశించి పోయిరి.

పల్లవ సైనికులు రెండు చోట్ల మాటువేసియుండిరి. పొన్నిదొర మాటులో పడిన ఏనుగులను వెదకుచు వచ్చిన మరియొక ఏనుగుల గుంపు మరునాడు పల్లవుల మాటులో పడినవి. అందులో మూడు గున్న ఏనుగులు, రెండు పెద్ద ఏనుగులు, రెండు పిల్లలతో కూడిన తల్లి ఏనుగులు. మొత్తము తొమ్మిది.

వాటికిని రామోజు అదే విధముగా చికిత్సలు చేసినాడు.

పొన్నిదొరకు కావలసిన ఏనుగు గున్నలు సమకూడినవి. ఇక వానిని మచ్చిక చేసికొన వలసియున్నది. అది ఎంతకాలము పట్టునో తెలియలేదు. పల్లవ సైనికులు ఇంకను ఏనుగులు కావలెనని మరియొక చోట గోతులు త్రవ్వి సిద్ధము చేయుచుండిరి.

రాత్రి భోజనానంతరము వకుళ దేవాలయ ప్రాంగణములో ఇసుక దిబ్బపై కూర్చుండి ఆకాశమువైపు తదేకముగా చూచుచుండెను. ఆనాడు బహుళ తదియ. చంద్రుడు కొంత ఆలస్యముగా ఉదయించినాడు. చంద్రబింబము పున్నమి నాటి వలె సంపూర్ణ వలయా కారముగా లేదు. ఒకవైపున కొంత వెలితిగా కనబడుచున్నది.

“ఏమో అంత తదేక ధ్యానముతో చంద్రునివైపు చూచుచున్నారు. చందమామలో మీ ముఖము పోలికలు చూచుచున్నారా?” అనుచు పొన్నిదొర సమీపించెను.

“ఓహో తెలుగు బాలకుడు కవిత్వము కూడ ఒలకబోయుచున్నాడే. తెలుగు వారు కవిత్వము కూడ చెప్పుదురా?”

“తెలుగు వారు కవిత్వము చెప్పకేమి? మీ తమిళుల కంటె ముందే తెలుగువారు కవిత్వము

చెప్పియున్నారు. మీరు ఒప్పుకొనరు. అంతే.”

“ఇదేదో క్రొత్తగా ఉన్నది. తెలుగులో ఇంకను కవిత్వము పుట్టలేదని కంచిలో మావారు చెప్పుకొనుచుందురు.”

“తెలుగులో కవిత్వము పుట్టలేదు కాని తెలుగువారు కవిత్వములు చెప్పినారు. తమిళములో ‘తిరుక్కురళ్’ కంటే ముందే తెలుగువారు కవిత్వము చెప్పియున్నారు. ‘తిరుక్కురళ్’లో సూక్తులు మాత్రమున్నవి. తెలుగువారి కవిత్వము నానారస భరితము.”

“కొంత వివరముగా చెప్పరాదా?”

“అశోక చక్రవర్తి కాలమున బౌద్ధమతము భరతఖండమంతయు వ్యాపించినది. బౌద్ధమతముతో బాటు పాలీభాషయు భరతఖండమునందంతటను వ్యాపించినది.”

“తమిళదేశమున పాలీ భాష వ్యాపింపలేదు.”

“ఆంధ్ర దేశము నందు వ్యాపించినంత గాఢముగా వ్యాపింపలేదేమో గానీ దాదాపు కావేరీ తీరము వరకు దాని ఛాయలు అల్లుకొన్నవి. పాలీ భాషయొక్క రూపాంతరమే ప్రాకృత భాష. అదియే రాజ భాషయై పోయినది. తరువాత ఆ భాషయే విద్యావంతుల, మేధావుల వ్యవహార భాషయైపోయినది. అయినప్పటికిని తెలుగు జానపదులు దేశభాషయైన తెలుగులో నూర్లకొలది పద్యములను రచించుకొన్నారు. అవి యన్నియు జనశ్రుతిలో నుండినవి. అవి వివిధములైన మాత్రా ఛందస్సులలో, వివిధములైన లయలతో చిన్న చిన్న చాటు పద్యములుగా నుండినవి. ఆ పద్యములలోని రసపుష్టికిని, భావ సౌందర్యమునకు, భాషా సౌందర్యమునకు, తెలుగువారి సంస్కృతికి ముగ్ధుడై శాతవాహన రాజైన హాల చక్రవర్తి ఆగాథలను సేకరించి పాలీభాషలోనికి అనువదించినాడు. వివిధ దేశీయ ఛందస్సులలోని పద్యముల నన్నింటిని తనకు అలవాటైన, సొంపైన ఆర్యావృత్తపు ఛాయలతో అనువదించినాడు. అన్నియు కృష్ణాగోదావరీ నదులు మధ్య నున్న భూభాగమునకు చెందినవి. ఈ భూభాగమునకు వెలుపలగల తెలుగువారి పద్యములను ఆయన అధికముగా సేకరించలేదు. అవియు కొన్నినూర్లు ఉండవచ్చును. ఆ రాజు వాటిని కూడా సేకరించి యుండిన యెడల ఆనాటి తెలుగు కవుల రసైక దృష్టి ప్రపంచమునకు వెల్లడియై యుండెడిది. హాల చక్రవర్తి ఆ పద్యములకు గాథలు అను పేరు పెట్టెను. ఆయన సేకరించినవే కాక ఆ పద్యములచే ప్రేరితుడై తానును కొన్ని రచించి ఏడు నూర్ల గాథలను గ్రంథస్థము చేసి వాటికి గాథాసప్తశతి అని పేరు పెట్టెను. ప్రస్తుతము ఆంధ్రదేశమున అందరును వాటిని చదువుచున్నారు. ఉత్తర దేశముల వారును చదువుచున్నారు. ఇప్పుడైనను అంగీకరింతువా హాలుని కంటే పూర్వమే తెలుగు వారు కవిత్వము చెప్పినారని”.

“ఆ గాథలు తెలుగుభాషలోనే ఉండిన యెడల అవి తెలుగువారు వ్రాసిరని నమ్మవచ్చును. అవి ప్రాకృతభాషలో నున్నవి. ప్రాకృత భాష భరతఖండమంతయు వ్యాపించి యున్నప్పుడు ప్రాకృత గాథలను భరతఖండమున ఎవరైనను వ్రాసియుండవచ్చుకదా? తెలుగువారే వ్రాసినారని ఎట్లు చెప్పగలరు.”

"ఆ గాథలలో గోదావరీ నది ప్రస్తావన చాలసార్లు వచ్చినది. తెలుగుసీమలో వ్యవహారము లోనున్న తెలుగు పదములు అందులో చాలా ఉన్నవి. తెలుగువారి ఆచార వ్యవహారములును అందులో ఎక్కువగా వర్ణింపబడినవి. వాటిని సేకరించిన హాలుడు ఆంధ్రుడు. అతని రాజధాని ధాన్యకటకము ఆంధ్రదేశమున నున్నది. కావున ఇవి యన్నియు తెలుగువారు రచించినవే. ఇంకను ఎన్ని సాక్ష్యములు కావలె?"

"సరే. ఆ మాటకే వత్తము. తెలుగువారే ఈ గాథలను ప్రాకృత భాషలో వ్రాసి యుందురేమో?"

"ఈ గాథలన్నియు తెలుగు గ్రామీణ జీవితమును వర్ణించునవి. తెలుగు జానపదులు వ్రాసినవి. ఈ విశాలమైన తెలుగునేలపై ఉన్న వివిధ జానపదులు తమ వ్యవహారములో లేని రాజ భాషయైన ప్రాకృత భాషలో అందరును ఒకే ఛందస్సులో వ్రాయుట అసంభవము. కావుననే వీటిని హాలుడను ఏకైక వ్యక్తి ప్రాకృతములోని ఆర్యా ఛందములోనికి అనువ దించినాడని చెప్పుచున్నాను."

"మీరు చదివినారా?"

"ప్రధానముగా దానినే చదివినాను."

"ఏదీ ఒక పద్యము."

"తుహ ముహసారిచ్ఛం. ఐలహ ఇత్తి సంపుణ్ణ మండలో విహిణా
అణ్ణమఅం వ్వ ఘడఇఉం పుణోవి ఖండిజఇ మిఅంకో"

వకుళముఖము అడ్డముగా త్రిప్పి "అర్థము కాలేదు ఇది తెలుగుకాదే," అనెను.

"ఇది తెలుగుకాదు ప్రాకృతభాష. దీనినే నేను తెలుగులోనికి ఇట్లు అనువదించితిని–"

నీ ముఖమ్ముసాటి నిలువని చంద్రుని
క్రొత్తగాగ చేయగోరి బ్రహ్మ
ఖండఖండములుగ ఖండించుచున్నాడు
తరుణి కనవె శశియు తరగిపోయె

"అర్థము కాలేదు," అన్నది వకుళ కొంటెగా నవ్వుచు.

"బ్రహ్మదేవుడు నీ ముఖమును, చంద్రబింబమును పలుమార్లు పరిశీలించి చూచినాడు."

"ఆఁ" అన్నది వకుళ

"నీ ముఖమనగా నిజముగా నీ ముఖము కాదు. నాయిక యొక్క ముఖము. నాయకుడు నాయికతో చెప్పుచున్నాడు."

"సరి సరి – తరువాత."

"చంద్రబింబములో మచ్చ ఉండుట వలన అది నీముఖమునకు సాటిరాలేదు. బ్రహ్మ దేవుడు సిగ్గుపడినాడు. చంద్రబింబమును మరియొక విధముగా, క్రొత్తగా, అందముగా నిర్మింపబూనుకొన్నాడు. కనుక చంద్రబింబమును దినమునకొక ముక్క వంతున ముక్కలు ముక్కలుగా ఖండించుచున్నాడు. చివరకు ఆ ముక్కలను కలిపి, పిసికి, మరింకేదయినా

పదార్థమును కలిపి నీ ముఖముతో సరితూగునట్లు చంద్రబింబమును నిర్మింప దలచెను కాబోలు.”

వకుళకు నవ్వు వచ్చినది.

“ఔరా చమత్కారము. ఎంత చమత్కారమునకైనను ఒక హద్దుండవలెను. మరి ఇంత ప్రయత్నించినను చంద్రునిలోని మచ్చ అట్లే ఉన్నదే!” అన్నది.

“నీ ముఖముతో తులతూగునట్లు చంద్రుని సృష్టించుట బ్రహ్మతరముకాదు.”

వకుళ మరింత బిగ్గరగా నవ్వినది. “ఇది మరియు చమత్కారము. మరి తెలుగున ఇంతవరకు కవిత్వము లేదంటిరి. ఈ తెలుగు పద్యమెట్లు కవికట్టితిరి.”

“ఇటీవల తెలుగువారు క్రొత్తగా తెలుగు ఛందస్సును సృష్టించుకొని పద్యములు వ్రాయు చున్నారు. చిన్నచిన్న కావ్యములు కూడా వ్రాయుచున్నారు. నేను గుంటూరులోనూ ధాన్య కటకములోనూ చూచితిని. కార్తికేయ జననము, రేణుకాదేవి మహాత్మ్యము, దక్షయజ్ఞము అనునవి. అన్నియు చిన్న చిన్న కావ్యములు. ఈ చిన్నచిన్న విత్తనముల నుండి అచిరకాలము లోనే మహావృక్షములు బయలు వెడలగలవు.”

“ఈ గాథను మీరు మరల తెలుగులో వ్రాయుదురా?”

“నాకంత తీరికయు, ఓపికయు లేవు. రాజ్యవ్యవహారములలో మా అన్నకు తోడ్పడవలె. తెలుగు భాషయు, తెలుగు పద్యరచనయు ఒక పరిపూర్ణ దశకు వచ్చిన తరువాత ఎవ్వరైన ఒక కవిసార్వభౌముడు దీనిని తెలుగులోనికి అనువదింపకపోడు. కాని నాకొక సందేహము. సంస్కృత వ్యామోహము వదలని మా తెలుగు కవులు ఈ తెలుగు గాథలను కూడా సంస్కృతమయములుగా అనువదింతురేమో. ఇందలి తెలుగు తనమును మాపివేయుదురేమో.”

పల్లవుల మాటుల వద్దను, పొన్నిదొర మాటు వద్దను ఏనుగులను మచ్చిక చేసికొను ప్రక్రియ ప్రారంభమైనది. పల్లవులు రెండవసారి వేసిన మాటులో మరికొన్ని ఏనుగులు పడినవి. పొన్నిదొరకు చిక్కిన ఒక పెద్ద ఏనుగును, రెండు గున్నలను పొన్నిదొరకే వదలిరి. తక్కిన వాటిని పల్లవులు తీసికొనిరి. పల్లవుల మాటులో పడిన ఏనుగులలో మూడు గున్న ఏనుగులను పొన్నిదొరకు ఇచ్చునట్లును తీర్మానించుకొనిరి. దీనితో పొన్నిదొర కోరుకున్నట్లు అయిదు గున్న ఏనుగులేకాక ఒక పెద్ద ఏనుగును లభించెను.

ప్రస్తుతము ఎక్కడున్న వానిని అక్కడనే ఉంచి తమకు నిర్ణయింపబడిన ఏనుగులకు తమ మావటి వారిచే మేతయు నీరును ఇచ్చుచుండిరి. ప్రతి మావటి వాడును గొయ్యిలోని తన ఏనుగుకే మేతయు నీరును స్వయముగా నోటికి అందియ్యవలె. ఆ యేనుగు ఆ మావటివానినే తమ శ్రేయోభిలాషగా భావింపవలె.

చంద్రగిరి నుండి మచ్చికైన ఏనుగులను రప్పించి గోతుల ఒడ్డున గొలుసులతో కట్టివేసిరి. ప్రాత ఏనుగులును క్రొత్త ఏనుగులును చూపులతోనూ, ఘీంకారములతోనూ, తొండముల కదలికతోనూ పరస్పరము పలుకరించుకొనుచుండెను.

మావటివారు ప్రతి దినము నాలుగైదుసార్లు అంకుశముతో పొడుచుచు అదలింతురు.

ఏనుగులు అంకుశమును చూడగానే భయపడుట, వెనుకకు జగ్గుట, ఓరగా పోయి ఒదిగి నిలుచుట అలవాటైనది.

నెల దినముల తరువాత గోతులకు ఒక ప్రక్క ఏటవాలుగా త్రవ్వి ఏనుగులు ఎక్కి వచ్చుటకు అవకాశము కల్పించిరి. అవి ఎక్కిరాగానే చాకచక్యముతో గొలుసులతో బంధించిరి.

పొన్ని తన అయిదు ఏనుగు గున్నలను, పెద్ద ఏనుగును దేవాలయపు ఉత్తర భాగమున కట్టిపెట్టెను. పల్లవులు దక్షిణ భాగమున కట్టిపెట్టిరి. దేవాలయ ప్రాంగణములో ఎల్లప్పుడు జన సంచారము ఉండుట వలన ఏనుగులకు మనుష్యులనిన బెదురుపోయి చెలిమి ఏర్పడెను.

ఆ ఏనుగులను ఇంకను ఒక నెల దినములు మచ్చిక చేసికొనవలసియున్నది. మావటి వాని ఆజ్ఞలను అర్థము చేసికొనుట, చెప్పినట్లు చేయుట నేర్పవలెనన్నచో ఒక నెల దినములు పట్టవచ్చును.

ఇప్పుడు శంకరశర్మయు తిమ్మన శ్రేష్ఠియు కొండపైననే యున్నారు. తిమ్మనశ్రేష్ఠి చంద్రగిరి వర్తకశ్రేణి వారి ద్వారా పొన్నిదొరకు అవసరమైన ధనమును తెప్పించి ఇచ్చుచున్నాడు. శంకరశర్మతో మహారాణి గారికి మంచి కాలక్షేపము జరుగుచున్నది. బ్రాహ్మణుడు మంచి మంచి పురాణ గాథలు చెప్పుచున్నాడు. ప్రతిదినము పంచాంగము చెప్పుచున్నాడు.

వకుళ, పొన్నిదొరల వ్యవహారమును శంకరశర్మ గమనించుచునే యున్నాడు. వకుళ ఏదో ఒక నెపమున పొన్నిదొరను కలిసికొనుటకు వచ్చుట, వకుళ కొంతసేపు కనబడక పోయినచో పొన్నిదొర కాలు కాలిన పిల్లివలె తిరుగుట, వకుళ పల్లవుల మాటు వద్దకుపోకుండ బోయదొరల మాటు వద్దనే ఎక్కువ కాలము గడుపుట, ఇద్దరును ఘడియల పర్యంతము మాటలలో మునిగిపోవుట, ఆ సమయమున ఇరువురి మొగముల యందలి ఆనందాతి రేకములు శంకరశర్మ గమనించుచునేయున్నాడు.

శంకరశర్మ పొన్నిదొరకు గురువు, ఇప్పుడు ఏనుగులను పట్టుకొనుటకు వచ్చిన బోయల సమూహమునకు పెద్దదిక్కు, వ్యవహర్త. ఈ వ్యవహారమును ఇట్లే కొనసాగించి ఫలవంతము చేయవలెనా? లేక మొగ్గలోనే త్రుంచివేసి ఎవరి దారి వారు చూచుకొనవలెనా? ఇది శంకరశర్మకు పెద్ద సమస్యయైపోయెను.

బోయభటులలో వయోధికుడు, విశ్వాసపాత్రుడైన ఒకనిని పిలిచి వానికి సమస్తమును వివరించి చెప్పినాడు. ఆ భటుడును అంతయు చూచుచునేయున్నాడు కదా.

"నీవు వెంటనే కట్టెపు దుర్గమునకు పోవలె. నన్నిదొర గారికి ఈ విషయమును సవివరముగా చెప్పవలె. ఆయన ఏమి సెలవిచ్చునో తెలిసికొని రావలె. నీ వెంట ఐదుగురు భటులను తీసికొని వెళ్ళుము. వారికి ఇంటి పైన కలవరము పడినదనియు, ఆరోగ్యము బాగుగా లేదనియు చెప్పుము. ఇదే ప్రయాణమునకు నెపము. వచ్చునప్పుడు పది మంది భటులను అదనముగా తోడ్కొని రమ్ము. ఏనుగులను ఏగించుకొని పోవలెకదా?"

అందరును శంకరశర్మను ముందుంచుకొని పొన్నిదొర యొద్దకు వెళ్ళిరి.

"వీరికి ఇంటిపై కలవరము పడినది. ఆరోగ్యము కూడా బాగుగా లేదను వంక

చెప్పుచున్నారు. వీరిని పంపివేసి పది మంది భటులను పిలిపింతము. కొత్త ఏనుగులను పట్టుకొని పోవలెకదా. నేను వీరిని ప్రయాణమునకు సిద్ధము కమ్మంటిని. నీ అనుమతి అయినచో వీరు వెళ్ళుదురు." అన్నాడు శంకరశర్మ కాదని చెప్పుటకు ఆస్కారములేకుండా.

పొన్నిదొర సరే అనెను. వారు వెళ్ళిపోయిరి.

తిరువేంగడమునకు కొన్ని సంవత్సరములుగా యాత్రికుల రాకపోకలు ఎక్కువైనవి. ముఖ్యముగా పల్లవరాణులు చేయించెడు బ్రహ్మోత్సవములు తిరువేంగడమునకు మిక్కిలి ప్రచారమును తెచ్చిపెట్టినవి. ఒకసారి బ్రహ్మోత్సవములకు వచ్చిన వారు రెండవసారి మరికొంత మందిని వెంటబెట్టుకొని వచ్చుచున్నారు. వచ్చిన వారు కొన్ని దినములు కొండ పైననే ఉండి చుట్టుప్రక్కలగల తీర్థములనన్నింటిని దర్శించుచున్నారు.

కొందరు దేవాలయము చుట్టును విశాలమైన వీథులు వదలి ఇండ్లు కట్టుకొని అందే నిలిచిపోవుచున్నారు. సత్రములు ఏర్పడినవి. విపణి వీధియు ఏర్పడినది. దేవాలయమునకు ఆదాయము పెరిగినది.

పల్లవ మహారాణి దేవాలయము నందు కొన్ని మార్పులు చేసినది. పుష్కరిణిని మరింత విశాలముగా త్రవ్వించి తాపలు నిర్మింపజేసినది.

వకుళయు ప్రతిదినమును దేవాలయములోనికి పోయి మలయప్ప సేవలో అర ఘడియ గడపనిదే ఏ పనియు చేయదు.

ఏనుగులను పరిశీలించుచున్న పొన్నిదొర దగ్గరికి వకుళ మెల్లగా వచ్చినది. కావి రంగు పావడయు, తెల్లని పయ్యెద అంశుకమును ధరించినది. చెవులకు ముత్యాల లోలకములు, మెడలో ఎఱ్ఱని పగడముల దండ, కాళ్ళకు వెండి అందెలు, చేతులకు బంగారు మురుగులు, తలవెనుక కొంత కుడివైపుకు వాలిన కొప్పు, కొప్పుచుట్టును మల్లెల దండ.

పొన్ని దొర వకుళవైపు రెప్ప వాల్పక చూచుచు నిలబడిపోయెను. అతని గుండె గుబగుబలాడసాగెను. మనస్సు వశము తప్పుచున్నది.

"బంగారూ," వకుళ నవ్వుచూ పలుకరించెను.

"ఇదియేమి క్రొత్త పిలుపు?"

"ఇది నీపేరే."

పొన్ని అర్థము కానట్లు చూచెను.

"తమిళ భాషలో పొన్ను అనగా బంగారు."

"అట్లని నాకు కొత్తపేరు పెట్టుదువా. నన్ను పొన్ని అనియే పిలువుము."

"ఆ పేరుతో నేను పిలువను. నాకు బంగారు అను పేరే ఇష్టము."

"ఆ పేరు బాగు లేదు. నా రంగును వెక్కిరించినట్లున్నది."

"నీ రంగుతో నాకేమి పని. నాకు ఈ పేరే నచ్చినది. నేను ఆ పేరుతోనే పిలిచెదను"

"సరే.సరే. నీఇష్టము. బాగులేదని చెప్పుటకు నేనెవరు. 'తావలచినది రంభ.' "

"మరి పొన్ని వలచినది?"

పొన్నిదొర రెండు క్షణములు తటపటాయించెను.

వకుళ మరల అడిగెను "మరి పొన్ని వలచినది?"

"వకుళ", పొన్ని ఈ మూడు అక్షరములను మెల్లగా పలికెను.

వకుళ చకితురాలై అట్లే పొన్నివైపు చూచుచు ఉండిపోయెను.

పొన్నిదొర వకుళ చేతిని తన చేతులలోనికి తీసికొని రొమ్ముపై నుంచుకొని ఆమె ముఖము వైపుచూచుచు "ఇక ఒక వారములో మేము ఏనుగులను తోలుకొని వెళ్ళిపోవుదుము." అనెను.

వకుళ తలవంచుకొని పొన్ని రొమ్ముపై నున్న తన చేతితో అతని రొమ్ముపై మెల్లగా రుద్దుచు "మీ అన్నగారు వచ్చి అడిగిన.."

"అడిగి లేదనిపించుకొనుట మా అన్నకు అలవాటు లేదు. నేను సహింపను. కాబట్టి ముందుగా మీ పెద్దలే..."

వకుళ కొంతసేపు అట్లే ఉండి మెల్లగా తన చేతిని విడిపించుకొని వెడలిపోయెను.

ఆ సాయంత్రము వకుళ మహారాణి ప్రక్కన కూర్చుండి రాణి మెడలోని ముత్యాల దండను, బంగారు గుండ్లదండను, మరికొన్ని హారములను చిక్కువిడిపించుచున్నట్లు సవరించుచు మెల్లగా "అత్తా" అనెను.

ఎంతటి మహారాణియైనను తన తండ్రికి చెల్లెలే కదా. చిన్నప్పటి నుండియు చనువుతీసికొన్నది. పైపెచ్చు బిడ్డలు లేని మహారాణి వకుళను చాల ప్రియముగా చూచుకొనుచున్నది. "ఇది ఏదో అడుగుటకే ఈ నంగనాచి సేవలు చేయుచున్నది," అనుకొని మహారాణి "ఏమే" అనెను.

"నీ కొడుకుకు పెండ్లి చేయవా?"

మహారాణి వకుళ చెవి పట్టుకొని తన వైపు లాగుకొని "ఏమే తిక్కగా నున్నదా? కొంచెము కూడ భయము లేకుండా పోయినది. నేను ఏ కొడుకుకు పెండ్లి చేయవలె," అన్నది.

"దొరికినాడు కదా ఒక క్రొత్త కొడుకు. అమ్మా అనిపిలుచువాడు!"

మహారాణికి ఏమియు అర్థము కాలేదు. ప్రజలందరు తనను అమ్మగారు అనియే పిలుతురు. "ఎవడే ఆ క్రొత్త కొడుకు. సరిగా చెప్పుము," అని వకుళ బుగ్గపై ఒక పోటు పొడిచినది.

వకుళ ఆ గుడారమునందే ఒక చోట ప్రత్తికూరి కుట్టి నిలబెట్టి యున్న బోరెపు ఎలుగుబంటిని చూపినది.

మహారాణికి మొదట ఏమియు అర్థము కాలేదు. క్రమముగా ఒక్కటొక్కటియు ఆమె మనఃఫలకమున ప్రత్యక్షము కాసాగెను. ఈ ఎలుగుబంటిని ఇచ్చినవాడు పొన్నిదొర. అతడు తనను ఎప్పుడును 'అమ్మా' అనియే పిలుచును. ఇతరుల వలె అమ్మగారూ అనడు. "తల్లి

ఆజ్ఞ కుమారుడు నెరవేర్చవలె కదా" అని ఒకసారి అన్నాడు. "తల్లి కుమారుని కష్టపెట్టదు" అని మరి యొకసారి అన్నాడు. వానిని చూచినప్పుడెల్ల తన హృదయములో ఒక ఆదరభావము కలుగుచుండును. ఓహో ఇతడేనన్నమాట వకుళ చెప్పుచున్న క్రొత్త కొడుకు.

మహారాణి మొగమును కన్నులును పెద్దవి చేసికొని "అమ్మో ఎంతదానివైపోతివే," అని వకుళ చెంపపై కొట్టుటకు చేయెత్తెను. వకుళ అత్త ఒడిలోనికి వాలిపోయి ఆమె చీరకుచ్చిళ్ళలో ముఖము దాచుకొనెను.

మహారాణి మనస్సులో ఎన్నియో ఆలోచనలు గిఱ్ఱున తిరిగినవి. రెండు నిమిషములు ఏమియు మాట్లాడలేదు. తరువాత మెల్లగా వకుళ ముఖమును పైకెత్తి భుజములు పట్టుకొని తన చేతి పొడవు దూరమున నిలుపుకొని ఆమె ముఖమునే చూచుచు "నిజమేనా?" అనెను. వకుళ కన్నులు వాల్చెను. తలయు వాల్చుకొనెను.

మహారాణి మరికొంత సేపు ఆలోచించి "లే– లే– వెళ్ళి మీ నాన్నగారిని, అమ్మనూ నేను పిలుచుచున్నానని చెప్పి పంపుము" వకుళ చివుక్కున లేచి మహారాణి చెంపపై ఒక ముద్దు పెట్టి గిరుక్కున వెనుదిరిగి మాయమైపోయెను.

ఆ రాత్రి మహారాణియు, జయవర్మయు, అతని భార్యయు ఏకాంతమున సమావేశమైరి. మహారాణి వకుళ మనోగతమును వారికి వివరించినది.

"పొన్నిదొర పేరుకు తగినట్లు బంగారే. ఇటు ఆయుధ ప్రావీణ్యమును అటు విద్యా ప్రావీణ్యమును కలవాడు. సాధారణముగా జానపదులలో ఇంతటి విద్యావంతుడు ఉండుట అరుదు. మన్నన మర్యాద తెలిసినవాడు. ఆత్మాభిమానము మెండుగా కలవాడు. అన్నిటికంటె ముఖ్యమైనది. చిన్నదో, పెద్దదో ఒక రాజ్యమునకు యువరాజు. పల్లవ చక్రవర్తికి తప్ప మరెవరికిని తలవంచవలసిన అవసరము లేనివాడు.

"మీరైనను మీ బిడ్డను ఎవరికీయగలరు? ఏ సేనానికో, దళపతికో, రాజోద్యోగికో ఇవ్వగలరు. అంతేకదా. వాడు నూరుగురికి తలవంచవలె. పొన్ని స్థాయి అటువంటిది కాదు. అన్నకు తప్ప మరెవరికిని తలవంచని స్వతంత్రుడు. దాదాపు రెండుమూడు నెలలుగా పిల్లవాని సమస్త విషయములును పరిశీలించినాము. అన్నింటికంటె ప్రధానమైనది వకుళ అతనిని పరిశీలించి, మెచ్చుకొని వరించినది. ఆలోచింపుడు"

జయవర్మ వరుసకు మహారాజు గారి బావమరదియే గాని ఎందుకో మహారాజు ఏనాడును అతనికి ప్రాముఖ్యము నిచ్చినది లేదు. ఎట్టి అధికారమును కట్టబెట్టినది లేదు. రాణిగారి అన్నగారు అను గౌరవము మిగిలి యున్నది. వకుళ పెండ్లి విషయమున మహారాజు ఎంతమాత్రము శ్రద్ధ చూపు సూచనలు లేవు. మహారాణి మాత్రము యేమి చేయగలదు. మహారాణి చెప్పినట్లు తమ పాలిటికి ఇదియే పెద్ద సంబంధము. ఒక చిన్న రాజ్యపు ప్రభువుల యింటికి యువరాణిగా వెళ్ళుచున్నది. ఇంతకంటెను ఏమి కావలెను?

"మమ్ములను అడుగవలెనా? మాకింత నచ్చచెప్పవలెనా? వకుళ నీ బిడ్డకాదా? దాని బాగోగులపై మాకంటే నీకే ఎక్కువ శ్రద్ధ అని మాకు తెలియును. నీ యిష్టము" ఇరువురును ముక్తకంఠముతో చెప్పిరి.

అప్పటి నుండియు మహారాణి ఏదో ఒక మిష మీద పొన్నిదొరను తన సమక్షమునకు పిలిపించుకొని అతని కుటుంబ విషయములును, బోయకొట్టముల విస్తీర్ణము, సంఖ్య అచ్చటి పరిస్థితులు, బోయ రాజ్యము యొక్క ఆదాయ వ్యయములు, ఆదాయ వనరులు, రేవు పట్టణముల నిర్వహణము మొదలగు వివరములన్నియు యథాలాపముగా అడిగినట్లు అడిగి తెలిసికొనసాగెను. కోట, సైనికులు, ఆశ్విక దళము మొదలగునవియు తెలిసికొనెను. పొన్నిదొర మాటలను బట్టి అతని అన్న నన్నిదొర ప్రాభవమును ఊహించుకొనెను.

శంకరశర్మ అంతయు గమనించుచునే యున్నాడు. మహారాణి పొన్నిదొరను పిలిపించు కొనుటలోని ఆంతర్యమును ఊహించుచున్నాడు. పొన్నిదొర మహారాణిని దర్శించిన ప్రతి సారియు ఏదో కుతూహలము కొలది అడిగినట్లు "రాణి ఏమి చెప్పినది. ఏమి అడిగినది, ప్రసన్నురాలుగానున్నదా అప్రసన్నురాలుగానున్నదా. అక్కడ ఏమైనా తినబెట్టిరా వట్టి మాటలేనా? జయవర్మ మనతో సఖ్యముతో నున్నాడా ఉదాసీనుడుగా నున్నాడా– మన బోయకొట్టములను గురించి ఏమడిగిరి. ఏమిచెప్పితివి," అని మెల్లగా అడుగసాగినాడు. పొన్ని మాటలను బట్టి మహారాణి హృదయమును కొంతకొంత పసిగట్టగలిగినాడు. అంతయు సానుకూలముగానే ఉన్నది. మహారాణికి ఆ ఉద్దేశ్యము లేని యెడల పొన్నిదొరతో ఇన్ని వివరములేల మాట్లాడును? వకుళా పొన్నిదొరల వ్యవహారము తాము గమనించినట్లే వారును గమనించియుందురు. ఇష్టము లేనిచో అప్పుడే నిలువరించి యుందురు. శంకరశర్మ ఆలోచన లిట్లున్నవి.

కట్టెపు దుర్గమునకు పోయి యుండిన బోయదొర పదిమంది బోయలతో తిరిగి వచ్చి శంకరశర్మకు నన్నిదొర సందేశమును చెప్పెను.

"నా తమ్ముడు అన్నియు తెలిసిన వాడు. విద్వాంసుడు. అనర్హమైన సంబంధమును వాడెన్నడును కోరడు. వాడు మెచ్చినాడన్నచో ఆమె వానికి తగినదనియే అర్థము. కనుక నేను కాదనుమాటయే లేదు. కానీ వారు రాజవంశీకులు. వారికి డాంబిక మెక్కువ. వారు మనకు బిడ్డనిచ్చుటకు సుముఖులుగా నున్నారను విషయము తెలిసికొనిన తరువాతనే మనము ముందడుగు వేయవలె. అడిగి లేదనిపించుకొనుట అవమానకరము. కనుక వారు సుము ఖులుగా నున్నారని దృఢముగా తెలిసికొని ఈ ఉత్తరమును ఆమె తల్లిదండ్రులకు ఇవ్వవలసినది. వారు సుముఖముగా లేని యెడల వెంటనే ఏనుగులను తోలుకొని బయలుదేరవలసినది. మా తమ్ముడు ఆత్మాభిమానము కలవాడు. ప్రాధేయపడడు."

ఈ మాటలు చెప్పుచు బోయదొర నన్నిదొర వ్రాసి పంపిన ఉత్తరమును శంకరశర్మకు ఇచ్చెను. శంకరశర్మకు సంతోషమాయెను. రెండు వైపుల అనుకూల వాయువులే వీచుచున్నవి.

మరుసటి దినము శంకరశర్మయు, తిమ్మనశ్రేష్ఠియు మంచి ముహూర్తము చూచుకొని రాణివాస సందర్శనమునకు అర్హమైన ఉడుపులు ధరించి బయలుదేరిరి. తమ రాకను ప్రతీహారుల ద్వారా లోపలికి చెప్పి పంపిరి. మరుక్షణమే ఇరువురు పరిచారికలు వెలుపలికి వచ్చి వారిని లోనికి కొనిపోయిరి. వారు ఆసనములపై కూర్చున్న అయిదు నిమిషములకు

రాణిగారు వచ్చిరి. ఇరువురును లేచి నిలబడిరి. శంకరశర్మ తన అలవాటు చొప్పున వేదమంత్ర ములతో ఆశీర్వదించెను. తిమ్మనశ్రేష్ఠి రెండు చేతులతో రాణి పాదముల ముందర నేలను తాకి నమస్కరించెను.

ముప్వురును కూర్చొనిరి.

"ఏమీ? మాతో మాట్లాడవలెనని వచ్చినారట?" రాణి సహజదర్పముతో అనెను.

శంకరశర్మ మాట్లాడెను.

"మహారాణి గారు మన్నించవలె. నేను బ్రాహ్మణుడను. వేదపండితుడను. లౌకికమెరుగని వాడను. చెప్పదలచుకొన్నది డొంకతిరుగుడు లేకుండా సూటిగా చెప్పుట అలవాటైనవాడను. నా మాటలలో ఏవైన హెచ్చు తగ్గులు కనబడినచో మన్నింతురను విశ్వాసముతో మీకొక విన్నపము చేయవచ్చినాము."

"నిర్భయముగా చెప్పవచ్చును," అని రాణి అభయమిచ్చెను.

"అమ్మా, దాపరికము లేకుండా చెప్పుచున్నాను. మేము ఏనుగుల కొఱకు ఇక్కడికి వచ్చినప్పటి నుండియు మా యువరాజు గారును జయవర్మ గారి కుమార్తె వకుళాదేవియు ఒకరికొకరు పరిచయమైనారు. పరిచయము కొంత చిక్కబడి స్నేహమైనది. స్నేహము వలపుగా మారినట్లు తోచుచున్నది. వారిద్దరు ఒక చోట చేరినప్పుడు వారికి ప్రొద్దుపోవుటయే తెలియుట లేదు. ఆ దినము వకుళాదేవి పామును, మా యువరాజు గారు ఎలుగుబంటిని చంపిన నాటి నుండియు వారు మరింత చేరువైనారు. వీరి మధ్య వలపు ప్రారంభమైనదని తోచి ఈ విషయమును వెంటనే మా ప్రభువు నన్నిదొర గారికి తెలియజేసితిని. ఆయన అభిమాన ధనుడు. 'తమ్ముని యిష్టమే నా యిష్టము. వాని వివేకమును నేను శంకింపను. వాని ఎన్నిక అన్ని విధముల సమంజసముగానే ఉండును. కానీ అడిగి లేదనిపించుకొనుట మర్యాద కాదు. మొదట వారి ఉద్దేశ్యము కనుగొని వారు సుముఖులుగా ఉన్నట్లు తెలిసిన యెడల వివాహ ప్రస్తావన సంప్రదాయ బద్ధముగా ముందుగా మీరే ప్రతిపాదింపుడు.' అని సెలవిచ్చినారు. కన్యాదాతలు మీరు సమ్మతిని తెలియజేసినచో రేపు నలుగురి ముందర మేము బహిరంగముగా వివాహ ప్రస్తావన చేయుదుము. మీకు సమ్మతి లేనిచో ఏనుగులను తోలుకొని మేమురేపే వెళ్ళిపోయెదము. ఈ విషయము మన ముప్వురి మధ్యలోనే అణగి పోవును. కానీ – కానీ – పసి హృదయములు భగ్నమైపోవునే అని నాకు దిగులుగా ఉన్నది. ఆపైన మీ చిత్తము."

మహారాణి హృదయపూర్వకముగా పకపక నవ్వి పలికెను.

"మంచి బ్రాహ్మణుడవయ్యా స్వామి నీవు. అగ్నిద్యోతనుని వంటివాడవు. నేనును మనస్సు విప్పి మాట్లాడెదను. మా వకుళ హృదయము మూడు దినముల క్రితము వరకు మాకు తెలియదు. తెలిసిన వెంటనే ఆమె తల్లిదండ్రులను పిలిపించి అడిగితిని. వారును సమ్మతించి నారు. ఇక్కడ ఎవరికిని అభ్యంతరము లేదు. ఇంతకును పొన్నిదొర తన ఆంతర్యమును ఎవరికీ వెల్లడి చేసినట్లు లేదు. వకుళ మాటలను బట్టి చూడగా అతడు తన అభిప్రాయమును

వకుళ యెదుటనే బయటపెట్టినట్లు ఉన్నది. ఉండండి ఇప్పుడే వానిని పిలిపించెదను. మీరు ఏమియు మాట్లాడకుడు. నేనే మాట్లాడెదను," అని రాణి పరిచారికను పిలిచి పొన్నిదొర ఎక్కడ ఉన్నను వెంటనే వచ్చి రాణి గారి దర్శనము చేసికొనవలసినదని వార్త పంపమనెను.

ఆడుపెండ్లివారి సమ్మతి తెలిసిపోయినది కనుక శంకరశర్మ నన్నిదొర జయవర్మ పేరిట వ్రాసి పంపిన లేఖను మహారాణిగారిని సమర్పించెను.

సంప్రదాయ సంబోధనలు, ఉభయ కుశలోపరుల అనంతరము లేఖలోని ప్రధానాంశము "చాళుక్య రాజ్యము అల్లకల్లోలముగా నున్నది. సింహాసనము కొఱకు విజయాదిత్యుడును, భీమసలుకియు కొన్ని సంవత్సరములుగా పోరాడుకొనుచున్నారు. మేము సరిహద్దులో ఉన్నవారము. అప్రమత్తులమై ఉండవలె. తమ్ముని వివాహమునకు వచ్చు అవకాశము కనబడుట లేదు. మాపక్షమున మా ఒజ్జలు, మా కుల బ్రాహ్మణులు శంకరశర్మ అన్నియు నెరవేర్తురు. శుభప్రదముగా వివాహము జరిపించి చిరంజీవులను పంపవలసినదిగా మనవి" ఉత్తరమును చదివి మహారాణి చాల సంతోషించినది.

పది నిమిషములలో మహారాణిగారి ఆజ్ఞ పొన్నిదొరకు తెలియజేయబడినది. మహారాణి గారు కొన్ని దినములుగా తనను పిలిపించి అనేక విషయులను గ్రుచ్చి గ్రుచ్చి అడుగుటలోని ఆంతర్యమేమి? వకుళ తన మనోగతమును మహారాణికి చెప్పినదా? మహారాణి సమ్మతించి నదా. సమ్మతింపని యెడల ఇన్ని వివరములేల అడుగును. సమ్మతించుచున్నట్లే యున్నది. సానుకూల సూచనలే కనబడుచున్నవి. పొన్నిదొరకు గుంటూరులో తాను చదివిన మేఘ దూతములోని వాక్యము జ్ఞప్తికి వచ్చెను. "మందం మందం నుదతి పవనశ్చానుకూలో యథాత్వాం" – అనుకూల వాయువులు ముందుకు నెట్టుకొని వచ్చుచున్నవి. పొన్నిదొర రెక్కలు కట్టుకొని పోయి రాణి ఎదుట వాలెను. అక్కడ శంకరశర్మయు తిమ్మనశ్రేష్ఠియు ఎందుకున్నారో పొన్నిదొరకర్థము కాలేదు.

పొన్ని మహారాణికి నమస్కరించెను. మహారాణి పొన్నికి తన సమీపమున నున్న ఆసనమును చూపి కూర్చుండుమనెను.

"ఎప్పుడు మీ ప్రయాణము?"

"ఇక నాలుగైదు దినములలో."

"ఏనుగులను మీ వారు తోలుకొని పోవుదురు గాని నీవు కాంచీపురము రావలె."

"మా అన్నను చూచి చాల కాలమైనది. మొదట మా అన్నను చూడవలె."

"సరే. తరువాత నైనను కాంచీపురమునకు వత్తువా?"

"వలనుపడినప్పుడు వచ్చి అమ్మ దర్శనము చేసికొందును"

"నన్ను చూచుటకు కాదు, అక్కడ నీకు పల్లవ సామ్రాజ్య సేనలో ఉపసేనాని పదవి గానీ, ఆశ్వికదళాధిపతి పదవి గానీ అప్పగించెదము."

పొన్ని మొగము చిన్నబోయెను. "నాకు అట్టి ఆశలు లేవు. మా కట్టెపు దుర్గమే నాకు చాలును."

"నీవు గురువుల దగ్గర కొంత విద్యా గంధము పట్టించుకొన్నావు. కాంచీపురమున మహా మహోపాధ్యాయులున్నారు. నీవు కోరిన శాస్త్రములు చదువవచ్చును."

ఇదంతయు తనను ఎక్కడికో లాగుచున్నట్లు అతనికి తోచెను.

"నాకు వచ్చిన విద్య నాకు చాలును."

"ఎంత సేపును కట్టెపు దుర్గము కట్టెపు దుర్గము అని కలవరించుచున్నావు ఏమున్నదక్కడ? కాంచీపురము ఎట్లుండునో ఎరుగుదువా? నీవు కలలోనైనను అట్టి నగరమును చూచి యుండవు."

పొన్ని దొరకు ఒడలు మండిపోవుచున్నది. కాని మహారాణి గారి చెంత ఏమియు పలుకలేకున్నాడు.

"అపి స్వర్ణమయీ లంకా నమే లక్ష్మణ రోచతే' అన్నాడు రాముడు. కాంచీపురము స్వర్ణమయము కావచ్చును. నాకు కట్టెపు దుర్గమే ప్రియమైనది."

రాణి కొంతసేపు మౌనము వహించినది. వీడు ప్రలోభములకు లొంగువాడు కాడు. తన నేలపైన, తన జనులపైన అమితమైన నెనరున్న వాడు. రాణి మనస్సులో వానిని మరింత మెచ్చుకొనినది.

"మా వకుళను గురించి నీ అభిప్రాయమేమి?"

ఉన్నట్లుండి విషయము వకుళ పైకి మారినది. పొన్నికి ఏమియు తోచలేదు.

"రత్నము" అన్నాడు మెచ్చుకోలుగా.

"మెడలో ధరించుకొందువా?"

పొన్నిదొరకు తలతిరిగిపోయినది. ఎదురు చూడని ప్రశ్న.

"మా అన్న ఇచ్చినచో తలపై ధరింతును."

రాణి ఇక ఈ నాటకమును కొనసాగింపలేక పోయినది.

"మీ అన్న ఒప్పుకొన్నాడు లేవయ్యా మొనగాడా? నీ బెట్టు తగ్గించు. అన్నకు తగిన తమ్ముడు, తమ్మునికి తగిన అన్న. అన్ననడిగినచో తమ్ముని ఇష్టము అనుచున్నాడు. తమ్ముని అడిగినచో అన్న ఇచ్చినచో తలపై ధరింతును అనుచున్నాడు. మీ అన్యోన్యతను మెచ్చుకొనవలె. రేపు ఉదయము నలుగురి ఎదుట వివాహము నిశ్చయింతము. ఇదిగో వీరును అందుకే వచ్చినారు."

పొన్నిదొర మహారాణి పాదములనంటి నమస్కరించెను.

తిరువేంగడ క్షేత్రమున శ్రీనివాసుని సన్నిధిలో చంద్రగిరి దుర్గాధ్యక్షుడు, చంద్రగిరి పుర ప్రముఖులు, తిరుపతి నుండి వచ్చిన పెద్దలు మొదలైన వారి సమక్షమున శుభముహూర్తమున వకుళా పొన్నిదొరల వివాహము వైభవముగా జరిగెను. వధువు పక్షమున మహారాణిగారును, వరుని పక్షమున శంకరశర్మయు కార్యమును నిర్వహించిరి. వివాహ కార్యక్రమమును దేవాలయ అర్చకులే నెరవేర్చిరి.

ఈ వివాహము వలన బోయదొరల కట్టెపు దుర్గపు ప్రయాణమునకు వారము దినములు తడవు ఏర్పడెను. రాణిగారి గుడారము ప్రక్కనే మరి యొక చిన్న గుడారము లేచినది. అందులో సమస్త సదుపాయములు సమకూర్చబడినవి. రాణిగారి బానసము నుండి వేళ వేళకును దంపతులకు పంచభక్ష్య పరమాన్నములు, మధ్య మధ్య ఫలహారములు, పానీయములు తప్పుట లేదు.

దంపతులు పగలంతయు సమీపముననున్న వాగులు వంకలు, మడుగులు జల పాతములు చూచుచు ప్రపంచమునే మరచినారు.

నాలుగవ దినము ప్రొద్దుగ్రుంకి నాలుగు గడియలైనది. అందరును నిద్రకు ఉపక్రమించు చున్నారు. వెన్నెల మల్లెలు పరచినట్లున్నది.

"వెన్నెల కన్నుల పండువుగా ఉన్నది. నాకు జలక్రీడపై మనస్సు పోవుచున్నది. పుష్కరిణికి పోవుదమా," వకుళ గోముగా అడిగినది.

"అపచారము. పుష్కరిణి ఉన్నది జలక్రీడలకు కాదు. భక్తులు భగవంతుని దర్శించుటకు ముందు పుష్కరిణిలో పవిత్ర స్నానము చేయుదురు."

"ఉదయము మనము చూచిన వాగును మరియొకసారి వెన్నెలలో చూడవలెనని యున్నది. అక్కడి పరిసరములు, ఇసుక తిన్నెలు, కొండమల్లెలు మొగిలిపొదలు చాల బాగున్నవి. ఈ వెన్నెలలో అలలు తళతళలాడుచుండును, పోవుదమా."

"క్రొత్త దంపతులు రాత్రుల యందు అంత దూరము పోరాదు."

"భయమా?"

"అవును భయమే. అక్కడ అర్భకుడనైనన్ను ఒంటరివానిని చేసి ఏమిచేయుదువో అని."

వకుళ అలిగి గుడారము వెలుపలికి వచ్చి దేవాలయ ప్రాంగణములోనే ఒక మూల ఇసుక తిన్నెపై కూర్చుండినది. పొన్ని కొంత సేపు వేచి చూచెను. వకుళ లోపలికి రాలేదు. తానే లేచిపోయి ఆమె ప్రక్కన కూర్చుండెను. ఆమె మాట్లాడలేదు. మొగము అటువైపు త్రిప్పుకొన్నది. పొన్ని తిన్నని స్వరముతో మధురముగా ఒక గాథ పాడెను.

దే సుఅణు పసిఅ ఏణ్హిం పుణోవి సులహాఇం రుసిఅవ్వాఇం
ఏసా మిఅచ్ఛి మిఅలంఛణుజ్జలా గలఇ ఛణరాఈ"

వకుళ కన్నులలో నవ్వుతొణికిసలాడెను. "అర్థము కాలేదు." అనెను. పొన్ని ఆ గాథను తెలుగులో ఇట్లు చదివెను.

అలుగు కాలమ్ము మునుముందు కలదు చెలియ
చలము మానుము నేడు ప్రసన్న వగుము.
రిత్తగా పండు వెన్నెల రేయి యెల్ల
కరగిపోవుచు నున్నది కాంత కనవె.

"ఊహూఁ అర్థము కాలేదు." అన్నది వకుళ నవ్వును చెక్కిళ్ళలో అణచుకొని.

"దీని అర్థమేమనగా, అలిగిన నీ వంటి పెంకె పిల్లతో ప్రియుడు అనుచున్నాడు. ఓ అలుగుచున్న అమ్మాయీ, అలుగుటకు ఇంకను దినములు ముందున్నవి. తెలివి గల నూత్న దంపతులు ఎవరును ఇట్టి వెన్నెల రాత్రులను అలుకలతో వృథా చేసికొనరు," అని.

"మరి ఏమి చేసికొందురు."

"ఇట్లు చేసికొందురు," అని ఆమె ముఖమును రెండు చేతులలో ఇముడ్చుకొని పెదవుల పైనను, చెక్కిళ్ళపైనను, ఎదపైనను ముద్దులు పెట్టెను. అలుక పోయినది. కాలము కరగి పోయినది.

కొండపైన అయిదు రాత్రులు గడిపిన తరువాత బోయ పరివారము ఏనుగులతోబాటు పయనమయ్యెను. రాణిగారు వకుళ వెంట వెళ్ళుటకు ఇరువురు దాసీజనులను వకుళకొక పల్లకిని సిద్ధము చేయించెను.

"నేనును గుఱ్ఱముపైననే పోయెదను," అన్నది వకుళ.

"వెకిలి చేష్టలు చేయకుము. ఇప్పుడు నీవు ఒక రాజ్యమునకు యువరాణివి. తగిన పద్ధతిలో మెలగుట నేర్చుకో." అని రాణి వకుళ చెంపపై చరచెను. వకుళ రాణిని కౌగిలించుకొని కన్నీరు పెట్టెను.

"నాయనా. ఈ ఏనుగులను పట్టి కంచికి చేర్చిన తరువాత మీ అత్తమామలు మిమ్ములను చూడవత్తురు. మీకు పెట్టవలసిన సారెలు వరుసలు తెత్తురు. ఇది పెంకెపిల్ల. రెండు నెలలుగా చూచుచున్నావు కాదా. కాని మనస్సు మంచిది. నిన్ను మెచ్చినది. నిన్ను నమ్మినది. జాగ్రత్తగా ఏలుకో." మహారాణి తన సహజ గాంభీర్యమును కోల్పోయి కన్నుల నీరు పెట్టెను.

పొన్నిదొర పరివారము తిరుపతి నుండి శ్రీకాళహస్తి వైపు సాగుచున్నది.

తిరుపతి నుండి క్రోసెడు దూరము పోగానే వకుళ పల్లకి దిగి వాగె పక్కెరలు తగిలించి యున్న మంచి గుఱ్ఱము పైనెక్కి తన భర్త ప్రక్కననే పోసాగెను.

బాటకిరుప్రక్కల పచ్చని పొలములు, సంపన్నములైన పల్లెలు, మామిడి, జీడిమామిడి తోటలు, సువర్ణముఖి నుండి తీసిన కాలువలు, ఆ కాలువల నీటితో నిండుగా నిండిన చెఱువులు, చెఱువులలో గుంపులుగుంపులుగా తేలుచున్న కొంగలు. బాటల ప్రక్కన బీళ్ళలో మేయు గొఱ్ఱెలు, కంచెలలో బలసిన చెట్లలో మేయు మేకలు, వకుళకు ఆహ్లాదకరముగా నున్నది. పొలములలో పనిచేయుచుండిన జానపదులు వీరిని చూచి నిలబడి చేతులూపి పలుకరించుచుండిరి. పిల్లలు కుతూహలముతో ఏనుగుల వెంట కొంత దూరము నడచి వెనుదిరుగుచుండిరి.

"ఈ రాణివాసపు సహవాసమే ఒక చెఱసాల. ఎక్కడికి వెళ్ళవలెనన్నను పల్లకీలు. ఏమియు చూచుటకు అవకాశమియ్యరు."

"మరి ఈ గుఱ్ఱపు స్వారియు విలు విద్యయు ఎట్లు నేర్చుకొంటివి?"

"చిన్నప్పటి నుండియు నా అల్లరిని, దుడుకు తనమును చూచి మా మామ పట్టుపట్టి ఇవన్నియు నేర్పెను. మా మేనత్తయు ప్రోత్సహించెను. కంచిలో మంచి గురువుల వద్ద కొన్ని సంవత్సరములు సాధన చేసితిని. ఈ నడుమనే సాధన తగ్గినది."

"కట్టెపు దుర్గములో మరల సాధన ప్రారంభింపవచ్చును."

"అక్కడ మంచి గురువులు దొరకుదురా?"

"అక్కడ నేనే నీకు గురువును."

"సరిసరి. ఈ గురువు దగ్గర నాకు లభించునది విలువిద్య సాధన కాదు. మరియొక విద్యలో సాధన."

"అదియును కావలెను కదా."

"అదియును కాదు. మీరు అదియే సాధన చేయింతురు."

ఇరువురును నవ్వుకొనిరి.

"శ్రీకాళహస్తి యందు మా మేనమామ ఒకరున్నారు."

"మేనమామా?"

"అవును. మా అమ్మకు పినతండ్రి కుమారుడు. శ్రీకాళహస్తి దేవాలయమున ప్రస్తుత ధర్మాధికారి."

"శ్రీకాళహస్తి దేవాలయపు ధర్మాధికారిని నేనెఱుగుదును. మేము చంద్రగిరికి వచ్చునపుడు ఆయనను కలుసుకొన్నాము. ఆయన మీ తండ్రి పేరు చెప్పి 'ఆయన మా బంధువు' అని మాత్రము చెప్పెను. కాని ఇట్లు బంధువని చెప్పలేదు. మీ మేనమామ చాల దొడ్డ బుద్ధిగలవాడు. మా అన్న వ్రాసిన ఉత్తరము చూడగానే మమ్ములను చాల ఆదరించినాడు. మీ కంచుకికి ఉత్తరము వ్రాసి ఇచ్చినాడు."

"మనము వారి ఇంటికి పోవలె."

"తప్పక పోవుదము. ఆయనకు నీవంటి మేనకోడలున్నదని తెలిసియుండిన యెడల 'అయ్యా మీ మేనకోడలికిని ఒక ఉత్తరము వ్రాసి ఇవ్వండి, గజములతో బాటు ఆ గజగమనను కూడా పట్టి తెచ్చుకొందుము.' అని అడిగియుందును."

"చమత్కారములు చాలును."

ఇట్లు మాట్లాడుచునే వకుళ గుఱ్ఱము ప్రక్క వ్రేలాడగట్టిన విల్లు తీసి అమ్ముల పొది నుండి ఒక అమ్మును తీసెను.

"ఎందుకు? ఏమి కనబడినది? ఎక్కడ?" పొన్నిదొర ఆందోళనతో అడిగెను.

"అదిగో ఆకాశమున కొంగల బారు. అందులో ముందు పోవుచున్న కొంగను కొట్టెదను" అని ఒక బాణమును అరివోసి వదలెను. ఆ క్షణములో గుఱ్ఱము కొంత వేగముగా కదలుటచేత ఆ బాణము కొంగకు ముందు వెంద్రుకవాసిలో తప్పిపోయెను. బోయభటులందరును తలలెత్తి చూచుచుండిరి.

ముందుపోవు భటులలో ఒకడు కిసుక్కున నవ్వెను.

మరుక్షణమే ఆమె వదలిన మరియొక బాణము అ భటుని తలపాగాను, అదే వేగముతో వాని ముందు నడుచు మరియొకని తలపాగాను ఊడ్చుకొని పోయి నూరడుగుల ముందర నేలపై పడెను. ఎక్కడవారక్కడ ఆగిపోయిరి.

"ఏమిది? ఏమి ఈ దుందుడుకు తనము? కొంచెము గురితప్పియుండిన ఏమయ్యెడిది? నాకు అపఖ్యాతి తెత్తువా?" పొన్నిదొర ఆందోళనతో ననెను.

"మీకు అపఖ్యాతి కలుగునప్పటికి మరొక బాణము నా గొంతులో దిగును."

పొన్నిదొరకు కోపమును అచ్చెరువును కలిగినవి. "వారి ప్రాణములు తిరిగి వచ్చునా? నిన్ను కాదు అనవలసినది. నిన్ను ఇట్లు పెంచిన మహారాణి గారిని అనవలెను."

తలపాగాలు పోగొట్టుకున్న భటులిద్దరును గడగడ వడకుచు గుఱ్ఱములు దిగి ముందుకు పరిగెత్తి తమతమ తలపాగాలను తెచ్చుకొని వకుళ యెదుట చేతులు కట్టుకొని నిలిచిరి. వకుళ వారిని గుఱ్ఱములెక్కమని సైగ చేసెను.

ఈ సంఘటనతో అక్కడనున్న బోయ భటులందరికిని ఒడళ్ళు జల్లుమనెను. వెన్నెముకలో వణకు పుట్టినది.

ఏమి గురి? తన గురిపై తనకెంత విశ్వాసము! ఇది తమకెంతటి హెచ్చరిక! ఆ భటుడు నవ్వినందులకు ఆమె వానికి వేసిన శిక్ష ఎంత చమత్కారమైనది. ఇది శిక్ష కాదు. హెచ్చరిక. ఎవరికిని నోట మాట వచ్చుట లేదు.

"ఇకపై మనుష్యులపై ఇట్టి సాహసములు చేయవద్దు. మీ రాజ వంశములలో రాజులకు ఇతర మనుష్యుల ప్రాణములు తృణప్రాయములు. ఒకరిద్దరు చచ్చినను రాజులకు లెక్కలేదు. కాని మా బోయకొట్టముల పద్ధతి వేరు. ఇక్కడ అందరును మావారే. ప్రతి ప్రాణమును మాకు విలువైనది. ఇది ఎప్పటికిని జ్ఞాపకముండవలె." పొన్నిదొర ఇంచుక తీవ్రముగానే పలికెను. వకుళ తలవంచుకొని గుఱ్ఱమును నడుపసాగెను.

"అంత మాత్రమునకే అలుగ రాదు. చెప్పినది గ్రహించి యథాప్రకారము ఉండవలె."

"యథా ప్రకారమే ఉన్నాను."

"లేవు."

"ఉన్నాను అని నమ్మించుటకు ఏమి చేయవలె."

"అదిగో చెదరి పోయిన కొంగలన్నియు మరల సోలుపులు తీరి ఎగురుచున్నవి. ఆ నల్లని మచ్చగల కొంగను కొట్టవలె."

వకుళ మరియొక బాణమును తీసికొని శ్రద్ధగా గురిచూచి వదలినది. ఆ బాణము ఆ కొంగను గ్రుచ్చి తీసికొని పోయి ఎక్కడనో పడిపోయినది.

"దీనినే పిచ్చుకపై బ్రహ్మాస్త్రమందురు. ఈ బాణమును జింకనో అడవి గొఱ్ఱెనో, తోడేలునో కొట్టుటకు వాడవలె. చిన్నచిన్న పక్షులను కొట్టుటకు ఇదిగో ఈ విధమైన బాణమును ఎక్కువగా లాగకుండా వదలవలె. అప్పుడు ఆ పక్షియు ఆ బాణమును మనకు దగ్గరలో నేలపై పడును. మనము తెచ్చుకొనవచ్చును."

శ్రీకాళహస్తిని సమీపించిరి. వకుళ మరల పల్లకి ఎక్కెను. ఏనుగులను, బండ్లను, ఆశ్వికులను దేవాలయము ప్రక్కన సువర్ణముఖీ తీరమున విడియించిరి. వకుళయు, పొన్నిదొరయు, శంకరశర్మయు, తిమ్మన శ్రేష్ఠియు, రామోజును, మరి ఇద్దరు భటులును దేవాలయ ధర్మాధికారి ఇంటికి వెళ్ళిరి.

పల్లకి నుండి దిగుచున్న వకుళను చూడగానే ధర్మాధికారికి ఆశ్చర్యమును, సంతోషమును, సంభ్రమమును పట్టనలవి కాకపోయెను. ఇంటిలోని వారినందరిని కేకలు వేసి పిలిచెను. అందరును వచ్చి వకుళను చుట్టుముట్టి కుశల ప్రశ్నలతో ఉక్కిరిబిక్కిరి చేసిరి. వకుళకును, పొన్నిదొరకును వివాహమైన విషయము తెలిసికొని మరింత సంతోషించిరి. ధర్మాధికారి భార్య నూతన దంపతులకు కర్పూర హారతితోనూ, టెంకాయతోనూ దిష్టితీసి వారిని ఇంటిలోనికి కొనిపోయెను. తూగుటుయ్యేలపై కూర్చుండబెట్టి, పండ్లు పాలు ఇచ్చెను.

భోజనానంతరము కొంతసేపు విశ్రాంతి తీసుకొని పొన్నిదొరయు, వకుళయు సువర్ణముఖీ నదీ తీరమునకు వెళ్ళిరి. శంకరశర్మ శ్రీకాళహస్తిలోని పండితులను దర్శింపబోయెను. పరివారము పట్టణములోని వేడుకలను చూడనేగిరి.

సువర్ణముఖిలో స్వచ్ఛముగా, నిదానముగా, మిక్కిలి లోతు లేకుండా ప్రవహించు నీటిని చూడగానే వకుళకు నదిలో స్నానము చేయవలెనను కోరిక కలిగినది. ఇరువురును నదిలో దిగి మునకలు వేసిరి. ఘడియ సేపు నదిలో ఓలలాడిరి. ముందుగా పొన్నిదొర ఒడ్డుకు వచ్చి ఇసుక తిన్నెపై కూర్చుండెను. మరికొంత సేపటికి వకుళయు నీటి నుండి వెలికి వచ్చెను.

వకుళ చంకలక్రింద నుండి మోకాళ్ళ వరకును ఏక వస్త్రమును చుట్టుకొని యుండెను. పొడవైన వెండ్రుకలు నీరోడుచు పిఱుదులపై అంటుకొని యుండెను. పొన్నికి ఒక గాథ జ్ఞాపకము వచ్చి బిగ్గరగా ఇట్లు చెప్పెను.

> పత్త ణిఅంబప్ఫంసా ణ్హాణుత్తిణ్ణాఏ సామలాంగీఏ
> జలబిందుఏ హిం చిహురా రుఅంతి బంధస్సవ భఏణ

వకుళ వింతగా చూచుచు "అర్థము కాలేదు," అన్నది.

> స్నానమొనరించి లేచిన శ్యామలాంగి
> నీదు కురులేడ్చు నదిగొ కన్నీరు రాల్చి
> పిఱుదులంటి మోదమ్మున పెనగు తమ్ము
> పట్టిముడివైతువోయను భయముగదుర

వకుళ కొంటెగా నవ్వుచు "అర్థము కాలేదు" అన్నది.

"నీవెండ్రుకలు ఏడ్చుచున్నవి"

"ఏదీ?"

"అదిగో కన్నీరు కార్చుచున్నవి." అని పొన్నిదొర ఆమె వెండ్రుకల నుండి కారు నీటిని చూపెను.

"ఎందుకు ఏడ్చుట?"

"అవి ఇంతవరకు నీ పిఱుదులను తాకి ఆనందము ననుభవించుచుండినవి కదా. ఇప్పుడు నీవు వాటిని ఎత్తి ముడివేయుదువు. నీ పిరుదులను తాకు ఆనందము ఇక ఉండదని ఏడ్చుచున్నవి."

ఇరువురు బిగ్గరగా నవ్వుకొనిరి. "తెలుగువారు రసికులే," అని వకుళ మరింత నవ్వెను.

ఇరువురును ధర్మాధికారి ఇల్లు చేరుకొనిరి. శంకరశర్మయు రామోజును వచ్చిరి.

ఏలనో ధర్మాధికారి ముఖమున ఆందోళనయు, దిగులును కనబడుచున్నవి. అతడు తొందర తొందరగా ఆలయమునకు ప్రయాణమైనాడు. పొన్ని కారణమడిగెను.

"మా దేవాలయపు ఏనుగునకు ఏదో తీవ్రమైన జబ్బు చేసినది. నెల దినములుగా చేయని వైద్యము లేదు. గుణము కొంచెమైనను కనబడుట లేదు. ఇప్పుడు మరింత తీవ్రముగా నున్నదట. నేనిప్పుడక్కడికి పోవలెను. మీరు ప్రయాణపు బడలిక తీర్చుకొనుడు."

మేమును వత్తుమని పొన్నిదొరయు, శంకరశర్మయు రామోజును బయలుదేరిరి.

దేవాలయ ప్రాంగణమున ఒక మూల దేవాలయపు ఏనుగు పడి యున్నది. వైద్యులు, దేవాలయ పరివారము. గ్రామ పెద్దలు అరుగులపైకూర్చొని యేనుగు దయనీయ స్థితిని చూచుచున్నారు.

రామోజు ఏనుగును పరిశీలించెను. కనురెప్పలెత్తి చూచెను. చెవి వెనక భాగమున వ్రేలితో అదిమి చూచెను. నాభి యొద్ద చేతితో తట్టుచు చెవి ఆనించి వినెను.

ఏనుగు దీర్ఘముగా మూలుగుచున్నది. ముక్కి ముక్కి పుఱ్ఱుపుఱ్ఱుగా పారుకొనుచున్నది. రామోజు ఒక పొడవైన పుల్లతో ఆ మలమును కెలికి చూచెను.

"ఇంకేమున్నది. అంతయు అయిపోయినది. ఇదిగో ఇవి దాని పేగులలోని లోపలి పొర యొక్క తునుకలు. దీని కడుపులోనికి ఏదో వాడియైన ఇనుప వస్తువు పోయినట్లున్నది. అది దీని ప్రేవులు త్రెంపుకొనుచు పోవుచున్నది. ఇప్పటి పరిస్థితిని బట్టి చూడగా ఇది ఈ రాత్రికే కన్ను మూయవచ్చునని తోచుచున్నది." అని రామోజు చేతులు కడుగుకొనెను.

అందరునూ దీర్ఘముగా నిట్టూర్చిరి.

"ఇది ముప్పై సంవత్సరములు దేవుని సేవలో తరించినది. ఇప్పుడు శివైక్యము చెందు చున్నది. రాబోవు జన్మలో ఇది గొప్ప రాజుగానో, పరమభక్తునిగానో పుట్టును."

అందరును ఆ ఏనుగు యొక్క గుణగణములను పొగడుచు మాట్లాడుచుండగా అందరు చూచుచుండగానే ఏనుగు ప్రాణములు వదలెను.

ప్రక్కకు వాలి పడియున్న ఆ ఏనుగు క్రింద పొడవైన చెక్కలను దూర్చి అంటగట్టిరి. ఆ చెక్కల క్రింద రోకళ్ళ వంటి కొయ్య దుంగలను పెట్టి దొర్లించుకొనుచు పోయి దేవాలయమునకు దూరముగా ఆలయ మర్యాదలతో ఖననము చేసిరి. అందరును ఆవేళలోనే సువర్ణముఖిలో స్నానము చేసి మృతాశౌచమును బాపుకొనిరి. అందరును మరల దేవాలయ ముఖ మండపమున సమావేశమైరి. ఎవరికిని ఇంటికి వెళ్ళవలెనను ఆలోచనయే లేదు.

"ఎంత నెమ్మదియైన ఏనుగు! ఎంత నిబ్బరమైనది. ఎవరైనా తుంటరి పిల్లలు రాళ్ళు విసరినను, కఱ్ఱలు విసరినను, ఒక ఘీంకారము చేసి తొండమును ఊపి బెదరించుచుండెనే గాని, కాలు కదిపెడిది కాదు."

"దీనిని బాగుగా అలంకరించి దేవుని ఊరేగింపులో ముందు నడిపించుచుండగా ఆ ఊరేగింపునకెంత నిండుదనము, దాని నడకలో ఎంత గాంభీర్యము. ఎంత ఉల్లాసముగా, తొండమును ఊపుచు, చెవులను ఆడించుచు, ఎంత ఒయ్యారముగా నడచెడిది!"

"ఇక ఈ దేవాలయమునకు సగము కళ తగ్గిపోయినది."

"దీని స్థానమున మనము మరియొక ఏనుగును సంపాదించగలమా? ఏ మహారాజో ఈ దారిన రావలె. మన మనవిని ఆలకించవలె. ఏనుగును దానమీయవలె."

"దేవాలయమునకు ఏనుగు అంత అవసరమా?" అంతవరకును మౌనముగా ఉండిన పొన్నిదొర మెల్లగా అడిగెను.

"అదేమి అట్లనుచున్నారు. దేవుని వైభవములో వృషభము, అశ్వము, మత్తేభము, రథము ముఖ్యమైనవి కదా. ఏనుగు వలన దేవాలయమునకు ఎంత శోభ! ఎంత ఆకర్షణ, ఏనుగు లేని ఊరేగింపు ఒక ఊరేగింపా?" దేవాలయ అర్చకుడు ఉద్వేగముతో పలికెను.

"మేమిప్పుడు పట్టుకొని పోవుచున్న ఏనుగులలో పెద్ద ఏనుగును మా బోయకొట్టముల పక్షమున ఈ వాయులింగేశ్వరస్వామి వారికి కైంకర్యముగా సమర్పించుచున్నాము. రేపు ఉదయమే కైంకర్యమునకు కావలసిన తతంగమును ఏర్పాటు చేయుడు."

అక్కడున్న వారందరును ఆశ్చర్యచకితులైరి. ఏదో చుట్టపు చూపుగా ధర్మాధికారి ఇంటికి వచ్చిన మనిషి ఏనుగును దానమిచ్చుటయా?

ధర్మాధికారి తటాలున లేచి పొన్నిదొరను కౌగిలించుకొని "ఆ వాయులింగేశ్వరుడే నిన్ను త్రోసికొని వచ్చినాడు. తన సేవకు నిన్ను రప్పించుకొన్నాడు. ఇది దైవ సంకల్పము. నెల దినములుగా మృత్యువుతో పోరాడుచున్న ఈ ఏనుగు తన సమీపమునకు మరియొక ఏనుగు రాగానే తన కర్తవ్యమును దానికి అప్పజెప్పి ప్రాణములు వదలినది. ఇది దైవ సంకల్పము గాక మరేమి?" అన్నాడు.

పొన్నిదొరయు "అవును. ఇది దైవసంకల్పమే. మేము వెళ్ళినది అయిదు ఏనుగు గున్నల కొఱకే. కాని ఎందుకో ఈ పెద్ద ఏనుగును పల్లవ భటుల కీయక మేమే తెచ్చుకొంటిమి. వాయులింగేశ్వరుడే తెప్పించుకున్నాడు" అనెను.

అందరును తలకొక మాటగా పొన్నిదొరను కొనియాడిరి. పొన్నిదొర పండ్రెండు బోయ కొట్టముల యువరాజనియు కట్టెపు దుర్గాధిపతియనియు అందరికిని తెలిసిపోయెను. దానితో అతనిపై అందరి గౌరవాదరములు రెట్టింపయ్యెను.

అర్చకులు చాల సంతోషముతో ఆలయ శుద్ధి కార్యక్రమములు అప్పుడే ప్రారంభించిరి.

ఉదయముననే స్నానాదికములు ముగించుకొని బోయ పరివారము దేవాలయములో

చేరిపోయిరి. పెద్ద ఏనుగును తోలుకొని వచ్చి దేవాలయ ముఖమండపము వద్ద నిలిపిరి. అది దాని ముందు వేయబడిన రావి ఆకులను, చెఱకు గడలను, అరటి గెలను ఆవురావురని తినసాగెను.

పొన్నిదొర తొలుత తన అన్న వదినెల పేరుతోనూ, పంద్రెండు బోయకొట్టముల సంక్షేమము కొఱకును అర్చన చేయించెను. అర్చకులు స్వామివారి పక్షముననను, అమ్మవారి పక్షముననను శేషవస్త్రములను ప్రదానము చేసిరి. వకుళ వాటిని ఒక చవుకమున మడచి బండిలోని బోషాణము నందు పెట్టబంపెను. తరువాత ధర్మాధికారి వకుళా పొన్నిదొరల పేరిట అర్చనలు చేయించి శేష వస్త్రములను బహూకరింపజేసెను.

కొత్త ఏనుగు కైంకర్యము శాస్త్రోక్తముగా నిర్వహింపబడెను.

క్రొత్త ఏనుగు క్రొత్త మావటివానికి మచ్చిక అగువరకు ప్రాతమావటివాడు శ్రీకాళహస్తిలో నిలుచునట్లు నిర్ణయింపబడెను.

నెల దినములుగా బోసిపోయి యుండిన దేవాలయమునకు క్రొత్త శోభ చేకూరెను.

కొత్త ఏనుగును, దానిని దానము చేసిన బోయరాజ్యపు యువరాజును, యువరాణిని చూచుటకు ఊరు ఊరే కదలి వచ్చినది.

ఆ దినము ఆ వేడుకలతో గడిచిపోయెను. మరుసటి దినము ఉదయముననే అందరును బయలుదేరిరి. ఊరు దాటి ఒక క్రోసు దూరము పోగానే వకుళ పల్లకి దిగి గుఱ్ఱమెక్కెను.

సావకాశముగా ఏనుగులకును, ఎడ్లకును, వకుళ వెంట వచ్చిన ఆడువారికిని శ్రమ లేకుండా కతిపయ దినముల ప్రయాణముతో అందరును కందుకూరు చేరుకొనిరి. మధ్యాహ్నమైనది. అట్లే ప్రయాణము చేసినచో ప్రొద్దుగ్రుంకుసరికి కట్టెపు దుర్గము చేరుకొనవచ్చును.

"ఈ దినము శుద్ధ షష్ఠి. మంగళవారము నూతన వధూ గృహప్రవేశము మంచిది కాదు. రేపు సప్తమి బుధవారము. మంచి దినము. తెల్లవారుజాముననే లేచి ప్రయాణము చేసినచో పది ఘడియల ప్రొద్దుకు మన ఊరు చేరవచ్చును. పదునైదు ఘడియలకు ముందుగానే నూతన వధూ గృహ ప్రవేశము చేయవచ్చును. కాబట్టి ఈ రాత్రి ఇచ్చటనే బస చేయుదము." శంకరశర్మ మాటచొప్పున అందరును ఒక సత్రమున విడిసిరి. ఏనుగులను ఊరి బయట ఒక వనములో కట్టివేసి భటులు అక్కడే వంటలు చేసికొనిరి.

పల్లవ రాజు బావమరది జయవర్మ కూతురిని పొన్నిదొర పెండ్లి చేసికొని వచ్చుచున్నాడను వార్త తెలిసి కందుకూరు దుర్గాధ్యక్షుడు స్వయముగా సత్రమునకు విచ్చేసి పొన్నిదొరను, వకుళను పలుకరించెను. తన యింటికి ఆహ్వానించెను.

"మేము తెల్లవారు జాముననే లేచి మా ఊరికి ప్రయాణము కావలె. మేము తమరి గృహమునకు వచ్చిన యెడల ఉదయము మా ప్రయాణము ఆలస్యమగును. కావున మేమిక్కడ ఉండుటయే మంచిది"

"అట్లయిన మా యింట భోజనము చేసుకొని సత్రమునకే తిరిగి రండు"

భటులు తప్ప తక్కిన అందరును దుర్గాధ్యక్షుని యింట విందులు భుజించి తిరిగి సత్రమునకు చేరుకొనిరి.

ఒకానొక నాడు తన ముత్తాత గారి తాత వీరనబోయడు ఆనాటి కందుకూరు దుర్గాధ్యక్షుని ఎదుట చేతులు కట్టుకొని నిలబడినాడట. ఈనాడు తాను కందుకూరు దుర్గాధ్యక్షుని సహపంక్తి భోజనము గావించినాడు.

"ఔరా కాల మహిమ! కాలాయ తస్మైనమః" అనుకున్నాడు పొన్నిదొర.

నలుగురు ఆశ్విక భటులు జాముప్రొద్దుండగానే కట్టెపు దుర్గమునకు పోయి నూతన దంపతులు కందుకూరులో ఉన్నారనియు, ఉదయము బయలుదేరి వత్తురనియు నన్నిదొరకు విన్నవించిరి. క్షణములో ఈ వార్త ఊరంతయు తెలిసిపోయెను. ఊరి వారి సంబరము మిన్నుముట్టినది.

మన పొన్నిదొర పల్లవరాణి అన్నకుమార్తెను పెండ్లాడి వచ్చుచున్నాడట. ఎంత ఘనత! పొన్నిదొర ఎంతటివాడైనాడు. సాక్షాత్తు పల్లవ చక్రవర్తితో బంధుత్వమన్న మాటలా! ఎంతటి వారికి లభించును!

తెల్లవారినప్పటి నుండియు ఊరంతయు కోలాహలముగానున్నది. వీధులన్నియు కలయంపి చల్లి ముగ్గులు వేసినారు. తోరణములు కట్టినారు.

పెద్దదొరగారి నగరు వద్ద మరింత శృంగారముగా అలంకరించినారు. తోరణములతో బాటు అరటి స్తంభములు, పచ్చని పందిళ్ళు, గుమ్మములకు పసుపు కుంకుమలు, వ్రేలాడదీసిన పూలదండలు కన్నుల పండువగానున్నది.

తప్పెటల వారు, కొమ్ములవారు, బూరలవారు, మంగళవాద్యముల వారు, బ్రాహ్మణ ముత్తైదువలు, బ్రాహ్మణులు నగరు వద్ద చేరిపోయిరి.

అయిదారు గడియల ప్రొద్దున అందరును బయలుదేరి ఎదురు ప్రయాణము సాగించి నారు. అరక్రోసెడు దూరము పోవుసరికి పొన్నిదొర పరివారమును, ఏనుగు గున్నలును కనబడినవి. వాద్యఘోష రెట్టింపయ్యెను.

ఈ జన సమూహము ఇంకను ఇన్నూరడుగుల దూరమున నుండగానే పొన్నిదొరయు తక్కిన వారును గుఱ్ఱములు దిగిరి. వకుళ పల్లకి దిగెను. ఆశ్వికులు గుఱ్ఱములు దిగి కుంతము లను ధరించి బాట కిరువైపుల నిలిచిరి.

పొన్నిదొరయు, వకుళయు ముందు నడచి నన్నిదొరకును, అతని భార్య పెమ్మసానికిని పాదములంటి నమస్కరించిరి. శంకరశర్మ నన్ని దంపతుల చేతులకు అక్షతలిచ్చి వేద మంత్రములతో ఆశీర్వదించుచు అక్షతలు నూతన దంపతులపై చల్లించెను. నన్నిదొర తమ్ముని, పెమ్మసాని వకుళను అక్కున చేర్చుకొనిరి. నన్నిదొర వకుళను పలుకరించెను.

"అమ్మా, ప్రయాణము సుఖముగా జరిగినది కదా! దారిలో ఏమియు శ్రమపడలేదు కదా? అమ్మగారును, నాన్నగారును బాగున్నారా? మహారాణి గారు సంతోషముగా వున్నారా?"

అన్నిటికిని వకుళ తల యూచుచు సమాధానమిచ్చెను.

నన్నిదొర వయస్సు తక్కువ అయినను వ్యవహారపు తీరులో చాల పెద్దరికము కన బడుచున్నది.

వాద్యఘోషతో జనులకోలాహలముతో అందరును ఒక ఘడియ నడచి నగరు చేరిరి. అక్కడ బ్రాహ్మణ ముత్తైదువలు హారతులు తీసి నూతన దంపతులను లోపలికి ప్రవేశింపజేసిరి. ఇంటి ముంగిట నవ దంపతులు కాలుసేతులు ముఖము కడుగుకొని లోపలికి ప్రవేశింపగానే వారిని ఊయెల పీట మీద కూర్చుండబెట్టి పండ్లు పాలు సమర్పించిరి.

ఆ దినము సాయంత్రము శంకర శర్మ శాస్త్రోక్తముగా నూతన వధూ గృహప్రవేశ కార్యక్రమమును నిర్వహించెను.

వారము దినములుగా వకుళ అక్కడి వారి నందరిని బాగుగా పరిశీలించి చూచుచున్నది. అంతయు వింతగానున్నది.

శ్రీకాళహస్తి నుండి కందుకూరు వరకును అందరును నన్నిదొరను బోయకొట్టముల రాజు అనుచున్నారు. పొన్నిదొరను యువరాజు అనుచున్నారు. కాని కట్టెపు దుర్గమున ఆ మాటలే వినబడుట లేదు. సన్నిహితులు బావ, అన్న, అని వరుసలు పెట్టి పిలుచుచున్నారు. ఇతరులు పెద్దదొర, చిన్నదొర అని సంబోధించుచున్నారు.

ఈ పిలుపులతో ప్రభువులకును, ప్రజలకును మధ్య అంతరములు మాయమైనవి. ఆత్మీయత పెరిగినది.

ఆడువారిలో బోయవనితలు ఎవరును రాణి, యువరాణి అని పిలువరు. అక్క, వదినె అనువరుసలతోనే పిలుచుచున్నారు. ఇతర వర్ణముల వారు పెద్దదొరసాని, చిన్న దొరసాని అని పిలుచుచున్నారు. బోయవనితలందరును చాలా కలుపుగోలుగా మాట్లాడుచున్నారు. ప్రక్కన కూర్చొనుచున్నారు, తాకుచున్నారు. హాస్యములాడుచున్నారు. అవి మోటు హాస్యములు. అయినను గిలిగింతలు పెట్టు హాస్యములు.

కాంచీపురపు రాణివాసమున అన్నియు కృత్రిమమైన మర్యాదలు, అన్నదమ్ముల మధ్య, అక్కచెల్లెంద్ర మధ్య, చివరకు భార్యాభర్తల మధ్య మర్యాదలు. హద్దులు.

ఇక్కడ ఎంత స్వేచ్ఛగా నున్నది! ఎంత స్వతంత్రముగా ఉన్నది! అడుగడుగునా మర్యాద తప్పుచున్నామేమో అన్న భయము లేదు.

నన్నిదొర నగరు ప్రాంగణమున ఒక ఆసనముపై కూర్చొని ప్రక్కన బల్లపై నున్న విండ్లను, అమ్ములను పరిశీలించుచుండెను. వకుళ ఆ మార్గమున పోవుచుండుట చూచి దగ్గరకు పిలిచెను.

"మా మనుషులు నిన్ను గురించి ఏమేమో చెప్పుచున్నారు. అదేదో ఇప్పుడు చూడవలె. అదిగో ఆ కొబ్బరి చెట్టుపై నున్న కొబ్బరి గెలను పడగొట్టవలె. విల్లును అమ్ములను అందుకో చూతము." అనెను.

వకుళకు నోటమాట రాలేదు. ఎల్లప్పుడును రాచకార్యములలో తలమునకలుగా నుండు రాజుగారు... కాదు బావగారు. ఇంత తీరికగా తనను పరీక్షించుచున్నాడు. తానేమి చేయవలె. నన్నిదొర తీరికగా ఉండుట చూచి అప్పుడే కొందరు మగవారు వచ్చి చేరిపోవుచున్నారు. వకుళను వెదకుచు కొందరు స్త్రీలును వచ్చి చేరుకొన్నారు. ఇక తప్పునట్లు లేదు.

వకుళ అక్కడున్న విండ్లలో ఒక దానిని అందుకొని ఒక అర్ధచంద్ర బాణమును అందుకొన్నది. నన్నిదొర వకుళను తన ఎడమవైపున కొంత ముందు నిలువుమనెను. నన్నిదొరయు ఒక విల్లును అమ్మును తీసికొనెను. వకుళ వింతగా చూచెను. కొబ్బరి గెలను కొట్టవలసినది తాను కదా. బావగారు ఏల విల్లందుకొన్నారు. తాను కొట్టలేకపోయినచో తాను కొట్టుటకా? తన గురిపైన ఆయనకు అంత నమ్మకము లేదా? వకుళకు రోషము వచ్చెను. తదేక దృష్టితో గెలపైన గురి నిలిపెను. నన్నిదొరయు కూర్చున్న చోటి నుండియే విల్లు ఎక్కుపెట్టి బాణము సంధించి సిద్ధముగా ఉండెను. వకుళ చక్కగా గురి నిలిపి బాణమును వదలెను. మరులిప్తలోనే నన్నిబోయని బాణము వకుళ బాణమును ఎగురగొట్టుకొని పోయి ఎక్కడో పడిపోయెను.

వకుళ నివ్వెరపోయెను. ఒక బాణమును మరియొక బాణముతో కొట్టుట. పురాణములలో, భారతములో, రామాయణములో విన్నదే కాని చూచినది లేదు. ఈ నైపుణ్యము ఇప్పటి మనుష్యులలో ఉన్నదా? ఇప్పుడిక్కడ కనబడుచున్నది. ఈ నన్నిదొరలో కనబడుచున్నది.

వకుళ మరియొక బాణమును వదలెను. దానిని కూడ నన్నిదొర ఎగురగొట్టెను. వకుళకు కోపము వచ్చెను.

"సరిపోయినది. నాకొక పని చెప్పి నన్ను ఆ పని చేయనీయక అడ్డుకొనుచున్నారు. ఇక నేనేమి చేయగలను?"

"నీ గురి లక్షణముగా నున్నది. కానీ నీ బాణమునకు వేగము లేదు. వేగము గల బాణము ఇతర బాణమునకు చిక్కదు. నీ బాణము చిక్కిపోవుచున్నది. వేగము లేని బాణమునకు శక్తియు తక్కువయే. బాణమునకు వేగమును శక్తియు వింటి యొక్క బిఱ్ఱుపై ఆధారపడి యుండును. నీ చేతిలోని విల్లు పిల్లలు అభ్యాసము చేయునది. ఈ విల్లు అందుకొనుము." అని నన్నిదొర మరియొక విల్లును చూపెను.

వకుళ క్రొత్త విల్లందుకొన్నది. బరువుగానున్నది. అల్లెత్రాడుకూర్చుటయే కష్టముగా నున్నది. బాణము కూర్చి లాగుట మరియు కష్టముగానున్నది.

"లాగవలె. చెవి వరకు లాగవలె."

వకుళ ఎంత ప్రయత్నించినను విల్లు వంగుట లేదు. ఎట్లో ఈలకఱచి లాగి అర్ధచంద్ర బాణమును వదలెను. కొబ్బరి కాయల గెల కసుక్కున తెగి నేలపై పడెను. కాయలు చెల్లా చెదరుగా పడిపోయెను. బోయపిల్లలు కాయలను, బాణములను ఏరి తెచ్చిరి. చూచుచుండిన మగవారును, ఆడవారును "బలే బలే," అని కేకలు వేసిరి.

నన్నిదొరయు "బాగున్నది – చాల బాగున్నది." అని మెచ్చుకొనెను.

"గురియు, పట్టుదలయు అన్నియు లెస్సగా ఉన్నవి. మా యింటికి తగిన దానవు లభించినావు. మా ఇంటి పేరు నిలబెట్టగలవు. కాని ఒకటియే లోపము. శక్తి చాలదు. బాణమునకు వేగమును, శక్తియు రావలెనన్న విల్లు బలముగా నుండవలె. బలమైన విల్లును లాగుటకు శరీరములో శక్తికావలె. సన్న బియ్యపుటన్నముతో ఆ శక్తిరాదు. మావలె నుండవలె నన్న మా తిండి తినవలె. బోయదొరసానులకు సౌకుమార్యము కాదు కావలసినది. సౌష్టవము కావలె. సాధన నిలుపకుము."

బాణ ప్రయోగ లాఘవమున ఇంత వరకు పొన్నిదొర మేటి అని వకుళ భావించుచుండెను. ఇప్పుడు నన్నిదొరతో సాటి వచ్చువాడు లేడనిపించుచున్నది. పొన్నిదొరకు విలువిద్య మాత్రమే తెలియును. నన్నిదొరకు విలువిద్య తత్వము తెలియును.

నన్నిబోయని మాటలు వకుళ చెవులలో మారుమ్రోగుచున్నవి. బోయవనితలలో సౌష్టవమున్నది. తనలో సౌకుమార్యమున్నది. సౌకుమార్యము వలన ఒరుగునదేమి? మగవారిని ఆకర్షించుట తప్ప. సౌష్టవము బహుళ ప్రయోజనకరము.

వకుళ కొంత కాలముగా చాలించి యుండిన గుఱ్ఱపు స్వారి, విలువిద్యా సాధన మరల ప్రారంభించెను. క్రమముగా తన ఆహారపు అలవాట్లను మార్చుకొనసాగెను. ఫలితము తొందరగానే కనబడెను. వకుళలో సౌందర్యముతో బాటు సౌష్టవమును పెరిగినది.

ఇదంతయు పొన్నిదొర చూచుచునే యున్నాడు.

ఒక చాళుక్య వనిత ఆనాడు ఒక బోయ యువకుని పెండ్లాడి వానిని చాళుక్యునిగా మార్చివైచినది. ఈనాడు ఒక పల్లవ వనిత బోయదొరను పెండ్లాడి తానే బోయవనితగా మారుచున్నది.

ఓ స్త్రీ. నీవు ఎంతకైనను తగుదువు. ఏమైనను చేయగలవు. ఏ రూపమునైనను ధరింపగలవు. నీకు అసాధ్యమేదియు లేదు. నీకు జోహార్లు.

తిరువేంగడ పర్వతముల నుండి పట్టి తెచ్చిన ఏనుగుగున్నలు జనులందరును చూచుటకు కట్టెపు దుర్గమునందే కొన్ని దినములుండినవి. వాటి కాలి తిమ్మిరి తీరుటకై ప్రతి దినము వాటిని రెండుమూడు బోయకొట్టములకు తోలుకొని పోయి అచ్చటి వారికి చూపించి సాయంత్ర మునకు తిరిగి వచ్చుచుండిరి.

ఒకనాడు నన్నిదొరయు, పొన్నిదొరయు శంకరశర్మయు, పశువైద్యుడును మరికొందరును ఏనుగులను పరిశీలించుటకు వచ్చిరి.

ఏనుగులకు బాగుగా ఆకలి యగుటకును, తిన్నది జీర్ణమగుటకును రామోజు ఏవో మందులు చేసి, వాటికి తినబెట్టించుచుండెను. గున్నలు బాగుగా మిసమిసలాడుచుండినవి. మనుష్యులకు బాగుగా మాలిమి అయినవి. పిల్లలు తమకు దొరికిన పండ్లు, కాయలు, ఆకుకూరకట్టలు తెచ్చి వాటి తొండమున కందించి అవి వాటిని నోటిలో పెట్టుకొనుచుండగా

వాటినోళ్ళ లోనికి కుతూహలముగానూ, ఆనందముగానూ తొంగి చూచుచుండిరి.

"వీటినిక్కడ ఉంచరాదు. ఇవి మనుష్యులకు ఈ విధముగా మాలిమి కారాదు. మాలిమి అయినచో యుద్ధమునకు పనికిరావు. దూరముగా ఉంచి పోషించవలె." అన్నాడు పొన్నిదొర.

"అవును. ప్రతి దినమును సిద్ధముగా మేత తెచ్చివేయుట వలన ఏనుగులు సోమరిపోతులై పోవును. వీటిని ఎక్కడనైనను సమీపమున అడవిలో పెట్టి పోషింపవలె." అన్నాడు పశు వైద్యుడు రామోజు.

నన్నిబోయడు రెండు నిమిషములు ఆలోచించెను.

"కంబకొట్టము దగ్గర అడవిలో మొగిలి మడుగున్నది. వీటిని అక్కడ పెట్టవలె."

పొన్నిదొర కలుగజేసికొనెను.

"అడవిలో వాటిని అదుపు చేయుట కష్టము. వీటికి ఒక వైపు ముందువెనుక కాళ్ళకు ఇనుప గొలుసులతో బందెము వేసి వదిలవేయవచ్చును. వేగముగా పోలేవు. పగలు విహ రించిన తరువాత సాయంత్రమునకు అవి మొగిలి మడుగు వద్ద చేరుకొనును."

వారు చెప్పుచున్న మొగిలిమడుగు కట్టెపు దుర్గమునకు అయిదు ఘడియల దూరమునను, కంబకొట్టమునకు రెండు ఘడియల దూరమునను ఉన్నది.

మావటివాండ్రును. భటులును వెళ్ళి అక్కడ పెద్దపెద్ద చెట్లపైన పాకల వలె మంచెలు నిర్మించుకొనిరి. ఏనుగులను తోలుకొని పోయి పోషింపసాగిరి. పగలు వాటిని స్వేచ్ఛగా వదలివేయుదురు. అవి దూరముగా వెళ్ళిపోకుండా సేవకులు కనిపెట్టుకొని యుందురు. రాత్రులయందు మావటివారు వాటిని తోలుకొని వచ్చి గొలుసులతో ఇనుప ఆలానములకు కట్టివేయుదురు.

అప్పుడప్పుడు ముప్పది, నలువది మంది భటులు ఈటెలతోను ఖడ్గములతోను వచ్చి ఏనుగులను చుట్టుముట్టి వాటిని రెచ్చగొట్టుదురు. అవి చిట్టెత్తి భటులపైకి దూసుకొని పోవును. వారు పారిపోవుదురు. కాలిగొలుసుల కారణముగా అవి వేగముగా తరుమలేవు. కావున భటులకు అపాయములేదు. ఇది ఏనుగులకిచ్చు యుద్ధ శిక్షణ.

ఒకనాడు వకుళ ఏనుగులను పరిశీలించుటకై గుఱ్ఱమెక్కి బయలుదేరినది. యథా ప్రకారము గుఱ్ఱమునకు ఒకవైపున విల్లును, మరియొక వైపున ఈటెయు, మెడ యొద్ద అమ్ములపొదియు ఉన్నవి.

వకుళకు పండ్రెండు బోయకట్టెములతోడను, అక్కడి పరిసర ప్రాంతములతోడను, అక్కడి ప్రజల తోడను బాగుగా పరిచయమైపోయెను. ఆమె విలువిద్యా నైపుణ్యము కర్ణాకర్ణిగా జనులకందరికిని తెలిసిపోవుటచే అందరును ఆమెను గౌరవముతోనూ ప్రేమతోనూ పలుక రించుచుండిరి. మొదట కొన్నిదినములు మగనితో బాటు తిరుగుచుండెను. ఇప్పుడు ఒంటరి గానే వెళ్ళుట అలవాటైనది.

వెనక నుండి గుఱ్ఱపు డెక్కల శబ్దమును, 'అక్కా, అక్కా', అను పిలుపును వినబడగా

వకుళ గుఱ్ఱము నిలిపి తిరిగి చూచెను. వెనుక కొంత దూరమున ఒక బోయపడతి గుఱ్ఱముపై స్వారి చేయుచువచ్చుచున్నది. వకుళ ఒక చెట్టు క్రింద గుఱ్ఱమును నిలిపి గుఱ్ఱమును దిగి నిలబడెను.

తాను కట్టెపు దుర్గమునకు వచ్చినప్పటి నుండియు గుఱ్ఱపుస్వారి చేయు ఆడువారిని అక్కడ ఎప్పుడును చూడలేదు. ఈ పడుచు గుఱ్ఱపు స్వారి ఎట్లు నేర్చుకొన్నది. ఎందుకు నేర్చుకొన్నది.

ఆ బోయపడుచు ఆ చెట్టు క్రిందనే గుఱ్ఱము దిగి వకుళ దగ్గరికి వచ్చెను. వయస్సు పదునారు, పదునేడు సంవత్సరములుండవచ్చును. ముఖమున అమాయకత్వము ఉట్టిపడు చున్నది. ఆమె కట్టెపు దుర్గములో ఉండునదే. పొన్నిదొరకు దగ్గరి చుట్టము. వేలు విడిచిన మేనమామ కూతురన్నట్లు జ్ఞాపకమున్నది. పేరు అల్లెమ అని గుర్తు.

"ఒంటరిగా ఈ దారిలో ఎక్కడికి బయలుదేరినావు?" వకుళ అడిగెను.

"నీదగ్గరికే."

"నా దగ్గరికా, నేనింతవరకు నగరులోనే ఉంటినికదా?"

"నాకు నీమీద చాల కోపముగా ఉన్నది."

వకుళకు ఆశ్చర్యము వేసెను. ఆశ్చర్యముతో బాటును నవ్వునువచ్చెను. ఎంత అమాయ కత్వము? ఎంత పసితనపు మాటలు!

"నిన్ను చంపివేయవలెనని యున్నది."

వకుళకు మరింత నవ్వు వచ్చెను.

"దానికి నన్నడుగుట ఎందుకు? నీ పని నీవు కానివ్వవచ్చు కదా?"

"అది కాదు – నాకు చనిపోవలెననియున్నది"

"దానికైనను నన్నడుగుట యెందుకు. నీ పని నీవు కానివ్వవచ్చును కదా."

బోయపడుచు వకుళను కౌగిలించుకొని వకుళ భుజముపై తలవాల్చి వెక్కి వెక్కి ఏడువసాగెను.

వకుళకు ఏమియు అర్థము కాలేదు. ఆ పడుచు వీపు నిమురుచు కొంత తడవు ఏడువనిచ్చెను. తరువాత ఆ పిల్లను నడిపించుకొనుచు ఆ చెట్టుక్రింద పొడవుగా సాగిన ఒక వేరుపై కూర్చుండి ఆమెను పొదివి ప్రక్కన కూర్చుండబెట్టుకొనెను.

"ఊఁ! ఇప్పుడు చెప్పుము. నన్ను చంపుటయేమి? నీవు చచ్చుటయేమి? ఏమి నీకథ?"

"ఏమున్నది. నీవు మా బావను తన్నుకొని పోయినావు."

వకుళకు విషయము కొంచెముగా బోధపడినది. అయినను జరిగిపోయినదానికి ఈ పడుచు ఇంత ఆగడము చేయుచున్నదేమి?

"మీ బావయే నన్ను తన్నుకొని వచ్చినాడు. నేను కాదు."

"ఎట్లైననేమి? నా బావ నాకు దూరమైనాడు. నీకు తెలియదు. నేను పుట్టిననాడే మా తల్లిదండ్రులు పొన్నికి పెండ్లాము పుట్టినది అని పేరుపెట్టుకొన్నారట. మా అత్తయు, మామయు

అదేమాట అన్నారట. ఆ తలంపుతోనే మా తల్లిదండ్రులు నాకు గుఱ్ఱపు స్వారియు, విలు విద్యయు నేర్పిరి. అందరును మా పెండ్లి జరుగుననియే నమ్మి నిశ్చింతగా నుండిరి. అంతలో బావ చంద్రగిరి నుండి నిన్ను తెచ్చుకున్నాడు. మా యింటిపైన పిడుగు పడినట్లైనది. కొన్ని దినములు మా ఇంటిలో ఎవరును అన్నము నీళ్ళు ముట్టలేదు. కంటినిండ నిద్రలేదు. నేను ఈ రెండు నెలల నుండి.. సరిగా..." ఇక మాట్లాడలేక ఆ పడుచు ఏడువసాగెను.

"ఊరుకో – ఊరుకో" అని వకుళ ఆమెను సముదాయించెను.

"అందుకే నాకు నీమీద కోపము. కాని నీవు మంచిదానివి. అందుకే నీవనిన నాకిష్టము. కానీ నీ వలన నా బావ నాకు దూరమైపోయినాడు."

వకుళకు అంతయు అర్థమైపోయినది. ఆ పిల్లపై జాలిపుట్టుకొని వచ్చినది.

"పిచ్చిదానా. అంతటి నీబావ నిన్ను కాదని మరియొకతెను పెండ్లి చేసుకొన్నాడు. ఇంకను అతనిపై నీకేల ఇంత వెఱ్ఱిప్రేమ. ఊరుకో. ఎవరినైనను మంచి యువకుని చూచి నేనే నీ పెండ్లి జరిపించెదను."

"చావనైన చచ్చెదను కానీ – మరొక మగవాని చేయి పట్టను."

వకుళ ఆలోచనలో పడెను.. ఈ పిల్ల ఎంత అమాయకముగా మనస్సు విప్పి మాట్లాడు చున్నది! ఈమె మాటలను బట్టి చూడగా రెండు కుటుంబములలోనూ ఈ తలంపు మొదటి నుండియు ఉండినట్లు అర్థమగుచున్నది. పొన్నిదొర చంద్రగిరికి రాకుండిన యెడల తాను అతని జీవితమున ప్రవేశించెడిదికాదు. పొన్నిదొర ఈ పడుచునే పెండ్లాడియుండెడి వాడేమో. దైవికముగా అతడు చంద్రగిరికి వచ్చుటయు, తామిరువురును కలిసికొనుటయు, తమ ప్రణయమును, పెద్దల అనుమతియు అన్నియు చకచక జరిగిపోయెను. తాను పొన్నిదొర భార్యయై ఈ కట్టెపు దుర్గమునకు – బోయ రాజ్యమునకు – యువరాణియై పోయినది. అనుకొనని విధముగా తాను ఈ పడుచు స్థానమునాక్రమించినది.

వకుళ లేచి ఆమెను లేవదీసి గుఱ్ఱముపై కూర్చుండబెట్టి తానును గుఱ్ఱమెక్కి కట్టెపు దుర్గమునకు తిరిగి వచ్చెను.

ఒక నెలలో పొన్నిదొరకును, అల్లెమ సానికిని పెండ్లి జరిగిపోయెను.

బోయకొట్టములలో అనేక వృత్తుల వారు వచ్చి చేరిపోయిరి. పండ్రెండు బోయ కొట్టము లలో ఎవరికి నచ్చిన చోట వారు చేరిపోవుచుండిరి. అన్ని కొట్టములలోనూ ఇండ్ల సంఖ్యయు, జన సంఖ్యయు పెరిగిపోవుచున్నది. ముఖ్యముగా నేతగాండ్రును, వారికి ప్రత్తి, నూలు, రంగులు మొదలగునవి సమకూర్చు పనివారును అధిక సంఖ్యలో వచ్చిచేరిరి. ప్రత్తి పంట విస్తీర్ణము పెరిగెను. భూములుగల రైతుల వద్ద కొందరు వచ్చి పాలేర్లుగా చేరుచుండిరి. ప్రత్తిపంటకు తోడు చెఱకు తోటలును మెండయ్యెను, చెఱకు గానుగల వద్ద పనిచేయువారును అధిక సంఖ్యలో చేరిరి.

వీరికందరికిని సేవలందించు చాకళ్ళు, మంగళ్ళు, కుమ్మరులు, కమ్మర్లు, వడ్రంగులు,

కుట్టుపనివారు, చర్మకారులు ప్రతి బోయకొట్టమునకు అనుబంధముగా ఇండ్లు కట్టుకొని జీవింపసాగిరి.

బోయస్త్రీలు కష్టజీవులు, దృఢకాయులు. వ్యవసాయమంతయు చాలమట్టుకు స్త్రీల వలననే జరిగిపోవుచుండెను. మేడిపట్టి మడకదున్నుట, నొగలపై కూర్చుండి బండితోలుట, మోకుపై కూర్చుండి కపిలె తోలుట తప్ప తక్కిన పనులన్నియు స్త్రీలే చేయుచుండిరి. ఆ పనులను చేయగల స్త్రీలును లేకపోలేదు. వారిని తోడిస్త్రీలు "మగరాయుళ్ళు", అని ప్రశంసించుచున్నట్లే వెటకారము చేయుచుండిరి. అయినను వారు లెక్కపెట్టరు.

కార్తిక మాసములో సేద్యపు పనుల తొందర కొంత తగ్గినది. స్త్రీలకు కొంత వెసులుబాటు చిక్కినది. ఎండ వేడిమి చాలా తగ్గిపోయినది. వెన్నెల పాలారబోసినట్లు కాయుచున్నది. గాలి చల్లగా మెల్లగా వీచుచున్నది. ఆకాశము నిర్మలముగా ఉన్నది.

అంతటి ఆహ్లాదకరమైన వాతావరణములో పనిపాటులు లేనిస్త్రీలు ఇండ్లలో ఉందురా? ప్రొద్దుగూకగానే భోజనములు ముగించి వీధులలోనికి వచ్చి గుంపులుగా చేరి గొబ్బిళ్ళు తట్టువారు, కోలాటలు వేయువారు, జక్కికిజమ్ ఆడువారు, సిరిసింగణావత్తి, వెన్నెలకుప్పలు ఆడువారు గా ఏయే వయస్సుకు తగిన ఆటలను వారు ఆడజొచ్చిరి.

ఆనాడు కట్టెపు దుర్గము నందు నగరు ముందర విశాలమైన ప్రదేశమున పడుచు లందరును మూడు గుంపులుగా చేరిరి. వలయాకారములుగా నిలిచిరి. ఒక వలయమువారు గొబ్బిళ్ళు తట్టుచు తిరుగసాగిరి. మరియొక వలయము వారు కోలాటము వేయుచు తిరుగుచుండిరి. మరియొక వలయము వారు "జక్కీకిజమ్" అని పాడుచు, చేతులు చఱచుచు చిందులు వేయుచు తిరుగసాగిరి.

క్రమముగా వారి చిందులు వేగమునందుకొన్నవి. అడుగుల తాకిడికి దుమ్ము దట్టముగా రేగినది. చప్పట్ల శబ్దము హెచ్చినది. శ్రావ్యముగా ప్రారంభమైన పాట రొప్పుటగా మారినది.

వకుళ వీరి ఆటలను ఆశ్చర్యముతో చూచుచుండెను. ఆ ఆటలలో ఆ పడుచులలోని వేగము, కాళ్ళుచేతులు కదలించుటలోని లాఘవము, శక్తి ఆమెను అబ్బురపరచినవి. కంచిలోని రాణివాసమున పెరిగిన తనకు ఇదంతయు అద్భుతముగా ఉన్నది.

కంచిలో ఏమున్నది. అంతయు నాగరికత – సారములేని నాగరికత – స్త్రీలు సుకుమారులు – పురుషులు విలాస పురుషులు. వారిలో ఈ వేగము, ఈ లాఘవము కాగడావేసి వెదకినను కనబడదు. ఈ బోయపడుచులు పురుషులకెంత మాత్రము తీసిపోరు.

పడుచుల చిందులు ఉచ్చస్థాయికి చేరుకొని తటాలున ముక్తాయింపుతో ముగిసినది. అందరును అరుగుల మీదనున్న కడవలలోనుండి కోరలతో నీరు ముంచుకొని తాగి రెండవ వరుస ఆటకు సిద్ధము కాజొచ్చిరి.

అల్లెమ వకుళను చూచి "అక్కా, అక్కా, నీవునురా." అని చేయి పట్టుకొని లాగెను. "నాకు రాదు, నాకు తెలియదు, నా చేత కాదు." అని వకుళ విదిలించుకొనుచున్నను వినక అల్లెమ వకుళను పట్టుకొని పోయి వరుసలో తన ప్రక్క నిలుపుకొనెను. వకుళ విధిలేక

రెండుమూడు చుట్లు తిరిగి వారితో బాటు చిందులు వేయుట చేతకాక వెనుకకు వచ్చివేసెను.

అర్ధరాత్రి దాటునంత వరకు అందరును ఆడుకొని ఇండ్లకు వెళ్ళిపోయిరి.

వకుళ ఆలోచనలో పడెను.

ఈ పడుచుల శక్తి, వేగము, లాఘవము మరియొక విధముగా ఉపయోగించుకొను మార్గము లేదా. తమ బోయరాజ్యము పల్లవ, చాళుక్య రాజ్యముల సరిహద్దులో ఉన్నది. ఏ సమయమున ఎవరికి ఏ బుద్ధి పుట్టునో, ఎవరు ఎప్పుడు పైనపడుదురో? అట్టి ఆపత్సమయములలో పురుషులేనా పోరాడవలసినది? స్త్రీలేమియు చేయలేరా? యుద్ధములు జరుగునప్పుడు కంచిలోని స్త్రీలు ఏమగుచున్నారు? భర్తలు చనిపోయినచో వితంతువులై మూల కూర్చొనుచున్నారు. లేదా శత్రువుల చేత చెరపట్టబడి వారి ఇండ్లలో దాస్యము చేయుచున్నారు. బోయపడుచులకు అట్టి దుర్గతి పట్టరాదు. వీరికిని యుద్ధములో పాల్గొను విధానములు నేర్పవలె. యుద్ధములో భర్తను కోల్పోవు ప్రతి స్త్రీయు ప్రతీకారముగా ఒక శత్రువునైనను చంపవలె.

బోయపడుచుల శక్తిని, వేగమును, లాఘవమును ఆ మార్గమునకు మళ్ళించవలె. వీరు కుంతములు, ఖడ్గములు పట్టి శత్రువులతో ముఖాముఖి తలపడలేరు. విలువిద్య నేర్చుటకు అది తగిన వయస్సు కాదు. మరి ఏమి నేర్పవలె.

ఇట్లు ఆలోచించి వకుళ చీమకుఱ్ఱు నుండి నల్లరాళ్ళను తెప్పించి వాటిని పలుచని బండలుగా చీల్చించెను. మూకుడులంత పలకలుగా తీర్పించెను. అంచులకు వాదరలను పట్టించి కోటగోడపై బురుజుల వద్ద రాసులు పోయించెను. అవి చూచుటకు కృష్ణుని చక్రాయుధములుగా కనబడుచుండెను. ఆడువారికి ఆ రాతి పలకలను గురిచూచి విసరుటలో సాధన చేయించెను. అల్లెమసాని ఈ కార్యక్రమములో వకుళకు చేదోడు వాదోడుగా నిలిచెను. యువతులు, ప్రౌఢవనితలు కూడా ఈ పలకలు విసరుటలో ఆరితేరిరి.

వేంగి సామ్రాజ్యము అల్లకల్లోలముగా నున్నది.

విష్ణువర్ధన మహారాజు మరణించినాడు. విష్ణువర్ధన మహారాజు బ్రతికి యుండగా అతడు తన రెండవ కుమారుడైన సలుకిని యలమంచిలిపైకి పంపెను. యలమంచిలిలో తమ వంశము వాడే అయిన కొక్కిలి మనుమడు చిన కొక్కిలి రాజ్యము చేయుచున్నాడు. వేంగి రాజ్యమున కొంత భాగమును ఆక్రమించుకొని తానే వేంగి రాజుగా ప్రకటించుకొన్నాడు. సలుకి – వీనికే భీమసలుకి అనియు పేరు – యలమంచిలిపై దండెత్తిపోయి చినకొక్కిలిని వధించి... యలమంచిలిని స్వాధీనము చేసికొనెను. విష్ణువర్ధనుడు మరణించగానే సలుకి తానే వేంగి సామ్రాజ్యధినేతనని ప్రకటించుకొనెను. వేంగిలో అతని అన్న విజయాదిత్యుడు తానే రాజ్యాధినేతనని ప్రకటించెను. వేంగిలో గందరగోళ పరిస్థితులు నెలకొన్నవి. విజయాదిత్యుని వద్ద పెద్ద సైన్యము సిద్ధముగా లేదు. సలుకి యలమంచిలికి కొనిపోయిన చాళుక్య సైన్యమంతయు అతని యొద్దనే ఉన్నది. ఆ సైన్యము సహాయముతో అతడు విజయాదిత్యుని,

అతని అనుచరులను రాజ్యము నుండి వెళ్ళగొట్టెను. వేంగిని ఆక్రమించెను.

విజయాదిత్యుడు అచిర కాలములోనే సైన్యమును సమకూర్చుకొని సలుకిపై దండెత్తెను. రాష్ట్ర కూటులు సలుకికి సాయము వచ్చిరి. విజయాదిత్యుడు ఓడిపోయెను.

విజయాదిత్యునకు హైహయ రుద్రుడు సహాయము వచ్చెను. కాని సలుకిని, రాష్ట్ర కూటులను ఎదిరించుటకు విజయాదిత్యుని సైన్యము చాలదు. విజయాదిత్యుడు బెజవాడను తన స్థావరముగా చేసికొని తన తండ్రికి మిత్రులుగానూ, విశ్వాసపాత్రులుగానూ ఉండిన సామంత రాజులతో మంతనములు సాగించుచుండెను.

బోయకొట్టముల వారు పల్లవులకు విధేయులైయున్నారని విజయాదిత్యునికి తెలియును. కాని జయసింహ వల్లభుని కాలము నుండి ఇటీవల వరకు వారు చాళుక్యుల సామంతులే కదా? కావున వారిని సామదాన భేద దండోపాయములతో తమ వైపునకు త్రిప్పుకొనవలె. బోయలు పేరెన్నిక గన్న ధానుష్కులు. వారు తమ సైన్యములో ఉండినచో సలుకినే కాదు. రాష్ట్ర కూటులను కూడ అవలీలగా జయింపవచ్చును. కాని – వారు తమవైపువత్తురో, రారో, ఏమో ప్రయత్నించవలె.

విజయాదిత్యుడు బోయకొట్టములకు రాయబారిని పంపనిశ్చయించెను.

చాళుక్యరాజ్యమున బ్రాహ్మణులు కార్యఖడ్గములకు చాలినవారై మంత్రులుగానూ, దండనాధులుగానూ కొలువు చేయుచున్నారు. వారు అటు శాస్త్ర విద్యలోనూ, ఇటు శస్త్ర విద్యలోనూ ప్రవీణులు. అట్టి వారిని శర్మ, భట్టారక అను పేర్లతోనే కాక రాజు అనే పేరుతో కూడ పిలిచెడి వారు. అట్టి వారిలో కడియ రాజు అను దండనాథుడు ప్రసిద్ధుడు. నలువది యేండ్ల వాడు. విద్యావంతుడు, పరాక్రమవంతుడు. మాటల యందు సౌమ్యుడు. కార్యముల యందు కఠినుడు. క్రూరుడు. సాహసి.

"ఎట్లైనను మనము బోయ ధానుష్కుల సహాయము సంపాదింపవలెను." అన్నాడు కడియరాజు.

"వారిని మనమే చేజేతులా జార విడుచుకొంటిమి. పల్లవ సేనాధిపతి ఉదయచంద్రుడు బోయకొట్టములపై దండెత్తినప్పుడు మనము పృథ్వీవ్యాఘ్రరాజునకు సాయమందింప లేక పోతిమి. మా పెదతాత విష్ణువర్ధనుడు మా చినతాత కొక్కిలితో యుద్ధము చేయుచు బోయలకు సాయము చేయలేకపోయెను. ఇప్పటికిప్పుడు ఈ సలుకితో గొడవ పెద్దదైపోయినది." అన్నాడు విజయాదిత్యుడు.

"మనకు బోయ ధానుష్కుల సాయము అవశ్యము కావలసియున్నది." అన్నాడు అయ్యపశర్మ.

"సామదాన భేదోపాయములతో ఎట్లయినను వారిని మన దగ్గరికి చేర్చుకొనవలె," అన్నాడు విజయాదిత్యుడు.

"దండోపాయముతోనైనను సరియే." కడియరాజు దృఢముగా పలికెను.

"దండోపాయమా?"

"అవును బలప్రయోగముతోనైనను వారిని స్వాధీనము చేసికొని ధానుష్కులను పట్టుకొని రావలె."

"బలాత్కారముగా పట్టుకొని వచ్చిన వారు విశ్వాసముతో యుద్ధము చేయుదురా?"

"యుద్ధములో పాల్గొను సైనికులలో విశ్వాసముతో యుద్ధము చేయువారు కొందరు మాత్రమే. తక్కిన వారందరును పోరాడకుండిన యెడల ఎదుటి వాడు చంపునని ప్రాణభయముతో పోరాడుదురు." కొంతసేపు తర్కించుకొన్న తరువాత కడియ రాజిట్లనెను.

"రెండు వేల ఆశ్వికబలముతో నేనును, అయ్యపశర్మయు కట్టెపు దుర్గమునకు వెళ్ళెదము. ఆశ్వికులను గుండ్లకమ్మ నదీ తీరమున దాచియుంచి మేము బోయదొరల యొద్దకు రాయబారము వెళ్ళెదము. వారు మనకు సాయము వచ్చినచో వారు ఇప్పుడు పాలించుచున్న భూభాగముకాక ఉత్తరముగా మరి అంత భాగము అప్పగింతుమని వాగ్దానము చేయుదుము. వారు ఒప్పుకొనని యెడల దాగి యుండిన ఆశ్విక సైన్యముతో హఠాత్తుగా కట్టెపు దుర్గము పైబడి నన్నిరాజును బంధింతుము. ఇక చచ్చినట్లు ధానుష్కులు మన వెంట వత్తురు."

"రెండువేల ఆశ్విక దళముతో బోయదొరలను జయింపగలమా. కొన్ని సంవత్సరముల క్రితము ఏమి జరిగినది? నొలంబాధిపతి పులాల చోరుడు ఈ బోయలెంతలే అని చులకన భావముతో బోయకొట్టములపైకి పోయి బోయలకు చిక్కుటయు, వారు వానిని బందీగా చేసి పల్లవరాజు కడకు పంపుటయు, పల్లవరాజు అతనిని క్షమించి తన సామంతునిగా చేసికొనుటయు విన్నాము కామా? అప్పటికి నన్నిదొర వయస్సెంత? లేబ్రాయము క్రిందనే లెక్క. అతడిప్పుడు మరింత ఆరితేరియుండును."

"అదేమి మాట. నొలంబుల బలమెంత? మన బలమెంత? నక్కను ఢీకొన్న బలముతో సింహమును ఢీకొనగలడా?"

తుదకు కడియరాజు మంత్రాంగమే నెరవేరునట్లు విజయాదిత్యుడు అనుమతించెను.

కడియరాజును, అయ్యపశర్మయు రెండువేల ఆశ్వికదళముతో బోయకొట్టముల వైపు బయలుదేరిరి. ఆ సైన్యమున కాల్బలము లేదు. కావున వారు తొందరగానే గుండ్లకమ్మను చేరిరి. ఆశ్విక దళమును గుండ్లకమ్మ తీరమున ఒక తాటితోపులో నిలిపి కడియరాజును, అయ్యపశర్మయు గుఱ్ఱములధిరోహించి కేవలము పది మంది ఆశ్వికులు తోడురాగా నాలుగైదు ఘడియలలో కట్టెపు దుర్గము సమీపించి తమ రాకను నన్నిదొరకు తెలియపరచిరి.

నన్నిదొరకు ఈ విషయము చూచాయగా తన వేగుల ద్వారా తెలిసియే ఉండెను. పంద్రెండు బోయకొట్టముల నుండి కుంతాల వారిని, విలుకాండ్రను రప్పించి స్వల్ప సైన్యమును కట్టెపు దుర్గమున నిలుపుకొని తక్కిన వారినందరిని సమీపములోనున్న బోయకొట్టములలో నిలిపి యుండెను. ఏనుగులను తెప్పించి ఒక క్రోసెడు దూరములోని ఇప్పవనములో సిద్ధముగా నుంచెను. సాధారణ జనులకెవ్వరికిని ఈ సన్నాహము గురించి తెలియదు.

నన్నిదొర శంకరశర్మను, పొన్నిదొరను ఎదురు పంపి కడియరాజును అయ్యపశర్మను సాదరముగా ఆహ్వానించెను.

కడియరాజు వీధుల వెంట పోవుచు జనులను గమనించెను. అందరును ప్రశాంతముగా తమ తమ పనులలో నిమగ్నులైయున్నారు. ఎవరును ఆందోళన పడుచున్నట్లుగాని పోరును ఎదురు చూచుచున్నట్లు గానీ సూచనలు కానరాలేదు. ఇప్పుడు మెరుపువేగమున తమ ఆశ్వికులు వచ్చిపడిన యెడల ఈ నన్నిదొరయు, పొన్నిదొరయు వంట ఇంటి కుందేళ్ళే.

నగరులోని విశాలమైన పడసాలలో ఒకవైపున నన్నిదొరయు, పొన్నిదొరయు, శంకర శర్మయు మరికొందరు బోయపెద్దలును ఆసీనులైయున్నారు. వీరికి ఎదురుగా కడియరాజును, అయ్యపశర్మయు, ఇరువురు చాళుక్య దళపతులును ఆసీనులైయున్నారు.

"మీకు తెలిసియే యుండును. చాళుక్యరాజవంశములో పెను తగవులు పుట్టినవి. పెద్దవాడైన విజయాదిత్యుడు ఉండగా చిన్నవాడైన భీమసలుకి రాజ్యమును అపహరించినాడు. వానికి రాష్ట్రకూటులు సాయముగానున్నారు. రాష్ట్రకూటులు అన్యాయమును బలపరచు చున్నారు."

నన్నిదొర తల ఊపుచు నిశ్శబ్దముగా వినుచుండెను.

"మీరు వినియే యుందురు. మీ పూర్వీకులు త్రిపురాంతక ప్రాంతమున ఉండిన వారు. అనగా వేంగి రాజ్య ప్రజలే. మీరు ఇక్కడ స్థిర పడిన తరువాత కూడ మీరు చాలా కాలము వేంగి రాజ్య ప్రజలుగానే ఉంటిరి. ఇటీవలనే మిమ్ములను పల్లవులు లోగొన్నారు. ఆనాడును – ఇట్లే. వేంగి రాజ్యము అస్తవ్యస్తముగా నుండెను. ఒకవైపున కొక్కిలి రాజుతోనూ అతనికి సాయముగా నిలిచిన సామంతులతోనూ పోరాటము. మీకు సాయము వచ్చు అవకాశము లేకపోయెను."

నన్నిదొర ఊరక వినుచుండెను.

"దొరగారేమియు మాట్లాడుటలేదు." అయ్యపశర్మ అసంతృప్తితో పలికెను.

"మీరింకను ఏమియు అడుగలేదు కదా. చరిత్ర చెప్పుచున్నారు. వినుచున్నాము."

ఈ గడుసు సమాధానమునకు కడియరాజంతటి రాజకీయ ధురంధరుడు నివ్వెఱపోయెను. ఇతడు చాలా లోతైన మనిషి. ఇతనితో జాగ్రత్తగా వ్యవహరింపవలె. ఇక సూటిగా ముగ్గులోనికి దింపవలసినదే. ముసుగులో గుద్దులాట ఇతని వద్ద పనికిరాదు. కడియరాజు రెండు నిమిషములు మౌనముగా ఉండి మరల ప్రారంభించెను.

"మీ పూర్వ ప్రభువుల వంశములో అన్యాయము జరుగుచున్నది. మీరు న్యాయము వైపు నిలిచి అన్యాయమును తుదముట్టించుట మీ ధర్మము."

"మాకు ఆ అవసరము కనబడుట లేదు."

కడియ రాజునకు సమాధానమేమియుతోచలేదు.

అయ్యపశర్మ పలికెను.

"అవసరములు సామంతులకు కలుగవు. చక్రవర్తులకే అవసరములు కలుగును. చక్రవర్తుల అవసరములు తీర్చుట సామంతుల కర్తవ్యము."

"మేము పల్లవ చక్రవర్తుల సామంతులము. మా చక్రవర్తులకేమియు అవసరమేర్పడలేదు."

"మీరు పల్లవుల సామంతులుగా నుండనవసరము లేదు. ఇప్పుడు మీ పండ్రెండు బోయకొట్టములు ఎంత విస్తీర్ణము వ్యాపించియున్నదో అంత విస్తీర్ణ భూభాగము గుండ్లకమ్మకు ఉత్తరమున అదనముగా విజయాదిత్యులు మీకు బహూకరించి మిమ్ములను ముఖ్య సామంతులుగా పరిగణింతురు."

"శ్రీరాముడు సముద్రమును దాటకనే, లంకలో అడుగుపెట్టకనే, రావణుని చంపకనే, లంకకు విభీషణుని రాజుగా పట్టాభిషేకము చేసెనట. అట్లున్నది."

"రాముని వలెనే మేము జయింపనూ జయింతుము. మీకు భూభాగము ఇవ్వనూ ఇత్తుము."

"నందోరాజా భవిష్యతి" మా కున్నది చాలును. అదనపు రాజ్యము అవసరము లేదు."

"అంతకాలము మిమ్ములను పాలించిన వేంగి ప్రభువులను కాక నిన్నమొన్న మీపై నిష్కారణముగా దండెత్తి వచ్చి బలవంతముగా ఆక్రమించుకొన్న పల్లవులపై విశ్వాసము చూపుట ధర్మము కాదు. మీరు తెలుగువారు, వేంగి ప్రభువులు తెలుగువారు. ఇది వేంగినాడు. మీరు వేంగి నాటి సామంతులు. పల్లవులు తమిళులు. వారు మీపై బలవంతముగా మోపిన కాడిమానును తీసిపారవైచి వేంగి ప్రభువుల యెడల విశ్వాసము చూపుటకు ఇదియే మీకు దొరికిన అరుదైన అవకాశము."

నన్నిబోయడు తాను కూర్చున్న ఆసనముపైన చక్కగా కూర్చొని రవంత ముందునకు వంగి మాట్లాడసాగెను.

"తమరు చరిత్ర సగమే చెప్పితిరి. సగము మరుగుపరచితిరి. ఎవరు మా ఏలికలు? ఎవరికి మేము సామంతులము. చాళుక్య ప్రభువులు మా ఏలికలా? ఏదీ – ఒకసారి వెనుకకు తిరిగి చూడుడు.

ఆరేడు తరములకు పూర్వము మావారు త్రిపురాంతక ప్రాంతమున ఆకుచాటు పిందెల వలె సడియు చప్పుడును లేకుండా బ్రతుకుచుండగా సత్యాశ్రయ పులకేశి మహారాజుల వారు విష్ణుకుండినులపై దండెత్తుచు మా గ్రామములపై నడచి వెళ్ళిరి. పులికేశి సైన్యము మాపల్లెలను కొల్లగొట్టినది. మా పశువులు, గొఱ్ఱెలు, మేకలు, పందులు, కోళ్ళు, పాతరలలో ధాన్యము అంతయు పులికేశి సైన్యము స్వాహా చేసెను. ఆ మహాసైన్యము మా పంటభూములను వారి గుఱ్ఱముల చేతను, ఏనుగుల చేతను, ఎడ్ల చేతను మేపించి, త్రొక్కించి నాశనము చేసినది.

విష్ణుకుండినులు మావారిని చాలమందిని తమ సైన్యములోనికి లాగుకొనిరి. యుద్ధములో మా వారు చాల మంది చనిపోయిరి.

చాళుక్యులు గెలిచిన తరువాత, వేంగి రాజ్యమును ఏర్పాటు చేసికొన్న తరువాత, వారి భూభాగములోని మా పల్లెలను గురించి, స్థితిగతులను గురించి ఆలోచించిరా? మా వారికి అభయమిచ్చిరా? లేదు. పై పెచ్చు మావారు విష్ణుకుండినులకు విశ్వాసపాత్రులుగానున్నారను నెపముతో మావారిని వేధించిరి. వధించిరి. చాళుక్య సైనికులను మా పల్లెలలో దింపి ఆక్రమింపజేసిరి.

ఆనాటి మా బోయదొరల నాయకుడు వీరనబోయడు పల్లవుల నాశ్రయించి ఈ భూభాగమును సంపాదించి మావారి నందరిని ఇక్కడకు తరలించి సుఖముగా బ్రతుకుచుండగా జయసింహ వల్లభమహారాజు దారినపోవు వర్తకుల మాటలు నమ్మి పెద్ద సైన్యముతో మా కొట్టములపై బడెను. అప్పటికి మావారు తమ దగ్గరనున్నదంతయు సమర్పించుకొని దాసోహమనిరి. మరికొంత కాలమునకు మంగి యువరాజు మరియొకసారి మాపై బడెను. మావారు మరల తమ వద్ద ఉన్నదంతయు ఊడ్చి సమర్పించుకొనిరి.

ఇప్పుడు చెప్పుడు. ఏనాడైన చాళుక్య ప్రభువులు మమ్ములను తమ ప్రజలుగా చూచిరా? ఏనాడైనా మమ్ములను తమ సామంతులుగా చూచిరా? మేము విష్ణుకుండినుల పాలనలో నుండగా వారి పక్షమున పల్లవులతోనూ పోరాడిన వారమే. పల్లవులు అది మనస్సులో పెట్టుకొనక మాకు ఆశ్రయమిచ్చిరి. అంతమాత్రపు ఔదార్యము చాళుక్య ప్రభువులకు లేకపోయెను.

చాళుక్య ప్రభువులనే నమ్ముకొని, చాళుక్య దళపతి కుమార్తెను పెండ్లాడి, చాళుక్యులకు విశ్వాసపాత్రుడై యుండిన మా తాత పులిరాజు – మీరు పృధ్వీవ్యాఘ్రరాజు అని చెప్పుకొన్న పులిరాజు గతి ఏమైనది. పల్లవులు మాపైబడినప్పుడు సహాయమునకై తన తమ్ములను మీ యొద్దకు పంపెను. మిమ్ములను అర్థించెను. ఆక్రోశించెను. మిమ్ములను నమ్ముకున్నందుకు ఏమైనది. మా పినతాతలను – పులిరాజు తమ్ములను ఇక్కడనే – ఈ తావులోనే ఉదయ చంద్రుడు ఘోరముగా కొఱత వేసి చంపెను. ఆ ఘోర దృశ్యము ఇప్పటికి నా కన్నులకు కట్టినట్లున్నది. పులిరాజు పారిపోయెను. చాళుక్య ప్రభువులు అతనికి ఆశ్రయమిచ్చిరా? పులిరాజు తమ్ములను కొఱత వేసినందులకు చాళుక్య ప్రభువులు పూటకాదా?

ఎవరు మా ప్రభువులు? మా సేవలు, మా కప్పములు, మా కానుకలు మాత్రమే అవసరము కాని మా క్షేమము ప్రభువులకు అవసరము లేదా?

మేమెవరికిని సాయము చేయునట్టి స్థితిలో లేము. మా మానాన మమ్ములను బ్రతుకనిచ్చిన చాలును.” నన్నిదొర ఆగెను.

“అదియైనను సాధ్యమగునని తలంచుచున్నారా?” కడియరాజు గందరించిన మొగముతో మంద్రస్వరమున పలికెను.

ఆ మాటలోని బెదరింపు హెచ్చరిక విని బోయ పెద్దలు ఉలికిపడిరి. ఇది నన్నిదొర ఊహించినదే.

“బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా. ఏమి జరుగవలసియున్నదో అది జరుగనిండు. మీరు వచ్చిన పని పూర్తి అయినది.” అని నన్నిబోయడు సమాధానమిచ్చి వెనుకకు చేరగిలబడి కూర్చుండెను.

కడియరాజును, అయ్యపశర్మయు తదితరులును లేచి నిలబడిరి.

“ఇక సెలవు తీసికొందుము. మీరు మరి యొకసారి ఆలోచించుట మంచిది.” అని పలికి కడియరాజు తన వారితో కలిసి వెడలిపోయెను.

గుండ్లకమ్మ వద్ద ఆశ్వికులున్న విషయము నన్నిదొరకు ముందుగానే వేగు వచ్చినది. అప్పటికే ప్రొద్దుపోవుచున్నది. వీరు పోవుటకును, వారు దండెత్తి వచ్చుటకును రెండు జాములు పట్టవచ్చును. చీకటిలో శత్రుసైనికులు యుద్ధము ప్రారంభింపరు. కావున చాళుక్యుల ఆశ్విక దళము ఉదయమునే వచ్చిపడును.

నన్నిదొర, బోయదొరలతో సమావేశమై యుద్ధ తంత్రమునాలోచించెను. మొదట కోట తలుపులు మూయించెను. కోటగోడలపై ఇన్నూరు మంది విలుకాండ్రును, తక్కిన వారు కోట వెలుపల శత్రువులకు కనిపించని చోటను ఉండబంచెను. శత్రువుల విలుకాండ్ర వద్ద బాణములు అయిపోవు వరకు జాగ్రత్తగా పోరాడి తరువాత విజృంభించవలెను.

ఆ రాత్రి కోటలోపల ఎవరికిని నిద్రలేదు. తెలతెలవారుచుండగా దూరమున ఆశ్విక దళము వచ్చు ధూళిమేఘములు కనబడెను. వకుళ తాను ఇదివరకే శిక్షణ ఇచ్చియుండిన యేబది మంది ఆడ సైన్యమును కోటగోడపై కోటకొమ్మల చాటున నిలిపెను. వారి దగ్గరనే బోయధానుష్కులు సిద్ధముగా నుండిరి.

చాళుక్యసేన కోటగోడపైకి బాణ వర్షము కురిపించుచు కోటను ముట్టడించెను. మొదట కొంత అజాగ్రత్తగా నుండిన బోయ యువకులు పది పదునైదు మందికి బాణముల దెబ్బలు తగిలినవి. వారు వైద్యము కొఱకు క్రిందికి దిగిపోయిరి. చాళుక్యుల బాణములకు అగపడ కుండా కోటకొమ్మల చాటునను, డాలు వారుల చాటునను నిలబడి బోయవనితలు రాతి పలకలను చాళుక్య సేనలపై విసర సాగిరి. క్రింద చాళుక్య సైన్యము సమ్మర్దముగా ఉండుట చేత ప్రతి పలకయు చాళుక్యుల ఆశ్వికులకో, అశ్వమునకో తగిలి పెద్దగా గాయపఱచు చుండెను. ఆ రాతి పలకలను చాళుక్యులు మరల కోటగోడపైకి విసురు అవకాశము లేదు. నేర్పు, బలము చాలదు. చాళుక్య సైనికులు ప్రయోగించు బాణములు కోటకొమ్మలకు తగిలి క్రింద పడిపోవుచున్నవి. కొన్ని బాణములు కోటలోపల పడుచున్నవి. లోపల పడిన వానిని స్త్రీలు సేకరించి కోటగోడలపైకి చేర్చుచున్నారు. బోయదొరలు తెరపి చూచి చాటునుండి ప్రయోగించు బాణములు రాతి పలకలవలెనే ఎవరికో ఒకరికి తగులుచుండెను. మూడు ఘడియల యుద్ధములోనే చాళుక్య ఆశ్వికులు చాలా మంది గాయములపాలైరి. కొందరు మరణించిరి.

కడియరాజు అనేక యుద్ధములలో ఆరితేరినవాడు. తన సైనికులలోకొందరికి డాలు వారులు తలలపై చాటు పెట్టించి కోట తలుపులను చీల్చుమని ఆజ్ఞాపించెను. కోటగోడపై నుండి లగ్గదింపులను దొర్లించకుండా కోటగోడపై ఎవరును తల సూపకుండా ధానుష్కులను బాణప్రయోగము చేయనాజ్ఞాపించెను.

అంతలో చాళుక్య సైనికుల వెనుక వైపు మూడు ప్రక్కల నుండి దాదాపు మున్నూరు మంది బోయ విలుకాండ్రు గుఱ్ఱములపై దూసుకొనివచ్చి చాళుక్యులపై బాణవర్షము కురిపించిరి. తొలివ్రేటునకే నూరుమంది చాళుక్య సైనికులు నేలకొరిగిరి. తక్కిన వారు తేరుకొని వెనుదిరిగి నిలుచునప్పటికి రెండవ విడత బాణ వర్షమునకు మరియొక నూరుమంది

నేలకొరిగిరి. దీనితో దిగ్భ్రాంతినొందిన చాళుక్య సైనికులు కోటగోడను సాధించు ప్రయత్నమును వదలి క్రొత్తగా వచ్చిన బోయ విలుకాండ్రపై విఱచుకొని పడిరి. చాళుక్య సైనికులు అటువైపు తిరుగగానే కోట గోడపై నుండి బాణములును రాతి పలకలును ముమ్మరముగా వచ్చి పడెను. చాళుక్యుల పరిస్థితి అడకత్తెరలో పోకచెక్క చందమయ్యెను.

ఇంతలో ఎదురు చూడని విధముగా ఐదు ఏనుగులు వచ్చి చాళుక్య సైన్యమును చిందరవందర చేయజొచ్చినవి. ఆ యేనుగుల ముఖము మీదను, ప్రక్కల యందును ఇనుప రేకులు వ్రేలాడుచున్నవి. తొండము పొడవునను తోలు పట్టెడలు కట్టి వానికి అక్కడక్కడ మూరెడుపొడవు కత్తులు కట్టబడినవి. ప్రక్కల యందు పొడవైన ఖడ్గములు కట్టబడినవి. ఆ ఏనుగులు శివమెత్తినట్లు చిందులు వేయుచు చాళుక్య సైన్యములో దూరి విచ్చలవిడిగా తొండములనూపుచు పరుగెత్తుచుండగా చాళుక్యుల గుఱ్ఱములు గాయపడి బెదరి పారిపోజొచ్చినవి. చాళుక్యులు దూరము నుండి వేయు బల్లెములు గానీ, బాణములు గానీ వాటికి తగులుట లేదు. తప్పిదారి తగిలిన బాణముల దెబ్బకు అవి మరింత రెచ్చిపోయి మరింత వేగముగా చాళుక్య సైన్యమును కకావికలు చేయసాగెను. ఈ ఏనుగుల నెదిరించుటకు చాళుక్యులు ఏనుగులను కొనిరాలేదు.

ఏనుగుల వీరవిహారము, వెనుకనుండి పొన్ని నాయకత్వమున వచ్చి పడిన బోయవీరుల బాణ వర్షము. కోటగోడపై నుండి వచ్చి పడుచున్నరాళ్ళ వర్షము, తమ గుఱ్ఱముల బెదురుపాటు. ఇన్ని ప్రతికూల పరిస్థితులలో దిక్కుతోచక చాళుక్య సేనలు వెనుకడుగు వేయుచు గుండ్లకమ్మ వైపు సాగిపోజొచ్చెను. కడియరాజు ఖడ్గమును చేతపట్టుకొని గుఱ్ఱముపై పొన్నివైపు దూసుకొని పోయెను. పొన్ని కుడిచేతితో ఖడ్గమును, ఎడమచేతితో డాలును పూని కడియరాజును ఢీకొని తన కత్తితో అతని కుంతమును ఎగురగొట్టి రొమ్మున పొడిచెను. కడియరాజు రొమ్ముపైన కవచముండుట వలన ఖడ్గము అతని రొమ్ములో దూరలేదు. కాని అతడు గుఱ్ఱముపై నుండి క్రిందపడిపోయెను. బోయవీరులు అతనిని పట్టుకొని చేతులు వెనుకకు విరిచి కట్టిరి. అయ్యపశర్మయు లొంగిపోయెను.

"వారిని ఏమియు చేయవద్దు." అని నన్నిదొర గట్టిగా కేకవేసెను.

వెనుదిరిగిపోవుచున్న చాళుక్య సైనికులు కడియరాజు పట్టుపడుట చూచి వెనుదిరిగి తెగువచేసి ముందుకు రాజూచిరి. అది చూచి ఆయుధములు దించిన బోయవీరులు మరల ఆయుధములెత్తి సిద్ధమైరి. కానీ చాళుక్య దళపతులలో ఒకడు చేయెత్తి తనవారిని వారించెను.

తమ ప్రధాన పురుషులు ఇప్పుడు శత్రువుల చేతిలో బందీలుగా నున్నారు. ఇప్పుడు తాము ఎంత మాత్రము సాహసమునకు పూనుకొన్నను వారి ప్రాణములకు అపాయము. ఊరక చూచుచుండవలె అంతే.

కడియరాజును, అయ్యపశర్మను నన్నిదొర దగ్గరకు తీసికొనివచ్చిరి. నన్నిదొర ఇంకను కవచమును, ఆయుధములను ధరించియే యున్నాడు. యుద్ధరంగమునందే ఉన్నాడు.

"మీరు బ్రాహ్మణులు, వయోధికులు, శాస్త్రకోవిదులు. మీరు యుద్ధ విద్యలను కూడ అభ్యసించి వీరులైనారు. మీబోటి వారి కిట్టి వంచన తగునా. రెండు వేల మంది ఆశ్విక భటులను వెంటబెట్టుకొని వచ్చి వారిని మాకు కానరాని ప్రదేశమున ఉంచి మాతో సంధి సంప్రదింపులు జరుపుట, సాయమడుగుట. ఇది యేమి యుద్ధనీతి. ఇది వంచనకాదా? మీరు చదివిన శాస్త్రములు ఈ చర్యలను ఏమనుచున్నవి? వంచన అని అనునా? ఋజు ప్రవర్తనయని అనునా? మీ ప్రాణములిప్పుడు మా చేతిలో ఉన్నవి. కానీ మిమ్ములను చంపుట ధర్మము కాదు. కుండను చూడకపోయినను కుండలోని పాలను చూడవలె. మిమ్ములను చూడకపోయినను మీలోని శాస్త్ర విద్యను చూడవలె. మిమ్ములను వధించుట విద్యను వధించి నట్లే. మిమ్ములను వదలుచున్నాము. చివరగా మీకును, మీ ద్వారా చాళుక్య ప్రభువులకును ఒక విన్నపము. విజయాదిత్యుల వారికిని, సలుకి ప్రభువుల వారికిని జరుగుచున్న కలహము వారి కుటుంబమునకు చెందినది. ఎవరు ఓడినను, ఎవరు గెలిచినను మాకు ఒరుగునది లేదు. తరుగునదియు లేదు. మా వలన మీకు చిన్న మెత్తు కష్టముగానీ, నష్టముగానీ కలుగుట లేదు కదా. నిష్కారణముగా మమ్ముల నేల వేధింతురు? మీ సామ్రాజ్యకాంక్షకు మమ్ములనేల బలిచేయుదురు. మా మానాన మమ్ములను బ్రతుకనిందు" అని వారి బంధములు విడిపించు మని పొన్నికి సైగ చేసెను. పొన్ని వారి బంధములు తొలగించెను. చాళుక్య సైనికులు తీవ్రముగా గాయపడిన వారిని గుఱ్ఱములపై వేసికొని బ్రతుకు జీవుడా అని వెళ్ళిపోయిరి. కడియరాజును, అయ్యపశర్మయు గుఱ్ఱములెక్కి సైన్యమును దాటి ముందుపోసాగిరి.

ఈ చిన్నపాటి యుద్ధములోనే చాళుక్యసైనికులు ఇన్నూట యేబది మంది చనిపోయిరి. మరి అంతమంది గాయపడిరి. బోయకొట్టముల వారు ఇరువది మంది చనిపోయిరి. చాల మంది గాయపడిరి.

వకుళకు కుమారుడు పుట్టినాడు. బారసాల శంకరశర్మ నిర్వహించెను. "వానికేమి పేరు పెట్టదలచినారు," అని అడిగెను. వెంటనే వకుళ మలయప్ప అనెను.

"అది ఏమి పేరు."

అది తిరువేంగడ క్షేత్రమున వెలసియున్న దేవుని పేర్లలో ఒకటి. మల అనగా కొండ అని అర్థము. మలయప్ప అనగా కొండమీది దేవుడని యర్థము. నేను చిన్నప్పటి నుండియు మా మేనత్తతో కూడి తిరువేంగడము క్షేత్రములో జరుగు బ్రహ్మోత్సవములకు తప్పక వెళ్ళుచుంటిని. ఎందుకో గానీ నాకు ఆ దేవునిపై మిక్కిలి గురి ఏర్పడినది. మూల విరాట్టుగాని, అక్కడి ఉత్సవ విగ్రహము గానీ ఎంతో అందముగా నున్నవి. సాక్షాత్తు శ్రీమన్నారాయణుని చూచినట్లే యుండును. ఆ ఉత్సవ విగ్రహమునకు నేను మలయప్ప అని పేరు పెట్టుకున్నాను. నా కుమారునికి అదే పేరు కొట్టుకొందును.

నన్నిదొర ఆమోదముతో తలయూచెను. పొన్నిదొర "సరే," అనెను. నామకరణము జరిగిపోయెను.

ఆనాడే నన్నిదొర పెద్దకుమారునికి అక్షరాభ్యాసమును జరిగెను. శంకరశర్మ బియ్యముపై బంగారు శలాకతో ఓం నమశ్శివాయ సిద్ధం నమః అని (వ్రాయించెను. ఒక నెల దినములు జరుగగానే వాని విద్యాభ్యాసమునకు శంకరశర్మ భార్య పూనుకొని (ప్రత్యేక (శద్ధ వహించి చదువు చెప్పసాగినది. నన్నిదొర రెండవ కుమారుడును, మూడవ కుమారుడును (ప్రతి దినము అన్న వెంట ఊరకే తమ ఉపాధ్యాయురాలి ఇంటికి వెళ్ళి కాలక్షేపము చేయుచుండిరి. ఆమె వారికి చిన్న చిన్న పద్యములు, పాటలు, (ప్రార్థన శ్లోకములు నేర్పుచుండెను.

మరి రెండేండ్లలో పొన్ని దొర రెండవ భార్య అల్లెమసానికి ఒక కుమారుడును, వకుళకు ఒక కుమార్తెయు కలిగిరి.

మలయప్పకు నాలుగు సంవత్సరములు నిండగానే వకుళ ఒక దినము నన్నిదొరతో "ఇంటిలో అయిదుగురు మగపిల్లలున్నారు. వారిలో ఒకరిద్దరినైనను పెద్ద విద్వాంసులుగా పండితులుగా చేయవలెనని ఆశగానున్నది." అనెను.

నన్నిదొర ఆలోచించెను. నిజమే విద్య గౌరవమును తెచ్చును. పొన్నికి పల్లవ రాజ్యములో అంతకీర్తి వచ్చినదనగా వాడు గుంటూరులోనూ, ధాన్యకటకములోనూ నేర్చిన విద్యలే కారణము. యుద్ధ వీరులకేమి ఎక్కడైననుందురు. కాని ఈమె ఉద్దేశమేమి? ఎవనిని పండి తునిగా చేయదలచినది?

"ఇక్కడ అంతటి పండితులు లేరే. శంకరశర్మ అంతంత మా(తపు పండితుడు."

"కంచిలో గొప్ప గొప్ప శా(స్త్రవేత్తలున్నారు."

అర్థమైనది. మలయప్పను కంచిలో చదివించవలెనని ఆమె ఉద్దేశము.

"ఎంత కాలము చదువవలెను?"

"అయిదారు సంవత్సరములు చాలును."

"సరే. ముందుగా కంచికి వర్తమానము పంపి అక్కడి నుండి సమాధానము వచ్చిన వెంటనే మలయప్పను (ప్రయాణమునకు సిద్ధము చేయుము."

"మలయప్పనా? మలయప్పకంటె పెద్ద పిల్లలున్నారు."

"అవును. కాని మలయప్ప అయినచో అక్కడ మీవారితోబాగుగా కలిసిపోవును."

"అట్లేమియు లేదు. కొమరప్పను కూడ పంపెదము" కొమరప్ప నన్నిదొర చిన్నకొడుకు. నన్నిదొర సమ్మతించెను.

వకుళ కంచికి వర్తమానము పంపెను. వార్తాహరులు ఒక నెల దినములలో తిరిగి వచ్చిరి. కంచిలో వకుళ తల్లిదం(డులును మహారాణియు మిక్కిలి సంతోషించిరట. పిల్లవాం(డు అక్కడ అందరికి మాలిమి యగు వరకు కొంతకాలము వకుళ కంచిలో ఉండుట మంచిదట.

మరియొక నెలలో వకుళయు, మలయప్పయు, కొమరప్పయు తగిన పరివారముతో కంచికి చేరుకొనిరి. అక్కడ వకుళకు విశేషమైన ఆదరము లభించెను. మహారాజుగారి మేనకోడలు, బోయరాజ్యమునకు యువరాణి. గౌరవాదరములకేమి కొదువ. ఇటీవల

నొలంబాధిపతి పులాలచోరునితోనూ, మొన్నటికి మొన్న చాళుక్య సేనలతోనూ జరిగిన యుద్ధములను గురించియు, ఆ యుద్ధములలో బోయ సైనికుల విజయమును గురించియు, అందులో వకుళ పాత్రను గురించియు వార్తలు చిలువలు పలువలుగా పల్లవ రాజ్యమంతయు వ్యాపించిపోయినది. పల్లవ రాజు ఆమెను ప్రత్యేకముగా పిలిపించుకొని ప్రక్కన కూర్చుండ బెట్టుకొని బోయ రాజ్యము యొక్క విశేషములను గురించి మాట్లాడినాడు. ఇక చెప్ప వలసినదేమి?

కంచిలో పిల్లవాండ్ర విద్యాభ్యాసమునకు గురువుల ఎన్నిక, అప్పగింతలు జరిగిపోయెను. వకుళ కంచిలో నాలుగు నెలలుండి తిరుగు ప్రయాణమున తిరువేంగడక్షేత్రమున పది దినములు గడిపెను. అర్చకులందరును ఆమెను విశేషముగా ఆదరించిరి. ఆమెయు దేవాలయ మునకు విశేషముగా కైంకర్యములు సమర్పించెను.

వకుళ ఆ దేవాలయము నందలి ఉత్సవ విగ్రహము ఎదుట కూర్చుండి నోరారా 'మలయప్పా' అని పిలుచును, స్వయముగా అభిషేకము చేయును, స్వయముగా నైవేద్యము వండి సమర్పించును. స్వయముగా పవ్వళింపు సేవ చేయించును. జోలపాట పాడును.

పది దినములు తిరువేంగడమున గడిపి వకుళ తిరిగి కట్టెపు దుర్గము చేరెను.

వేంగి రాజ్యమున రాజకీయ కల్లోలము ఎన్ని సంవత్సరములైనను చల్లారలేదు. భీమసలుకికిని, విజయాదిత్యునికిని మధ్య యుద్ధములు సంవత్సరముల పొడువునను కొనసాగుచునే యున్నవి. విజయాదిత్యుడు ఒక చోట గెలిచిన, భీమసలుకి మరియొక చోట గెలుచుచున్నాడు. జయాపజయములు త్రాసులోని సిబ్బెల వలె పైకి క్రిందికి మారుచున్నవి. భీమసలుకికి రాష్ట్ర కూటులు బాసటగా నిలిచినారు. విజయాదిత్యునికి హైహయులు బాసటగా నిలిచినారు. ఇట్లు బాసటగా వచ్చిన వారు తాము అడుగుపెట్టిన చోట నెల్ల జనులను దోచుకొని తమ్ముతాము పోషించుకొనుచున్నారు.

దేశ చరిత్రలు, రాజుల చరిత్రలు, వ్రాయువారు వారి విజయములను పేర్కొందురే గానీ వారు కావించు విధ్వంసమును పేర్కొనరు. వారు గావించు విధ్వంసమును, మారణ హోమమును, దోపిడిని పరాక్రమముగా కొనియాడుదురు. శాసనములలోనికి ఎక్కింతురు. జయస్తంభములు నిలుపుదురు. ఒక్కొక్క జయస్తంభము వెనుక, ఒక్కొక్క విజయగాథ వెనుక వేలకొలది జనుల మరణఘోషయు, అనేక జనపదముల యొక్క విధ్వంస జనిత ఆర్తనాద ములును అంతర్లీనమై యుండును. అవి ఎవరికి వినబడును?

ఈ యుద్ధములు దాదాపు పండ్రెండు సంవత్సరములు కొనసాగినవి. ఇంచుమించు నూరు స్థలములలో నూరు యుద్ధములు జరిగినవి.

వేంగి రాజ్యపు రేవు పట్టణములన్నియు దిక్కులేనివైపోయినవి. ఇరు పక్షముల వారును ఓడలపై పన్నులు విధించెడు వారే. రక్షణ కల్పించువారెవరును లేరు. ముఖ్యముగా బ్రహ్మ, మలయ, సువర్ణ ద్వీపముల నుండి వచ్చు పెద్ద ఓడలు రేవు పట్టణములలో సరుకులు

దించు అవకాశమే సన్నగిల్లినది. వారు వేరు రేవు పట్టణములను వెదకికొను ప్రయత్నములు చేయసాగిరి.

ఈ పరిస్థితిని గమనించి నన్నిదొర గుండ్లకమ్మ నదీ ముఖద్వారమున కనుపఱ్ఱు సమీప మున గల ఓడరేవును మరింత విస్తరింపజేసెను. సముద్రతీరమున నూరడుగుల ఎత్తు గోపురమును నిర్మించి దానిపై భాగమున అయిదు పతాకములను ఎత్తించెను. రాత్రుల యందు చాల దూరము కనబడునట్లు నెగడువేయించెను. ఈ కార్యములు నిరంతరము జరుగునట్లు పది మంది పనివారిని నియమించెను. సరుకులపై పన్ను విధించి గ్రహించు టకును, వర్తకులకు తామ్ర ఫలకములలో అనుమతి పత్రములు వ్రాసి ఇచ్చుటకు, రాబట్టిన పన్నులు లెక్కలు కట్టి కట్టెపు దుర్గమునకు పంపుటకు ఉద్యోగులను నియమించెను. వర్తకులు విశ్రమించుటకు సత్రములును, బావులును, సరుకు దించి నిలువ చేసికొనుటకు విశాలమైన మాళిగలు ఏర్పాటు చేసెను. వర్తకులు నానా దేశస్థులు కనుక వారి వారి అలవాట్ల చొప్పున వంటలు వండుకొనుటకును ఏర్పాటు చేసెను. ఇన్ని ఏర్పాట్లతో అక్కడ ఒక పెద్ద ఊరే వెలసెను. చర్మకారులు, కమ్మరులు, కంచరులు, చాకళ్ళు, మంగళ్ళు భారవాహులు, బాడుగబండ్ల వారు, పల్లకీ బోయీలు, ఇతర వృత్తుల వారు చేరిరి. వర్తకుల వినోదము కొఱకు నాట్యకత్తెలు వచ్చి చేరిరి. వేశ్యవాటికలు కూడ వెలసెను. సత్రములలో నుండుట నచ్చని ఘనశ్రేష్ఠులు వేశ్యల యిండ్లలో విడియుచుండిరి. వారికి అక్కడ సమస్త రాజభోగములు అమరుచుండెను.

బోయరాజ్యమునకు ఆదాయము ఇబ్బడి ముబ్బడిగా పెరిగెను.

బోయరాజ్యపు ప్రభువు అనుమతి పొంది కనుపఱ్ఱు నుండి బయలు దేరిన సాతును అటు వినుగొండ నుండి ఇటు నెల్లూరు వరకు ఎక్కడగాని, అడ్డగించు ధైర్యము ఎవరికిని లేకుండెను. మరల పన్ను అడుగు ధైర్యమును లేకుండెను. కావున చాలమట్టుకు ఓడలు కనుపఱ్ఱులోనే దిగుచుండెను.

ఈ క్రొత్త ఆదాయముతో నన్నిదొర మరికొన్ని గుఱ్ఱములను కొనెను. ఇబ్బడిముబ్బడిగా ఆయుధములు, రక్షణ పరికరములు సమకూర్చుకొనెను. నానాజాతుల నుండి తెలివియు, సాహసమును, ఉపాయమును, శక్తియుగల యువకులను చాల మందిని సైన్యములో చేర్చుకొనెను. వారికి కొంత భూమిని భృతిగా ఇచ్చుచుండెను. జీతమునకు యుద్ధము చేయు వాడు రాజుకొఱకై యుద్ధము చేయును. పొలముకలవాడు తన జన్మభూమికై, తన ఉనికికై యుద్ధము చేయును. నన్నిబోయడు వారికి నిరంతరము ఆయుధ విద్యలలో సాధన చేయించు చుండెను. సైనికులకు చర్మపు కవచములను, చర్మపు శిరస్త్రాణములును చేయించియిచ్చెను. చర్మకారులకు పని ఎక్కువయ్యెను. ఆదాయమును పెరిగెను.

మలయప్పకు ఇప్పుడు పండ్రెండేండ్లు. కొమరప్పకు పదమూడు. కొమరప్పకు కంచి వాతావరణమును కంచి చదువుల భారమును ఒంటబట్టలేదు. కంచిలో రెండేండ్లుండి చదువుకు స్వస్తిచెప్పి కట్టెపుదుర్గము చేరుకొనెను. మలయప్ప ఆరునెలలకొకసారి కంచి

నుండి కట్టెపు దుర్గమునకు వచ్చి ఒక నెల దినములు స్వజనుల మధ్య కాలము గడిపి వెళ్ళుచుండెను. కంచిలో అతడు దండనీతి, కౌటిల్యుని అర్థశాస్త్రము, కాళిదాసు కావ్యములు, నాటకములు, భారత రామాయణములు పఠించెను, తర్కమీమాంసా ధర్మశాస్త్రములు అభ్యసించెను. అతని విద్యాభ్యాసము కంచిలో ఆరేండ్లు సాగెను.

మలయప్పకు కంచిలోని సంస్కృతి నచ్చినది కానీ ఆహారమునచ్చలేదు. అక్కడి బ్రాహ్మణ బ్రాహ్మణేతర వర్గ విభేదము మరియు శ్రుతి మించినట్లు తోచినది. అక్కడి బ్రాహ్మణులు బ్రాహ్మణేతరులలో మిగుల సంపన్నులను మాత్రము తగు మాత్రముగా గౌరవించుచుండిరి. తక్కిన వారిని చులకనగా చూచుచుండిరి.

అక్కడి రాజకీయ వర్గములలోని అతి నాగరికతయు అతనికి నచ్చలేదు. మర్యాదలు, హద్దులు, ఆచారములు వెగటు గొలుపుచుండినవి. ఆరేండ్లు కంచిలో చదివెనను మాటయే కానీ అతని దృష్టి అంతయు కట్టెపు దుర్గముపైననే. ఆరేండ్లు పూర్తికాగానే ఇక చదివినది చాలునని మలయప్ప కట్టెపు దుర్గమునకు తిరిగి వచ్చెను.

అతడు ఇంటికి రాగానే తనకును, తన సోదరులకును గలభేదమును గుర్తించెను. వారందరును ఆయుధ విద్యలలో ప్రవీణులైయున్నారు. తనను ఒక బోయబాలునిగా చూడక ఒక బ్రాహ్మణ బాలునిగా చూచుచున్నారు. దుర్బలునిగా చూచుచున్నారు. ఇది అతనికి అవ మాన కరముగా తోచినది. తనకును ఆయుధ విద్యలు నేర్పమని పెదతండ్రినడిగెను. పెద తండ్రి తగిన ఏర్పాటు చేసెను.

నన్నిదొర కుమారులు ముప్వురును ప్రయోజకులగుచున్నారు. శంకరశర్మ కుమారుడు వాసవశర్మ వద్ద తెలుగు వ్రాయను, చదువను నేర్చుకొన్నారు. అప్పుడప్పుడే బెజవాడ, వేంగి, ఓరుగల్లు, కందవోలు, దక్షారామము మొదలగు ప్రదేశములలో తెలుగుకవులు పద్యములు వ్రాయ నేర్చి చిన్నచిన్న కావ్యములు వ్రాయసాగిరి. నలచరిత్ర, హరిశ్చంద్ర చరిత్ర, క్షీరసాగర మథనము, త్రిపురాసుర సంహారము, దక్షయజ్ఞము, కార్తికేయ జననము రేణుకాదేవి మాహాత్మ్యము చిన్న చిన్న కావ్యములుగా వెలసినవి. అందు చివరి మూడును ఆంధ్రులకు ప్రియమైనవి. ఆ గ్రంథములు లేనివారు ఉన్నవారి దగ్గరకు వెళ్ళి వ్రాసికొని వచ్చుచుండిరి.

జ్యోతిశ్శాస్త్ర సిద్ధాంతులు వేంగి, బెజవాడ, గుంటూరు, తెనాలి అద్దంకి మొదలగు పట్టణములలో నుండిరి. పరిసర ప్రాంత పురోహితులు పుష్యమాసము పెట్టగానే ఆ సిద్ధాంతుల ఇండ్లకు పోయి వారి యింటనే మజ్జన భోజనాదికములు చేసికొనుచు ఒకేసారి రెండు మూడు సంవత్సరముల పంచాంగములు ఎత్తి వ్రాసికొని పోవుచుండిరి. ఆ సందర్భములోనే కవులు వ్రాసిన చిన్నచిన్న కావ్యములు కూడా వ్రాసికొని పోవుచుండిరి.

మొదట దేశీ ఛందములైన తేటగీతి, ఆటవెలది, సీసపద్యము, కంద పద్యములలో ప్రారంభమైన తెలుగు కవిత్వము క్రమముగా అక్కరలు, తరువోజలను చేర్చుకొని ఇక దేశి ఛందస్సులతోనే పని జరుగదని సంస్కృత ఛందముల నుండి ఉత్పలమాల, చంపకమాల, మత్తేభము మొదలగు వృత్తములను రూపొందించుకొని, అవియు చాలవని సంస్కృత ఛందము

లైన మత్తకోకిల, స్రగ్ధర మొదలైన వానిని యథాతథముగా – యతి ప్రాసల నియమములతో – తెలుగులోనికి తెచ్చుకొన్నది. జానపదగాథలు, స్థానిక వీరగాథలు గ్రంథస్థములైనవి. కాని ఇవి సంస్కృత ప్రియులైన ఆనాటి పండితులకు సంతృప్తిని కలిగించలేకపోయినవి. తెలుగు పదములు ఒక్కొక్క ప్రాంతమున ఒక్కొక్క విధముగానున్నవి. అవి ఆంధ్ర దేశమున అందరికిని పరిచయములో లేవు. అందువలన అవి ఆంధ్రదేశమునందు అందరికిని సమానముగా అర్థమగుటలేదు. సంస్కృతముపై ఆధారపడక తప్పునట్లు లేదు. కాబట్టి పండిత కవులు సరళమైన శ్రావ్యమైన సంస్కృత పదములను సమాసములుగా కూర్చి తమ పద్యములలో చేర్చుటకు ప్రయత్నము చేయుచుండిరి. చదువరుల ఇండ్లలో ముప్పది నలుబది యాకులతో కూడిన చిన్న చిన్న తాళపత్ర గ్రంథములు కనబడసాగెను.

నన్నిదొర కుమారులు ఇట్టి పుస్తకములను బాగుగా చదువుచుండిరి. పొన్నిదొరయే వారి గురువు. బోయకొట్టములలో నివసించు బ్రాహ్మణులు ఎక్కడెక్కడో వెదకి వీనిని వ్రాసుకొని వచ్చి రాత్రులందు తమతమ ఇండ్లలోగిళ్ళ యందుగానీ దేవాలయముల యందు గానీ జనులకు చదివి వినిపించుచుండిరి.

# 8

# ప్రతీకారం

కొంతకాలమునకు ఆంధ్రదేశమున అలజడులు అణగి శాంతి నెలకొన్నది. విజయా దిత్యుడు భీమసలుకిని శాశ్వతముగా పారద్రోలి వేంగిని సంపూర్ణముగా స్వాధీనము చేసికొనెను. కాని రాష్ట్ర కూటుల సహాయకుడైన సువర్ణ వర్షునితో మరికొంత కాలము పోరాడవలసి వచ్చెను. కడకు సువర్ణవర్షుడు ఓడిపోయి తన సోదరిని విజయాదిత్యుని కుమారుడు కలివిష్ణువర్ధనునికిచ్చి వివాహము చేసి సంధిచేసికొనెను. కలివిష్ణువర్ధనునికి అదివరకే వివాహమై ఒక కుమారుడు కూడ ఉండెను.

విజయాదిత్యుడు రాజ్యమును సుస్థిరముగావించుకొన్న తరువాత కడియరాజునకు బోయదొరలపై పగతీర్చుకొనవలెనను కోరిక పొటమరించినది. వయస్సుదాటిపోవుచున్నది. ఎదలో అవమానాగ్ని మండుచున్నది.

ఒకనాడు విజయాదిత్యుడు కృష్ణానదీ తీరమున నరేంద్రేశ్వరాలయమును నిర్మింప తలపెట్టి ఆ ప్రదేశమును పరిశీలించు చుండగా కడియరాజు అతనిని సమీపించెను.

"మన వేంగి రాజ్యమునకు కృష్ణానదినే దక్షిణ సరిహద్దుగా మనమే చేసికొనుచున్నాము. అవతలి భూభాగమంతయు పల్లవుల స్వాధీనములో నున్నది. అదంతయు తెలుగునేల. వేంగీరాజ్య గతవైభవమును తలచుకొన్నప్పుడు నా హృదయము మండిపోవుచున్నది."

"కడియరాజా, నాకాలమంతయు యుద్ధములతోనే గడిచిపోయినది. లెక్కవేసి చూడగా నేను నూట ఎనిమిది యుద్ధములు చేసినాను."

"అయిన ఏమి ప్రయోజనము? తెలుగు నేలలో సగము పల్లవుల చేతిలోనున్నది. దక్షిణమున చంద్రగిరి వరకు తెలుగు సీమయే కదా"

"చంద్రగిరియే ఏల? కంచి వరకు మన తెలుగునేలయే."

"అవును కదా? మరి ఇంత తెలుగుసీమ తమిళులైన పల్లవుల చేతిలో ఉండగా చూచి ఎట్లు సహించగలము? కనీసము చంద్రగిరి లేదా నెల్లూరు వరకైనను మన స్వాధీనములోనికి తెచ్చుకోవలె కదా"

"కడియ రాజా, చాలు. ఈ యుద్ధములిక చాలు. యుద్ధములు చేసి చేసి విసిగియున్నాను. కొన్ని వేల మందిని హతమార్చినాను. ఎన్నియో గ్రామములను శూన్యము గావించినాను. నా సైనికులు పెక్కు వేల మంది మరణించిరి. యుద్ధములపై రోత కలిగినది. ఇక భగవత్సేవలో

కాలము గడుప దలచితిని. నూట ఎనిమిది శివాలయములను కట్టించదలచితిని. భగవంతు డెప్పుడు నన్ను పిలిపించునో తెలియదు. విష్ణువర్ధనుడెప్పుడో పట్టాభిషేకము చేసికొని యుండ వలసినవాడు. అతని దురదృష్టవశమున నా ఆయువు పెరిగిపోయి అతడు యువరాజుగానే యున్నాడు. నామనుమడు విజయాదిత్యుడు ఎక్కివచ్చుచున్నాడు. నీకుమారుడు పండరంగడును ఎక్కి వచ్చుచున్నాడు. వారికి చేతనైనచో చేయవలసిన పనిని వారే చక్కచేసికొందురు. నన్ను నెమ్మదిగా భగవత్సేవలో కడతేరిపోనిమ్ము."

కడియరాజు హృదయములో మండుచున్న అవమానాగ్నిపై నీళ్లు చల్లినట్లయినది.

ఇంటికి వచ్చి నిలకడ లేని మనస్సుతో పడసాల యందు అటు ఇటు తిరుగుచున్నాడు. చల్లబడిపోయిన ఈ మహారాజు వలన తన అవమానాగ్ని చల్లారదు. కేవలము తన అవమా నాగ్నిని చల్లార్చుకొనుటకు బోయకొట్టములపై దండెత్తవలెనన్న మహారాజు అంగీకరింపడు. అందుకే తాను పల్లవుల మాట ఎత్తవలసి వచ్చినది. పల్లవులపై దండయాత్రకు పూనుకొన్నచో పనిలో పనిగా బోయకొట్టములను కొట్టవచ్చును. కానీ మహారాజు హఠాత్తుగా యుద్ధ విముఖుడై నాడు. మరి తన కోరిక తీరుట ఎట్లు? ఎవరివలన?

కడియరాజు ఇట్లు ఆలోచించుచుండగానే విజయాదిత్యుని మనుమడు విజయాదిత్యుడును కడియరాజు కుమారుడు పండరంగడును ఇంటిలోనికి వచ్చిరి. ఇరువురును ఇంచుమించు సమ వయస్కులు. సహ పాఠకులు. ఇరువురును నానా విధములైన ఆయుధములను ప్రయోగించుటలో నిపుణులు. అందు పండరంగడు శాస్త్రవిద్యలను కూడ అభ్యసించిన వాడు. ఇరువురును అవివాహితులే. ఉడుకు రక్తముతో చిందులు వేయుచున్నారు. కడియరాజు వారిని చూచియు చూడనట్లును తనలో తాను అనుకొనుచున్నట్లును బిగ్గరగానే మాట్లాడ జొచ్చెను.

"లాభము లేదు. ఈ రాజులను నమ్మి ప్రయోజనము లేదు. ఈ రాజులు తమ కొఱకు యుద్ధములు చేయుదురు కానీ ప్రజల కొఱకు కాదు. అయ్యో, తెలుగు సీమలో సగభాగము పల్లవరాజుల స్వాధీనములో మ్రగ్గుచున్నదే– తెలుగు వారు అనాథలైపోయిరే అన్న ఆలోచన గానీ, తపన గానీ మహారాజు గారికి కలుగునేమో అని చాల కాలముగా ఎదురు చూచు చున్నాను. ఏదీ! మహారాజు గారి ఎదలో చలనమే లేదే. దాయాది సలుకిని త్రోసివేసి అంతటితో నిమ్మకు నీరెత్తినట్లున్నాడు. పరుల పాలనలో నవయుచున్న మన తెలుగు వారి దురవస్థను తలచుకొన్నప్పుడెల్లా నా మనస్సు తల్లడిల్లిపోవుచున్నది. కానీ... కానీ... ఏమి చేయగలను? మహారాజు గారికి దైవభక్తి ఎక్కువైపోయినది. నూట ఎనిమిది శివాలయములు కట్టింతురట. మన కోశాగారము ఏమి అక్షయపాత్రయా? ఇంత వరకు జరిగిన యుద్ధములకే ధనమంతయు వ్యయమై పోయినది. ఇంక మిగిలినదియు, రావలసినదియు, అంతయు శివాలయముల పాలైపోవును కాబోలు. కోశాగారమున నిష్కమైనను నిలువ యుండదు కాబోలు. ఏమి చేయగలను. ఎవరితో చెప్పుకొందును?"

విజయాదిత్యుడును పండరంగడును ఏమియు మాట్లాడక నిలబడి యుండిరి. కడియ

రాజునకు తెలుగునేలపైనను, వేంగి రాజ్య సంక్షేమము పైనను ఉన్న శ్రద్ధకు విజయాదిత్యుడు ముగ్ధుడైపోయెను. ఉండిన ఇటువంటి మంత్రులు ఉండవలె. కడియరాజు చెప్పు మాటలు నూటికి నూరుపాళ్ళు యథార్థములే. తెలుగునేల యంతయు తెలుగు రాజులైన వేంగిరాజుల ఆధీనమున ఉండవలె. అది న్యాయము. రాజైనవాడు ఉపేక్షింపరాదు. ఈ విషయమును గురించి తీవ్రముగా ఆలోచింపవలసినదే. విజయాదిత్యుడు ఇరువురి యొద్దను సెలవు తీసికొని వెడలిపోయెను.

విజయాదిత్యుడు వెడలిపోయిన తరువాత పండరంగడు తండ్రితో మాట్లాడెను.

"ఉన్నట్లుండి పల్లవులపై ఎందుకు దృష్టి మళ్ళినది? ప్రస్తుతము మన ప్రధాన శత్రువులు రాష్ట్రకూటులు కదా?"

"నా పగ పల్లవులపై కాదు. బోయకొట్టముల మీద. ఆ కట్టెపు దుర్గము మీద. సమస్త వేంగి రాజ్యమునకు మంత్రినైన నన్ను, వేంగి రాజ్యమును మునివ్రేళ్ళపై నడిపించుచున్న నన్ను, అనేక యుద్ధములలో తలపండిన నన్ను, ఒక అల్పాతి అల్పుడైన బోయదొర నాపెడ రెక్కలు విరిచి కట్టించి తన ఎదుట నిలబెట్టుకొని అపహాస్యము చేసినాడు. "ఇప్పుడు నీ తల తీయించిన యెడల నీకు దిక్కెవరు?" అని బెదరించినాడు. "బ్రాహ్మణుడవని విడిచిపెట్టు చున్నాను, పొమ్ము," అని భటులతో బయటికి త్రోయించినాడు. కుమారా? ఆ అవమానాగ్ని చల్లారు ఉపాయమే లేదా?"

పండరంగడు తండ్రి అవమాన గాథను ఇదివరకు రెండు మూడు సార్లు వినియే యున్నాడు. విన్నప్పుడెల్ల పండ్లు పటపట కొరుకుచునే యున్నాడు. విజయాదిత్యుడు తనకు అనుంగు మిత్రుడే. నెపము లేమియు లేకుండా నేరుగా బోయకొట్టములపైకి ఎత్తిపోవుద మన్నను సరే అనువాడే కాని కాదనువాడు కాడు.

"నాన్నగారూ. మీరు నిరాశపడవలసిన పనిలేదు. ఏదో ఒక సమయమున ఏదో ఒక నెపమున నేనును విజయాదిత్యుడును కలిసి మహారాజు విజయాదిత్యుల వారి అనుమతి వడసి బోయకొట్టములపై బడెదము."

"ఇది జరుగునా, ఇది నిజమేనా?"

"తప్పక జరుగును చూచుచుండుడు."

ఆ సాయంత్రము పండరంగడు యువరాజు విజయాదిత్యుని కలుసుకొనెను.

"యువరాజా. మానాన్నగారు చెప్పిన విషయమును గురించి ఆలోచించితిరా?"

"అప్పటి నుండియు అదే ఆలోచనలోనున్నాను. తాతగారు యుద్ధములకు విముఖులుగా ఉన్నారు. ప్రస్తుతము మనమేమియు చేయలేము. కొంతకాలము వేచి చూడవలె."

"మనకును, పల్లవరాజ్యమునకును మధ్య ఈ బోయరాజ్యమొకటి ఒక బలమైన శక్తిగా ఎదుగుచున్నది. కొంతకాలమునకు మునుపు మన చాళుక్య సైన్యమునే చావుదెబ్బకొట్టినది. మా తండ్రియంతటి వీరుడు వారిచేత పట్టుబడి అవమానింపబడినాడు."

"విన్నాను."

"ఇప్పుడు మరింత బలపడుచున్నారు. రేవు పట్టణమును నిర్మించుకొని ఓడ వర్తకమును తమ రాజ్యములోనికి ఆకర్షించుకొనుచున్నారు. మరింత సైన్యమును సమకూర్చుకొనుచున్నారు. వేగులవారు చెప్పుచున్నారు."

"కానిమ్ము గొట్టె బలసినంతయు గొల్లవానికే లాభము. అవి అన్నియు ఏనాటికైనా మనకు దక్కునవియే కదా."

"అట్లు కాదు. మనము పల్లవులపైకి పోవలెనన్న మొదట వీరిని చక్కబెట్టవలసియున్నది. వీరు పల్లవులతో వివాహ సంబంధములు కూడా నెరపుకొని విఱ్ఱవీగుచున్నారు. పల్లవులకు ఉత్తర సరిహద్దున ఒక గోడవలె నిలిచి యున్నారు."

"ఈ గోడలు నీకొక లెక్కయా. సమయమురానిమ్ము. విజృంభింతువుగానీ."

నన్నిబోయని కుమారులు పెద్దవారైనారు. రాజ్యకార్యములను స్వయముగా నిర్వహించు నేర్పును సంపాదించుకున్నారు. నన్నిబోయనికిని, పొన్నిబోయనికిని తమ కుమారుల సామర్థ్యముపై నమ్మకము కుదిరినది. సైన్య నిర్వహణ భారమును వారి కప్పగించిరి.

వకుళకు నలువది యేండ్లు దాటినది. పెండ్లి నాడుండిన ముగ్ధత్వము, కోమలత్వము పోయి ప్రౌఢత్వము వచ్చినది. శరీరము కఠినముగా తీరినది. మనస్సు దృఢత్వమును సంతరించుకొన్నది. బోయకొట్టములలోని యువతులకు ఆమె గురువైనది. ఆరాధ్య దైవమైనది. వకుళలోని భక్తియు శక్తియు అందరిని ఆకర్షించుచున్నది.

శక్తి యందు అపర దుర్గ. భక్తి యందు అపర ప్రహ్లాదమూర్తి.

ఆమెయు, అల్లెమసానియు కలిసి బోయ యువతులకు యుద్ధ విద్యలలో శిక్షణనిచ్చు చున్నారు.

ఆడువారికేల ఈ విద్యలు అని ఎవరో అడిగిరి.

"మనము పల్లవరాజ్యమునకును, చాళుక్య రాజ్యమునకును మధ్యనున్నాము. వీరు మిత్రులని వీరు శత్రువులని భావింపరాదు. ఈ మహారాజులకు సామ్రాజ్యకాంక్ష యెక్కువ. ఈ రాజ్యములకు స్థిరమైన సరిహద్దులు లేవు. ఎవరు ఏ కాలమున ఎంత ఆక్రమింతురో ఆ కాలమునకు అది వారి రాజ్య సరిహద్దు. మనకు ఇరువైపుల పోటు ఎల్లప్పుడును పొంచి యున్నది. పల్లవులు నాకు బంధువులని మనము మురిసిపోనవసరము లేదు. రాజులకు బంధుత్వములు లేవు. వారు మనజోలికి రాకుండా తొలగి పోవలెనన్నచో మనము బలిష్ఠులమై యుండవలె. మనది చిన్న రాజ్యము. పెద్ద సైన్యమును మనము సమకూర్చుకొనలేము. కనుక ఉన్న సైన్యమునే బలిష్ఠముగా తీర్చిదిద్దుకొనవలె. అందుకు స్త్రీలును సహకరించవలె.

"మరియొక ముఖ్య విషయము. మగవారు యుద్ధములందు మరణించినప్పుడు స్త్రీలు విధవలై మూల కూర్చుండుట గానీ, శత్రువులు బానిసలుగా పట్టుకొని పోవుటగానీ జరుగుచున్నది. ఎంత నీచము? దానికంటెను యుద్ధరంగమున పాల్గొని ఒకరిద్దరిని కొట్టి

తామును చచ్చుట మేలుకాదా. యుద్ధ సమయములందు స్త్రీలు చేయవలసిన పనులు చాల కలవు. గాయపడిన వారిని పట్టుకొని పోయి సురక్షిత ప్రదేశమున పెట్టి చికిత్స చేయించుట అన్నిటికంటె ముఖ్యమైన పని. కడియ రాజు మనపై దండెత్తినప్పుడు మన స్త్రీలు చూపిన శౌర్యము అందరును చూచితిరి కదా?"

బోయ స్త్రీలకు ఆమె మాటలు చాల నచ్చినవి.

నన్నిబోయని పెద్దకుమారుడు కొమ్మనబోయనికి వివాహము తలపెట్టిరి. గండబోయని కొట్టము దొర పోతన బోయని కుమార్తె నరసాసానిని ఎన్నిక చేసిరి. పెండ్లి వైభవముగా జరిగెను. వాని తల్లిని ప్రక్కనబెట్టి వకుళయే అన్నియు తానై పెండ్లి జరిపించెను. వకుళ అన్నయు వదినెయు వారి బిడ్డలును వచ్చిరి. పెండ్లి నాటికిని నేటికిని వకుళ స్థాయి మారి యుండుటను కన్నులారా చూచిరి. ఆమె గౌరవము హెచ్చినది. అధికారము పెరిగినది. పెమ్మసాని పేరుకు మాత్రమే పెద్దదొరసాని. ప్రాభవమంతయు చిన్నదొరసానిదే.

వకుళ అన్నయు వదినెయు అబ్బురపోయిరి. మలయప్పను తమ అల్లునిగా చేసికొనిన బాగుండునను ఆలోచన వారి మనస్సులో ఏర్పడినది. కాని అడుగుటకు ఇది సమయము కాదు. వాని కంటె పెద్దవారు నన్నిదొర కుమారులు ఇద్దరున్నారు. ఇప్పుడు పెండ్లి ప్రస్తావన తెచ్చినచో వారిలో ఒకనికి ఇమ్మని అడుగుదురేమో. కాదనుటకు వీలుండదు. కావున వారు ఆ ప్రస్తావనయే ఎత్తక మిన్నకుండిపోయిరి.

పండ్రెండు బోయకొట్టములకు కొమ్మన బోయడు ఉత్తరాధికారి అని ప్రకటింపబడెను. శాస్త్ర పారంగతుడు, మేధావి అయిన మలయప్ప మంత్రిగా ప్రకటింపబడెను శంకరశర్మ కుమారుడు వాసవశర్మ తండ్రియంతటి వాడు కాదు. అతనికంటె మలయప్ప నూరు రెట్లు మెరుగు. వాసవశర్మ పురోహితుడు మాత్రమే.

ఆ పెండ్లికి ముందునాడే కందవోలు నుండి కొందరు వణిక్శ్రేష్ఠులును, కొందరు బ్రాహ్మణ పండితులును సువర్ణ ద్వీపమునకు ప్రయాణమై, కనుపఱ్ఱురేవుకు పోవుచు కట్టెపు దుర్గమునకు వచ్చిరి. వారిని పొన్నిదొర సాదరముగా ఆహ్వానించి నగరు ప్రక్కన ఒక మందిరములో విడియించెను. వారి సౌకర్యములను చూచుటకై ఊరిలోని ఇద్దరు బచ్చులను నియమించెను. పెండ్లి జరిగిన మరునాడు పొన్నిదొరయు, వాసవశర్మయు, మరికొందరు బ్రాహ్మణులును వర్తకులతో సమావేశమైరి.

"మీరు కందవోలు నుండి ఏయే ఊళ్ళు తిరిగి వచ్చుచున్నారు?" వాసవశర్మ మాటలు కలిపెను.

"మేము కందవోలు నుండి మహానంది వెళ్ళితిమి. అక్కడి నుండి శ్రీశైలము వెళ్ళితిమి. ఆపైన త్రిపురాంతకము దర్శించుకొంటిమి. అటుపైన అద్దెక్కి వచ్చి ఇటు వచ్చితిమి."

"మీరు చూచిన పట్టణములలో ఎవరైనా కవులు ఏవైనా కొత్త కావ్యములు వ్రాసినట్లు విన్నారా?" పొన్నిదొర కుతూహలముతో అడిగెను.

"మా పొన్నిదొర గారు బహు శాస్త్రకోవిదులు. సంస్కృత సాహిత్యమును బాగుగా చదివిన

వారు. వారి కుమారులు మలయప్ప గొప్ప విద్వాంసుడు.” వాసవశర్మ ఎఱుక పఱచెను.

“ఆ విషయము – ఇదిగో సూరనభట్టుగారిని అడుగుడు. ఈయన ఓడలో సింహళమునకు పోవుటకు వచ్చుచున్నాడు,” అన్నారు వర్తకులు.

“ఆశ్చర్యముగా నున్నదే. మీరు సింహళ ద్వీపమునకు పోవుటయేమి? అక్కడ మీకేమి పని,” వాసవశర్మ కుతూహలముతో అడిగెను.

“మన పొరుగున నున్న సింహళము నందును, సముద్రముల కావల బహుదూరమున నున్న మలయ, చంపా, సువర్ణద్వీపముల యందును బౌద్ధమతము విస్తరించియున్నది. బౌద్ధ జైన మతములు పాషండ మతములు. అవి వేద ప్రామాణ్యము నంగీకరింపవు. మన వేదములు పురాణములు స్తుతించు దేవతలను ఆ మతము లంగీకరింపవు. అవి సన్యాసమును, నిర్వ్యాపారత్వమును బోధించును. ఆ మతముల వలన ప్రజలలో నైతికతయు, దైవభక్తియు, ఆచార సంప్రదాయములును నశించుచున్నవి.

కావున ఆ దేశములలో బౌద్ధమతమును అణచివేసి వైదిక ధర్మమును స్థాపించుటకై మేము నలువురము బయలుదేరినాము. నేను సింహళములో దిగిపోదును. వీరు మలయ, చంప సువర్ణ ద్వీపములకు పోవుదురు. అక్కడ ప్రజలకు మన వైదిక ధర్మమును గురించియు, మన దేవతలను గురించియు ప్రచారము చేయుదుము. మన దేవతలకు దేవాలయములు కట్టింతుము. బౌద్ధమతములోని నాస్తికత్వమును దాని దుష్పరిణామములను వెల్లడింతుము” సూరనభట్టు ఉద్వేగముతో సమాధానమిచ్చెను.

“బౌద్ధమతము వలన కలుగు దుష్పరిణామములేవి?” పొన్నిదొర కుతూహలముతో ప్రశ్నించెను.

“వేదములను అంగీకరింపకపోవుటయే మొదటి దుష్పరిణామము. దేవతలను పూజింప కుండుట రెండవ దుష్పరిణామము. జనులు గుంపులు గుంపులుగా బౌద్ధ భిక్షువులను పేరిట విహారములు, చైత్యములు నిర్మించుకొని అందు నివసించుచు ఊళ్ళమీద పడి దండుకొని తినుట మూడవది.”

“వేదములను అంగీకరింపపోవుటయే దుష్పరిణామమా?” పొన్నిదొర ప్రశ్నించెను.

“కాదామరి. వేదములు లేకపోయినచో మానవ జాతికి మార్గనిర్దేశకత్వము ఎక్కడి నుండి వచ్చును.”

“బౌద్ధులకును మార్గనిర్దేశకత్వమునకు ఏవో గ్రంథములున్నవట కదా. వారు వాటిని అనుసరింతురు”

“అవియన్నియు మానవజాతిని తప్పుదారిని పట్టించునవి. వేదములు, మనదేవతలు మాత్రమే మానవజాతికి తరణోపాయము చూపగలవి.”

“బౌద్ధులును వారి గ్రంథములను గురించి ఇట్లే చెప్పుకొందురుకదా?”

“వారి వాదములను ఖండించి వైదిక ధర్మమును స్థాపించుటకే మేము వెళ్ళుచున్నది. అందులకు సంసిద్ధులమై ప్రామాణిక గ్రంథములను వెంటగొని పోవుచున్నాము.”

"వీరి ఈ రేకు పెట్టె నిండుగా తాళపత్ర గ్రంథములే ఉన్నవి," అన్నారు వర్తకులు.

"కొత్తవేమైనను ఉన్నవా?" పొన్నిదొర ఆసక్తితో అడిగెను.

కొంతకాలమునకు పూర్వమెప్పుడో శంకరాచార్యులను ఒక పరివ్రాజక మహానుభావుడు శ్రీశైలమునకు విచ్చేసియుండెనట. అతనిని గురించి ఎంత చెప్పినను తరగదు. లేత వయస్సు వాడట. సుకుమార శరీరుడు. ఆ వయస్సునకే ఆయన వేదవేదాంగములు, సర్వశాస్త్రములు క్షుణ్ణముగా చదివిన వాడు. యోగనిష్ఠాగరిష్ఠుడు. ఆ సేతు హిమాచలము పర్యటించినవాడు. కాశ్మీర దేశమున పండితులను జయించి శారదాపీఠమునధిష్ఠించిన వాడు. వైదిక ధర్మ పరిరక్షణకును, ప్రచారమునకును నేల నాలుగు చెరగుల తన పేరిట అయిదు పీఠములు ఏర్పాటు చేసినాడట.

"అవును. నేను కంచిలో ఉండగా ఆ పీఠమును చూచినాను. అందలి గురువుల యొద్ద కొంత కాలము చదివినాను," అన్నాడు అప్పుడే అక్కడకు వచ్చిన మలయప్ప.

సూరనభట్టు కొనసాగించెను. "ఆయన శ్రీశైలములో కొన్ని దినములు నిలిచి ఆశువుగా శివానందలహరి, సౌందర్యలహరి అను రెండు గ్రంథములు రచించెను. ఆ రెండు గ్రంథములను ఆలయ వ్రాయసకాండ్రు వ్రాసియుంచినారు. ఈ విషయము తెలిసి ఎక్కడెక్కడి నుండియో పండితులు వచ్చి వాటి ప్రతులు వ్రాసుకొని వెళ్ళుచున్నారు. నేనును వ్రాసుకొని వచ్చినాను."

"ఏవీ చూపుడు."

సూరనభట్టు రేకు పెట్టె తీసి లోపలి నుండి కొన్ని గ్రంథములను వెలికి తీసెను.

"ఇది శివానంద లహరి, ఇది సౌందర్యలహరి. ఇది ఆయన ప్రస్థాన త్రయమునకు వ్రాసిన భాష్యము. ఇవి ఆయన వ్రాసిన ఇతర దేవతాస్తోత్రములు."

పొన్నిదొర మొదటి రెండు పుస్తకములును విప్పి రెండుమూడు శ్లోకములను చదివి వెంటనే వ్రాయసకాండ్రను పిలిపించి ఆ రెండింటి ప్రతులను వ్రాయమనెను. వర్ణ దోషములు లేకుండా చూడమని మలయప్పను నియమించెను. సమీపముననే ఉన్న వకుళ అన్నయు తన కొక ప్రతి వ్రాయించుడు అనెను. మలయప్ప చదువుచుండగా వ్రాయసకాండ్రు వ్రాయసాగిరి.

మరునాడు వర్తకులును, సూరనభట్టును కనుపఱ్ఱునకు బయలుదేరగా వకుళ అన్న కుటుంబము కంచికి బయలుదేరి వెళ్ళిరి.

ఆ దినము సాయంత్రము పొన్ని దొరయు, మలయప్పయు, శంకరశర్మయు, వాసవశర్మయు, మరికొందరును తీరికగా కూర్చొని శివానందలహరిని, సౌందర్యలహరిని చదివిరి. మలయప్ప ప్రతి శ్లోకమును వ్యాఖ్యానించెను.

ఆహా ఏమి ధార! కవి యథాలాపముగా పలికిన పలుకులే ఛందోబద్ధములై జాలు వారినట్లున్నది.

ఏమి పదలాలిత్యము! పదములు, సమాసములు అన్నియు లలితములు. కర్ణపేయములు. ఆపాత మధురములు.

ఏమి భావగాంభీర్యము! అందలి భావములు కవి యొక్క హిమాలయోన్నత వ్యక్తిత్వమును దర్పణములో వలె చూపుచున్నవి.

ఏమి ఆ భక్తిభావము! ఆ భక్తికి శివుడుగానీ, పార్వతిగానీ, ప్రత్యక్షము కావలదా? అవసరములేదు. వారు ఆయన హృదయములో కొలువైయున్నారు. ఇక ప్రత్యక్షమేల కావలె.

ఏమి కవిత్వము! ఇది ఆలంకారికులకు, లాక్షణికులకు, కవితామర్మజ్ఞులమనుకొను జ్ఞానలవదుర్విదగ్ధులకు అందునా? వారెవరును ఈ కవిత్వము యొక్క దరిదాపులకేని రాలేరు.

సౌందర్యలహరిలో ఆయన చెప్పినట్లు–

“కవీనాం ప్రౌఢానా మజని కమనీయఃకవయితా”

కమనీయమైన కవిత చెప్పిన ప్రౌఢకవి శంకరాచార్యులు. ప్రౌఢత్వమును, కమనీయత్వమును ఒక చోట నుండునా? ఇదిగో శంకరాచార్యుల కవిత్వమున ఉన్నది. శంకరాచార్యులు కవిలోక శిఖామణి. విన్న వారందరును రసజగత్తున తేలియాడిరి.

ఒక పిడుగుపాటు వంటి వార్త దక్షిణ భారతదేశమున దావాగ్నివలె వ్యాపించెను. చాళుక్య మహారాజు విజయాదిత్యుడు మరణించెను.

పం(డెండేండ్ల నిరంతర యుద్ధములతోనూ, నిరంతర ఉద్వేగ స్థితి వలననూ విజయాదిత్యుని ఆరోగ్యము క్షీణించినది. అది లోకమును తెలియని – వైద్యులకు మాత్రమే తెలిసిన విషయము. ఆపైన భగవత్సేవలో నిరంతర వ్రతదీక్షలు, ఉపవాసములు, వేళ తప్పిన భోజనము, వేళ తప్పిన నిద్ర, వివిధములైన నైవేద్యాన్నములతోనే ప్రొద్దు పుచ్చుట మొదలగు వాని వలన అతని ఆరోగ్యము మరింత క్షీణించినది. అదియు లోకమునకు తెలియని – వైద్యులకు మాత్రము తెలిసిన విషయము. ఉన్నట్లుండి ఒకనాడు రాజుగారికి వాంతులు ప్రారంభమయ్యెను. రాజవైద్యుల వైద్యము నిష్ప్రయోజనమయ్యెను. మూడవ దినము మహారాజు కన్నుమూసెను.

ఈ వార్త తెలిసిన పొరుగు రాజులందరును ఉలికిపడిరి. రాష్ట్రకూటులతోనూ భీమసలుకితోనూ, పం(డెండు సంవత్సరములు నిర్విరామముగా శతాధిక యుద్ధములు చేసి వేంగి రాజ్యమును పునఃస్వాధీనము చేసికొన్న విజయాదిత్యుని పరాక్రమము, పట్టుదల పొరుగు రాజులందరును ఎరిగినదే. అందరును అతని చేత భంగపడిన వారే. అతడు యుద్ధ విముఖుడై భగవత్సేవలో నిమగ్నుడైనాడని విని అందరును ఊపిరి పీల్చుకొనిరి. గుండెలపై చేయి పెట్టుకొని నిద్రింపసాగిరి.

ఇప్పుడు అతని కుమారుడు కలివిష్ణువర్ధనుడు రాజైనాడు. అతడు ఎట్టివాడో తెలియదు చాళుక్య రాజులలో విష్ణువర్ధన నామధేయులలో ఇతడు అయిదవవాడు.

ఈ వార్తను విని ఎక్కువగా కలవరపడిన వారు బోయకొట్టముల వారు.

బోయదొరల చేత అవమాన పడిపోయిన కడియరాజు ప్రతీకారము కొఱకు ప్రయత్నించియే యుండును. కాని మహారాజు విజయాదిత్యుడు యుద్ధవిముఖుడయ్యెను. అందుచేత కడియరాజు మిన్నకుండవలసి వచ్చెను. ఇక కలివిష్ణువర్ధనుని ప్రేరేపించి ఏ క్షణములోనైనా ఎత్తిరావచ్చును.

నన్నిదొర ఎందుకైనను మంచిదని తగు సైన్య సహాయమునకై కంచికి వర్తమానము పంపెను.

"వేంగికి వేగులను పంపి అక్కడి పరిస్థితులను గమనించుచుండవలసినది. వేంగిలో సైన్యములు బయలుదేరినట్లు తెలియగానే కంచి నుండి సేనలు వచ్చి సాయపడును." అని సమాధానము వచ్చెను.

"ఇది ఏమి మాట. ఇది జరుగునా. ఆనాడు పులిరాజుకు చాళుక్యులు సాయము వచ్చిరా. మహారాజుల మాటలిట్లే యుండును," అని నన్నిబోయడు తన జాగ్రత్తలో తానుండదలచెను. సంవత్సరము గడచినది వేంగిలో కదలికలు కనబడలేదు. దండెత్తు ఆలోచన చాళుక్యులకు లేదేమో. ఏమో ఎట్లునమ్మవచ్చును?

ఇంతలో మరియొకవార్త

కలివిష్ణువర్ధన మహారాజు సంక్రాంతి పర్వదినమున నిత్యకృత్యముగా తెల్లవారకమునుపే గుఱ్ఱముపై క్రోసెడు దూరము స్వారి చేయబోయెను. రాత్రి వీచిన గాలికి దారిలో ఒక వెదురు పొద నుండి ఎండిపోయిన ఒక వెదురు మ్రోడు బాట మీదికి వాలి యుండినది. కనుచీకటిలోనూ పొగమంచులోనూ మహారాజు దానిని చూడక గుఱ్ఱమును వేగముగా పోనిచ్చెను. వెదురుమ్రోడు రాజు కంఠమునదిగిపోయెను. రాజు గుఱ్ఱము నుండి జారి ఆమ్రోడునకే కొంచెము సేపు వ్రేలాడి క్రిందపడి మరణించెను.

ఇది దక్షిణాపథ రాజకీయములపై రెండవ పిడుగుపాటు.

వెంటనే కలివిష్ణువర్ధనుని కుమారుడు గుణగ విజయాదిత్యుడు రాజయ్యెను. గుణగ విజయాదిత్యుడు దుందుడుకు స్వభావము కలవాడనియు, తాతయు, తండ్రియు బ్రతికి యుండగానే స్వతంత్రించి సైన్య సమీకరణము చేసినాడనియు, విశేషముగా ఆశ్వికదళమును పెంపొందించుకొన్నాడనియు అందరును విన్న విషయమే. ఇంత ప్రయత్నములు అతడు ఎందుకు చేయును? తప్పక దండయాత్రకొఱకే.

గుణగ విజయాదిత్యుడు సింహాసనమునధిష్ఠించిన వెంటనే సామంతరాజులను గడిదుర్గముల పాలకులను వేంగికి రప్పించెను. వారికి గట్టి హెచ్చరికలు చేసెను. అవిధేయత కనపడినచో తన తాత చేతి దెబ్బకంటే తన చేతి దెబ్బ మరింత కఠినముగా నుండునని హెచ్చరించెను. ఆజ్ఞాపించినప్పుడు ఆజ్ఞాపించినచోటికి అడిగినంత సైన్యముతో వచ్చి చేరవలెనని కట్టడి చేసెను.

ఈ సమావేశములో విజయాదిత్యునికంటె పండరంగడే ఎక్కువగా మాట్లాడెను. ఇక పండరంగనిదే రాజ్యము అన్నట్లుండెను.

ఈ సమస్త కార్యక్రమమును వినయడిశర్మయు, వృద్ధుడైన కడియరాజును పర్యవేక్షించు చుండిరి. వినయడిశర్మ అయ్యపశర్మ కుమారుడు.

కడియరాజును చూచినచో సామంతులకు వణకుపుట్టును. కడియరాజు ఎంతటి విద్యా సంపన్నుడో యుద్ధములందు అంతటి క్రూరుడు. ఊరక ఓడించుట, స్వాధీనము చేసికొనుట, సంధి చేసికొనుట అతని ఎరుకలో లేని పదములు. ధ్వంసముచేయుట, ఊచకోతగా శత్రు వులను వధించుట, పల్లెలను, పట్టణములను పరశురామ ప్రీతిగావించుట. తన సైనికులచే దోచుకోనిచ్చుట, శత్రువులను భీతావహులను చేయుట ఇవి మాత్రమే అతనికి తెలియును. తొలిసారి కట్టెపు దుర్గముపై ఎత్తిపోయినప్పుడు బోయల బలమును తక్కువగా మదింపు వేసికొని తక్కువ సైన్యముతో పోయి భంగపడెను. కాని కొంత హెచ్చరికతో దాడి చేసి యుండినచో ఆనాటి కథ వేరు విధముగా నుండెడిది. ఇప్పుడు మాత్రము మించిపోయినదేమి?

అతని కుమారుడు పండరంగడు మాటలను బట్టి చూడగా తండ్రి కంటే రెండాకులు ఎక్కువ చదివినట్లున్నాడు.

గుణగ విజయాదిత్యుడిట్లు ప్రసంగించెను.

"మనము తెలుగువారము. మనది తెలుగు సీమ. తెలుగు మాట్లాడు వారు ఎంత మేర విస్తరించి యున్నారో ఆ మేర భూభాగము మన వేంగి రాజ్యమునకు చేరవలెను. కాని పల్లవులు తమ సరిహద్దులను దాటి ఉత్తరమునకు చాల దూరము చొచ్చుకొని వచ్చియున్నారు. తెలుగుసీమలో చాల భాగము ఆక్రమించుకొని యున్నారు. ఇంతకాలము మనము ఉపేక్షించుటయే తప్పు. ఇక ఎంత మాత్రము ఉపేక్షింపరాదు.

పడమటి వైపున రాష్ట్ర కూటులతో మనకు ఎడతెగని కయ్యములు కలుగుచునేయున్నవి. రాష్ట్ర కూటుల సహాయకుడు సువర్ణవర్షుడు మా తాతగారితో యుద్ధమున ఓడి విధిలేక సంధి చేసికొని మా తండ్రిగారికి తన సోదరినిచ్చి పెండ్లి చేసెను. కాని వాని మనస్సునందలి విరోధ భావము సమసిపోలేదు. ఈ సంధిని రాష్ట్ర కూటులు అంగీకరింపలేదు. రాష్ట్రకూట అమోఘవర్షుడు కయ్యమునకు కాలు దువ్వుచునే యున్నాడు.

ఇదిగో ఈ దినము ఈ పండరంగని చాళుక్య సామ్రాజ్యమున సర్వసైన్యాధిపత్యమునకు పట్టము కట్టుచున్నాను. ఇతని ఆజ్ఞయే నా యాజ్ఞగా భావింపవలసినది."

పండరంగడు లేచి మాట్లాడెను.

"ప్రభువుల మాట విన్నారు కదా. మొదట మనము మన తెలుగుసీమను స్వాధీనము చేసికొనుటకై దక్షిణ దిగ్విజయయాత్ర చేయవలె. ఇది జ్యేష్ఠమాసము. కార్తీక మాసమునకు వర్షాకాలము తీరిపోవును. జలతృణ సమృద్ధి యుండును. జైత్రయాత్రలకు అదియే తగిన అదను. కార్తిక పౌర్ణమికి మీరందరును మీకు నిర్ణయించు సంఖ్యలో సైనికులతో వినుకొండ యొద్ద విడిసి యుండవలె. మేమును ఆనాటికి సైన్య సమేతముగా వచ్చి కలుసుకొందుము." అని పలికి పండరంగడు కొందరు సామంతులవైపు వేలు చూపుచు "నీవు, నీవు, నీవు, నీవు నీవు," అని అయిదు మందిని లేపెను. వారు లేచి నిలబడి "తమ ఆజ్ఞ తప్పక పాటింతుము,"

అనిరి. వారు తేవలసిన సైన్య సంఖ్యను వారివారికి రహస్యముగా పండరంగడు తెలియజేసి పంపివేసెను.

ఇదంతయు రాజుగారి అభ్యంతర సమావేశ మందిరమున రహస్యముగా జరిగిన మంత్రాంగము. వెలుపలి వారికి తెలియదు.

భరణి కార్తెలో రెండుమూడు వర్షములు పడెను. రైతులందరును పొలములను రెండుసార్లు దున్నుకొనిరి. ఊరి బయట దిబ్బలుగా వేసియుండిన పశువుల ఎరువును తోలుకొని పోయి పొలములలో దుక్కులలో వెదజల్లుకొనిరి. ఎరువు మెండుగా లేనివారు దూరభారములు లెక్కచేయకుండా చెరువులలో ఒండ్రుమన్ను తోలించి పొలముపై చల్లుకొనిరి. విత్తనముల కొఱకు దాచి యుంచిన ధాన్యమును, విత్తనములను ఒక అమావాస్య పూట ఎండలో ఎండనిచ్చి భద్రపరుచుకొనిరి. మృగశిర కార్తెలో వర్షములు పడగానే పొలములలో మరుదుక్కి దున్నుకొనిరి.

పంద్రెండు బోయకొట్టములలోని జనులకందరికిని కొద్దిగానో, గొప్పగానో పొలము లున్నవి. వృత్తుల వారికి కొంచెముగానూ, రైతులకు విస్తారముగానూ పొలములున్నవి. రైతులందరును వారికున్న పొలములలో మూడింట ఒక భాగము ప్రత్తి వేయుట తప్పనిసరి. ఈ ప్రత్తిని కోనబోయని కొట్టములోనూ బద్దెబోయని కొట్టములోనూ నెలవు చేసికొనియున్న నేతగాండ్రకు అమ్మివేయవలెను. తక్కిన భూమిలో సజ్జలు, జొన్నలు, ఆరుగులు, కొఱ్ఱలు, కందులు, పెసలు, ఆముదములు, విత్తుకొందురు. ఇవి అన్నియు వర్షాధారమైన పంటలు.

పునర్వసుకార్తె పూర్తి అగునప్పటికి పొలములలో విత్తనములు విత్తుట పూర్తి అయినది. వెలిసేద్యము ముగియగానే నీటి సేద్యమునకు సన్నాహములు ప్రారంభమయ్యెను.

బోయకొట్టములలో కొందరికి వ్యవసాయపు బావులున్నవి. లోతుబావులలో మోటల తోనూ, తక్కువ లోతు బావులలో ఏతములతోనూ నీళ్ళు చేదుకొనుచున్నారు. వాగుల పక్కన గోతులు త్రవ్వి అక్కడ ఊరిన నీటిని "గూడ"వేసి పారించుకొందురు.

ఈ విధమైన నీటి ఆధారము గల భూములలో కొంచెము వరి, కొంచెము చెఱకు, కొంచెము కూరగాయలు పండించుకొందురు.

ఈ రెండుమూడు నెలలును పల్లెలలోని కమ్మరులకు, వడ్రంగులకు, ఊపిరి సలుపని పని. రైతులకు క్షణము తీరిక దొరకదు. మోటలకు మోకులు, తొండపు త్రాళ్ళు, పగ్గములు, మడకత్రాళ్ళు, వారెనత్రాళ్ళు, పేనుకొందురు. ఇనుపరేకులతోగానీ, వెదురుదబ్బలతో గానీ ఏతముబానలు చేసికొందురు. చర్మకారులు చర్మముతో మోటబానలు కుట్టుదురు. వెదురు, తాటాకులతో గూడలు అల్లుకొందురు.

రెండు నెలలలో మడులలో వరి విత్తనములు విత్తుట, నారు తీసి నాటుట మొదలైన పనులు ముగిసినవి. ఇక ప్రతి దినము వేకువనే లేచి పొలములకు నీరు పెట్టుటయే పని. మధ్యాహ్నము తరువాత పనిలేదు. పనిలేనప్పుడు ఏమి చేయవలె.

'నాటకము నేర్చుకొందము,' అని కొందరు ముందుకు వచ్చిరి. దాసరి సుబ్బోజు దక్షయజ్ఞము నేర్పెదననెను. అతడు దీనిని కందుకూరున నేర్చుకొని వచ్చినవాడు. దక్ష యజ్ఞము నాటకము రసవత్తరమైనది. సతీదేవి యోగాగ్ని యందు దగ్ధమైపోవు వరకు శోకరసము చిప్పిలుచుండును. తరువాత వీరభద్రుని ప్రవేశము నుండి రౌద్ర రసము.

నెల దినములు ఒద్దిక జరిపిన తరువాత ఒకనాటి రాత్రి రెండవ జామున మొదలు పెట్టి తెల్లవారు వరకు నాటక ప్రదర్శన జరిగెను. ఒక మద్దెలయు ఒక ముఖ వీణయు, ఒక పిల్లనగ్రోవియు వాద్యములుగా తోడు పడుచుండెను. వేదిక మీద నాలుగు వైపుల దివిటీలు వెలుగుచుండెను. నాటకములోని పాత్రలు రంగస్థలమున తిరుగుచున్నప్పుడు కూడ దివిటీల వారు నటులతో బాటు ముందుకు వెనుకకు తిరుగుచుందురు.

కార్తిక పూర్ణిమ రానే వచ్చెను. పండరంగడు పదివేల కాల్బలముతోనూ, రెండు వేల ఆశ్వికదళముతోడనూ, వినుకొండ చేరుకొనెను. అప్పటికే అక్కడ ఐదుగురు సామంతులు తమ తమ సైన్యములతో సిద్ధముగా నున్నారు. మొత్తము ఇరువది అయిదు వేల కాల్బలము నాలుగువేల ఆశ్వికదళము కూడినది. పరస్పరము గుర్తించుటకు అందరును ఎఱ్ఱని నడికట్లు కట్టుకొనునట్లు ఏర్పాటు చేసికొనిరి.

వినుకొండ సమీపమున చాళుక్య సైన్య సమీకరణ జరుగుచున్నదనియు, ఐదు మంది సామంతరాజులును, చాళుక్యసేనాని పండరంగడును తమ సైన్యములను వినుకొండ వద్ద ఏకము చేసికొని దక్షిణము వైపు దండెత్తనున్నారనియు వినుకొండలోనున్న పల్లవ ప్రతినిధికి తెలిసి అతడు తన పరివారముతో ఎప్పుడో పారిపోయెను. వినుకొండ అనాయాసముగా చాళుక్యుల వశమయ్యెను.

అందరును కలిసి సుడిగాలివలె పయనించి అణ్ణెక్కి పైబడిరి. చాళుక్య ఝంఝా మారుతమునకు అణ్ణెక్కి గాలిలో దీపమువలె వడవడ వడకిపోయెను. అణ్ణెక్కి సేనలు ఓపినంత మేరకు యుద్ధము కొనసాగించి ఇక నిలువలేక లొంగిపోయిరి. పల్లవ రాజప్రతినిధి పారిపోయెను.

"అణ్ణెక్కి ప్రజలు మన ప్రజలే. వారికే అపకారమును చేయరాదు," అని పండరంగడు గట్టిగా ఆదేశించెను. కాని సామాన్య సైనికులు ఊరకుందురా! వీధులలో వీరవిహారము సలిపి ఇండ్లలో దూరి అందినంతయు దోచుకొనిరి. కొందరు మర్యాదస్థులైన పౌరులు తమంత తామే తృణమో పణమో వారి పాదములపై పడవేసి దండములు పెట్టి ప్రాణములు దక్కించుకొనిరి.

దోపిడీ దొంగలకును, యుద్ధములందు గెలిచిన సైనికులకును వీసమంతైనను భేదము లేదు. పేరులో మాత్రమే భేదము. వారు దోపిడీదొంగలు. వీరు రాజసైనికులు. దోపిడీ దొంగలకు గృహస్థులు కొందరు ఏకమై కొట్టవత్తురేమో అనుభయము ఉండును. కావున వారు తొందర తొందరగా తమ దోపిడీ ముగించుకొని పోవుదురు. సైనికులకు ఆ భయమును లేదు. వీరిది స్వైర విహారము.

యుద్ధము కొంత సేపే జరిగినను అణ్ణెక్కి సైనికుల ప్రతిఘటన గట్టిగా నుండినది.

చాళుక్య సైనికులు చాల మంది గాయపడిరి. వారికి సైన్యము వెంట వచ్చిన వైద్యులు చికిత్స చేయుచుండిరి.

ఒక సామంతరాజునకు అణ్ణెక్కి ధానుష్కుడు ప్రయోగించిన బాణముడొక్కను చీల్చుకొని పోయినది. దీనికి వెంటనే తగిన చికిత్స చేయని యెడల ఆ చీలిక మరింత పెద్దదిగా విచ్చు కొని పోవు ప్రమాదమున్నది. అతనికి వైద్యము చేయు పరిజ్ఞానము కల వైద్యులు అక్కడ లేరు.

అణ్ణెక్కి సమీపమున నున్న కొండపై కాపురమున్న బ్రాహ్మణుని గురించి పండరంగనికి ముందే తెలియును. ఆయన పేరు ఆదిత్య భట్టారకుడు. గొప్ప జ్యోతిశ్శాస్త్రవేత్త. వైద్యుడును. ఒకరు కొండపైకి పోయి ఆయనను పిలుచుకొని వచ్చుటకు చాల సమయము పట్టును. చాలా ఆలస్యమైపోవును.

సామంతరాజును మంచముపై పరుండబెట్టి కొందరు మోసికొని పోయి కొండపైన బ్రాహ్మణుని ముందుంచిరి. పండరంగడును అక్కడికి చేరుకొనెను.

ఆదిత్య భట్టారకుడు సామంతరాజు గాయమును పసుపునీళ్ళతోనూ, పటిక నీళ్ళతోనూ శుభ్రము చేసెను. మంటకు తట్టుకొనలేక సామంతరాజు బిగ్గరగా కేకలు వేసెను. వైద్యుడు ఒక గచ్చకాయంత లేహ్యమును అతని చేత మ్రింగించి గాయమైనచోట ఒక ద్రవమును పూయగా గాయమైన చోట తిమ్మిరెక్కి స్పర్శజ్ఞానము తగ్గిపోయెను. తెరచుకొని యున్న గాయమును ఇద్దరు శిష్యులు ఇరువైపుల నొక్కి పట్టుకొని యుండగా వైద్యుడు సన్నని సూదియు, దారమును తీసికొని ఒక ఆకు పసరులో అద్ది ఒక్కొక్క రెప్పపాటు కాలములో ఒక్కొక్క కుట్టు వంతున ఎనిమిది కుట్లు వేసెను. కుట్లను త్రెంపుకొని గాయము మరల విచ్చుకొనకుండునట్లు కుట్లపై మందముగా మైనము మెత్తి కట్టుకట్టెను. మూడు దినములు కదలరాదనెను.

సామంతరాజు చికిత్స ముగియగానే అందరును ఊపిరి పీల్చుకొనిరి. సామంతరాజు మరికొన్ని దినములు ఆదిత్య భట్టారకుని పర్యవేక్షణలోనే ఉండవలసియున్నది. గాయపడిన సైనికులు కోలుకొని యుద్ధమునకు సిద్ధమగుటకు రెండు మూడు దినములు పట్టవచ్చును.

పండరంగడు చాళుక్య సైన్యమును అణ్ణెక్కి పట్టణమును వదలి గుండ్లకమ్మ తీరమున విడియవలసినదిగా ఆజ్ఞాపించెను.

పరిసరములు కొంత నెమ్మదించిన తరువాత పండరంగడు తన ప్రవర చెప్పుకొని ఆదిత్య భట్టారకునికి నమస్కరించెను. పండరంగడు శ్రీవత్స గోత్రీకుడు.

"మేము భారద్వాజస గోత్రీకులము. మా మేనమామ గారు శ్రీవత్స గోత్రీకులు. మనది కేవలము బదరీ బాదరాయణ సంబంధము కాదు. మరికొంత చిక్కని సంబంధమే," అని ఆదిత్య భట్టారకుడు నవ్వెను.

ఇరువురును ఇంటి లోపలి నుండి బయటికి వచ్చిరి. కొండపై భాగము కొంత మేర చదును చేసి పాదులు తీర్చి మూలికలు, ఔషదపు మొక్కలు, తీగలు పెంచుచున్నారు. పది

మంది శిష్యులు కల్వములలో మందులు నూరుచున్నారు. లోపలి గదులలో ఔషధముల కుపయోగించు రసద్రవ్యములు, శిలలు, గవ్వలు, లవణములు, కడవలలో నున్నవి. కొంత దూరమున విశాలమై కొట్టమున ఔషధ ద్రవ్యములను పుటము పెట్టుటకును, కాచుటకును, ఒక కొలిమి, పొయ్యి, కుండలు, మట్టిగొట్టములు, చిన్నవియు పెద్దనియునగు మూకుడులు అనేకములున్నవి.

ఇవి అన్నియు సరే. ఇవి ఆదిత్య భట్టారకుడు చేయువృత్తికి సంబంధించినవే. కాని అల్లంత దూరమున కోట బురుజు వంటి ఎత్తైన కట్టడముపైన కనబడుచున్న వస్తువులేమి? వాని ఉపయోగమేమి? పండరంగడు ఆదిత్యభట్టారకుని అడిగినాడు.

“మా పూర్వీకులు గొప్ప జ్యోతిశ్శాస్త్రవేత్తలు. మాముత్తాత గారి తాతగారు అర్కభట్టారకులు గొప్ప ఖగోళ పరిశోధకుడు. జ్యోతి శ్శాస్త్ర పారంగతుడు. ఉజ్జయినిలోని వరాహమిహిరుని ఖగోళ పరిశోధనాలయములో చాల ఏండ్లు పరిశోధనలు చేసినవాడు. ఎంత కాలమైనను పరదేశమున ఉండలేడు కదా. కొంతకాలమునకు అణ్ణెక్కి చేరుకొని ఇక్కడ గ్రహ పరిశీలనకు ఈ బురుజును, ఈ పరికరములను నెలకొల్పినాడు.”

ఉజ్జయిని వారికి శనిగ్రహము యొక్క పరిభ్రమణమును లెక్కించుటలో కొన్ని చిక్కులు తోచినవి. అర్కభట్టారకుడు ఇక్కడ దానిని గురించి పరిశోధించి ఆ చిక్కును పరిష్కరించి ఉజ్జయినికి వెళ్ళి ఆ వివరములను వారికి విశదీకరించి వారి కృతజ్ఞతకు పాత్రుడయ్యెను.

మా ముత్తాత గారికి ఖగోళ పరిశోధనపై ఆసక్తి లేదు. కేవలము జ్యోతిశ్శాస్త్రమునకు పంచాంగ గణనకు పరిమితమైపోయెను.”

“ఏల? ఖగోళమున పరిశోధించవలసిన అంశములు ఇంకను అనేకములున్నవి కదా. మీ ముత్తాతగారు ఏల విరమించుకొనిరి” పండరంగడు కుతూహలముతో అడిగెను.

ఆదిత్యభట్టారకుడు కొంతసేపు మౌనముగా నుండి మెల్లగా ఇట్లు చెప్పసాగెను.

“ఇటీవల దేశమున భక్తితత్వమను ఒక వింత ధోరణి అల్లుకొనుచున్నది. ఆధ్యాత్మిక వస్తువుగా ఉండవలసిన భగవత్తత్వమును భౌతిక వస్తువుగా మార్చుకొనుచున్నారు. మనస్సులలో హృదయములలో దర్శింప వలసిన భగవత్తత్వమును బాహ్య వస్తువుగా రూపొందించుకొని పూజా విధానములు మొదలగు క్రియాకలాపములకు ప్రాధాన్యమిచ్చుచున్నారు. జనులు తమ తెలివితేటలను, శక్తియుక్తులను, సృజనాత్మకశక్తిని, మేధాసంపదను ఈ బాహ్మరూపమైన భగవంతునిపై కేంద్రీకరించుచున్నారు. ఇటుపై సాహిత్యము, సంగీతము, నాట్యము, శిల్పము మొదలైన కళలన్నియు బాహ్యరూపమైన భగవంతునే ప్రధానముగా చేసికొని వృద్ధి పొందును. అదియే పరమార్థమని, అదియే జన్మసాఫల్యమని ఒక భావన ప్రబలుచున్నది. ఇక శాస్త్ర పరిశోధనలు, అన్వేషణములు, నూతన ఆవిష్కరణములు ఏమియు ఉండవు. ఇది వరకు జరిగిన శాస్త్ర పరిశోధనలు ఇంతటితో ఆగిపోవును. నూతనముగా ఏవియు వెలువడవు. ఈ విధమైన భక్తితత్వమువలన కళలు వృద్ధి పొందునుకాని శాస్త్రవిజ్ఞానము స్తబ్దమైపోవును. అంతేకాదు. ఈ బాహ్యరూప భక్తితత్వములోని పూజాది క్రియాకలాపముల వలన మరియొక

అనర్థము కలుగనున్నది. ఇది నా పూజ, ఇది నేను పూజించుదేవుడు, ఇది నా విధానము, నా విధానమే శ్రేష్ఠమైనది. అను అహంకార ధోరణులు పుట్టుకొని వచ్చును. దానితో బాటు మత్సరమును, అసహనమును పుట్టుకొని వచ్చును. ఇది ఒక ప్రమాదకర పరిణామము.

మా ముత్తాతగారు అంతటి జ్ఞానియై యుండియు ఈ భక్తితత్వమున తగులుకొనిరి. ఖగోళ పరిశోధనను మానుకొనిరి. ధర్మపురము నందలి భీమలింగేశ్వరస్వామికి భక్తులైపోయిరి. ఆ దేవునిపై కీర్తనలు రచించిరి. జ్యోతిశ్శాస్త్రమును, పంచాంగ గణనమును మాత్రము కొన సాగించిరి. ఖగోళ పరిశోధనలు మానుకొని వైద్యరంగమున పరిశోధనలు మొదలుపెట్టిరి. ఇది మానవులకు తక్షణ ప్రయోజనమును చేకూర్చునది." అని ఆదిత్యభట్టారకుడు గతమును తలంచుకొనుచు నిట్టూర్చెను.

"వారు మానుకొన్నారు సరే. మరి మీరైనను ఖగోళ పరిశోధన పునఃప్రారంభింప వచ్చును కదా. ఆ నిర్మాణములు, పరికరములు అట్లే ఉన్నవి కదా"

"శాస్త్ర పరిశోధన ఎడతెగకుండా జరుగవలె. ఒకసారి తెగిపోయి కొంతకాలము గడచిన యెడల మరల కొనసాగించుట కష్టసాధ్యము. అందుచే నేనాపనికి పూనుకోలేదు. ఇక్కడ ఆ రంగమున తోడ్పడువారును లేరు. కనుక అప్పటి నుండి మా తండ్రిగారును, నేనును ఒకవైపు పంచాంగ గణనము, మరియొక వైపు వైద్యము చేపట్టినాము. ఇక్కడికి రెండు దినముల ప్రయాణములో పంచాంగములు గుణించు సిద్ధాంతులెవరును లేరు. దూర ప్రాంతముల నుండి పురోహితులు మా యింటికి వచ్చి ఒకసారిగా మూడు నాలుగు సంవత్సర ముల పంచాంగములు వ్రాసికొను పోవుచుందురు. నేను పది సంవత్సరముల పంచాంగమును వ్రాసియున్నాను. ఇప్పుడును కొందరు పురోహితులు లోపల కూర్చొని పంచాంగములను వ్రాసికొనుచున్నారు."

ఇరువురును లోపలి గదులకు పోయిరి. నలుగురు బ్రాహ్మణులు ఆలేఖములను ముందుంచుకొని ఆదిత్యభట్టారకుడు వ్రాసియుండిన పంచాంగములను తాళపత్ర గ్రంథము నుండి ఎత్తి వ్రాసుకొనుచుండిరి. అది చూచి పండరంగడు హఠాత్తుగా "నేను దక్షిణ జైత్రయాత్రకు పోవుచున్నాను. అది ఎట్లు జరుగునో తమరు శోధించి చెప్పవలె," అన్నాడు.

ఆదిత్యభట్టారకుడు చాల సేపు ఆలోచించి మెల్లగా ఇట్లనెను.

"ఈ యుద్ధములును ఈ నరమేధమును, ఈ విధ్వంసమును తప్పవా? ఎంత చిన్న యుద్ధమైనను తేలికగా పోదు. ఎందరో చత్తురు. ఎందరో గాయపడుదురు. కొందరు తీవ్రముగా గాయపడి సరియైన చికిత్స అందక చచ్చుటయో, వికలాంగులగుటయో సంభవించును. వారి గతియు వారి కుటుంబముల గతియు ఏమి?"

"సైనికులు దీనికంతటికిని సిద్ధపడియే సైన్యములో చేరుదురు. సైనికుల కుటుంబ సంక్షేమమును రాజులు చూచుకొందురు"

"గెలిచిన రాజులు చూచుకొందరు. ఓడిన రాజులేమి చేయుదురు. ఇవన్నియు సైనికుల

పాట్లు. ఇక సామాన్యుల పాట్లు కూడ కొంచెము కాదు. ఎవరో ఏల? నన్నే చూడుడు. మీ దండయాత్రకు వెరచి నాలుగు దినములుగా ఇల్లు వదలి కొండపై కాపురమున్నాను. జైత్రయాత్రలో కొందరి ఇండ్లు కూల్చబడును, కొన్ని కాల్చబడును. కొన్ని ఇండ్లను సైనికులు దోచుకొందురు. దండు పయనించు మార్గమున పంటలు పాడైపోవును. పల్లెలు కొల్లబోవును. చూచుచున్నారు కదా. దేశమంతయు రైతులు కష్టించి పండించిన పైరు పచ్చలతో నవనవ లాడుచున్నది. కొద్దిదినములలో పంటలు రైతుల చేతికందును. అట్టి పంటలు మీ దండు ప్రయాణమున నాశనమగుచున్నది. మీ గుఱ్ఱములకు ఎడ్లకు మేత యగుచున్నది. అణ్డెక్కిలో ప్రజలు దాచుకొన్న ధాన్యము, ధనము మీ సైనికులు స్వాహా చేయుచున్నారు. ఒకసారి యుద్ధమున దెబ్బతిన్న ప్రాంతములోని ప్రజలు కోలుకొనుటకు రెండుమూడు సంవత్సరములు పట్టును. ఈ విధ్వంసమును, ఈ మారణహోమమును, ఈ నష్టమును ఎవరును గుర్తింపరు. గెలిచిన వానిని మహావీరుడని కీర్తింతురు.

అసలు యుద్ధమనగానేమి? విధ్వంసము, నరమేధము, హింస – ఇరు పక్షముల వారు చేయు పని ఇదియే. అందులో ఎవరు ఎక్కువ విధ్వంసము, నరమేధము, హింస చేసి పైచేయి సాధింతురో వారు గెలిచిన వారు. వారు మహా పరాక్రమవంతులు. వారిది కీర్తి.

అహింసావాదులైన బౌద్ధులు యుద్ధోన్మాదియైన మౌర్య అశోకుని గురించి ఏమన్నారు? దేవానాంప్రియుడన్నారు. ప్రియదర్శి అన్నారు.

బౌద్ధులు సరే. మన వారు అశోకుని గురించి ఏమన్నారు? మహావీరుడన్నారు. సమ్రాట్ అన్నారు. అతడు చేసిన కళింగ యుద్ధములో ఎందరు కళింగవీరులు చచ్చిరి. ఎందరు మగధ వీరులు చచ్చిరి. కళింగ సైనికులే కాదు. కళింగ ప్రజలెంత మంది చచ్చిరి. ఇందరు చచ్చుటకు, ఇంతటి మారణహోమము జరుగుటకు కారణమేమి? కేవలము ఒకే ఒక వ్యక్తి యొక్క సామ్రాజ్యకాంక్ష. ఆకాంక్ష పేరు వీరత్వము. ఆ విధ్వంసము పేరు పరాక్రమము. ఇది లోకము తీరు."

"మరి నేను చేయుచున్న యుద్ధము?"

"అది నీవు ఆలోచింపవలసినది."

పండరంగడు ఒక నిమిషము మౌనముగా ఉండి "మరి నేనడిగిన ప్రశ్నకు మీరు బదులు చెప్పలేదు. నాజైత్రయాత్ర ఎట్లు జరుగును?" అనెను.

"నీ జన్మనక్షత్రము జన్మలగ్నము, తత్కాలగ్రహస్థితి, దశాభుక్తులు తెలిసినగాని ఖచ్చితముగా చెప్పలేను."

అవి యన్నియు పండరంగని నోటి యందే ఉన్నవి. అతడు చెప్పుచుండగా ఆదిత్య భట్టారకుడు పలకపై కుండలివేసి గుర్తించుకొని కొంతసేపు పరిశీలించెను. "నీవు వృశ్చిక లగ్నమున పుట్టినావు. వృశ్చక లగ్నమునకు లగ్నాధిపతి కుజుడు. అందుకే నీవు ఈ క్షత్రియ వృత్తిని ఎంచుకున్నావు. నీకు సర్వత్ర విజయమే. నీకు అపజయమనునది లేదు. నీది పూర్ణాయుర్దాయము. అయినను ప్రస్తుత గ్రహచారము పరిశీలించగా నీకు పెద్ద శస్త్ర బాధ

కలుగునట్లున్నది. ప్రాణాంతకమైన గాయమును పొందుదువు. కాని ప్రాణభయము లేదు. నీది దీర్ఘాయువు. గాయపడినను విజయము నీదే – జాగ్రత్తగా మెలగవలె. ఎల్లప్పుడును వైద్యుని వెంటబెట్టుకొని యుండవలె.”

పండరంగడు కొన్ని నిమిషములు మౌనముగా ఉండిపోయెను.

“ఈ విషయమును గుంటూరునందు మరియొక సిద్ధాంతియు చెప్పినాడు. సరిగా మీరు చెప్పినట్లే చెప్పినాడు. ఆయన చెప్పినపుడు నేను తేలికగా తీసుకొన్నాను. కాని మీరు ఇంత గట్టిగా చెప్పుచున్నారు. నాకును గట్టి నమ్మకము ఏర్పడుచున్నది” అని మరికొన్ని నిమిషములు మౌనముగా ఉండి హఠాత్తుగా ఆదిత్య భట్టారకుని రెండు చేతులు పట్టుకొనెను.

“నాకీ గండము తప్పక సంభవింపగలదని గట్టిగా తోచుచున్నది. మీరు వైద్య శిఖామణులు, పెద్దలు, సాటి బ్రాహ్మణులు. మీరు నాకొక వరమీయవలె” అని వరమడుగువాని వలె దోసిలిపట్టెను.

“వరమా? ఏమి వరము?”

“ఇచ్చెదనని చేతిలో చేయి వేయుడు”

ఆదిత్య భట్టారకుడు ఒక నిమిషము ఆలోచించెను.

“నీవు కోరు వరము మానవ ధర్మమునకు విరుద్ధము కానిచో, ఇతరులకు హానికరము కానిచో, నా శక్తికి మించినది కానిచో తప్పక ఇచ్చెదను.”

“ఇక్కడి నుండి నేను బోయకొట్టములపైకి యుద్ధమునకు పోవుచున్నాను. మీరు మా వెంట రావలెను. అక్కడ నాకు ఈ గండము ఎదురైన యెడల మీరు నన్ను కాపాడవలెను.”

ఆదిత్యభట్టారకుడు నివ్వెఱపోయెను. ఆలోచనలో పడెను. ఇది ధర్మభంగము కాదు. ఇతరులకు హానికరమును కాదు. తన శక్తికి మించినదో కాదో దైవము నిర్ణయించును. కాని ప్రమాదకరము. యుద్ధరంగమున ఎవరు ఎవరని గుర్తింతురు? ఏమైనను జరుగవచ్చును.

“నా ప్రాణము మీదికి తెచ్చుచున్నావు.”

“మీరు యుద్ధరంగమునకు రానవసరము లేదు. కట్టెపు దుర్గమునకు ముందే క్రోసెడు దూరమున నాగపాళెము అను పల్లె ఉన్నది. మీరు అక్కడ విడిది చేయవచ్చును. అక్కడ కొందరు శిష్యులతో ఔషధములతో, పరికరములతో ఉండిన చాలును.”

“సరే. నాదొక నియమము.”

“ఏమది?”

“వైద్యుడు ఒకరికే వైద్యుడు కాడు. వైద్యుడు రోగుల కందరికిని వైద్యుడే. అక్కడ చికిత్స కొరకు ఎవరు వచ్చినను, చాళుక్య సైనికులు గానీ, బోయ సైనికులు గానీ, నేను వైద్యము చేయుదును. అక్కడ నన్నెవరును ప్రశ్నింపరాదు. కానీ నీకే గనుక గాయమైన యెడల అందరిని వదలి నీకే వైద్యము చేయుదును. అది మాత్రము తప్పను.”

రెండు దినములలో గాయపడిన సైనికులు కోలుకొనిరి. సామంతరాజును కొండపైననే శిష్యుల పర్యవేక్షణలో ఉంచి ఆదిత్య భట్టారకుడు పదిమంది శిష్యులను వెంటబెట్టుకొని పండరంగని సేనను వెంబడించెను.

రెండు దినములు ఏకధాటిగా పయనించి చాళుక్యసైన్యము నాగపాళెము చేరెను. ప్రొద్దుపోయినది. పండరంగడు నాగపాళెములోని ఒక భజన మందిరమును, ప్రక్కనున్న రెండు భవనములను స్వాధీనము చేసికొని ఆదిత్య భట్టారకునికి అప్పగించెను. చాళుక్య సేనలోని వైద్యులు ఆదిత్య భట్టారకుని వైద్య బృందములో చేరిపోయిరి.

అందరును నడుమునకు తెల్లని వస్త్రమును కట్టుకొని తెల్లని వస్త్రమును భుజముపై వల్లెవాటుగా వేసికొని, తెల్లని తలపాగాను ధరించిరి. చూచువారికి వీరు క్షతగాత్రులను రక్షింపవచ్చిన దేవతామూర్తులో అనిపించుచుండిరి. వీరు అక్కడ విడిసిన ప్రయోజనమును తెలిసికొని నాగపాళెము వారును వీరికి భయభక్తులతో కావలసిన వస్తువులను సమకూర్చ సాగిరి. యుద్ధము జరుగకతప్పదు. క్షతగాత్రులు రాక తప్పదు. అని గ్రామస్థులు తొట్లలో నీరు, పెద్ద కొప్పెరలలో గంజి, అంబలి మొదలైనవి సిద్ధము చేయసాగిరి.

తెల్లవారునప్పటికి సైనికులు పుష్టిగా తిని మెఱపు మెరసినట్లు పోయి కట్టెపు దుర్గము చుట్టును ముట్టడించిరి.

అప్పటికే బోయవిలుకాండ్రును, సాధారణ భటులును, యువతులును కోటగోడలపై బురుజుల మరువునను, కొత్తళముల మరువునను, కోటకొమ్మల మరువునను నిలిచి యుండిరి. చాళుక్య సైన్యము చుట్టుముట్టగానే కోటపై నున్న వారు వారిపై వడిసెల రాళ్ళు, చక్రాయుధముల వంటి రాతి పలకలు రివ్వు రివ్వున విసరసాగిరి. కోట క్రిందనున్న చాళుక్య సైన్యము సమ్మర్ధముగా ఉన్నది. పైనుండి పడిన ప్రతి రాయియు, ప్రతి చక్రాకారపు రాతి పలకయు ఎవరో ఒకరికి తప్పక గట్టిగా తగులుచుండెను. వాటి బరువునకు, వేగమును, వాదరకు చాళుక్య సైనికులు తీవ్రముగా గాయపడుచుండిరి. కొందరికి తలలు పగిలినవి. కొందరికి ఎముకలు విరిగినవి. కొందరికి కండలు తెగినవి. గాయపడిన వారు యుద్ధభూమిలో నిలువలేక తొలగిపోసాగిరి. క్రిందనున్న చాళుక్య సైనికులు కోటపైకి ప్రయోగించిన బాణములు, రాళ్ళు కోటకొమ్మల మరువునను, బురుజుల మరువునను నిలిచి యున్న వారికి తగులక కోటలో పడిపోవుచుండెను. కోటలోని ఆడువారు వాటిని ఏరుకొని వచ్చి కోటపై నున్న వారికి అందివ్వసాగిరి.

పండరంగడు కుడిచేత ముమ్మొనవాలును – త్రిభువనాంకుశమును – ధరించి గుఱ్ఱముపై కలయదిరుగుచు ఈ పోరాటమును అరఘడియసేపు పరిశీలించిచూచెను. తన సేనలో ఎక్కువ నష్టము జరుగుచున్నది.

కోట బయట కోటగోడ కంటె కొంత ఎత్తుగా బురుజులు కట్టి వాటిపై నిలబడిననే గాని కోటగోడపై నుండు వారిని తరుముటకు వీలు కాదని తలంచెను. సైన్యమును తక్షణమే

యుద్ధము ఆపవలసినదిగాను కొంత వెనుకకు జరుగవలసినదిగానూ ఆజ్ఞాపించెను. తాము వెంటకొని వచ్చిన బండ్లలోని గంపలు, పారలు గునపములు దింపించెను. ఆశ్వికులు కొంతమంది సమీపముననున్న బోయకొట్టములపైబడి చేతికందిన పారలు, గునపములు, గంపలు బయట పడవేసిరి. ఆ పల్లెలోని మగవారినే ఈటెలతోనూ, కొరడాలతోనూ బెదరించి వారిచేతనే మోపించుకొని వచ్చిరి.

కోటగోడకు కొంత దూరమున నూరేసి అడుగుల పొడవును, ఐదడుగుల వెడల్పును కోటగోడంత ఎత్తును ఉండునట్లు ఆరు మట్టి కట్టలు ఏటవాలుగా పోయుటకు అయిదు వేలమంది సైనికులను నియమించెను. కోటగోడపై నుండి వీరిపై బాణ ప్రయోగము జరుగకుండా వీరి ముందర ధానుష్కులు నిలిచి డాలువారులను అడ్డము పెట్టుకొని కోటగోడపై ఎవరినీ తల సూపనీయక బాణములు వేయుచుండిరి.

ఒకవైపున మట్టికట్టలు పోయు పని జరుగుచుండగా మరియొక ప్రక్క కోట క్రింద ముందు వరసలో ఉన్న చాళుక్య సైనికులకును, కోటగోడపై బురుజుల వెనుక దాగియున్న బోయలకును మధ్య నిరంతర బాణ ప్రయోగము జరుగుచునే యున్నది. చచ్చిన వారు చచ్చుచున్నారు. గాయపడిన వారు వెనుకకు వెళ్ళిపోవుచున్నారు.

అయిదారు ఘడియలలో మట్టి కట్టలు కోటగోడ ఎత్తు లేచినవి. చాళుక్య సైనికులకు ఇప్పుడు మంచి పట్టు దొరికినది. కోటగోడపైభాగము పూర్తిగా కనబడుచున్నది. కోటలోపలి ఇండ్లును కనబడుచున్నవి. బోయ సైన్యము కోటగోడపై తిరుగుట కష్టమైపోయెను.

పండరంగడు కోటగోడను పరిశీలించెను. గోడ రాతితో కట్టబడినది కాదు. మట్టి గోడ. పది అడుగుల మందముండవచ్చును. తలుపులు బలిష్ఠములై యున్నవి. వాటిని గొడ్డళ్ళతో చీల్చవచ్చును. గోడలను గునపములతోనూ, పారలతోనూ బల్లెములతోనూ త్రవ్వవచ్చును. లోపల ఎంత సైన్యమున్నదియు తెలియదు. మట్టి కట్టపైకి కనబడుచున్నదానిని బట్టి చూడగా వీధులలోనూ, బయళ్ళ యందును, పెద్ద సంఖ్యలో ఆశ్వికులును కాల్బలమును ఉన్నట్లు తెలియుచున్నది. వారు బయటపడిననే కాని ముఖాముఖి యుద్ధము జరుగదు. ముఖాముఖి యుద్ధము జరిగిననే గానీ విజయము శీఘ్రముగా లభింపదు.

పండరంగని సూచన మేరకు మరి రెండువేల మంది సైనికులు తలలకు పాగాలు చుట్టుకొని పాగాలపై ఇనుస గోలములు బోర్లించి కట్టుకొని గునపములు పారలు, బల్లెములు పట్టి కోట గోడను గ్రొచ్చుటకును, తలుపులు గొడ్డళ్ళతో చీల్చుటకును పూనుకొనిరి. బోయలు వారిపైకి వేడినీరు, వేడి నూనె వేసినను అవి వారిపై పడకుండుటకై వేయి మంది వారి వెనుక నిలబడి వెదురు తడకలను పట్టుకొని నిలిచిరి. చాళుక్య ధానుష్కులు మట్టి కట్టలపై నిలబడి కోటగోడలపై ఎవరిని తలయెత్తనీక బాణములు వేయుచుండిరి.

ఇట్లు రెండు మూడు గడియలు గడచునప్పటికి కోటగోడ క్రింది భాగము అంతయు త్రవ్వబడినట్లాయెను. గోడ ఒకటి రెండు చోట్ల బీటలు వారెను. కూలిపోవు సూచనలు కనబడగానే త్రవ్వుచుండిన వారు తమ పరికరములతో వెనుకకు పరిగెత్తిరి. కోటగోడపై

నున్నవారు క్రింది దిగిపోయిరి. కోటగోడ భయంకర శబ్దముతో కూలిపోయెను. దుమ్మ్ముదూళి రేగి కొంత సేపు ఏమియు కనబడలేదు. ఇదియే అదనుగా కోటలోని వారు వేయి మంది ఆశ్వికులు, రెండు వేల మంది కుంతధారులును, ఖడ్గధారులును జైకార్తికేయ అని అరచుచు కోట నుండి వెలువడి చాళుక్య సైన్యము బడిరి. చాళుక్య సేనలు జయ త్రిభువనాంకుశ అని అరచుచు వారిని ఎదుర్కొనిరి.

దొమ్మి యుద్ధము ఘోరమయ్యెను.

అదే సమయమునకు మావటి వారు ఏనుగులను తోలుకొని వచ్చి చాళుక్య కాల్బలముపై బడిరి. ఏనుగులు తొండములకు కట్టిన కత్తులతోనూ, ప్రక్కలందు బిగించిన ఈటెలతోనూ శత్రు సైన్యములో దూరి చిందులు వేయసాగినవి. ఈ ఏనుగులు దూరినంత మేర చాళుక్య సైనికులు గాయముల పాలగుటయో, బెదరి దూరముగా పారిపోవుటయో జరుగుచున్నది. చాల మందికి కాళ్ళు చేతులు శరీరము తెగి గాయములైనవి. మావటి వాండ్రు ఏనుగులకు లెస్సగా కల్లు త్రాగించి యుండుటచే వాటి వీర విహారమునకు హద్దులు లేకుండెను.

చాళుక్య సైన్యములోని ఆశ్వికులు ధైర్యము చేసి ఏనుగులను చుట్టుముట్టి వాని శరీరములందు ఇనుప రేకుల కప్పులేని మెడమీదను, పిరుదుల మీదను ఈటెలతో పొడిచిరి. అవి మరింత రెచ్చిపోయి బెదరిపోయి ఘీకరించుచు చిందులు వేయుచు అడవి వైపు పారిపోయినవి. బోయలకు ఏనుగుల సాయము లేకపోయెను.

ఏనుగులు ఉన్నంత సేపును బోయ ధానుష్కులు వాటి వెనుక నిలబడి బాణములు ప్రయోగించుచు చాళుక్య సేనకు అపార నష్టమును కలిగించిరి.

మలయప్పయు వాని అన్నలును పండరంగని లక్ష్యముగా చేసికొని తమ గుఱ్ఱముల నురికించిరి. అంతలో చాళుక్య సామంతరాజులు అడ్డము వచ్చి వారినెదుర్కొనిరి.

పండరంగడు దూరము నుండి గుఱ్ఱము అంకె వన్నెలపై నిలిచి వారిపై గురిచూచి బాణములు వదలెను. ఒక బాణము మలయప్ప రొమ్ములోనూ, మరియొకటి కొమ్మన బోయని గొంతులోనూ దిగబడెను. ఇరువురును గుఱ్ఱములపైనుండి నేలకొరిగిరి. ఇరువురు సామంత రాజుల ఈటెలకు నన్నిదొర కొడుకులును నేలకొరిగిరి.

సగము పడిపోయిన గోడపై నిలిచి చూచుచున్న వకుళ ఈ బోయ కుమారులు పడుటను చూచెను. ఒక్క క్షణము నిశ్చేష్టురాలయ్యెను. ఆమె ప్రాణము తల్లడిల్లెను. దుఃఖము పొంగి వచ్చెను. ఒడలు తెలియని రౌద్రమావేశించెను. విల్లును, రెండు అర్ధచంద్ర బాణములను అందుకొనెను. తాను కొబ్బరి గెలను కొట్టిననాడు నన్నిదొర పలికిన పలుకులు చెవిలో రింగుమనెను. ఔడు కరచి బాణమరివోసి చెవి వరకు లాగి ఒకటి తరువాత ఒకటిగా రెండు అర్ధచంద్రబాణములను గురి చూచి వదలెను. ఆ బాణములతో ఆ సామంతరాజుల కంఠములు సగముపైగా తెగిపోయి మెడ ఎముకలు విరిగి తలలు వెనుకకు వ్రేలాడజొచ్చెను. ఇరువురు సామంతురాజులును నేలకూలిరి.

పండరంగడు బాణముల కందనంత దూరముననున్నాడు.

కుమారులు చచ్చుట చూచి నన్నిదొరయు, పొన్నిదొరయు రెండు చేతులతో ఖడ్గములు ధరించి అంకెవన్నెలపై నిలబడి పండరంగని వైపు గుఱ్ఱములనురికించిరి. వారట్లు పోవుట వకుళ చూచెను. ఇక పండరంగనికి చావు మూడినదని అనుకొనెను. వాని చావు కనులారా చూడవలెనని నిలిచెను. వారిని అడ్డగింపవచ్చుచున్న చాళుక్య వీరులపై బాణములు ప్రయోగించుచుండెను. నన్నిదొరను, పొన్నిదొరను ఆపుట అసాధ్యమని చాళుక్య దళపతులు గ్రహించిరి. ఒక కుత్సితమైన ఉపాయము పన్నిరి. వెనుకనుండి చాళుక్యవీరులలో కొందరు వారి గుఱ్ఱముల కాళ్ళు నరికిరి. నన్నిదొరయు, పొన్నిదొరయు నేల మీదికి దూకి ఖడ్గములు చేతిలోనికి తీసికొను లోపల వెనుకనున్న ఇరువురు చాళుక్య దళపతులు వారిని ఈటెలతో పొడిచిరి. చాల దగ్గరి నుండి పొడుచుట వలన అవి వారి వీపున దూరి రొమ్ము వరకు చొచ్చుకొని పోయినవి. వారట్లే నేలపై వాలిపోయిరి.

వకుళ ఇదియు చూచెను. ఆమెకు ప్రపంచమంతయు గిఱ్ఱున తిరుగుచున్నట్లైనది. కనుల ముందే కొడుకులు పోయిరి. ప్రాణములో ప్రాణమైన మగడు పోయెను. ధీరోదాత్తుడు నన్నిదొర పోయెను. ఆమెలో ఆవేశము రేగినది. గట్టి విల్లును రెండు నారాచములును అందుకొని ఒకదాని వెంట ఒకటి ఆకర్ణాంతము లాగి వదలినది. ఇరువురు దళపతులు నేలకూలిరి. వెంటనే కోటగోడపై నుండి ఒక ఉరుకున క్రిందికి దిగినది. ఆశ్వికుని కోల్పోయిన ఒక బలమైన గుఱ్ఱముపైకి కుప్పించి ఎగిసి అంకవన్నెలలో కాళ్ళు బిగదన్ని పగ్గములను నడుమునకు చుట్టుకొన్నది. రెండు చేతులలోనూ రెండు బలమైన కుంతములను పట్టుకొని గుఱ్ఱమును పండరంగని వైపు త్రిప్పి కుంతపు కఱ్ఱలతో గుఱ్ఱమును రెండు ప్రక్కల గట్టిగా తాడించినది. ఆ దెబ్బలకు గుఱ్ఱము శరవేగముతో ముందుకు పరుగెత్తసాగెను. వకుళ రెండు కుంతములను రెండు చంకల క్రింద గట్టిగా ఇరికించుకొని ముందుకు చాపి పండరంగని వైపు గుఱ్ఱమును తరుముచున్నది.

నన్నిదొరయు, పొన్నిదొరయు పడిపోవుట చూచి బోయ సైనికులును, ప్రముఖ సామంత రాజులు దళపతులు పడిపోవుట చూచి చాళుక్య సైనికులును చకితులై నిలబడి పోయిరి.

పండరంగడు త్రిభువనాంకుశమును పైకెత్తి పట్టుకొని అరచుచున్నాడు.

"కోటను పడగొట్టుడు. ఇండ్లను ధ్వంసము చేయుడు, నిప్పు పెట్టుడు. పూచికపుల్ల మిగులరాదు. మట్టి పెళ్ళపై మట్టిపెళ్ళ ఉండరాదు. రాతిపై రాయి ఉండరాదు. ఊరువల్లకాడు కావలె. కోట బయలైపోవలె."

పండరంగనికి తన తండ్రి చేతులు వెనుకకు విరిచి కట్టబడి, తలవంచుకొని, ఒకానొక అల్పాతి అల్పుడైన బోయని ఎదుట నిలబడిన దృశ్యమే కనబడుచున్నది.

వకుళకు శరీరముపై స్పృహ లేదు. దయ్యము ఆవేశించినట్లున్నది. చూపు పండరంగనిపై నున్నది. గుఱ్ఱము శరవేగమున పండరంగని గుఱ్ఱమువైపే పోవుచున్నది. కొందరు చాళుక్య సైనికులు దానిని అడ్డగింప ప్రయత్నించిరి. కాని వకుళ చేతిలోని కుంతము తగిలి దూరముగా పడిపోయిరి.

పండరంగడు కోట వద్ద జరుగుచుండిన విధ్వంసకాండను చూచుచుండిన వాడు ఒక క్షణము ఇటు చూచెను. కాళికాదేవి వలె తనపైకి దూసుకొని వచ్చుచున్న వకుళను చూచి త్రిభువనాంకుశమును సవరించుకొను లోపల వకుళ కుడిచేతిలోని కుంతము పండరంగని కుడి భుజము దిగున ప్రక్కటెముకల మధ్య దూరి వెనుక వైపున వీపులో ఒక జేనెడు బయటికి పొడుచుకొని వచ్చెను. ఆ వ్రేటునకు పండరంగడు ఆ కుంతముతో బాటు గుఱ్ఱముపై నుండి కిందపడిపోయెను.

వకుళ గుఱ్ఱము ఆగలేదు. అదే వేగముతో యుద్ధరంగమును వదలి దక్షిణ దిశగా ఎటో వెళ్ళిపోయినది. ఆమె దానిని ఆపుటకైనను ప్రయత్నించలేదు. ఎడమచేతిలోని ఈటెను వదలలేదు. శిలవలె బిగుసుకొనిపోయిన మొగముతో మ్రాన్పడిపోయిన శరీరముతో గుఱ్ఱముపై కూర్చుండిపోయెను. గుఱ్ఱము తనకు తోచినట్లు దక్షిణ దిశగా పరుగుతీయుచుండెను.

నన్నిదొరయు, పొన్నిదొరయు పడిపోగానే బోయ సైన్యము చెల్లాచెదరై పారిపోయెను. చాళుక్య సైనికులు పండరంగని చుట్టును, సామంతరాజుల చుట్టునుచేరిపోయిరి. ఇరువురు దళపతులును, సామంత రాజులును మరణించినారని తెలిసిపోయెను. పండరంగని ప్రాణము పోలేదు. కొందరు అతని రొమ్మున నాటిన ఈటెను తీయజూచిరి కాని అది తమ చేతకాని పని అని తెలుసుకొనిరి. పండరంగడు స్పృహ కోల్పోయియున్నాడు. కొందరు అతనిని చేతుల మీద ఎత్తుకొని నాగపాళెము వైపు పరుగెత్తిరి. అప్పటికే అక్కడ నూర్లకొలది క్షతగాత్రులు పడియున్నారు. వైద్యులు చకచక తిరుగుచు చికిత్సలు చేయుచున్నారు.

పండరంగని చూడగానే ఆదిత్యభట్టారకుడు పరుగున ఎదురువచ్చెను. పరిస్థితిని గమనించెను. కుంతమును వెనుకకు లాగుటకు వలను పడదు. కట్టె కంటె అలుగు వెడల్పుగా నున్నది. వైద్యుడు శస్త్ర చికిత్సకుపయోగించు సన్నని రంపముతో వీపున పొడుచుకొని వచ్చిన అలుగును మెల్లగా కోసి తీసివేసెను. రొమ్మువైపు నుండి ఈటె కఱ్ఱను వాటము చూచి హఠాత్తుగా లాగివేసెను. పండరంగడు గట్టిగా కేకవేసెను. కాని స్పృహ రాలేదు. వైద్యుడు వెంటనే ఒక ఔషధ ద్రవమును ఆ రంధ్రములోనికి కొంచెము కొంచెముగా దిగునట్లు పోసెను. ఇట్లు ముందునుండియు, వెనుకనుండియు ఔషధ ద్రవమును పోసిన తరువాత మందాకుతో రంధ్రములు మూసి కట్టుకట్టెను. గోరు వెచ్చని పాలు పాలడతో పోసి త్రావించెను. కొంత సేపైన తరువాత నీరు త్రావించెను.

ఈ వ్యవధిలో కట్టెపు దుర్గములోని వారందరును పిల్లపాపలతో ముసలివారితో కోట వదలి పారిపోయిరి. ఊరు నిర్మానుష్యమైపోయెను.

చాళుక్య సైనికులు విధ్వంసకాండకు పూనుకొనిరి. కోటగోడను అన్ని వైపుల కూల్చివేసిరి. పూరి కొట్టములకు నిప్పుపెట్టిరి. మిద్దెలను పడగొట్టిరి. నగరు ధ్వంసమయ్యెను. కొలువు కూటము నేల మట్టమయ్యెను. ఇండ్లలోని వస్తువులు అగ్నిపాలయ్యెను. ఇంకను ఇండ్లు వదలి పారిపోనివారు ఆలగోడు బాలగోడుగా అరచుచు పారిపోజొచ్చిరి. సైనికులు ఇండ్లలో దూరి ఎవరికి దొరికినది వారు భద్రపరచుకొనిరి. గోడలలో దాచిన సొమ్ము బయటపడెను.

నగరులో కోశాగారము తప్ప తక్కిన ఊరంతయు కొల్లబోయినది. సాయంత్రమునకు

కార్తికేయుని దేవాలయము తప్ప కట్టెపు దుర్గము సర్వము ధ్వంసమైపోయెను. కోశాగారములో బీగములు వేసియున్న బోషాణములను అట్లే నాగపాళెమునకు తరలించిరి.

చాళుక్య సైనికులలో ముప్పాతిక మంది కట్టెపు దుర్గమునకు ఉత్తరమున నున్న చెఱువు వద్దకు వెళ్ళి అక్కడ విడిది చేసికొనిరి. తక్కిన వారు నాగపాళెము వద్ద నిలిచిరి.

పండరంగడు మూడు దినములు స్పృహ లేకుండా పడియుండెను. తీవ్రమైన జ్వరము. ఆదిత్యభట్టారకుడు ఘడియఘడియకు పరిస్థితిని గమనించుచు మందులు మ్రింగించుచుండెను. నూర్ల కొలది క్షతగాత్రులు నాగపాళెమునకు చేరిరి. ఊరివారు తమ పనిపాటులు మానుకొని క్షతగాత్రులకు సేవ చేయుటలో నిమగ్నులైరి. యుద్ధరంగములోనికి పోయి నడువలేక పడి యున్న క్షతగాత్రులను మంచములపై తెచ్చి వైద్యులకు అప్పగించుచుండిరి. వారి గాయములకు కట్లు కట్టుటకు ఎన్ని చలువ బట్టలైనను చాలలేదు. ప్రక్కపల్లెలకు పోయి బట్టలు సేకరించుకొని వచ్చిరి. ప్రక్కపల్లెల వారును నాగపాళెమునకు వచ్చిరోగులకు సేవ చేయసాగిరి. కొందరికి తీవ్రమైన గాయములు తగిలినవి. కొందరికి అవయవములు తొలగింప వలసివచ్చెను. ఇది మరింత బాధాకరమైన చికిత్స. వారికేకలతో ఊరు దద్దరిల్లిపోవుచుండెను.

నాగపాళెము వారును, ప్రక్కపల్లెల వారును రోగులకు వైద్యుల సూచనల మేరకు గంజి, అంబలి, అన్నము తెచ్చి పెట్టుచుండిరి. బోయసైనికులలో గాయపడిన వారిని కూడ నాగపాళెము వారు నెమ్మదిగా తెచ్చి వైద్యుల కప్పగించిరి. వైద్యులు అందరికిని ఒకే రీతిగా చికిత్స చేయసాగిరి.

అటు చాళుక్య సైనికులును, ఇటు బోయకొట్టముల వారును యుద్ధరంగమున తమ వారి శవములను వెదకి తీసికొని పోయి ఖననము చేసిరి.

పది దినములకు పండరంగడు ఇంచుక స్వస్థుడయ్యెను. లేచి నిలబడగలుగుచున్నాడు. అతడు కట్టెపు దుర్గమును చూడవలెనని కోరెను. కొందరు భటులు అతనిని మంచముపై కూర్చుండ బెట్టుకొని కట్టెపు దుర్గము వద్దకు కొనిపోయిరి.

కోటగోడ పూర్తిగా కూలిపోయినది. చాల ఇండ్లు కూలిపోయినవి. కొన్నికాలిపోయినవి. ఊరు నిర్మానుష్యమై యున్నది.

“ఆ యిండ్లను కూడ కొట్టివేయుడు. జేనెడెత్తు గోడయైనను కనపడరాదు. దూలములును, దంతులును, మిగిలిన సామగ్రిని నాగపాలెము వారికి ఇచ్చివేయుడు.”

ప్రొద్దుపోవు లోపల ఆ పనియు జరిగిపోయెను. ఇప్పుడు కట్టెపు దుర్గము విశాలమైన బయలుగా కనబడుచున్నది.

ఇదియేనా ఒకనాడు బీళ్ళుగానూ, చిట్టడువులుగానూ ఉండిన విశాల భూభాగములను సస్యశ్యామల భూములుగా మార్చిన త్రిపురాంతక బోయలు చెమటోడ్చి కట్టుకొన్న కలలకోట!

ఇదియేనా అరి వీర భయంకరులైన బోయధానుష్కులు నిత్యసాధన చేయుచుండిన గరిడీకోట!

ఇదియేనా పండ్రెండువేల సైన్యముతో ఎత్తివచ్చిన చాళుక్య జయసింహవల్లభుని కేవలము తన వాక్ప్రతిభతో అప్రతిభుని చేసి పంపిన మంగసాని నడయాడిన కడిది కోట!

ఇదియేనా ద్వీపాంతరముల నుండి ఓడవర్తకులు వచ్చి బోయదొరలతో మంతనము లాడుచుండిన కలిమికోట!

ఇదియేనా నొలంబాధిపతియైన పులాల చోరుని మట్టికరిపించి పట్టి, కట్టి, పల్లవరాజుల కప్పగించిన గడుసుకోట!

ఇదియేనా చాళుక్యాశ్వీక దళమును అల్లకల్లోలము గావించి చాళుక్య ప్రధానామాత్యుని పెడరెక్కలు విరిచి కట్టి నిలబెట్టిన బిరుదుకోట!

అంతటి నిన్నటి కట్టెపు దుర్గము నేడు కడు బయలైపోయినది. రాతి మీద రాయి లేదు. ఇటకమీద ఇటుక లేదు. మట్టి పెళ్ళపైన మట్టి పెళ్లలేదు. కూలిన గోడలు, వ్రాలిన స్తంభములు, కాలిన పైకప్పులు, ఒక్క కార్తికేయుని దేవాలయము తప్ప తక్కిన దుర్గమంతయు శ్మశాన సదృశ్యమైపోయినది.

ఇట్లు ఇన్నూరు సంవత్సరములలో ఆవిర్భవించి, అభివృద్ధి చెంది, ఒక వెలుగు వెలిగి, పరిఢవిల్లిన బోయరాజ్యము. అభిమాన ధనులైన బోయ విలుకాండ్రకు, వీరులకు స్థావరమైన బోయరాజ్యము, పంౘ్రెండు బోయకొట్టములు అను సామూహిక నామముతో పిలువబడు చుండిన బోయరాజ్యము, పల్లవ, చాళుక్య ప్రభువుల సామ్రాజ్యకాంక్షలకు బలియై, వారి రాజకీయపుటెత్తుల మధ్య నలిగి, కేవలము ఒక్కనాటి యుద్ధములో శాశ్వతముగా, రూపుమాసి పోయినది. బయలైపోయినది. చరిత్ర పుటలలో కేవలము ఒక పంక్తిగా నిలిచి పోయినది.

పాడైన కట్టెపు దుర్గములో నిర్మానుష్యమైన కార్తికేయుని గుడిగోపురముపై త్రిభువనాంకుశ చిహ్నముతోడి పతాకము రెపరెపలాడసాగినది.

# తదుపరి

**వకుళ:**

పదునైదు దినములకు వకుళ చంద్రగిరి చేరికొనెను. ఆమె ఎక్కడ ఆగెనో, ఎక్కడ పరుండెనో, ఎక్కడ ఏమితినెనో, త్రాగెనో, ఆమె ఎక్కిన గుఱ్ఱము ఎక్కడ ఏమి తినెనో, ఎక్కడ విశ్రమించెనో దేవునికే ఎరుక.

దారిలో శ్రీకాళహస్తి వద్ద ఆమెను ఎరిగిన వారు ఆమెను పలుకరించిరి. ఆమె ఎవరివైపును చూడలేదు. ఎవరితోనూ మాట్లాడలేదు. గుఱ్ఱమును ఆపనే లేదు. పోవుచునే యుండెను. ఆమె పరిస్థితి చూచి ధర్మాధికారి ఆమె వెంట కొందరిని పంపెను. వారు ఆమెతో చంద్రగిరి దుర్గాధిపతి ఇంటి వద్దకు వచ్చి అక్కడ ఆమెను వదలి వెనుదిరిగిరి. వకుళ విచిత్రమైన మానసిక స్థితిలో నున్నది. ఆ సమయమునకు చంద్రగిరిలో వకుళ అన్నయు, వదినయు, పల్లవరాణియు ఉండిరి. వారు ఆమెను ఎన్ని ప్రశ్నలడిగినను మౌనమే సమాధానమయ్యెను.

చంద్రగిరికి వచ్చిన మూడవ దినమున వకుళ తిరువేంగడ క్షేత్రమునకు వెడలిపోయెను. అక్కడ ఆమె మలయప్ప సేవలో నిమగ్నమైపోయెను. ఆ విగ్రహమునే తన కుమారుడైన మలయప్పగా భావించినది. ప్రతి దినము ఆ విగ్రహమునకు స్నానము చేయించుట, బట్టలు కట్టుట, అలంకరించుట, భోజనము వండిపెట్టుట, అప్పుడప్పుడు చిరుతిండ్లు, దోశెలు, వడలు, క్షీరాన్నము, చిత్రాన్నము చేసిపెట్టుట మొదలైన పనులలో లీనమైపోయెను. దగ్గర కూర్చుండి ముచ్చటలాడుచుండెను. ప్రొద్దుపోయిన తరువాత మలయప్పను ఊయెలలో పరుండబెట్టి పాటలు పాడుచు నిద్రపుచ్చుచుండెను.

తిరువేంగడమున నున్నవారందరికిని ఆమె బాల్యము నుండియు పరిచితురాలే. అనేక పర్యాయములు బ్రహ్మోత్సవములలో పల్లవరాణితోబాటు వచ్చి పాల్గొనుచుండినది. బోయ రాజ్యమునకు యువరాణియైన తరువాత ఆమె వచ్చినప్పుడెల్ల దేవాలయమునకు పెద్ద పెద్ద కానుకలిచ్చినది. అర్చకులు ఆమె భక్తికి ముగ్ధులైపోయిరి. ఆమె మానసిక స్థితికి జాలిపడిరి. ఆమెకు దేవాలయములో సంపూర్ణ స్వేచ్ఛనిచ్చిరి. ఆమె వండిన పదార్థములను నైవేద్యముగా సమర్పింపసాగిరి. ఆమె కొరకు దేవాలయమున ఆగ్నేయ దిశగా ఒక చిన్నగది నిర్మించిరి. అక్కడనే ఆమె నైవేద్యమును వండి తెచ్చి సమర్పింపసాగెను.

"నేను ఈ చెట్టుక్రింద గుడిసె వేసుకొని కాపురముంటినమ్మా. ఒకనాడు ఈ శ్రీనివాసుడు తలపై గాయముతో నావద్దకు వచ్చినాడు. పాపము ఇక్కడ వానికెవరున్నారు? నేనే వాని గాయమును కడిగి మందువేసి కట్టుకట్టితిని – గాయమెట్లు తగిలినది నాయనా అని అడిగితిని. ఆకాశరాజు కూతురు పద్మావతి రాయి విసిరినదని చెప్పినాడు. పోనీలే ఆ వైపు వెళ్ళకు. నా

యొద్దనే ఉండు అన్నాను. కాని ఉండడే. పద్మావతినే పెండ్లాడవలెనని మొండిపట్టు పట్టినాడు. నన్ను ఆకాశరాజు దగ్గరికి పొమ్మన్నాడు. ఏమి చేయుదును? దిక్కులేని బిడ్డడు. వాని పెండ్లి నేను చేయక ఎవరు చేయుదురు? ఏమైనను కానిమ్మని ఆకాశరాజు దగ్గరికి పోతిని. ఈ దొంగ పిల్లవాడు ఊరకున్నాడా? నాకంటే ముందే ఎరుక సాని వేషము వేసికొని ఆకాశరాజు అంతఃపురములో ప్రవేశించి ఎఱుక చెప్పి పద్మావతి హృదయములో అనురాగ బీజములును, ఆమె తల్లిదండ్రుల మనస్సులలో అనుకూల బీజములును వేసి మాయమైనాడు. సరే. ఇంకే మున్నది. పెండ్లి జరిగిపోయినది."

ఈ కథను ప్రతి దినమును అడిగిన వారికిని, అడుగని వారికిని చెప్పుచుండెను. ఎవరును చెంతలేనప్పుడు తనకు తానే చెప్పుకొనుచుండెను.

ఒకనాడు ఉదయమున అర్చకులు దేవాలయమునకు వెళ్ళగా అక్కడ వకుళగానీ, ఆమె ఆరాధించుచుండిన మలయప్ప స్వామి ప్రతిమగానీ కనబడలేదు. అందరును అన్ని దిక్కులకును వెళ్ళి వెదకిరి. తీర్థములలో శోధించిరి. ఆమె జాడగానీ, విగ్రహము జాడగానీ తెలియనేలేదు. అందరును నిరాశ చేసికొని మరలివచ్చిరి. ఈమె పూర్వ జన్మమున వకుళ మాత అని జనులు భావించి నమ్మిరి. ఈమె చెప్పు కథలే క్రమముగా స్థల పురాణముగా మారినవి.

అప్పుడు పోయిన మలయప్ప విగ్రహము తరువాత ఎప్పుడో, ఎక్కడో లభించినది.

**పండరంగడు–**

కట్టెపు దుర్గమును కదుబయలుచేసి పం(డెండు బోయకొట్టములను స్వాధీనము చేసికొన్న తరువాత పండరంగడు అక్కడ ఇట్లు చాటించెను.

"ఇక ఇక్కడ ఎవరును కోట కట్టరాదు. ఇక్కడ రాజ్యము ఏర్పడరాదు. ప్రభుత్వము ఏర్పడరాదు. మీరందరును సామాన్య రైతులుగా ఉండవలె. భూమి పన్ను మేము నియమించు గ్రామాధికారికే చెల్లించవలె. ఓడరేవు మాది. సుంకములు విధించుట మా పని. మీరు కేవలము రైతులే. జాగ్రత్తగా మెలగవలె."

అక్కడి నుండి పండరంగడు కందుకూరుపై బడెను. కందుకూరు సులభముగా స్వాధీన మయ్యెను. పల్లవులు మాటిమాటికి చాళుక్యరాజ్యముపై దండెత్తకుండ ఆపవలెనన్నచో కందుకూరును చాళుక్య రాజ్యమునకు మూడవ రాజధానిగా చేయవలె. చాళుక్యరాజ్యమున వేంగి తరువాత బెజవాడ రెండవ ముఖ్య పట్టణముగా నున్నది. కందుకూరును బెజవాడవలె రూపొందించవలె.

కోటను పటిష్టముగావించెను. స్థానికులైన వివిధ జాతుల వారిని సైన్యమున చేర్పించెను. అగ్రవర్ణస్థులను దళపతులుగా నియమించెను. తానుకొనిపోయిన సైన్యములో అయిదు వేల మందిని అక్కడనే నిలిపివేసెను. విశ్వాసపాత్రుడును, పరాక్రమవంతుడును అయిన చాళు క్యవంశస్థుని రాజప్రతినిధిగా నియమించెను. అక్కడి నుండి నెల్లూరుకు తన దండయాత్ర సాగించెను.

నెల్లూరులో అతనికి గట్టి ప్రతిఘటన ఎదురయ్యెను. ప్రతిఘటన పెరిగినచో పండ రంగనిలో రౌద్రము పెరుగును. పల్లవ రాజప్రతినిధిని ఓడించి నెల్లూరును పరశురామ ప్రీతిగావించెను. భస్మీపటలము గావించెను. తన సైనికులకు పట్టణమును కొల్లవిడిచెను. పట్టణమున బీభత్సమును సృష్టించి మరలెను.

తిరిగి వచ్చుచు పండరంగుడు అడ్డెక్కిలో ఆదిత్యభట్టారకుని దర్శనము చేసికొనెను.

"మీ దయ వల్ల బ్రతికి బట్టకట్టితిని. మీరు చెప్పిన జోస్యము నిజమైనది. ప్రాణగండము తప్పినది. జయ పరంపర లభించినది. మీకు ఏదైనను ప్రత్యుపకారము చేసి మీ ఋణము కొంచెమైనను తీర్చుకోదలచితిని. ఏదో ఏల? మీకును మీ వంశము వారికిని శాశ్వతముగా నుండునట్లు మీరు కోరినచోట మీరు కోరినంత భూమి దానము చేసెదను. కోరికొనుడు ఎక్కడ ఇమ్మందురు."

"నాకేమియు వలదు. మీరేదైనను ఇవ్వదలచినచో ధర్మపురమున కొలువైయున్న భీమలింగేశ్వరస్వామికి ఇవ్వవచ్చును."

పండరంగడు నవ్వి ఇట్లనెను. "మీరే కదా అంటిరి. భక్తివలన ప్రగతి స్తబ్ధమగునని."

"నిజమే. కాని 'వట్టి చెవులకంటే తాటాకు చెవులు మేలు' అని సామెత.

పండరంగడు మరల బిగ్గరగా నవ్వి "నాకు ఈ ధర్మకర్తలపైనను అర్చకులపైనను నమ్మకము లేదు. వీరిలో స్వార్థమెక్కువ. దేవాలయమును నిర్వహించుటకు నిస్వార్థపరుడైన ధర్మకర్త ఉండవలె. అట్టివాడు ఇప్పుడు ఇక్కడ నాకెవడు దొరకును? నేను మీకు దానమిచ్చెదను. మీరేమైనను చేసికొనుడు" అనెను.

"అయినచో ధర్మపురమున దేవాలయమునకు దగ్గరగా భూదానమిమ్ము"

వెంటనే పండరంగడు ధర్మపురము గ్రామాధికారిని పిలిపించి భీమలింగేశ్వరస్వామి దేవాలయ సమీపమున భూములను సాగుచేయుచున్న రైతులను పిలిపించెను. అక్కడ సాగు చేయుచున్న భూమి విస్తీర్ణమును లెక్కచూడగా ఎనుబొది పుట్ల ఆడ్లు పట్టునేల లెక్కతేలెను. పండరంగడు ఆ రైతుల ఎదుట ఇట్లు ప్రకటించెను.

"ఈ మొత్తము నేలను నేను ఈ ఆదిత్యభట్టారకుల వారికి దానమిచ్చుచున్నాను. మీరు ఇదివరకు ఈ భూమికి గాను గ్రామాధికారికి ఎంత పన్ను చెల్లించుచున్నారో ఆ పన్ను ఇకపై ఆదిత్యభట్టారకుల వారికి చెల్లింపవలెను. మీ చెల్లింపులను గ్రామాధికారి పర్యవేక్షించును. ఇదిరాజాజ్ఞ. మీరు రాజాజ్ఞకు భయపడి కాక దైవమునకు భయపడి, ధర్మమునకు భయపడి, నరకమునకు భయపడి, మీ అంతరాత్మకు భయపడి ఈ ధర్మమును శిరసావహించవలెను"

తరువాత పండరంగడు శిల్పులను వ్రాయసగాండ్రను పిలిపించి శిలా శాసనము చెక్కించెను. ఆదిత్య భట్టారకుడు శాసన పాఠమును రచించి ఇచ్చెను. శాసన పాఠము ఆనాడు బహుళ ప్రచారములో నుండిన తరువోజ ఛందమున రచింపబడినది.

శ్రీ మహితాంధ్రభూ శ్రీ విభవుండు శ్రీ చళుక్యాన్వయ క్షీరాబ్ధి విధుడు
హేమాద్రి ధీరుండు హిత భాషణుండు ఎక్కటి వేంగిరాజ్యేందిరా వరుడు,

తామసహరుడు సత్యా(శయ కీర్తి దక్షిణ పశ్చిమోత్తర దిశా దేశ
భూమీశ శిఖర దంభోళినా బరగి భువి విజయాదిత్య భూపాలకుండు
పట్టంబు గట్టిన (ప్రథమంపు నేడు బలగర్వమొప్పంగ బైలేచి సేన
పట్టంబు గట్టించి (ప్రభు పండరంగు బంచిన సామంత పదవుతో బోయ
కొట్టముల్ పం(డెండు గొని వేంగినాటి గొఱల్చియ (త్రిభువనాంకుశ బాణ నిల్పి
కట్టెపు దుర్గంబు కడుబయల్సేసి కందుకుర్బెజవాడ గావించె మెచ్చి.
పండరంగు పరమ మాహేశ్వరుండు ఆదిత్యబటరనికి
ఇచ్చిన భూమి ఎనుబొదిపుట్ల ఆడ్లు పట్టునేల ధర్మపురంబున
ధర్మువులు వీని రక్షించిన వారికి అశ్వమేధంబున ఫలంబు అగు

శిలాశాసనమును అడ్డెక్కి కోటకు ఉత్తరమున ఆదిత్యభట్టారకుని గృహము ముంగిట పాతిపెట్టించెను.

అదియే పండరంగని అద్దంకి శాసనము ((క్రీ.శ. 848 సం॥)

**వివరణ:**

ఘోరమైన నేరము చేసిన (స్త్రీని "పుట్టెడు సున్నపురాళ్ళలో విడగబోసిరి" అనుమాట అంతటను వాడుకలో నున్నది. ఒక (స్త్రీని విడగబోయుటకు ఒక బస్తా సున్నపు రాళ్ళు చాలును. ఆ లెక్కన ఒక పుట్టి అనగా ఒక బస్తా. ఒక బస్తా ఆరిక ధాన్యమును రెండు ఎకరములలో విత్తవచ్చును. ఎనుబది పుట్ల అడ్లు పట్టునేలయనగా 160 ఎకరములు. ఇది కొంతవరకు సమంజసముగా నున్నది. కావున ఎనుబొది అనగా ఎనుబది అనియు, పుట్టి అనగా ఒక బస్తా అనియు నా అభి(ప్రాయము.





## రచనలు

సంస్కృతం:
- పట్టాభిరామ సుప్రభాతము
- యక్షప్రశ్నోపాఖ్యానమ్
- ఘోషయాత్రా

తెలుగు: పద్యకావ్యాలు
- విషాద మాధవి
- చరిత్రకెక్కని మారణహోమం
- ఒక రాఘవరెడ్డి కథ
- ఓరుగల్లు - వీరగల్లు

నాటకాలు
- దివిలో కవిసమ్మేళనం
- అన్వేషణ - అంభి

కథలు
- ఆ నవ్వే
- జింకపిల్ల
- గుండె ఊసులాడింది

నవలలు
- చండాలుడు
- మర్రిమాను సాక్షిగా...

వ్యాస సంపుటులు
- ఈ పద్యం నేర్చుకుందామా!
- వెలుగు తగ్గిన తెలుగు

# బోయకొట్టములు పండ్రెండు

కరణం బాలసుబ్రహ్మణ్యం పిళ్ళై

**Boyakottamulu Pandredu**

**Karanam Balasubramanyam Pillai**

ఇది క్రీ.శ. 624 నుండి 848 వరకు విస్తరించిన
తెలుగు చరిత్ర
ఇన్నూరు సంవత్సరములలో
ఆవిర్భవించి అభివృద్ధి చెంది ఒక వెలుగు వెలిగి
కేవలం ఒకనాటి యుద్ధములో
శాశ్వతముగా రూపుమాసిన
బోయకొట్టముల చరిత్ర

ఈ నవలలోని -
ఇతివృత్తం కావ్యేతివృత్తం
భాష కావ్య భాష
శైలి కావ్య శైలి
కల్పనలు కావ్య కల్పనలు
ఇది తెలుగువారు తప్పక చదువ వలసిన
వచన మహాకావ్యం

